మూర్ఖులు తమకు విద్యాబుద్ధులను చెప్పినగురువును లక్ష్యము సేయరు ఆతఁ డెద్దానినైనఁ గోరిన నీయరు సరికదా పుచ్చిపో యినపుచ్చకూరైన నీయరు వీరిభక్తి గురువులయెడ నీరీతిగా నొసఁగుచున్నది ఇఁక వీరిధనమును భక్తియు నెట్లు సఫలము లగుచున్నవో వినుఁడు ఇట్లు గురువులకీయక ఆధనమును వచ్చి భోగముదానిపాలుచేయుదురు. అహా! ఎంత మూర్ఖులో మూఢుఁడు గురుఁడు భోగముదానికంటె గుణహీనుఁడా! కాఁడుగదా! కావున నిట్టిమూర్ఖపుపనులను చేయఁగూడదు

ఆ. గూబ చేర గృహము గునిసి పాడుగఁ బెట్టి
వెళ్ళిపోదు రెంత వెఱ్ఱివారొ
గూబగృహము లేమి కూర్చురా కర్మంబు,వి....

మూర్ఖులు తాము స్వయముగా తెలిసికోలేరు, ఒకరు చెప్పినను వినరు వారిమాధ్యమే మాధ్యము శకునములని శుభము లని యశుభములని పేరులను చెప్పికొనుచు ఇంటికోనికి గూబ వారొత్తుగాఁ జొరఁబడినదని ఇంటిని పాడుఁబెట్టి మనములో గొణుగు కొనుచు వెళ్లిపోయెదరు ఎంత వెఱ్ఱివారో! మూఢుఁడు గూబ దిగినంతమాత్రాన నాగృహము ఏమికర్మములను తెచ్చును? వీరి మూర్ఖత్వమే గాని వేఱు గాదు

ఆ. గ్రాస మింత లేక కడుఁ గష్టపడుచున్న
విద్య యేల నిలుచు వెడలుఁ గాక
పచ్చికుండ నీళ్లు పట్టిన నిలుచునా, విశ్వ.... 47

మఱికొంద ఱజ్ఞానులు అన్నమైనను మానుకొని విద్యాసక్తి యెక్కువగా కలిగియుండవలయు నని చెప్పుచు ఆహారాదుల కూడ మానుకొని చదువుచదువని చచ్చెదరు. మ్రింగుటకు మెతుకులు లేక మిణికెడుసమయములో చదువు ఒంటపట్టునా? పట్టదు ఎట్లనఁగా : ఆవములో కాచినకుండలో నీళ్లుపోసిన నిలుచును గాని పచ్చికుండలో నీళ్లుపోసిన విఱియక నిలుచునా? నిలువదు. అట్లె మూర్ఖునిపనులుకూడ నగును.

ఆ. చెఱకు తీపి లేమిఁ జెత్త నాఁ బడునట్లు
పరగు గుణము లేనిపండితుండు
దూఱువడునుగాదె దోష మటుండఁగ, విశ్వ....

ప్రపంచములో పుట్టినందునకు గుణియై మెలగవలయును గదా మూర్ఖు లట్లుగాక తమయిచ్చవచ్చిన చొప్పునఁ బ్రయత్నించుచుందురు కాని ఇందువలన వారు యశము నొందుదురా? యశమునకు బదులుగా దూఱు నొందెదరు ఎట్లనఁగా- తీపిలేనిచెఱకు చెత్త యనఁబడదా! అట్టులే గుణము లేనిపండితుఁడు-ఇతరులను మోసపుచ్చినందుకు పొందఁదగినపాప మటుండఁగా పై పెచ్చు లోకాపవాదమునకుఁ బాల్పడును

ఆ. చేటు వచ్చువేళఁ జెసనాడు దైవంబు
మేలు వచ్చెనేని మెచ్చుకొనును
చేటు మేలు దలఁప చేసినకర్మముల్, విశ్వ....49

మూర్ఖుఁడు తాను చేసినప్రయత్నములు సఫలములుగాక పైగా తనకే చేటు తెచ్చునది యైనప్పుడు దైవము తనకు

అన్యాయమును చేసినని నిందింప మొదలువెట్టును. ఒకవేళ నా ప్రయత్నములు ఫలించినయెడల తన ప్రయోజకత్వముచేతనయ్యెనని సంతసించును. అహా! ఎంత తెలివి తక్కువ! చెడువచ్చినను మేలు వచ్చినను తమతమకర్మములవలననే వచ్చునని వీరొకప్పుడైన తలంపరుగదా!

ఆ. చదివి చదివి కొంత చదువంగఁ జదువంగ
చదువు చదివి యింకఁ జదువు చదివి
చదువు మర్మములను జదువలేఁడయ్యెను, వి....

చదువవలయును చదువవలయునని చదివిచదివి శక్తియున్నంత వఱకును పుస్తకములను కంఠపాఠము జేసికొని అసలు కావలసినవర్మమును మాత్రము చదువక వదలివేయును ఇట్లు చేయుట యజ్ఞానిలక్షణము కావున తెలివితేటలుగలవారలు ఏది ముఖ్యమో దానిని చదువవలయును కాని మూర్ఖులై చెడిపోఁగూడదు.

ఆ. చందమెఱిగి మాటఁ జక్కఁగాఁ జెప్పిన
నెవ్వఁడైన మాఱుకేల పలుకు
చందమెఱిఁగి యుండుసందర్భ మెఱుఁగుము, వి....

మూఢులు తమవలన తప్పులేనట్టులును ఎదుటివాఁడే, ఎక్కువ తక్కువగా మాటలనాడుచున్నాఁడనియు విరుద్ధముగా భాషించుచుననియు నిందల నెదిరిపై నారోపించెదరు. ఇది నిజమా? కాదు ఎట్లనియెదరా? మానుఁడు అందము చందమును సమయమును సందర్భమును చక్కగా నెఱిఁగి మాటలాడ నేర్చియుండినయెడల ఎంతిగొప్పవాఁడైనను మేధావియైనను మాఱు

బలుకునా? పలుకఁడు. కావున బుద్ధిమంతుఁడై మూర్ఖునిఁ బోలి తెలితప్పులను సజ్జనుల కారోపింపక, అభిప్రాయమును తెలిసికొని సందర్భమునకు తగినట్లు మాటలాడుము.

ఆ జననమరణములకుఁ దా స్వతంత్రుఁడు గాఁడు
మొదటఁ గర్తకాఁడు తుదను కాఁడు
నడుమఁగర్తననుట నగుబాటు కాదొకో, వి....

మూఢజనుఁడు తనలోనే సకలమును జఱుగుచున్నదని యును, తానె యన్నిఁటికిని కారణుఁడ ననియు తలంచుకొని విఱ్ఱవీఁగి తెలిపోనివానిని పైని వేసికొనుచుండును ఎంతటి తెలివి తక్కువయో! చూచితిరా? మనుజుఁడు మొదట పుట్టుటకు తాను కారణుఁడు కాఁడు పోనీ మృతికి స్వతంత్రుఁడని యందము న్నను దానికిని కాఁడు. ఇట్లు మొదటను కర్తకాక చివఱను కర్త గాక నడుమ ఎచ్చటనుండియో వచ్చి కర్తనని చెప్పుచుండుట విచారించిన నవ్వులచేటు కాదా? అగును కావున మూర్ఖులు గాక జ్ఞానులై మెలఁగవలయును

ఆ. జాణల మనుకొనియు చపలాత్ములగువారు
తెలియలేరు తమ్ముఁ దెలియలేరు
కష్టమైన యడవిఁ గాడ్పడియున్నారు, ....విశ్వ. 53

ప్రపంచములోని యందఱికంటెను తామే మిక్కిలి తెల్వి గలవారజాణలము అనుకొని చపలులై తిరుగుచుందురు. ఇట్టి మూర్ఖులు తాము చేయుపనిని తప్పని తెలియలేరుకదా! పై పెచ్చు తా మెవ్వరో కూడ తెలిసికొనలేకయుందురు. ఈరీతిగా

మూర్ఖులు అజ్ఞానమనునడవిలో జొరఁబడి కన్నులు కానక కష్టములను అనుభవించుచు బడలుచున్నారు కావున నోయీ చదువరీ! నీవెన్నటికిని మూర్ఖుఁడవు కాకుము.

ఆ. తగదు తగ దటంచు తగువారుచెప్పిన
వినఁడు మొఱకు చెడును గొనకు నిజము
మునులు చెప్పుధర్మముల మీఱ నింతెరా! వి....

మొఱకు అగుమనుజుఁ డేదేని చెడ్డపనులను చేయ మొదలు పెట్టినయెడల సత్పురుషులు సాధుబుద్ధితో "నాయనా! ఇట్లు చేయతగదు తగ"దని తగిన పెల్లవిధముల చెప్పినను వినఁడు. వినకపోవుటమాత్రమే కాక తనయిచ్చవచ్చినచొప్పున చేసి చివఱకు చెడిపోవును ఇది తగును మహానుభావు లైనమునులు లోకోపకారార్థము ధర్మముల చెప్పిరి వినని వారల గతి యింతకంటె నెక్కువ కాఁగలుగునా? కావున మూర్ఖులు గాఁజనదు.

ఆ. తనదు బాగు గోరి ధర్మంబుఁ జెప్పినఁ
దిట్టుచుండ్రు మొఱకు లెట్ట యెదుట
గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు, వి.... 55

మూర్ఖులు తాము స్వయముగా తెలిసికొనుశక్తిలేక దుర్మార్గములఁ బడిపోవునప్పు డెవరైనను కరుణామయులై వారిబాగుఁ గోరి ధర్మమును జెప్పుదురేని కృతజ్ఞులగుటకు బదులాగా కృతఘ్నులై వారియెదుటనే తిట్టుటకు మొదలు పెట్టెదరు ఇట్లు చేయుచుండుట మూర్ఖులకు సహజమైయున్నది. ఎట్లనెనరా? చూడుఁడు, పొడిచెడిస్వభావముగల పశువునకు కొట్టఁబోక మేఁత

వేయఁ బోయినప్పటికిని తనకే మేలు చేయుచున్నాఁడని సంత సించక కొమ్ముల నాడించి పొడవవచ్చునా? లేదా? అట్లే మూర్ఖుఁడుకూడ మంచి చెప్పిన వారని నిందించ మొదలు పెట్టును.

క౦. తనలో సర్వం బుండఁగఁ
దనలోపల వెదక లేక ధర వెదకెడి యా
తనువుల మోసెడు నెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా! 56

మూర్ఖులపనులకు మేరయే లేదు భగవంతుఁడు సర్వజగములయందు నిండియుండఁగా తనలోఁగూడ నుండఁగా తెలిసికొనలేక గుళ్లలోనుండు నని గోపురములలో నుండు ననియును తలఁచి తీర్థయాత్రలపేరును బెట్టికొని తిరుగుచుందురు. నిజమును విచారించితిమేని భారమును మోయు నెద్దులకును వీరికిని భేదము లేదు ఎట్లందురా? వీరు శరీరములను మోసికొని ఎద్దులవలె మొద్దులై యుందురు ఇట్టి వీరికి తెల్పి వీరిచేత నాచరణముఁ జేయించుటకు బ్రహ్మదేవునికైనను వశమగునా? కాదనుట

ఆ. తన్నుఁజూచి యొరులు దగ మెచ్చవలెనని
సొమ్ము లెఱవుఁ బెట్టు నెమ్మిమీఱ
నొరులకొఱకు తాన యుబ్బుచు నుండును,వి....

తెలివితక్కువవారలై తమ నే యందఱును మెచ్చుకొనవలయు నని తలఁచికొని ఇల్లిల్లుఁ దిరిగి సొమ్ములను ఎఱవుదెచ్చి పెట్టుకొని కులుకుచుందురు. నిజముగా తాము ఆసొమ్మును బెట్టుకొని ఇతరులకొఱకు ఉబ్బొంగుచుండునే కాని అందువలన తమ

కొక్కెంతయును లాభము లేదుగదా? కావున బుద్ధిమంతులైన వారు తమకు అక్కఱలేని సంగతులలో ప్రవేశించి పరిహాసమునకు పాత్రులగుదురా? కారు

కం. తలఁ దాఁకినపుడు తలఁతురు
తల క్రిందై పడినయపుడు తలవరు శివునిన్
బలుగాకు లిలను సాజము
కలనాఁ డెన్నరె యదేమి కర్మమొ వేమా 58

మూర్ఖులు తాము చేయుచుండు మూర్ఖపుకార్యములను విడిచి పెట్టుకుని చెప్పినప్పుడు వినరు కాని ఆకార్యమువలన ఏదియో యొకచెడ్డ తలపైఁబడినప్పుడు తప్పక తలఁచెదరు. అప్పుడే దైవ భక్తి కలవారుగ నుందురు ఇట్టివారు కాకులవలె కుక్షింభరు లనుటకు సందియములేదుగదా! లేకున్న కలవాఁడు ఒకప్పుడు కాకపోయిన నొకప్పుడైనను స్మరియింపవలదా? అదేమి పాపకర్మమో గాని ఆవిషయమునే తలపెట్టరు

ఆ. తల్లి యున్నయపుడె తనదుగారాబము
లామె పోవఁ దన్ను నరయు రెవరు
మంచికాల మపుడె మర్యాద నార్జింపు, వి....59

మూర్ఖులు "తమవారెవ్వరైన తమదుండగములు సహించియుందురే గాని యితరులు సహింపరు" అని తెలిసికొనకయును తమ కెల్లప్పు డొక్కరీతిగానే నడచునని యూఁ దలంచి మూర్ఖ్యము చేయుచుందురు. తమవారైననే తమ్మును సహించెదరే గాని ఇతరులోర్చెదరా? ఓర్వరు. కావున బుద్ధిమంతులు తమకున్న మంచి

కాలములోనే పేరునొంది మర్యాదను ఆర్జించుటకు ప్రయత్నింప వలయును కాని మూర్ఖులు కారాదు.

ఆ. తామసంపుఁబనులు తగవెందులకునైన
తామసంబు నుడుగఁదగు సుజనుఁడు
తామసంబు నెంచు ధరలోన మూర్ఖుండు,వి....

అజ్ఞానపుపనులు దేనికైనను తగియుండవు వానివలన సామాన్యముగా ముప్పు దప్పక కలుగుచుండును. కావున సుజనుఁడగువాఁడు అట్టి తామసంపుబనులను చేయఁగూడదు తామసంబును మూర్ఖుఁడొక్కఁగుఁడే మంచివస్తువునుగా నెంచును గాని విజ్ఞుఁడు ఎంచఁడు కావున మూర్ఖుఁడు కాఁగూడదు

ఆ. తుమ్మచెట్టుకు ముండ్లు తోడనే పుట్టును
విత్తులోని నుండి వెడలునట్లు
మూర్ఖునకును బుద్ధి ముందుగా పుట్టును,వి....61

దుర్మార్గులకు దుష్టములగు బుద్ధులు జన్మతోడనే పుట్టును మూర్ఖులకు గూడను మొఱకుతనము పుట్టుకతోడనే పుట్టును. ఎట్లనియుందురా? విత్తులో నుండి చెట్టుమొలచెడిరీతిగా నగును. చూడుఁడు తుమ్మచెట్టుమొలకరూపము నెత్తిన తోడనేముండ్లు గూడ మొలకలెత్తును గదా అట్లే మూర్ఖుఁడు గూడ పుట్టుక నుండియే తనమొఱకుతనమును మాపుచుండు.

ఆ. దానమరసి చేయుదాత దగ్గఱఁజేరి
వక్రభాషణములు వలుకు మొఱకు
చందనతరువందు సర్పమున్నట్లయా, వి.... 62

మూర్ఖుఁడు తమకు తెలియకయు నొరులు చెప్పినవినకయు తాము స్వయముగా మంచిచెడ్డలనెఱిఁగి దానమీయను సరికదా పైనయోగ్యతను విచారించి దానమిచ్చుదాతదగ్గరచేరి వంకరమాటలను పలుక నారంభింతురు మూఢు, ఎట్లందురో. మంచి వాసనయును చల్లదనమును గలిగినచందనపుచెట్టుపైని సర్పమున్న రీతిగా మూర్ఖులుకూడ నుందురు

ఆ ధర్మ మన్న వినరు తనువు నమ్మినవారల్
యమునివారు వచ్చి యడలఁ జేసి
చొచ్చికట్ట తమరు చొరఁబారఁ గలరొకో,వి....

జనులు సాధారణముగా నెంతటిమూర్ఖులగుదురో విచారించుఁడు. ధర్మ మని చెప్పిన వినినే వినరు, తమశరీరమునే శాశ్వతముగా నుండునని తలఁచెదరే కాని ఇతరము నాలోచింపరు. యమధర్మరాజు భటులు వచ్చి చేసినపాపమునకు ఫలము ననుభవింపఁజేయుటకు తీసికొని పోవఁ బ్రయత్నించినసమయములో-తమరు తప్పించుకొని పోఁగలరా? చాలరు కదా! కావున మొఱకుతనము మంచిదికాదు

ఆ. నీటిలోని వ్రాఁత నిలువక యున్నట్లు
పాటిజగతి లేదు పరము లేదు
మాటమాటకెల్ల మారును మూర్ఖుఁడు, వి....64

బుద్ధిమంతుఁడగువాఁడు తానిచ్చినమాటను వెఱవేర్చుకొనుటకు వేయివచ్చినను వేయిపోయినను తప్పకొని తిరిగిపోవఁడు మూర్ఖుఁడట్లుగాదు. మానావమానములను సరకుసేయక మాటిమా

టికిని మర్యాదను పాటింపక తిరిగిపోవుచుండునే కాని నిలువఁ జాలఁడు ఎట్లనియనియెదరా - అజ్ఞుఁడు నీటిపైని వ్రాసిన వ్రాఁత నిలువక చెదరిపోవునట్లు మూర్ఖుఁడు కూడ మాటను తప్పిపోవును

ఆ. నీళ్లుపోసి కడిగి నిత్యము శోధించి
కూడువెట్టి మీఁదఁ గోఁక కట్టి
యేమిపాట్లా పడుదు రీదేహమునకయి, వి....65

అజ్ఞానులు దేహము లశాశ్వతములని తెలిసికొనలేక యభిమానము నుంచికొని దినదినమును ఆదేహమునకు పరిచర్య చేసి పెంచుటకై పడరానిపాట్లు నన్నింటిని పడియెదరు ఆహా ఎంత మూర్ఖ్యము ప్రపంచములో నంతకంటెను మించిన దేమికలదు

ఆ. పరగఁ దా నొసఁగఁడు పరులు చెప్పినదైన
నియ్యఁజాలక విధి నెసఁగువాఁడు
పోట్టు తినెడిలండి బువ్వలుపెట్టునా, విశ్వ....66

తనకు ఉపయోగించునది కానిదైనను తనవస్తువు కాక పోయినను యజమానుఁడీయుమని చెప్పినను మూర్ఖుఁడు ఈయుటకు ఒప్పికొనఁడు. తాను స్వయముగ నిచ్చెడిది గాదుకదా! యజమానునివస్తువును అతనియాజ్ఞచేతనైనను ఇవ్వవచ్చునుకదా! ఈయఁడు. మూర్ఖులస్వభావమే ఇట్టిది పరీక్షింపుఁడు పొట్టుతిని కొని తినియెడిలోభి ప్రజలను పిలిచి యన్నము నొసంగునా? పెట్టఁడు. అట్టులే మూర్ఖుఁడు కూడఁబెట్టఁడు.

ఆ. పర్వతవనవాసి పరిణామవర్తన
కూపవాసి కెట్లు గుఱుతుపడును
బ్రహ్మదేవువెంటఁ బ్రాకృతుఁ డరుగునా?, వి....

మూర్ఖుఁడు పండితునిపరీక్ష చేయుసామర్థ్యము తనకు లేకున్నను పరీక్షించుటకు పూనుకొనును, కాని అంతమాత్రముచేత పండితునిప్రభావము బోధపడునా? పడదు ఎట్లందురా? అడవులలోనుకొండలమీఁదనుండి పక్వములగుఫలములను భక్షించి దినదినమును బొందుచుండెడి పరిణామతత్వమును ఒక్కచోటు నొకబావిలోఁ గూర్చున్నవాని కెట్లు తెలియును? అట్లే బ్రహ్మదేవుఁడు త్రిభువనలోకములను న్నాఁడు నేనును బ్రహ్మమునే. ఆ స్థానమును కనుకొంగు నన వచ్చునపడునా? పడదు

ఆ. పరమపదవిఁ గోరుభక్తుండు నిత్యము
రాజు గోరుచుండు రణజయంబు
మూర్ఖుఁడెప్పుడు గోరు ముదితలతో పొందు,వి....

ఎవ్వ రెవ్వ రేయేకులమునఁ జన్మించి యెంతయెంత పూర్వజన్మపుణ్యమును ఈజన్మపుపవిత్రమును చేసియున్నారో వారు వారట్టిఫలములనే పొందెదరు చూడుఁడు. భక్తుఁ డగువాఁ డెప్పుడును జననమరణాదిక్లేశములు లేని యుత్తమపథమునే కోరును రాజగు వాఁడెప్పుడును శత్రువుల నణఁచుటకును మహదైశ్వర్యముల ననుభవించుటకునే కోరుచుండును. ఇఁక మూర్ఖుఁడన్ననో నిద్దురలేచినదిమొదలు, ముదితలతో పొందుసేయుటకే ప్రయత్నించును గాని పరముఁ గనఁడు.

ఆ. పాముకన్న లేదు పాపిష్ఠి దగుజీవి
యట్టిపాము చెప్పినట్టు వినును
ఇలను మూర్ఖుఁ దెల్ప నెవ్వరివశ మయా, వి....

క్రౌర్యములో నేమి, హింసాకార్యములలో నేమి, పాపపు తలంపులలో నేమి, పాముకంటె మించినపాపాత్మ మఱియొక్కటను లేదు అట్టిపామును గూడ శిక్షించి ఇది యుక్తమిది యయుక్త మిట్లు చేయవలయు నని తెల్పి చెప్పినట్లు చేయు రీతిగా చేయవచ్చునుగాని అబ్బబ్బ! ఈభూలోకములో నెవ్వని నైనను మూర్ఖుని సమాధానపఱచి వానిని మంచిత్రోవలోనికి త్రిప్పుటకు వలనుపడదు

ఆ. పుట్టుఫలము లేని పురుషాధములు భువిఁ
బుట్టనేమి లేక గిట్టనేమి
పుట్టలోన చెదలు పుట్టదా? గిట్టదా! విశ్వ....

ప్రపంచములో తాముపుట్టిన దెందులకో ఎట్లు ప్రవర్తించిన తమపుట్టుకకు ఫలము గలుగునో కొంచెమైనను ఆలోచింపక తమతమ యిష్టమువచ్చినయట్లుల ప్రవర్తించుచుందురు. ఈరీతిగా పుట్టినఫలము లేని యాచెట్టులు ఈలోకములోన పుట్టినను సరియే గిట్టినను (అనఁగా: చచ్చినను) సరియే. ఎందువలననియందురా? పుట్టుకకు సంఖ్యాపూరణము ప్రయోజనమైన యెడల దినదినమును పుట్టలో నెంత చదలుపురుగులు పుట్టుట లేదు. ఎన్నిగిట్టుట లేదు?

ఆ. పొట్లకాయ రాయి పొడుగుత్రాటను గట్ట
లీలతోడ వంక లేక పెరుఁగుఁ

కుక్కతోఁక గట్ట కుదురునా చక్కఁగా, వి....

ఎన్నికష్టములకోర్చి ప్రయత్నించినను అసాధ్యుఁడగు మూర్ఖుఁడు మూర్ఖుఁడే యగును కాని మతియొకరీతి గాఁజాలఁడు. ఇట్టిప్రయత్నములు గుణియందు సఫలములగునే గాని ఇతరుల యందు కావు ఎట్లనఁగా పొట్లకాయను రాతిని వేలాడఁగట్టిన యెడల నడిగాడుపుగా వంకయొకింత యును లేక పెరుఁగునే గాని పుట్టుకతోడనే వంకఁబాతిన కుక్కతోఁకను వెదురుబద్దలను వైచి యెంతసురుసురుగా గట్టినను చక్కఁగా నిలువనేనిలువదు.

ఆ. బట్టి పెట్టి నాల్గు జానలచమురుతో
వండి శుద్ధిచేయ దండి యగునె
పుట్టువందుకలుఁగు పూర్వపుణ్యంబున్న, వి....

గుణముగాని దోషముగాని రూపముగాని పాపముగాని ప్రతిమనుష్యునికి పుట్టుకతోడనే పుట్టుచున్నది గాని దానిని మధ్యకాలమున నెంతప్రయాసపడి మార్పఁదలఁచినను మారదు. అట్లే మూర్ఖునికిఁ గూడను చూడుఁడు. ఒకవస్తువు మలినముగా నున్నదని యనుకొనుఁడు దానినిబట్టి వేసి నాల్గుజానలచమురు లోఁగాఁచి వండి శుభ్రము చేసినమాత్రాన మంచిది యగునా? కాదు పూర్వపుణ్యమేమాత్రముండినను అయ్యది పుట్టుకలోనే కలుగుచుండును.

ఆ. బందుబూతులాడు పరమనీచుం డెన్న
దండివారిమేల్మి తా నెఱుఁగునె
చందనంబు ఘనత పంది యే మెఱుఁగును, వి....

గొప్పగొప్పవారినిసయితము మూర్ఖుఁడు అనను విన నశక్య ములగుబూతులనాడుట కారంభించును. కాని వారికుండెడి గౌరవము మంచిమొదలగువానిని గ్రహింపఁగలఁడా? లేఁడు. ఎట్లని యెదలేని పరికింపుఁడు. బురదలో నున్నపురుగు నెఱుఁగఁగలదే గాని పంది చందనమునకుండినగొప్పను గ్రహింపఁగలదా? లేదు. అట్లులనే మూర్ఖుఁడుగూడ తనకున్న నైచ్యమును తెలిసికొనలేక పెద్దలను తిరస్కరింపఁబూనుకొనును.

ఆ. బౌద్ధమతమువారు బుద్ధి దైవం బని
మెచ్చుతక్కు వాడి తుచ్ఛమతిని
గాడిదెల గుమినలె గ్రక్కునఁ బడుదురు, వి...

బౌద్ధులంతటిమూర్ఖులు ఇఁక నీ ప్రపంచములో మఱియెవ్వరునులేరు. వారు భ్రమసి మూర్ఖులై 'బుద్ధియే దైవము బుద్ధిజనితములగుకోర్కెలే దైవసంకల్పము' లని చెప్పుచు ఎక్కువ తక్కువమాటలను ఆడి బుద్ధిహీనులై గాడిదలవలె తిలకించుకొని ముందువెనుకలు లేక యొకరివెంట నొకరు అతిశీఘ్రముగా పతనులగుదురే గాని పరమార్థమును కనలేరు. ఇట్టివారలే మూర్ఖులని యెఱుఁగునది.

ఆ. మఘవుఁ డైన నేమి మర్యాద యెఱుఁగని
వారలేల తెలిసి గౌరవింత్రు
ఉరిమి మొఱుగుకుక్క యోగినేమెఱుఁగురా? వి.

మూర్ఖు లెంతటిధనధాన్యసంపదలఁ గులతూఁగుచున్నను అతిథుల నార్యులను సత్కరింపనే సత్కరింపరు. అగతుఁడు

దేవేంద్రునంతటివాఁడైనను వారు తెలిసికొని గౌరవమును చేయుం
దురా? చేయరు ఏలయనఁగా వారియోగ్యత యంతవఱకే ఎట్లం
దురా! చూడుఁడు గ్రుడ్లురిమి చూచుచు పైనిబడఁబోవు
కుక్క యోగిని గుర్తింపఁగలదా? లేదుగదా! అట్టులే మూర్ఖుఁడు
గూడనని తెలిసికొనునది

ఆ. మంచివారు లేరు మహిమీఁద వెదకినఁ
గష్టులెందఱైనఁ గలరు భువిని
పసిఁడిలేదు కాని పదడెంత లేదయా, వి.... 76

ప్రపంచము నంతయు పట్టిబట్టి వెదకినను అంతయును మూ
ర్ఖులే యగపడుచు గురుగాని మంచివారొక్కరైనను దొరకరు.
కాని కష్టాత్ములు పలువురైనను ఎందఱైనను దొరకఁగలరు ఎట్లన
గా - నిదానించి చూడుఁడు లోకములోన వెనుకఁబోయిన
బంగారము లేదుగాని బంగారమునకు బదులుగా పదటు ఎంత
యైన నుండుటలేదా? అట్లే మూర్ఖులుగాడు

ఆ. మంత్రమెల్ల మఱచి మధురాధరముఁ గోరి
ఎట్లు మొఱకు డోడయు నెఱుగఁ గలఁడు?
ఉవిదఁ జూచి పరమయోగంబు మఱచును, వి....

మూర్ఖులకు ఎన్నిమారులు ఎంతదివ్యమంత్రముల నుపదే
శించి విషయసుఖములఁ గోరక తరించు మని చెప్పినను అధరము
నాసించినయా మొఱకునోడయుని కానఁగలఁడా! కానఁజాలఁడు.
ఏల యని యందురా? ఈచేసినబోధల నన్నిటిని యావలిని చూ
చునంతవఱకు స్మరించును చూచెనా ఇఁక యోగమునైనను వెం
టనే మఱచిపోవును ఇట్టిలక్షణములు మూర్ఖులనని తాత్పర్యము.

ఆ. మర్మ మెఱుఁగ లేని మనుజు లెల్లరు నిట్లు
మాలదాసరులకు మడుపు లిచ్చి
మహిని గాచునట్టి మనుకులం బెఱుఁగరు, వి....

ప్రపంచములో పుట్టి పరమార్థము తెలియఁగనిపందలు మాలదాసులపాదముల నాశ్రయించికొని మర్మమును తెలిసికొనలేక మడుపుల నిచ్చి చెడిపోయెదరే కాని తామెంతటి గొప్ప క్షత్రియుఁడగు మనువంశమున జన్మించిరో తమ కెంతటినీచుఁడగుమాలవానిగురుత్వ మబ్బినదో యని యైన నాలోచింపరు ఇట్టివారలే మూర్ఖులు

ఆ. మాటలాడఁగలుగు మర్మము లెఱిఁగిన
పిన్న పెద్దతనము లెన్నవలదు
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా, వి.... 79

మూర్ఖులు పిన్నలు పెద్దలని ఎంచెదరే కాని తెలివితేటలను చూడనే చూడరు ఆహా! ఎంతతెలివితక్కువ! కావున బుద్ధిమంతులగు నరులారా! ఎవ్వఁడు మర్మముల నెఱిఁగి మాటలాడ నేర్చునో వాడె మనకు పెద్ద యగును కాని చిన్నపెద్దతనములను ఎంచఁడు ఏల యని యందురా? జ్ఞానము ప్రధానము గాని ఒడ్డుపొడుగు వయస్సు ముఖ్యము కాదు చూడుఁడు. చిన్నవానిచేతిలోని దీపము పెద్దదిగా వెలుఁగదా?

ఆ. ముక్కుత్రాళ్లఁ గ్రుచ్చి ముఱికి పోవఁగఁ దోమి
కచ్చనీరు నించి కడిగి కడిగి
డొక్కలోమిన నంత దొరకునా మోక్షంబు, వి....

రోగులు కొందఱు మూర్ఖులై యోగాభ్యాసమని ముక్కు-
లలోనికి గుడ్డల నెక్కించికొని ముడికిపోవునట్లుగా తోము
కొని గోచిని శుభ్రముగా నుదికి యుదికి డొక్కను కడుగుకొని
నిక్కుచుందురే కాని తాము అజ్ఞానులై పోవుట నెఱుఁగరు.
డొక్కతోమినంతమాత్రమున మోక్షముదొరకునా! దొరకదు.

క. ముందరిపోటుల మాన్పను
మం దెందైనను గలుగును మహిలోపల నీ
నిందలఁబల్కెడు మొఱకుకు
మం దెచ్చటనైన గలదె మహిలో వేమా 81

ముందుముందుగా వచ్చి పొడవవచ్చు మొద్దులగు యెద్దుల
పోటుల నైనను ప్రయత్నించి లోపఱుచుకొని మాన్పుటకు
మందు కలదు గాని కంటికి కనిపించిన ప్రతివారిని నిందించుచుం
డెడి మూర్ఖులయొక్క తెలివితక్కువను పట్టుపలను మాన్పుటకు
మందు ఈ ప్రపంచములో నెచ్చటనైననున్నదా? విచారించిన
లేదని స్పష్టముగు నున్నది కావున మొఱకుతనమును బుద్ధి
మంతుఁడై పోఁగొట్టుకొనవలయును.

ఆ. మ్రాను దిద్దవచ్చు మరివంక లేకుండ
దిద్దవచ్చు రాయి తిన్నగాను
మనసు దిద్దరాదు మహిమీఁద నెవరికి,వి.... 82

దినదినము ను పెరుఁగుచు ననేకములగువంకలుగా తిరుగు
చుండుమ్రానునైనను వంక లేకుండ దిద్దగా వచ్చును. అట్టులే అతి
కఠినమునైనరాతిని గూడ దిద్ది మనయిచ్చవచ్చినరూపము చేర్చ

ఉపవచ్చును కాని ఈ భూలోకములో ఎంతటి నేర్పుకలవారి కైనను పెడతిరిగినమనస్సును త్రిప్పగారాదు

ఆ. మృగము మృగ మనుచును మృగములదూషింత్రు
మృగముకన్నఁ జెడుగు మూర్ఖుఁ డగును
మృగముకన్నఁ గుణము మూర్ఖునకే లేదు,వి....

లోకములోని జనులు ఏదైనను తప్పులను చేయుచుండు వారిని చూచినప్పుడు కేవలము పశుప్రాయుఁ డనియును, మృగ మనియును దూషించుచుందురు, కాని అట్టివారు మృగములు కారు మృగములుకూడ జ్ఞానము కలవి కనుక నవి నిందింపఁదగిన యవి కావు ఇఁక ఎవరు గుణహీనులందురా? విచారించితిమేని మృగముకంటెను గుణము మూర్ఖునకే లేదు. అనఁగా పశువు కంటె పశువు మూర్ఖుఁడు.

ఆ. యౌవనమునఁ జూడ నది యెఱుకే లేదు
యౌవనంబు నెంతొ రధికముగను
యౌవనంబు తనకు నందకయే ముంచు,వి....84

జనుఁడు స్వతంత్రుఁడగుటకు యౌవన మింకను రాలేదని చెప్పుచుందురు; కాని ఎంతతెలివితక్కువవారో చూడుఁడు. వారు అనుకొనినయట్లులు యౌవనము వచ్చినప్పుడు "తాను కర్మబంధములో నుండెనని యు,దానినుండి విడిపించుకొనవలయు ననియు" జ్ఞానము వానికి లే నేలేదు కావున ఏయౌవనోదయము ను స్వతంత్రతకై కోరునో అది తనకు తెలియకయే ముంచును

ఆ. రాజుమా టనవలె రసికుఁ డాడఁగవలె
నెంతపనికి నుబికి యెగురరాదు

కదిసియొగిరెనేని గ్రహసమానము గాదె
దొడ్డకొంచెమేల దొరకు వేమ! 85

రాజాలము రాజాలము అని పేరుఁబెట్టుకొని 'అనిన నేనే యనవలెను ఆడిన నేనే యాడవలయు' నని సుంబికి యెగిరిపడు మందురు మూర్ఖులు అట్లు బుద్ధిమంతులు సేయరాదు ఒకవేళ నెవ్వరైనను ఏం చేయరాదని కదిసి యెగిరినయెడల వారొక గ్రహముతో (అనఁగా: పిశాచముతో) సమానులు కారా! కావున బుద్ధిమంతులు మూర్ఖులవలె స్వాహంభావమును వహింపరాదు

ఆ. ఆయిరూపుఁ జేసి రాజుల మ్రొక్కింప
వన్నెకెక్కనటవె వైభవంబు
కర్త యెవ్వఁ డనుచు కానరు మూర్ఖులు, వి....

రాజు అనుమతించినది ధర్మమని కొందఱు మూర్ఖులగు నాస్తికులు రాతివిగ్రహమును చెసి రాజులచే దండములను బెట్టించి "రాజంతటివారె నమస్కరింపఁగా-మీరేల నమస్కరింపరు?" అని జనుల నిర్బంధించెదరు విచారించిన నింతకంటె మూర్ఖులు లేరు. రాజు మ్రొక్కినంతనే వైభవము వచ్చునా? రాదు, ఎవఁడు కర్త? ఎవ్వఁడు భోక్త? యని కొంచెమైనను ఆలోచింపరు గదా మూర్ఖులు

ఆ. లెక్కలేనియాశ లీలమై యుండఁగాఁ
దిక్కయొత్తివరుఁడు తిరుగుఁగాక
కుక్కవంటిమనసు గూర్చుండనిచ్చునా?, వి....

మూర్ఖుఁడై ఇంద్రియములను జయింపలేక మనంబులోని యాశ పిశాచమువలె పెరిఁగి లాగుచున్నప్పుడు తిక్కపట్టిన వానివలె తిరుగుటకే ప్రయత్నించును గాని యొదిగి కూర్చుండ లేఁడు ఛీ! ఎంతనిచత్వము మనస్సు కుక్కవంటిది. అది కూర్చుండ నిచ్చునా? మూర్ఖులు దీనిని నిలుపలేక తిరిగెదరు మండలింపఁ జాలరు

ఆ. వనములోనఁ దిరుగువరమౌను లైనను
మనసు కుదురకున్న మమతచేత
చెడుదు రన్న మొఱకు చెడుటేమి లెక్కరా?, వి.

మహామహామునులే అడవిలో తిరిగి ఆకు లలము తినువారలే ఒకచోట కూర్చుండి మనస్సును నిల్పలేక మమత్వముచేత చెడి పోవుచున్నారని చెప్పినపుడు జ్ఞానమే లేక శుద్ధమూర్ఖులై యున్న నరులు చెడిపోవుచున్నారని చెప్పుట యొకలెక్కయా?

ఆ వాచవికిని మొగము వాచినయట్టులు
నదియు నదియుఁ దినఁగ మొదలువెట్టె
మరల దింక బుద్ధిమర్యాదపోయిన, వి.... 89

మూర్ఖుఁ డగునరుఁడు ఇంద్రియముల స్వభావమును కని పెట్టలేక నోటిరుచిసహ్యత పోవుకొఱకని దానిని దానిని తిన మొదలుపెట్టెనేని ఇఁక వానిజన్మములో నాబుద్ధి మరల వాని స్వాధీనము కాదు ఇది నిశ్చయము ఏల యని యనెదరా? ఒక మారు మర్యాదపోయిన నిఁక ఎన్నిమారులు రమ్మన్నను వచ్చునా? రాదుగదా.

అజ్ఞానులై తాము మునిఁగినదే గంగ యనుకొనువారలకు ఎన్ని చెప్పినను గుణము వచ్చునా? గుణముగా నుండుట యవసర మనియైనను తోఁచునా? తోఁచదు తోఁచినను నిష్ప్రయోజకములే యగును ఎట్లంగురా! చూడుఁడు. భోగముపడుచునకు నావివరుసలు ఎందులకు? నిష్ప్రయోజనము అట్లే చాడీలు చెప్పెడివానికి సాత్త్వికగుణ మెందులకువలయును? ఈ రీతిగానే మూర్ఖులకు జ్ఞానమెందులకు?

ఆ వాదబుద్ధిచేత వాదంబు లాడఁగాఁ
బూనియుందురయ్య పుడమిలోన
కర్మమార్గమునను గడతేరలేదయా, వి.... 91

మూర్ఖు లెంతదూరము చదివినను ఎంతగొప్ప ధనమునొందిన నేలోకమునకు సత్యముఁ జెప్పఁబూనుకొనక చేతనైనంతవఱకు వాదప్రతివాదములనే చేయ నిశ్చయించెదరు, గాని తనవలననైనంతమట్టుకు కాయిక వాచిక మానసిక కర్మముల ద్వారా సంసారమును వదల్చుకొని కడతేరవలసియుండుటను తెలిసికొనఁజాలరు తెలిసికొనినను కడతేరఁజాలరు

ఆ విష్ణుభక్తు లెల్ల వెలిబూదిపాలైరి
వాదమేల? మతవిభేదమేల?
తెలియ లింగధరులు తిరుమణిపాలైరి, వి.... 92

పిల్లా! ఈవైష్ణవము గాని శైవము గాని చవటలచలువ ఆల్చెపులి ములా? కావు నడుమంత్రపువిమోహుఁడు విష్ణుభక్తుఁడు వెలి బూడిదెపాలును, లింగధారులు తిరుమణిపాలు నైరి కావున మూర్ఖులు కాఁజనదు

క. వెయ్యార్వురునదులజలములు
తియ్యక మజ్జనముగఁ బోనఁ ద్రిప్పటకాదా
కొయ్యగులామునకు జ్ఞానము
వెయ్యనను తెలుపలేము వినరా! వేమా! 93

మూర్ఖులు ఎన్నియో తీర్థములని పేరులఁ బెట్టుకొని వేల కొలఁదినదులలో మునుగఁబోయెదరు విచారించిన నది కాళ్ల త్రిప్పటయే గాని లాభము కాసంతెగూడ లేదు ఈవిషయముఁ జెప్పినను మూర్ఖులు వినరు ఎందువలన నందురా? కొయ్యబొమ్మకు ఎన్ని చెప్పినను తెలివిని గలిగింపఁగలమా? లేముగదా!

ఆ. వెఱ్ఱివేషములను వేసికోఁబోకుము
కఱ్ఱికుక్క తెలుపుగాదుసుమ్ము
పుఱ్ఱెలోనిగుణము పూడ్పింపఁజనవలె, వి.... 94

సుమతీ! బుద్ధిమంతుఁడవై యుండుటకుఁ బ్రయత్నమును సేయుము కాని యెప్పటికైనను వెఱ్ఱివెఱ్ఱివేషములను వేసికొని మూర్ఖుఁడవై పోకుము. నల్లకుక్క కెన్ని ఔషధములను వేసి తోమి

నను తెలుపురాని యట్టులే పుత్తియలో లేనిగుణము పూడ్చినను రాదు

ఆ. శక్తిమహిమ పోకి చెడిరయా పురుషులు
ముక్తి మహిమెఱుఁగక మూఢులగుచు
ఆదిశక్తిగూడ నన్యాయమై పోయె, విశ్వ.... 95

జనులు శక్తిపూజ యను పేరున భ్రమసి తుచ్ఛసౌఖ్యముల మఱిగి నిజముగు ముక్తియున్న మాహాత్మ్యమును తెలిసికొనఁజాలక మూర్ఖులై చెడిపోయిరి వీరికి మొదలనున్న కొంచెము జ్ఞానము కూడ ఇప్పుడన్యాయమై చెడిపోయినది చదువవేసినను మతిపోయినట్టులు మూర్ఖత ఎంతటిహానిని కూర్చుచున్నదో చూడుఁడు

ఆ. శివునిమంత్రమె యగు శ్రీహరి మంత్రము
తెలిసి తెలియలేరు తిక్కనరులు
దేవుని మఱచి తమదేహమే యందురు, వి....96

మూఢులగు తమకు తెలియకయున్నను ఒకరు చెప్పిననైనను వినవచ్చునుగదా ఆమాత్రమును గూడ చేయరు చూడుఁడు మతాభినివగ్రహావిష్టులు కొందఱు శివమంత్రము వేఱు, విష్ణుమంత్రము వేఱు అని భేదము నారోపించుచు తెలిసి తెలిసి తెలియనివారగుచున్నారు. దేవుని మఱచిపోదురు. ఇట్టివారు చివఱకు తమదేహమే దేవుఁడని చెప్పఁబూనెదరు అహాహా! ఎంతటితిక్కవారో పరికించితిరా!

ఆ. శ్రవణపుటములున్న సార్థక్య మేమిరా ?
వినఁగవలయుఁ బెద్దలనెడివన్ని

వినఁగ వినఁగ నీకె విశదంబులౌ సుమ్ము, వి....97

బుద్ధిమంతుఁడవై విద్యావృద్ధులుపెద్దలు చెప్పెడిసద్వార్తల నన్నిటిని వినవలయును సుమా? అట్లు నీవున్న నీకు చెవు లుండినందునఁ గలుగుఫల మిసుమంతయును లేదు ఈరీతిగా వినఁగా వినఁగా అన్నియును నీకే విశదములు కాఁగలవు కావున త్వరపడి యజ్ఞానముచేత తెలిసినది కాదనియును చెప్పలేకపోయి రనియును నిందింపఁబోకుము అట్లు చేయుట మూర్ఖకృత్య మగును

ఆ. సత్యము విడనాడి సాహసంబులుఁ జూపి
బంటుపంతమాడు బత్తి లేక
కర్మజీవి తానుగానంగ లేఁడయా, విశ్వ.... 98

ఇట్టియే మూర్ఖుఁడు తనయిష్టము వచ్చినచోట్లకు తిరుగుచు యథార్థమును మాటలాడుటను మాని వైచి కావలయును సాహస కార్యముల నాచరించుచు తనకు తెలియనివిషయములయందైనను పంతములను పలుకుచు దేవునియందు భక్తి యిసుమంతయైనను లేక సంచరించును. కాని తాను కర్మలఁ జేయఁదగినజీవుఁడు మాత్రమే గాని ఆకర్మములకు ఫలములనిచ్చువాఁడు గూడ తానే యగునా? కాఁజాలఁడు. కావున నాముష్మికముల నిట్టి మూర్ఖుఁడు దుఃఖములపాలగును

ఆ. సాధుచరిత యైనసతిసత్ప్రవర్తన
జార యే మెఱుంగు సాధుజనుని
బ్రహ్మనిష్ఠ మెఱకుప్రాకృతుఁ డెఱుఁగునా, వి....

మోటకులు పండితశిరోమణుల నెల్లరను వారిని వీరిని అను లెక్కలేకనిందలు పల్కుటకు ప్రారంభింతురు అయ్యది వాని యజ్ఞానమునే బోధించును గాని దానివలన పండితున కొక్కింత యైనను లోపము లేదు ఎట్లనఁగా — పతివ్రత యగుస్త్రీనిం జూచిన రంకులాడి ఆమెసత్ప్రవర్తనను తెలిసికొనఁజాలునా ? లేదు బ్రహ్మనిష్ఠులగు ప్రాజ్ఞుల మాహాత్మ్యమును మూర్ఖుఁడు తెలుఁగఁజాలఁడు

ఆ. హీనుఁ డెన్నివిద్య లిల నభ్యసించిన
ఘనుఁడు గాఁడు మోటకుజనుఁడె గాని
పరిమళముల గర్దభము మోయ ఘనమౌనె, వి.

నీచుఁ డగువాఁడు ఎన్నివిద్యల నెంతెంత గొప్పవానిని అభ్యసించినను వానినీచగుణము పోఁజాలదు అట్టినీచుఁడు విద్యాభ్యాసమాత్రముచేత మూర్ఖుఁడే యగును గాని ఘనుడు కాఁజాలఁడు ఎట్లనఁగా. మంచిమంచిపరిమళవంతములగువస్త్రములను మోయుచుండినమాత్రమున గాడిద గొప్పదియగునా ! కాదు గదా !

# 2. దాంభికపద్ధతి.

అవతారిక దాంభికులు అనఁగా — లోకులను అసత్యమత ములయందు ప్రవేశపెట్టుటకై లేనిపోనివేషములను వేసికొని మోసముచేయుటకుఁ బూనుకొని నడిచువారు అట్టివారు తాముచేయు పనులయందు తమకే శ్రద్ధాభక్తులును నమ్మకమును లేకపోయినను జనులను మోసపుచ్చుటే చరితార్థమని తలంచుచుందురు అట్టి వారిని బుద్ధిమంతులు నమ్మరాదు పూర్వాపరములను విచారింపక వారు చెప్పినట్లు చేయరాదు కావున నా దాంభికు లెట్టివారో వా రెట్లు మోసమును చేయుదురో ఈ పద్ధతిలో తెల్పు చున్నాఁడు.—

ఆ అచ్చు వేసికొన్న నడియేని యన్నను
తమ్మఁ దిన్న పంగదాసుఁడ నన
భాగ్యవశత గాని బ్రదుకులు లేవయా, విశ్వ....1

తాత్పర్యము మనుష్యునికి దేవుఁడెద్దానిని సంపదను గాని ఆపదనుగాని నియమించెనో అదియే కలుగును కాని స్వప్రయో జకత్వముచేత సాధించుటకు వీలుపడదు కావున శంఖచక్రాదిము ద్రలను బుజముపై నంటించికొనినను, వైష్ణవ ప్రపత్తినిజూపి "అడియేన్ దాసన్" అని దొంగదండములు పెట్టినను, ఆచార్యుల ప్రసాదమని యెంగిలితినినను ఏమియు ప్రయోజనము లేదు. భాగ్యముకలుగవలె బ్రతుకవలె నే గాని పట్టిదంభముకూడదు.

ఆ. అందు నిందు వెదకి యనుభవ మందక
కొందఱయ్య లెవుడు కొంగవలెను
మూర్ఖతపముఁ బూని మురియుట గానవా, వి....

"ఆపుణ్యక్షేత్రములో తపస్సుచేసిన దేవుఁడు కనుపడును. ఈపుణ్యక్షేత్రములో తపస్సుచెసిన కనుపడును" అని కొందఱు అజ్ఞానులు కొంగలాగున నిలుచుండి తపస్సుఁజేయుచున్నామని శుష్కించిపోవుచు సంతోషమును పొందుచున్నారు ఓయీ! నీవు చక్కగాపరికించి చూడుము అందువలన కొంచెమైనను ప్రయోజనములేదు గావున మూర్ఖుఁడవుకాకుము

ఆ అధిక మైనయజ్ఞ మల్పుండు తాఁ జేసి
మొనసి శాస్త్రములని మురువు దక్క
దొబ్బ నేర్చుకుక్క దుత్తలు మోచునా, వి....

అల్పుఁడు తెలివితక్కువచేత యజ్ఞము నధికమని తలంచి దానినిచేసి శాస్త్రప్రకారము చేసితినని సంతసము నొంది పశు హింస చేయును ఈయజ్ఞమును చేయించువారు శాస్త్రములని చెప్పి చేయించెదరేకాని హింసాఫలము ననుభవింతురా? కుండ నిండ తెచ్చినయన్నమును కుక్కదొబ్బితినఁగలుగునే కాని మరల దానిని ఇంటికి తీసికొనిపోఁగలుగునా? చాలను అట్లే దిగమని దింపువారేకాని ఫలముననుభవించువారు లేరు

ఆ. అన్నమదమువలన నతివలు మతిచెడి
యేపు రేఁగి మదనుఁ జేచె నందు
రన్నముడుగు వెనుక నతఁ డెందుఁబో య్యెరా, వి.

వేదాంతులు "స్త్రీలకు అన్న మెక్కువగా పెట్టినందువలన మదించి కామవిచారములు కల్గుచున్నవి కావున ఈతిప్ప అన్నముది" అని చెప్పెదరు ఇది అసత్యము పైని చెప్పినట్లు అన్నము వదలితినుచుకొనినను కామము కలుగుట లేదా! కావున దాంభికులు చెప్పినట్లుగాక దుర్గుణము ప్రకృతిచేతనే వచ్చుచున్నది.

ఆ. అన్నిజాతులందు నధికుల మనుచును
యజ్ఞపశువుఁ జంపి యగ్ని నిడుచు
మల్లెయందుఁ బెట్టి మాంసంబు తిందురు,వి....

బ్రాహ్మణులు "మేము మాంసమును తినము మేమన్నిజాతులవారికంటె ఉత్తములము జీవహింస చేయము" అని చెప్పికొందురు, ఇది బూటకపుమాట యజ్ఞమనుపేరును పెట్టికొని పశువునుజంపి నిప్పులోవైచి కాల్చి నందులో నుంచి బెట్టికొని తిందురు పైకిమాత్ర మెఱుఁగనివారివలె నుందురు కావున వీరు దాంభికులు, వీరిమాటలు విశ్వసింపఁదగనివి

ఆ. అరయ దోఁచికొనుచు గురువని తన్నెంచి
తిరుగువాఁడు తన్ను నరయ లేఁడు
పనికి మాలినట్టి బానిసకొడుకురా, విశ్వ.... 6

లోకములో వంచకులు అనేకరీతులుగా బయలుదేరి జనులను మోసముచేయుదురు. శైవులు మొదలగువారిలో గురువులనిపేరు పెట్టికొని తిరుగుచుందురు. నిజముగగురువులు వీరు కారు! తాను గురువునుకొన్నవాఁడు తా నెవరో తెలిసికొనవలదా? కావున నిట్టివాఁడు ఎందునకు పనికిరానితొత్తుకొడుకే గాని గురువు కాఁడు. ఈగురువులుకూడ దాంభికులే.

ఆ. అరుత లింగముండ నది యెఱుంగఁగ లేక
పర్వతంబుఁ బోవు బానిసీఁడు
పాయరానిలింగ మగుఁగాదె ప్రాణంబు, వి....7

వంచకులు జనులను వంచించేకొఱకు మేము శ్రీశైలము నకుఁ బోయెదము కొండ నెక్కెదము ధనసహాయము చేయుమని పీడించుచుందురు ఈ ముండకొడుకులు తమదగ్గఱనే దివ్యమైన లింగముండఁగా సులభముగా పూజచేయలేక పర్వతమునకుఁ బోదురు తమదగ్గఱ లింగమేది యని యందురా? పట్టి నెట్టినను వదలిపోక బొందిలోనుండు ప్రాణము లింగముకాదా?

ఆ అల్లబోడితలలు తెల్లనిగొంగళ్లు
నొడలబూతి పూసి యుందురెపుడు
ఇట్టివేషము లిల బొట్టకూటికె సుమా, వి.... 8

[illegible]

మేని ఇట్టివేషములు బిచ్చమెత్తుకొని జనులను అల్లించి బెల్లించి పొట్టపోసికొనుటకే గాని వేరు గాదు

ఆ అక్షమాలఁ బూని యలసటఁ జెందక
కుక్షి నింపుకొనుట కొదువ గాదు
పక్షికొంగరీతి పైచూపు లేలొకో, వి.... 9

మోసగాండ్రు కొందఱు జపములు తపములు చేయుదు

మని రుద్రాక్షమాలలను చేతఁబట్టికొని దొంగవేషములను వేసి పొట్టనించుకొందురు వారట్లుచేసినంతమాత్రముచేత ఇతరులకు తక్కువయేమియును రాదు, కాని పక్షి కొంగలాగున పైకిమాచి నిక్కియుండడ మెందుకు? అడిగిన కడుపునిండఁ బెట్టరా ?

ఆ. అక్షరాళివెంట నడవులవెంటను
కొంగరాలఁ గోడు గుడువ నేల
హృదయమందు శివుఁడటుండుట తెలియదా, వి.

మోసము చేయ నెంచినవారలు లోకులకు భగవంతునిదర్శనము కలుగుటకని జపముచేయుమని అడవులలో తపముఁ జేయుమని కొండలలో నుండుమని చెప్పుచుందురు ఓజనులారా! మీరు ఆదాంభికులు చెప్పినట్లు చేసి గోడుగోడుమని కష్టములచేత ఏల ఏడ్వవలెను? మీ మనస్సులలోనే దేవుఁడున్నాఁడని మీకు తెలియదా? కావున దాంభికులమాటలను వినవలదు

దాంభికులు కొందఱు ఆఁకలిలేనియప్పుడు అచార మాచార మని ఇతరులు ముట్టినపదార్థములను స్వీకరింపరు. ఆఁకలి కాఁగానే సిగ్గులేక మఱల దానినే గ్రహింతురు. కావున ఆఁకలి సమయములో తా మితరులకు చెప్పిన ఆచారములను వదలివేయుదురు. ఇతరులకు చెప్పినచిత్తశుద్ధి వానికి చీఁకటిపడినతోఁడనే లేకపోవును ఇట్లు గర్భిణిస్త్రీకి వెనుకటిబిగువులేకుండును గదా.! దాంభికులు తప్పులు చేయుచుందురు, కాన వారిని నమ్మవలదు

ఆ. ఆకు లెల్ల దిన్న మేఁకపోతుల కేల
కాకపోయె నయ్యె కాయశుద్ధి
లోకు లెల్ల వెఱ్ఱిపోకళ్లఁ బోదురు, విశ్వ.... 12

ఆచారవంతుల మనకొనుచు దేహమును పరిశుద్ధముచేసికొనుటకు నానావిధములగు వనమూలికలను పవిత్రములని చెప్పి తినుమని దాంభికులు లోకులను మోసగించెదరు. ఆకులను తిన్నంతమాత్రాన లోకులకు శరీరము శుద్ధియగునేని మేఁకపోతులు గుట్టగుట్టకు తిరిగి అన్నివిధములగు ఆకులను తినునుగదా! దానికేల కాయశుద్ధి కాలేదు. కావున లోకులు వెఱ్ఱివెఱ్ఱిపోకడల పోయెదరే కాని అవి నిజములు కావు

ఆ ఆచరాచముల నంగాలలింగాలు
సరణి దెలియనట్టిశైవ మేల
అష్టతనుమయుండు హరుఁడౌట తెలియదు,వి....

ఆరాధ్యులను పేరుగలశైవులు మెడలలోను చేతులకును భక్తిపరవశత్వము చేతనని లింగములను కట్టికొనియెదరు. జంగమ స్థావరరూపమైన యీ ప్రపంచమునందలి జీవులందఱు లింగములు గారా? ఆమార్గము తెలియక శైవమని చెప్పెదరు. దాని తెలియని ఆశైవ మెందులకు? శివుఁడు శివుఁడనఁగా వేరే కలఁడా? నీరు, నిప్పు, గాలి, సూర్యుఁడు, చంద్రుఁడు, ఆకాశము, భూమి, సోమయాజి అను ఎనిమిది శరీరములస్వరూపమే ఈశ్వరుఁ డనుమాట వారికి తెలియదుకదా? అట్టి దంభిశైవ మెందులకు?

ఆ. ఆఁడుదానిఁ జూడ నర్థంబుఁ జూడఁగ
బ్రహ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
బ్రహ్మయాలిత్రాఁడు బండికేవునఁ ద్రెంప, వి....

లోకములో నెంతటిబుద్ధిమంతులైనను ఎంత ఇంద్రియనిగ్రహము గలవారలైనను బ్రహ్మదేవునంతటివారలైనను ఆఁడువారినిగాని, ధనమును గాని చూచినవెంటనే ఆశజనించును. పూర్వము బ్రహ్మ సృష్టిచేయుచు తాను సృజించిన సరస్వతిని కూఁతురుతో సమానమైనది యని యైనఁ గాని చూడక వరించెను. ఏమి బ్రహ్మగారైన నేమి? వాడియాలిత్రాఁడు బండ్లు దిగుకేవులో త్రెంపన వానికి గూడ నిదే బుద్ధికదా! ఇతరులకు చెప్పెడినీతి వారికి లేదు

ఆ. ఆత్మశుద్ధి లేనియాచార మదియేల
భాండశుద్ధిలేనిపాక మేల
చిత్తశుద్ధిలేనిశివపూజ లేలరా?, విశ్వ.... 15

మూర్ఖులై లోకులను వంచనచేయుతలంపుతో, శివునిపూజించుచున్నట్లు పైకివేషమును చేయుదురేకాని లోపల చిత్తము పరిశుద్ధమై యుండదు అట్లు చిత్తశుద్ధిలేక చేయునట్టి ఆశివపూజ వలన కొంచెమైనను ఫలముగలదా అట్లే ఆత్మశుద్ధిలేని యాచారము వలనఁ గూడ నేమిప్రయోజనము? కుండలు తోమక అన్నము వండిన నేమిప్రయోజనమగును.

ఆ. అణుమతములందు నధికమైనమతంబు
లింగమతముకన్న లేదు భువిని
లింగధార్లకన్న దొంగలు లేరయా?, విశ్వ....16

శైవమని, వైష్ణవమని, కాపాలికమని, జైనమని, శక్తిమత మని,చార్వాకమునని ఆఱుమతములున్నవి ఈయాఱు మతముల లోను నియమములు కలిగి సత్యప్రతిపాదకమగు నుత్తమమతమేది యని యాలోచించినచో ప్రపంచములో లింగధారిమతము (అనఁగా శైవము) కంటె మించినది మఱియేదియును లేదు. ఈమాట నిజమే కాని, లింగధార్లందఱు సత్యాన్వేషులేనా ? సజ్జనలేనా? అని విచారించినయెడల లింగధారులకంటె మించిన దొంగలు ఈలోకములో నింక నెవ్వరును లేరు

ఆ. ఆసనములు పన్ని యంగంబు బిగియించి
యొడలు విఱిచికొనెడి యోగు లెల్ల
జెట్టిసాముకన్న చింతాకు తక్కువ, విశ్వ.... 17

యోగులమని పేరుపెట్టుకొని ఒడలినిండ బూడిదను పూసి కొని కూర్మాసన మని, కుక్కుటాసనమని యొడలు విఱిచికొనుచు కూర్చుండుయోగు లందఱును వ్యర్థులేకాని సఫలులు కారు. వీరికిని జెట్టీలమని పట్లుపట్టువారికిని విశేషము భేదము లేదు వీరు వారికంటె చింతాకంత తక్కువయౌనే గాని అంతకంటె భేద ముగనఁబడదు ఇట్టివారందఱును దాంభికులు.

ఆ. ఇచ్చవచ్చునరుని కెచ్చువైష్ణవ మిచ్చి
ద్విజులకన్న దొడ్డతి రటంచు
నెల్లవారు నల్లపిల్లాండు పాడరా? విశ్వ.... 18

వైష్ణవమతస్థులకు ఏజాతివాఁడైనను గాని దాసుఁడుగా నున్నయెడల పావతీర్థము నిచ్చుటకుఁ బని నియమము లేదు అజాతి

వారలు లోకులకు చేయుచున్న సంకర మింతంత యనరాదు. తమకిష్టమువచ్చినవానికి మాలగానీ మాదిగగానీ వైష్ణవ మిచ్చెదరు వారిని బ్రాహ్మణులకంటె నధికులని చెప్పెదరు తర్వాత మానాభిమానములు, ఉచ్ఛనీచలులేక అనీచులతో కలసి అల్లపిల్లాండమును పాడెదరు (అల్లపిల్లాండమనునదియొక పాట "అల్లాండం పిల్లాండం" అని, దీనిని 'అందఱును నొక్కటే' యని సూచించుటకై పాడెదరట)

ఆ. ఇల్లునాలి విడిచి యినుపకచ్చలఁ గట్టి
వంటకంబునీటివాంఛ లుడిగి
ఒంటినున్నయంత నొదవునా తత్త్వంబు, వి....

కొందఱు అమాయికులగు జనులను చేరఁదీసి "సంసారము సాగరము, దీనిని తరించుట కష్టము అందునకొక్కటియే యుపాయము ఇల్లు వాకిలి వదిలిపెట్టికొని యన్నపానాదులను విడిచి ఒంటరిగానుండుము" అని చెప్పెదరు జనులు విని మోసపోదురు ఇల్లు, వాకిలి విడిచి ఇనుపగోచిపెట్టికొని అన్నము తినక కోర్కులను కోలక ఒంటి కట్టుగా నున్నంత నే పరబ్రహ్మము కనుపించునా ? కనుపింపదు

ఆ. ఇహమునందు సుఖము లీడేరఁగా లేదు
పరమునందు నెట్లుపడయవచ్చు
మొదలలేనిచేఁత తుదినెట్లు వచ్చురా, వి.... 20

కొందఱు "యజ్ఞము మున్నగుకర్మలచేత పరలోకములో సుఖములు గలుగును ఆసుఖములు వీనికంటె నుత్తమములు. కావున నీలోకమునందలి తుచ్ఛసుఖములను వదలి పరమునందలి

యధికసుఖమును బొందుటకు ప్రయత్నింపవలయునందురు ఇది టక్కరిమాట పరలోకమునకీలోకము మొదలువంటిది. మొదల నిక్కడే లేనిసుఖము చివరనక్కడ నెక్కడినుండి వచ్చును. రాదు కావున దీనిని పాటింపవలదు

ఆ॥ ఉదయమందు శూద్రుఁ డుత్తమోత్తముఁ డెట్లు
సతికి శూద్రతనము సత్యమె కద!
తల్లి శూద్రయయ్యె తానెట్లు బాపఁడు, వి....

అన్నివర్ణములవారికంటె బ్రాహ్మణుఁ డధికుఁడందురు మఱియును బ్రాహ్మణుఁడుకూడ పుట్టుకలో శూద్రుఁడే ఉపనయనమైన తరువాత బ్రాహ్మణుఁడగును. స్త్రీకి ఉపనయనాధికారములేనందున యామె శూద్రస్త్రీయే యగునుకదా! అట్టిశూద్రస్త్రీకిఁ బుట్టితానెట్లు బ్రాహ్మణుఁడగును? పుట్టుకలో శూద్రుఁడైనవాఁ డుత్తముఁ డెట్లు కాఁగలఁడు? కావున నివి లోకమును మోసపుచ్చుటకొఱ కుద్దేశింపఁబడినది

ఆ. ఉపవసించుచుండి యోగి నీళ్ల మునిఁగియు
కూడువండి వేల్పుఁ గుడువుమనుచు
దాని నోరుకట్టి తామె తిందురు కదా, వి....22

దేవుళ్లకు పొంగళ్లని దాంభికులుచేయు అల్లరికి మితమే లేదుకదా! భక్తిగలవారివలె ఉపవాసము లుందురు పవిత్రతను కోరువారివలె గుంట గుంటనీళ్లను మునిఁగెదరు చివఱకు అన్నమును వండి నైవేద్యమని యెదురుగా వడ్డించి "ఆరగించు" మని చెప్పి ఆ దేవతనోరుకట్టి తామే తిందురుకదా! అహ్హా! ఎంతి దంభముఁజూపెదరు.

ఆ. ఉపవసించినంత నూఱబందిగఁబుట్టు
తపసియై దరిద్రతను వహించు
శిలకు మ్రొక్కనగునె జీవము గలబొమ్మ వి....

వంచకులు లోకులను కొడుకులు పుట్టుటకును కోరికలు ఫలించుటకు నుపవాసములు చేయుమని జపములను చేయుమని దేవాలయములకేఁగి శిలావిగ్రహములకు నమస్కారములు చేయుమని చెప్పుచుందురు కాని ఇట్లు చేయుటవలన ఫలములేదు. ఉపవాసముచేసి యాత్మకు అన్నము పెట్టక శుష్కింపఁజేసినందున ఆత్మహత్యా దోషముకలుగును అందువలన మఱుజన్మములో పందియైపుట్టును. ఇఁక నెల్లప్పుడును తపస్సుచేయుటచేత దరిద్రుఁడగును కాఁబట్టి ఓరోయి బుద్ధివంతుఁడా! ప్రాణముగలబొమ్మ ప్రాణములేని రాతిబొమ్మకు దండములు పెట్టవచ్చునా? కూడదు, దాంభికులమాటలను నమ్మరాదు.

ఆ. ఊరఁబంది యెఱుంగ దుత్తరావాచులు
చెడ్డనరికె మెల్లఁ జెందుఁగాక
సాధ్విమహిమమెట్లు సైరిణి యెఱుఁగురా?, వి.

మోసగాండ్రు ఉత్తములైనవారిని అజ్ఞులని అసాధులని నిష్ప్రయోజకులని నిందించుచుందురు ఇంతమాత్రముచేత వారితెలివితక్కువ బయలగునేకాని వేఱుగాదు మాడు. ఊరిలోనుండుపంది, శ్రేష్ఠములగునింపగు వస్తువులను తెలిసికొనఁగలుగునా? కాని అసహ్యకరములగు నరికకూపములను మాత్రము తెలిసికొనఁగలుగును. అట్లే పతివ్రతయందలి మాహాత్మ్యమును రంకటాలుగూడ తెలియఁజాలదు కదా!

ఆ. ఊరినడిమిగోవి యుదకంబుగొని తెచ్చి
పాదతీర్థ మనుచు బ్రమయఁ జేతు
పాదతీర్థ మన్న ఫలమేమి కద్దురా ?, వి.... 25

ప్రతారకులు పలువిధముల లోకులను మోసగించెదరు. నడి యూరిలోనిబావినీళ్లను తీసికొనివచ్చి దేవునిపాదతీర్థ మని త్రావింది భ్రమింపఁజేయుచుందురు లోకులు వానిని తెలిసికొనలేక త్రాగుచుందురు అయ్యో! బావినీళ్లను త్రాగి పాదతీర్థమని కొని నందువలన ఫలమేమి యున్నది చెపుమా ?

క. ఊరులు పల్లెలు మానుక
వారక యడవిం జరించువాఁ డరుదెంచు
న్వేరులుఁ గూరలుమెసవెడు
వీఅడి కెట మోక్షపదవి వినఁగా వేమా. 26

వంచకులు లోకులకు "ఇల్లు వదలి పెట్టి ఊళ్లలోను పల్లెలలోను నుండక యడవికిఁబోయి తపముఁ జేయుచు ఆకలియగునప్పు డచ్చటి ఆకులలములను తినుచుండిన మోక్షము వచ్చునని చెప్పి మోసము చేయుదురు ఎంతవెఱ్ఱివారు! ఊరిని వదలిపెట్టి అడవులలో తిరుగాడుచు వేళ్లు కూరలు దినువారికి మోక్షమెట్లు కలుగును.

ఆ ఎంగిలెంగి లనుచు నీనోటితోడనే
వేదములను జదువు వెఱ్ఱులార
యెంచి చూడ నదియు నెంగిలికాదొకో, వి....

వేదములను జదువుకొనుచుండెడి చాద స్తపుబ్రాహ్మణులు ఆచారమని చెప్పచు చూచినదానినెల్లను ఎంగిలెంగిఁని పలుకు

చుందురు. ఓవెఱ్ఱిబ్రాహ్మణులారా ? మీరు నోటిలోనుండివచ్చిన దానినిగదా ఎంగిలని యందురు. ఆనోటితోనే, అనఁగా ఆ యెంగిలిగలిగిననోటితోడనే, వేదములను పవిత్రములైనవానిని చదువుచున్నారు ఆలోచింపగా నదిమాత్రము ఎంగిలికాదా ? కావున శాస్త్రీయము వదలివేయుఁడు. దంభమును అవలంబింపకుఁడు

ఆ. ఎంబెరుమత మని యెసఁగి మాంసముఁ దిని
మారుపేర్లు పెట్టి మధువుఁ ద్రావి
వావివరుసఁ దప్పి వర్తించి చెడుదురు, వి.... 28

ఎంబెరుమత మనఁగా : నామధారులమత మఁట ! లోకములోని మోసగాండ్రు "ఎంబేరుమత" మని పేరు పెట్టి ఇష్టము వచ్చినట్టులు మాంసమును తినెదరు కల్లునకు అమృతము పొందలగు మారుపేరులనుపెట్టి త్రావెదరు అక్కచెల్లెండ్రనియైన నాలోచింపక వావివరుసలు తప్పి యిచ్చవచ్చినట్టులు తిరిగి ప్రజలను మోసగించెదరు ఇట్టివారి దాంభికులు. కావున వీరిని నమ్మవలదు.

తే. ఏమియైనది పరతత్త్వ మెఱుఁగ లేక
సోమయాజులు పశువుల స్రుక్కడంచి
సామ మేర్పడఁ జదివినఁ జావవేల
బాధకములగుదుర్గుణపంక్తి వేమ. 29

యజ్ఞాదులను చేసి సామవేదమును పఠించినగుణియై ముక్తుఁడగునని చెప్పుచుందురు ! యజ్ఞములు చేసినంతమాత్రాన దుర్గు

ణములు తొలఁగవు పరబ్రహ్మస్వరూప మెట్టులుండునో తెలి సికొనఁజాలక సోమయాజులమని నోరులేనిపశువులను బట్టికొని చంపుచు వధచేయుఁకాలమున హింసపోవుకొఱకు సామవేదమును పఠించుచుందురు అయ్యారో! సామమును ఎంతచక్కఁగా చది వినను పరలోకమునకు బాధకము లగుదుర్గుణములు ఎందుకు నశింపవు చెపుమా? కావున నిదంతయును దంభము.

ఆ ఐన దాని కింక కానిదానికి నైన
నాడువారిమాట లాడుమన్న
సాహసమున పెక్కు లూహాలు పనుతురు, వి....

దాంభికులు చెప్పుమాటలకు తలుగే లేదు జరిగినదానిని గూర్చిగాని జరుగుచున్నదానిని గుఱించికాని కాఁబోవుదానిని గుఱించిగాని ఆఁడువారివలె నోటికి వచ్చినట్టులు సాధకబాధక ములులేకుండ తెంపుచేసికొని అనేకములను ఆకాశమునకు భూ మికి అతుకులు పెట్టుమాటల ననాలోచితముగా పల్కుదరు దాంభికు లెంతటిమోసమునకైన'పాల్పడుదురు. కావున నట్టివారిని నమ్మవలదు

ఆ. ఒడల బూది పూసి జడలు ధరించిన
నొడయఁడగును ముక్తిఁ బడయలేఁడు
తడకబిట్టుపెట్టఁ దలుపుతో సరియౌనె? వి....

దంభకరులలో కొందఱు ఒడలినిండ బూడిదను పూసి కొని జడలను దాల్చికొని ముక్తికొఱకుఁ బ్రయత్నించుచున్నా మని యనిరెదరు. అంతమాత్రముచేతనే మనుష్యుఁడు ముక్తి బొందఁగలుగునా! పొందఁజాలఁడు. ఎట్లనియనిరొదరేమెం!

చూడుఁడు ఇంటిలోనికి దొంగలుమున్నగువారు రాకయుండు నట్లు తలుపునుపెట్టుకొనవలయును గాని తడుకకు బిఱ్ఱువెట్టినంత మాత్రమున తడుకతలుపగునా? కాదు అట్లే విభూతిపెట్టుకొన్నంతను జడలుదాల్చినంతను అయిన నధికారియగునే కాని మోక్షము నొందఁ జాలఁడు.

ఆ. ఒడ్డుఁబొడుగుఁగలిగి గడ్డముం బొడవైన
దానగుణము లేక దాత యగునె
యెనుము గొప్పదైన నేనుఁగుఁబోలునా. వి....

కొందఱు సాపాటురామున్నలు లోకులను మోసముచేయుటకు దాతలవలె నటింపవలయునని యత్నించెదరు అట్టివారు ఎంతవేషమును వేసికొన్నను, ఒడ్డుపొడవుగలిగి దొడ్డవారలై బారెడుగడ్డమును పెంచికొనినను (ప్రకృతి) పుట్టుకతో సాధారణముగా లేనిదానగుణమును తెచ్చిపెట్టుకొని నటించుచున్నను దాతమాత్రము కాఁజాలరు ఉదాహరణముగా నెనుమును తీసికొందము ఎనుము ఎట్లు మిక్కిలియొడ్డుపొడుగు గలిగినను ఏనుఁగునుబోలదో అట్లు దాంభికుఁడును ఎన్నివేషములను వేసికొనినను దాతమాత్రము కాదు.

ఆ. కడుపు బోరగించి కన్నులు ముకుళించి
బిఱ్ఱబిగిసికొన్నబిదయోగి
యముని బారిఁగొట్ట యతఁ డేమి సేయురా. వి....

కొందఱు యోగులమని పేరుఁబెట్టికొని సర్వజ్ఞులవలె నటించుచుందురు; కాని తాము లోకులను వంచనచేసినందువలన గలుగుఁబోవుఫలమును మాత్రము కానలేరు. కడుపును ఉబ్బఁ

చేసికొని కన్నులనుమూసికొని బిఱ్ఱబిగిసికూరుచుండియున్న ఆ యోగి పాపము బీదవాఁడు. అతనికేమి తెలియును? యమునిబాటికి పోఁబోవుగొఱ్ఱెకావున నతఁడేమిచేయఁగలుగు నింతకంటెను! అనఁగా నిట్లు వంచించి చివఱకు యమలోకమునకుఁ బోవునని భావము

ఆ. కంబళీములఁ గట్టి గంతల గజ్జల
  బోడితలల సొంపు పొల్పు మీఱఁ
  గడుపుకొఱకుఁ దిరుగ ఘనులౌదురా వారు వి.

కొందఱు పరమధర్ములముని పేరులఁబెట్టికొని కంబళ్లుశాల్వలుమున్నగువానిని కప్పి గొప్పయాటోపముతో గజ్జెలు గట్టికొని తలలనున్నగా గొరిగించికొని సొగసుతెగయున్నట్లు ఊరూరికిని తిరిగి లోకోపకారమును చేయుచున్నామని విఱ్ఱవీగుచుందురు వారట్లు తిరుగుట కడుపునించుకొనుటకే గాని ఘనతను సంపాదించికొనుటకుఁ గాదు లేనిపోనిటక్కరివేషములను వేసికొని కడుపుకొఱకు తిరిగినంతమాత్రాన వారు గొప్పవారలెట్లు కాఁగలరు?

ఆ. కల్లటికెకు భూతి గట్టిగాఁ బెట్టిన
  నందులోనికంపు లడఁగనట్టు
  మెడను డ్రాడు వేయ మెఱయుచు ద్విజుఁడౌనె వి.

దాంభికులు కొందఱు యజ్ఞోపవీతమును మాత్రము ధరించిన చాలును బ్రాహ్మణత్వము సిద్ధించును. అని యేమేమో ప్రేలుచుందురు జన్నిదమును వేసికొన్నంతనే బ్రాహ్మణుఁడు కాఁడు, లోపలను వెలుపలను పరిశుద్ధతనొందవలయును అటుపిమ్మట

జన్నిదమును ధరించిననే ప్రయోజనముకలుగునే కాని మఱియొక రీతిగాఁ గలుగదు. కల్లటికెను తెచ్చి పైని విభూతిని పూసిన వాసనపోవునా? పోదు అట్లే మెడలో త్రాడు వేసికొన్నమాత్రాన బ్రాహ్మణుఁడగునా? కాఁడు.

ఆ. కావిపంచగట్టి కడుయోగివలె నుండి
వెలికిఁ గోర్కెలెల్ల విడిచిపెట్టి
తొరగి తిరుగువాఁడు దొంగసన్న్యాసిరా. వి....36

సర్వసంగపరిత్యాగులమని చెప్పుచు కావివస్త్రములను కట్టి కొని యోగిరీతిగా పైకిఁ గనఁబడుచు, ఏవస్తువులయందును తమకు కోరికలేనట్లులు నటించుచు టక్కరులు కొందఱు తిరుగుచుం దురు అట్టివారు నిజమైన సన్న్యాసులు గారు ఈరీతిగా తిరుగు వారినందఱిని దొంగసన్న్యాసులని తెలిసికొనవలయునేగాని నమ్మి వారిని చేరదీయరాదు.

ఆ. కుక్కుటమననంబు కొక్కెరధ్యానంబు
యతులనొసట నొనరునట్లు వ్రాసెఁ
దొల్లి చేసినట్టి దోషంబు తగిలెనో! విశ్వ.... 37

సన్న్యాసులు యోగాభ్యాసము అనిపేరుతో కనులు మూసి కొని పొట్టనింపులకై మననము ధ్యానము మున్నగువానిని చేయుం దురే కాని నిజముగా పరమాత్మసాక్షాత్కారముకొఱకు వారు అట్లు చేయుచుంట లేదు ఇట్టివీరిమననము కుక్కుటమననముతో సమము. ధ్యానము కొక్కెరధ్యానసమము. అనఁగా వీమననధ్యా నములు దొంగలవలె వంచన చేయుటకొఱకు చేయుచున్నారు. వీరు ఇట్లు చేసి జీవనము గడపవలయునట్లు బ్రహ్మ వీరినొసట

వ్రాసెను బ్రహ్మ ఇట్లు వ్రాయుటకు పూర్వ జన్మమున చేసినపాపము కారణమై యుండును.

ఆ. కులమునీఱుచేసి గురువును వధియింపఁ
బూనఁగ నేనుఁ గంతబొంకు బొంకె
పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా, విశ్వ.... 38

వంచకులు ధర్మాత్ములము అని యీరీతిగా పెద్దపేరులను పెట్టుకొని లోకమును వంచించుచు నసహ్యమునకైన ధియుపడెరు ఇట్టివారేగదా ధార్మికులు! చూడుఁడు ధర్మరాజు అన్నిధర్మములను తెలిసినవాఁడు గొప్పవంశమున పుట్టినవాఁడు అట్టివాఁడు తన ప్రవర్తనమున నిట్లుండవలెను? ఉండెనా? ధర్మరాజట్లులేదు. పైన వంశమును నాశనముచేసి చదువుసందెలఁ జెప్పినగురువును జంపుటకే కొంచెము కుంచము కాదు ఏనుఁగంత బొంకును బొంకెను కావున పేరును జూచి నమ్మవలదు పేరు ధర్మరాజే గాని విషవువిత్తనము

ఆ. గుహలు పదివేలు సొచ్చిన గుణము పోదు
నియతగురుభక్తి కావలె నేర్పమీఱ
మహితపరతత్వభావంబు మధురమగును
దాని సాధింపనే మఱి పూను వేమ. 39

దాంభికులు గుహలలో దూరి విషయాసంగము లేక నిశ్చలులై తపంబును చేసి తత్త్వమును చూచుచున్నామని లోకులకు చెప్పినమ్మించి వారిని గూడ నట్టులే గృహముల దారలను కొమరులను విడచి గుహలలో దూఱుటకు పురికొల్పుచుందురు. ఇది అసత్యము అని తెలియక లోకులు భ్రమయుచుందురు.

చూడుఁడు స్వతస్సిద్ధముగా పుట్టినగుణము పదివేలగుహలలో దూరినను పోఁజాలదు అజ్ఞానమునుపోయి జ్ఞానము కావలయునన్న నియమముగా గురువును సేవించి భక్తిగలిగి తెలివితేటలుగలిగివర్తించినయెడల పరబ్రహ్మస్వరూపము తేటతెల్లముగాఁ గనుపించును. వేమనా? నీవు అసత్యపదార్థమునే సాధింపఁబూనుకొనుము ఎంతమాత్రమును వంచకులను నమ్మవలదు

తే. గూబవలెఁ గ్రుడ్లుద్రిప్పిన గుణము రాదు
లోభమోహము లుడుగంగ లాభమగును
దేబెలై భిక్ష మెత్తుట తీర్ప దెపుడు
డాబుసేసిన లక్ష్య మఁటంగు వేమ. 40

మూర్ఖులై యోగమని పేరుపెట్టుకొని కన్నులు మూసికొని కనుగ్రుడ్లను తేలవైచి దొంగజపములను చేయుచు సమాధిలో నున్నట్లు వంచకులు నటించుచుందురు అట్టివానిని నమ్మరాదు గ్రుడ్లగూబలాగున గ్రుడ్ల ద్రిప్పినంతనే మంచిగుణము వచ్చునా? రాదు మఱి యెట్లు వచ్చునని యనినచోఁ జెప్పుచున్నాము లోభమును, మోహమును, అనఁగా అజ్ఞానమును వదలి పెట్టినయెడలనే లాభము కలుగును ఇట్లే, తెలివితక్కువచేత బిచ్చము నెత్తుచున్నను లాభము లేదు. తనకు లాభము లేకపోయినను డాబు సేసెదమని తలంచినయెడల అసలుతత్త్వము కనుపింపక యదృశ్యమగును. కావున నట్టులుచేయరాదు

ఆ. ఘటము నింద్రియములఁ గట్టి వేయఁగ లేక
చావువచ్చునపుడు సంన్యసించు
నాత్మశుద్ధి లేక యందునా మోక్షంబు,విశ్వ....

లో॥ ౬

చిత్త మఁ

దు ్రయ

ములను గట్టివేయలేక ఇష్టమువచ్చినట్లు అంగ శక్తయున్నంతవఱకును లోకులను మోసముచేసి చివఱకు చావుకాలము దాపరించినప్పుడు సంన్యాసమును తీసికొనును. ఇట్లు సంన్యాసమును తీసికొనినంతమాత్రాన మోక్షము వచ్చునా ? రాదు ఆత్మశుద్ధిగలిగి మోక్షమునొంద ప్రయత్నింపవలయునే కాని వేఱుగాదు. కావున నాత్మశుద్ధికై ప్రయత్నింపవలయునే కాని సంన్యాసము మొదలగువానికై ప్రయత్నింపకూడదు

ఆ. చిలుక నోరుగొట్టి చిత్తజుమెడఁ గట్టి
కచ్చడంబు బిగియఁ గట్టికొన్న
మనసు వశముగాదె! మహి నేమిపాపము?,వి....

వానప్రస్థాశ్రమమని పేరుతో అడవులలోఁ జేరి పండ్లను ఆహారముఁగైకొని స్త్రీలను ముందుంచికొని ముక్తికొఱకు ప్రయత్నించుచుందురు. ఇంతఁజేసినను వారికి ముక్తిమాట యట్లుంచి మనస్సు అయినను కుదుటఁబడినదా ? అనిన నదియును లేదు. చిలుకలు మొదలగువానికి ఆహారముగా సృజించి పండ్లను వాటి నోటిని గట్టివైచి కామమును విడనాడక గోచిని బిగువుగాఁ గట్టికొన్నంతమాత్రమున మనస్సు స్వాధీనము అగునా ? కాఁజాలదు ఏమిపాపమువలననో గదా ఇట్లగుట ? కావున దాంభికులం బోలి చెడిపోవలదు.

ఘోషాయనియును, సౌందర్యవతి యనియుంగా, పరపురుషులను చూడనైన నొల్లననియును, పైకి లేనిపోనిడాబులను పైన వైచికొని కొందఱు దాంభికలగు స్త్రీలు లోకమును వంచనచేయఁ బ్రయత్నించుచుందురు, కాని పైకి ఎన్నివేషములను వేసినను సహజమగు గుణమును మాత్రము మానరు చూడుఁడు ఎంత చక్కని చిన్నదియైనను, సొగసుగానున్నను, పరపురుషునికి శరీరమునైనను చూపకయున్నను పగలంతయుంగ గడిచిన పిమ్మట సందెచీకటి పడంగానే సయ్యాటలు నాడుటకు మొదలుపెట్టరా? కావున వారిమాటలను నమ్మరాదు

ఆ. చదువు చదువ నేల సన్న్యాసికా నేల
షణ్మతములఁ జిక్కి చావ నేల
అతను భజనఁ జేసి యాత్మలోఁ దెలియుఁడీ, వి.

కొందఱు మహానుభావులు శాస్త్రములనాఱింటిని తుదముట్టఁ జదువుకొని సన్న్యాసులై తత్త్వవిచారణమను పేరుతో శైవ, వైష్ణవాదులగు నాఱుమతములలోను అది హెచ్చు ఇదిలోచ్చు అని వాదించుచుందురే కాని నిజమును తెలిసికొనఁజాలరు కావున నిట్టిదాంభికలచదువంతయు వ్యర్థము ఎట్లంగురా? చదువుచదువని శాస్త్రముల నన్నింటిని ఏలచదువవలయును? తరువాత శాస్త్రములలో చెప్పియున్నదని సన్న్యాసమును తీసికొనుట యెందులకు? సన్న్యాసులైరిపో! షణ్మతములను చిక్కులలో ఏల

చికొ్కనవలయును ఇంతకన్న సులభముగుమార్గములేదా? కావున శరీరమేలేని యమేయరూపుని ఆత్మలో నున్నట్లు తెలిసికొనిన ముక్తి వచ్చునని తెలిసికొనవలయును.

ఆ చాలదయ్య యింక చార్వాకమతరీతి
శక్తి శైవ మనుచుఁ జాల నమ్మి
సరణి మిగిలి చెడును చండాలసేవచే, వి.... 45

లోకులనంటతిని మతగురువులమని పేరుపెట్టికొని తనులోనికి చేరఁదీసికొని శక్తిపూజయని కొందఱు వంచకులును, శైవమని వీరశైవమని మతకొందఱిని నమ్మించి తాము కూడ తెలివితక్కువచేతఁ గాఁబోలు నమ్మినట్లులుండి ఔచిత్యమును, మంచిచెడ్డలను వదలిపెట్టి మాలమాదిగలై చెడిపోవుచుందురు వీరు దాంభికులు చార్వాకులు దేవుఁడు లేఁడనిచెప్పొని నిందలను సేయుచుందురు. నిజముగా ఇట్టి యసత్యమతములను నమ్మినవారిరీతిని విచారించితిమేని యింతకంటె చార్వాకరీతి మతియొకటిఁ గానము ఇట్టులు నాస్తికమతమును అవలంబించుట ఇఁకనైనను నిలుపుదల చేయఁగూడదా?

ఆ. జడలు గట్టనేల సన్న్యాసి కానేల
నొడలువిఱుచుకొనెడి యోగమేల
ముక్తికాంతఁ బట్టి ముద్దాడనే కదా, వి.... 46

జడలను దాల్చికొని సన్న్యాసులమగుకొని కొందఱును ఒళ్లు విఱిచికొని యోగులమని కొందఱు లోకులను మోసము పుచ్చఁదలఁచుచుందురు. ఇట్లు చేయుటవలన ప్రయోజనమేమి యనః

ముక్తియని చెప్పెదరు. ముక్తిబడయుటకు జడలు ఏలకట్టుకొన వలయును? ఒళ్లు నెందులకు విఱుచుకొనవలయును? ఇంతకంటెను సులభములగు మార్గములుండఁగా నిట్లు చేయుట దాంభికలక్షణ మని యెఱిఁగి మోసమునొందక యుండవలయును.

ఆ. జాతులందు మిగుల జాతియే దెక్కువో
యెఱుక లేక తిరుగ నేమిఫలము!
యెఱుకగలుగువాఁడె యెచ్చైనకులజుండు, వి....

ఎఱుకలేని జనులను దగ్గఱచేరి అన్నిజాతులలోనికి మాజాతి యెక్కువనిన మాజాతియెక్కువది యని దాంభికులఁ ద్రొబ్బులాట లవాడి తమతమమతములలోనికిని జాతులలోనికిని తీసికొనప్రయ త్నములను సేయుచు నల్లరులను చేయుచుందురు. ఇట్లు చేయుట వలన సామాన్యులందఱును మోసపోయెదరు నిజముగా లోకులకు జ్ఞానము నుపదేశించి వారిని ఉత్తమజాతులను చేయఁదలఁచినచో వారికి ఉత్తమమగుజ్ఞానమును గలిగించి అపిమ్మట విచారింప వల యునే గాని జ్ఞానమే లేక తిరిగిన ప్రయోజనమున్నదా? లేదు. కావున ఎవ్వనికి జ్ఞానము పవిత్రమైనది కలుగునో వాఁడుత్తమ వంశముగలవాఁడగునే గాని వివాదమువలనకాఁడు.

ఆ. టిప్పణములు సేసి చప్పనిమాటలఁ
జెప్పుచుందు రన్ని శ్రుతులు స్మృతులు
విప్పిచెప్ప రేల వేదాంతసారంబు, వి.... 48

లోకులు అజ్ఞానదశలో నున్నందున తాము లోకానుగ్రహ ష్ఠులై ఊరూరను సదాచారముల నుపదేశింపవచ్చితిమని దొంగ

వేషములను వేసికొని నడుమనడుమ శ్రుతులను స్మృతులను ఉదాహరణముగా చెప్పుచు తమభావములకు సరిగా లేనిచోటుల టిప్పణములను సారము లేనిమాటలతో చెప్పుచుందురు వీరే దాంభికులు నిజముగా వీరు దాంభికులుగాక లోకమునకు మేలు చేయవచ్చినయెడల లోకులందఱు తరించునట్లుగా వేదాంతసార మును వివరించి ఏలచెప్పకయుందురు? కావున నిట్టివంచకులను నమ్మరాదు

ఆ. రింగణాలు బలసి నింగికి నెగిరినఁ
జెట్టుచివరపండు చేతఁ బడునె
పుస్తకములు చదువఁబొందునా మోక్షముల్, వి.

ప్రజలను మోసపుచ్చుటకై జనులు దాంభికులు గొందఱు మేమిన్ని గ్రంథములను చదివితిమి ఆమూర్ఖుఁ డొక్కఁడానిని గూడ చదువలేదు వాఁడు చదువరానివెంద్దు మేము చదువ నేర్చినపెద్దలము అని మోసము చేయుచుందురు డాబు చేసిన యెడల ఫలముగలుగదు చూడుఁడు పిక్కలు బలిసి ఆకాశ మునకు ఎగురఁగలిగినంతమాత్రాన చెట్టుకొట్టకొనమీఁదనుండు పండు అందఁగలదా? అట్లులే కట్టకట్టలుపుస్తకములు చదివినంత మాత్రముచేత మోక్షములు వచ్చునా? రాఁజాలవు కావున అట్టి వారిని నమ్మరాదు.

ఆ. దగ్గఱకుము పాపదాంభికులను నీవు
మోసపుత్తురయ్య కోసమనక,
క్రూరమృగములట్టివారు రానమ్మకు, వి.... 50

నాయనా! ఇట్టిదాంభికులదగ్గఱకు చేరకుము. వారు మిక్కిలి పాపాత్ములు వారికి తనవాఁడు నావాఁడు అను సాధు భావము గాని అయ్యో యని కరుణగాని లేదు పాపమును కూడ లెక్కచేయక దగ్గఱచేరి వారిని మోసముచేయఁ జూచుచుందురు. అట్టివారు మనుష్యరూపముతో తిరిగెడి అడవిలో నివసించు క్రూర మృగములతో సమానులు అటువంటివారి నెన్నటికిని నమ్ముకుము. వారివలలోఁ జిక్కకుము అట్టివారివలె నెన్నఁడును నీవు ఉండుటకు ప్రయత్నింపకుము ఇట్టి దాంభికులను తెలిసికొని నీవు ప్రవర్తింపవలయును

ఆ. తంత్రమంత్రములను తారక మజ్జనా
యంత్రబలము గురునిమంత్ర మాని
చింతఁజేయునపుడె చిన్మయ మందురా, వి....51

మంత్రశాస్త్రజ్ఞులు జనులను చేరదీసి జనవశ్యము రాజవశ్యములగలుగుటకు తమయొద్ద ననేకములు తంత్రములు మంత్రములను గలవనియును యంత్రములును గూడకలవనియును వాని వలన దుర్లభమైన ఎటువంటివస్తువైనను దొరకుటమాత్రమే కాక రోగులకుఁ గూడ దొరకనిధి రక మబ్బును. కావున తంత్రములను మంత్రములను నేర్చుకొనుఁడు అని చెప్పి మోసము నొందించెదరు వారికి జనులు లోఁబడుదురు నిజము విచారించినయెడల యంత్రములచేతను తంత్రములచేతను మాత్రములను తారకము చిక్కునా ? చిక్కదు. మఱి యింక నెట్లు దొరకునందువా? గురూపదేశము నొంది నిరంతరమును ధ్యానించిన చిన్మయము నొందుదువుసుమా!

ఆ. తనువునందు నగ్ని దరికొని కాలంగఁ
గాల్చుకొనుట యేమికర్మమునకొ
కాల్చుకొన్నయంత ఘనుఁడు తా నయ్యెనా, వి.

దాంభికులు లోకులు నపవిత్రులనియును వారిని పవిత్రుల నుగా చేయుటకు అగ్నితోనే పరిశుద్ధిచేయవలయుననియు నంగు లకే ముద్రలను వేయుట యనియుఁ జెప్పి మోసముం జేయుచుం దురు. ఇది వైష్ణవమతసంప్రదాయము, కాని యిట్లుచేయుటకు కారణములు కానరావు పవిత్రతకొఱకని యందురా? తమతమ హృదయములలోనే యగ్ని వెలుగుచుండఁగా మఱల కాల్చుకొనుట యేమికర్మము? పోనీ కాల్చుకొననిండు కాల్చుకొన్నంతమా త్రమున నాతఁడు ఘనుఁడయ్యెనా? కాలేదు కావున దాంభి కులమాటలు విని మోసపోవలదు

ఆ తనువు లస్థిర మని ధనము లస్థిరమని
తెలుపఁగలఁడు తాను తెలియలేఁడు
చెప్పవచ్చుఁ బనులు సేయుట కష్టమా, వి....53

దొంగలు వేదాంతుల మని పేరులతో తిరుగుచు "శరీరములు శాశ్వతములుకావు సంపదలు స్థిరములుగానుండఁజాలవు కావున మేనిలోనం బ్రాణములున్నంతలోనే దానాదులను చేయు" మని చెప్పి మోసము చేయఁజూచుచుందురే గాని నిజముగా వేదాం తులు గారు! వారునిజముగానే వేదాంతులగుగురేని తాను చెప్పెడి మాటలను తనపనులయం దెందులకు అవలంబించియుండఁగూ డదు? కావున నితరులకు చెప్పవచ్చునే గాని వానిని తాను చేయఁ

గలుగుట కష్టము అట్టి వంచకులగు వారిబారిలో జనులారా! మీరు ఎన్నటికిని చిక్కవలదు వారు దాంభికులవి తెలియుండు.

ఆ. తప్పువేషమూని ధరలోనఁ దిరిగెడు
   నేఁతలెల్ల మిత్తిఁ జేసుటకునె
   కడుపునిండ నింతి కష్టంబు లేలరా ?, వి.... 54

తప్పుడు వేషములను వేసికొని లోకములో నన్నిచోట్లు లను దిరుగుచు తనకగపడిన ప్రతివారిని వంచనసేయుచు దాంభికుఁ డిట్లుచేసిచేసి చివరకు పొందెడిఫలము మృత్యుదేవతను దర్శింపఁబోవుటయే కాని మఱియొకటి గాఁజాలదు. అనఁగా. బ్రతికి నన్నినాళ్లు పొట్టనింపుకొనుటకనుట. ఛీ! పాడుపొట్టను నిండించి కొనటకు చేయరాని ఇంతింతిపనులను, పడరాని పాట్లను పొందవలయునా ? పొంది చివరకు నొందుఫలమేమి ? కావున దంభముచేత నిసుమంతయు నుపయోగములేదు.

(ఆ) తిరుపతికిని బోవఁ దురక దాసరి గాఁడు
   కాశికేఁగఁ బంది గజముగాదు
   కుక్క సింహ మగునె గోదావరికిఁ బోవ,వి....55

వంచకులు సాధారణముగా "తీర్థయాత్రలఁ జేసితిమి తిరుపతికి బోయితిమి! తిరునాళ్లఁజూచితిమి పవిత్రుల మైతిమి. కావున నితరులగు జనులందఱును మమ్ము సేవించినను పూజించినను పవిత్రులగుదురు" అని మోసము చేయఁజూచెదరు. ఇట్టివాండ్రు వంచకులు వీరు తిరుపతి మొదలగుతీర్థాలకు వెళ్లినమాత్రానఁ బవిత్రులగుదురా? కారు, ఎట్లనఁగా. ప్రతిదినమును వేలకొలఁది జీవులఁజంపు తురక తిరుపతికిఁబోవఁగా నే దాసుఁడు కాఁజాలు

ఆ. ప్రజ లెఱుంగ బ్రదుకఁ బట్టభద్రుఁడు గాఁడు
పై గిరీటముండు బ్రహ్మగాఁడు
నోగుఁ దెలిసి పలుకు యోగీశ్వరుఁడు వాఁడు, వి.

విద్వాంసుఁడగు వాఁడు పొంగమాటములు లేక లోకులకు జ్ఞానము నుపదేశించి సన్మార్గమున నడిపింపఁబూనును ఆహా! ఏమి యీతని యపూర్వము లగు ప్రభులక్షణములు! ఈవిద్వాంసుఁడు అందఱికిని తెలియు నట్లు ఖండితముగా బలుకును ఇట్లుబలుక్రుటకు రాజుగారా? కాదు ఈతని తలపైనను గిరీటముండును. పోనీ సృష్టికర్త యగు బ్రహ్మయందమా యితను కూడ కాదు మఱి యిః ఈతఁ డెవ్వరని యందురా? ఓగును దెలిసికొని దయామయుఁడై కృతార్థునిజేయు నుపదేశించు యోగి యని కొనుఁడు అని భావము

ఆ. పృథివిమీదఁ బుట్టి ప్రిదులుగహంసల
విహారణం బెఱింగి విడువకమదిఁ
దిరుగ నేర్చియుండు ధీమంతుఁ డెప్పుడు, వి....

భూమిమీద మనుష్యుఁడై పుట్టిన తరువాత నుత్తమమగు జ్ఞానమును సంపాదించుట నరునకు ముఖ్యమగు కార్యము అందునను చదివికొని విద్వాంసుఁ డైనప్పుడు తప్పక విద్యలలో నెల్ల నుత్తమవిద్య మగు నాత్మవిద్యను సాధింపవలయును. ఇట్టిపని చేయుట పామరున కశక్యము. విద్వాంసుఁడో, భూతములయు నాత్మలయును పంచీకరణమును చక్కఁగా దెలిసికొని ఒకప్పుడా విచారణమును వదలివేయక సర్వదా తత్పరుఁడై యుండ నేర్చును.

ఆ. బంటువలెన లేవఁ బండితంమన్యుఁడు
సాధుపండితుండు శాంతుఁడగును
కుక్క గూయ నేమి గుఱ్ఱమునకు లెక్క, వి....

పండితుఁ డెద్దానినైనఁ గూర్చి మాటలాడఁ బోవునప్పుడు చెంతనున్న పామరుఁడు తాను వానికంటెను మిక్కిలిగా తెలిసినవానిఁబోలి లేచి వింతగా నార్భాటమును జేయును కాని యట్టివాఁడు పండితుఁడా? కాదు ఏల యనిన: నిజమగు పండితుఁడైన యసూయను విడనాడును శాంతమును వహించును సాధుభావమును చేకొనును పామరుఁ డట్టిపండితుని నిందించినందువలన నతనికి అవమానము కాదా? యందురేని వినుఁడు. కుక్క మొఱిగిన గుఱ్ఱమునకు అవమానమా? లేదు గదా! అట్లే

ఆ. బహుళకావ్యములను బరికింపగా వచ్చు
బహుళశబ్దచయము పలుకవచ్చు
సహన మొక్కటబ్బ చాలకష్టంబురా! వి....68

మూర్ఖుఁడగువాఁడు తానుగూడ పండితుఁడ నయ్యెదనని పట్టుబట్టి కావ్యముల ననేకములను చక్కఁగా చదువవచ్చును. అట్లే అనేకములు ననంతములగు శబ్దముల నుచ్చరింపవచ్చును. కాని ఈమాత్రముచేత నిజమగు పండితునితో తుల్యుఁడగునా? కాఁజాలఁడు; ఏల యని యందురా? విచారించుఁడు. పండితుని పామరుని వేఱుపఱుపఁజాలినది పామరునికి లేనిది పండితునకు కలది. దుస్సాధ్యమగునది యగు నొక్క ఓర్పు అబ్బుట చాల కష్టము. అట్టి ఓర్పుగల పండితుఁడే సర్వాధికుఁడు.

ఆ. బాపలన్నఁ దొడ్డపరువునఁ జూడరు
కానిపనులు సేయుగడలు కొనరు
కులము లెక్కయేమి గుణమే ప్రధానంబు వి....

వివేకియై విద్యాపక్షపాతి యగుపండితునకు ఎప్పటికిని ఎవ్వరియందును అభిమాన ముండదు అట్టివారు నిరక్షరకుక్షులను బ్రాహ్మణులైనంతమాత్రాన మర్యాదగాఁ జూడరు తక్కువ వారలను విద్యగలిగినను తక్కువ కులము వారని వదలిపెట్టరు ఇట్లు సమానభావముతో చూచుచుండుటయే విద్వల్లక్షణము. ఎట్లని యందురా? కులముతో ప్రయోజన మేమి? యోగ్యతఁ జూపునది గుణముగదా!

ఆ. బ్రాహ్మణులకు సకలభాగ్యంబు లీవచ్చు
గౌరవించవచ్చు కలయవచ్చు
జ్ఞాన మొసఁగి జనులఁగడ తేర్చు నట్లయిన, వి....

విద్వాంసుఁడై జనుల తరింపఁ జేయగలవాఁడు ఏకులమునం దున్నను పూజనీయుఁడే యగును అభిమానముచేత అట్టివాని ఈయన బ్రాహ్మణుఁడని నిందసేయరాదు ఏమి? బ్రాహ్మణుఁడయినందున నట్టము జ్ఞానము నిచ్చి జనులనుఁ తరింపచేయగల సజ్జనుఁడే యైనచో నట్టి బ్రాహ్మణులకు సమస్తభాగ్యములను ఈయవచ్చును. గౌరవము చేయవచ్చును వారితో కలిసి మెలసి తిరుగవచ్చును

క. భువి నరకులమునఁ బుట్టియు
భువినరకులములను బెరిగి భువినరకులముఁ

నవిరళముగ ఛీఛీ యని
శివకులమున దిరుగునతఁడె సిద్ధుఁడు వేమా.

విద్వాంసుఁడు అనువాఁడు తా నీసరిలోకములో పుట్టి నందులకు ఉత్తేజ్ఞుఁడయి పెఱిగి, పాపములఁజేయువారిని గని ఛీఛీ యని మందలించు వారి సద్ధరించుటను, ముఖ్యముగా చేయవలయును ఇట్లు తనవైగుణ్యమును లోకమున వెదజల్లుచు తిరిగెడి వాఁడే నిజముగు పండితుఁడు

ఆ మరములోన నున్నమాతములన్నియుఁ గోసి
ఘటములోన నున్నఘనుని తెలసి,
ఘనత నింపుచుంను ఘనతత్త్వయోగి యూ వి.

విద్వాంసుఁడు మార్గములను నిష్ప్రయోజకముగా బకవాదములను చేయుచుఁ బోవక తనహృదయములో నున్న వికల్పభావముల నన్నిటిని వెంటవెంట నశింపఁజేయును అటు తరువాత నాహృదయమునందున్న పరమాత్ముని తెలిసికొనును. క్రమముగా నీశ్వరుని ధారణచేయును పిమ్మట మహాయోగి యగును కావున సంగీతలక్షణము లిట్లు తమతమజ్ఞానానుసారములై కార్యరూపమును ధరింపవలయు.

ఆ. మననవృత్తిలోని మహిమ నెఱుంగుచు
మనసునందె పూజమహిమ గనుచు,
మానకుండు వాఁడె మర్మజ్ఞుఁడగు యోగి. వి....

మఱియు నట్టిజ్ఞాని దేవుని నిరంతరమూ ధ్యానించినందువలన వచ్చు మహిమను నెఱుఁగగలఁడు తన మానంబులో తాను

యతనిపూజల ప్రభావమును పరికింపఁ గలఁడు అట్టిసాధుఁ డగు నాపండితుఁడు ఎప్పుడు నీపనిని మాని మర్మజ్ఞుఁడై మెలఁగును.

ఆ. మనసు గుప్తపఱచి మాన్యుఁడై విబుధుఁడు
తెఱచు పలుకకుంట ధర్మముండ్రు,
తెఱచుమాటచేత దత్త్వంబుఁ జెడిపోవు వి....

పండితుఁడగువాఁడు, సామాన్యులగు జనుల నితరులకు చెడుపు కలుగకయుండుటయు నోటికివచ్చినట్లని యుఱవకుండుటయును కలిగియుండును అట్టివిద్వాంసులు తన మనంబును పదిలము చేయుచు కపటి యనిపించుకొనక పూజ్యుఁడగుచు సాధారణముగా పలుకకయుండును ఇట్లుండుట తత్త్వజ్ఞానికి ముఖ్యము. లేకయున్న తత్త్వము చెడిపోవును కావున పండితుఁడు ఆత్మజ్ఞుఁడై మెలగవలయును.

ఆ. మనసునిల్పినట్టి మాన్యులౌ విబుధులె
గరిమ మోక్షపథముఁ గన్నవారు,
చెట్టుఁ బెట్టి ఫలముఁ జేకొనకుందురా? వి....75

పేరునకు పండితుల మనుకొనినవారును, అనిపించుకొనినవారును పూజ్యులు కాఁజాలరు మనంబును జయించినవారే పూజ్యులగుపండితులు. అట్టివారే మోక్షపుమార్గము నెఱిఁగినవారలు. అట్టివారు పట్టినకార్యములను విడక ఫలములనుగుఱించి పాటు పడుచుందురు ఎందున కనియందురా? విచారింపుఁడు. చెట్టును మొలవఁబెట్టి పెంచి కాయించినవాఁడు దానిపండ్లను

తీసికొనక వదలునా ? వదలడుకదా ! అట్లే విద్వాంసుఁడు పైయితము

ఆ. మరణకాలమందు మదినిల్పు సుజ్ఞాని
పరముఁ బ్రతిభ చేత బట్టువిడక
వెనుకఁ గోర్కెలకును విలపించునజ్ఞాని విశ్వ....

పండితుఁడగువాఁడు రూపమునను తెలివితేటలయందే గాక కార్యముల నిర్వర్తి ఫలమును బొందుటయందుకూడ నెక్కువ తారతమ్యముగలదు చూఁడుడు జ్ఞాని యగువాఁడు ఇతరసమయముల నెట్లు ప్రవర్తించినను దేవుని మదిలో నిల్పును. అజ్ఞాని నిలుపఁజాలడు జ్ఞాని కేవల మొక పరమేశ్వరుని మనంబున నిలుపుటమాత్రమే కాక మంచిప్రతిభగలవాడై పట్టినపట్టువిడక ఫలమునొందును అజ్ఞానియో సమయమునందు వదలి పిమ్మట అయ్యో ! పోయెఁగదా యని విలపించును కావున పండితుడవగుము

ఆ మర్మవిదుఁడు గాని మర్మంబుఁ గనలేడు
కర్మజీవిగాని కానలేఁడు
నీరుచొరక లోతునిజములు తెలియునా విశ్వ....

ఒకవిద్వాంసు విజ్ఞానము మున్నగు వానిని తెలిసికొన వలయు నని కోరుచుండుమేని విద్వాంసుఁడే అట్టిపనికి సమర్థుఁ డగును గాని ఇతరుఁడు కాఁజాలఁడు ఎట్లనియెదరా ? చూడుడు మర్మము తెలిసినవాఁడుగాని మర్మముఁ దెలిసికొన లేడు అట్లులే కర్మజీవి గాని కనఁగాఁజాలఁడు. ఎలయనఁగా.—

నీళ్లలోని లోతును తెలిసికొనవలయును అని నీళ్లలో దిగక తెలియ వలనుపడునా? పడదుగదా! అట్లుతే, విద్వాంసుని జ్ఞానముకూడను.

ఆ. మాటలాడవచ్చు మనసు దెల్పగ లేదు
తెలుపవచ్చుఁ దన్ను దెలియు లేదు
సురియఁ బట్టవచ్చు శూరుఁడు గాలేడు విశ్వ....78

మూర్ఖులు కూడ పండితులఁ బోలి వేషములను వేసికొని తిరుగవచ్చునే గాని విజ్ఞానమును వెలయింపలేరు ఎట్లనఁగా తా నొకరితో కావలయు నన్నిమాటలు నాడవచ్చును కాని తనమనంబునకు తెల్పఁ జాలఁడు ఇతరులకు జెప్పవచ్చును ఎన్నిటికైనను కాని తాను ఆచరించుట కష్టము పిఱికివాఁడు కూడ శూరునివలె డాబుచేసి కత్తిఁ బట్టవచ్చునే గాని ఆరివీరులఁ గునిమి శూరుఁడు కాఁజాలఁడా? కాఁడుగదా! అట్లుతే మూర్ఖుఁడు గూడను.

ఆ. మాలకన్నియలకు మంచిరూపం బున్న
ముట్టునే త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులు సేయ ఘనులాసపడుదురా? విశ్వ....

మూర్ఖుఁడు, రూపంబును చూచి తనకుగాని పాపపుపనులను చేయఁ బూనుచుందురు విద్వాంసుఁ డనువాఁడో అట్లు కాదు. చూడుడు. పండితశిరోమణి యనఁదగు హరిశ్చంద్రుఁడు సత్యమును పలికి తా నాడినమాటను త్రిప్పెనా! మాలకన్నియ లైనను సరియే యని ఒప్పికొని రూపమునకు ఆశించెనా? లేదు. జ్ఞానముచే గొప్పవార లగువారు తమకు కానిపనులను చేయఁ

బూనెదరా ? బూనరు. అట్లు చేయఁబూనుట పండితలక్షణము కాదు

ఆ. ముక్తిఁ గానలేని మూర్ఖజనుల కెల్ల
బట్టబయలుచేసి పరమపదము
దాగిఁ జూపుబుధుఁడు దైవంబుగాఁడొకో విశ్వ ...

ఎవ్వఁడైనను, లోకులయజ్ఞానమును బోఁగొట్టి వారిని సంతరింపజేయుచున్న మహానుభావుని, "దైవస్వరూప" మని చెప్పిన మూర్ఖులు కాదని వాదముల నాడఁజొత్తురు తగినజ్ఞానము లేక పోవుట వలననే వీరిట్లు సెప్పెదరు. ప్రకాశించుచు ముక్తి యున్న నేమో యెఱుఁగక మూర్ఖులగు వారికందఱికిని బట్టబయలుచేసి మోక్షపుమార్గము చూపుపండితుఁడు దేవుఁడు కాఁడా! అగును.

ఆ. మున్ను నిన్ను గన్నముఖ్యు లెవ్వరో వారి
సన్నుతించి పిదప సంతతమును
జ్ఞానదాతఁ గొల్వ ఘనతచే విబుధుని విశ్వ....81

బుద్ధిమంతుఁ డగువాఁడు తెలివితేటలు గల్గి సదాచారమును విడక పండితులమార్గము ననుసరించి మెలఁగవలయును కావున నోయీ! నీవు ప్రతిదినమునను దేవతలందఱిలో నుత్తములును, నిన్ను కన్నవారును అగు నీతలిదండ్రులను సేవించి తరువాత నీకు నుభయలోకతారక మగుజ్ఞానము నిచ్చినవానిని గౌరవముగా గొల్చి ముక్తుడ వగుము

ఆ. మెలఁగి జ్ఞానమయుఁడు మితిమీఱు చుండడు
ఉనికి విడడు, తాను నుపమునొందు,
తనవు మఱచి మించి తత్త్వజ్ఞుఁ డుండును, వి....

విజ్ఞుఁ డైనవాఁడు, అనఁగా తెలిసినధీమంతుఁడు మూర్ఖుల బోలి హద్దును మీరి సంచరింపడు తానున్న నివాసస్థానమును వీడి అందని పండ్లకు అఱ్ఱుసాఁపఁ బరువు లెత్తఁడు తనకు సాధ్యము కాని పనికి యుపాయముచేత సాధింపఁబూనకొనును జ్ఞానము పూర్ణముగా సంపాదించినతరువాత దేహముపై నభిమానమును వదలికొని విబుధుఁడై మెలఁగును

క. మొదటను మతమున్ వదలక
తుద నెవ్వరిమతము నైన దూషింపక తాఁ
బదిలుఁడయి కోర్కెఁ గోరక
ముదమునఁ జరియించుబుధుఁ డెముఖ్యుఁడు వేమా.

మూర్ఖునిబోలి విద్వాంసుఁడు అనాలోచితముగా ఏమత మునం దన్యనామతములో ప్రవేశింపఁడు అథవా ప్రవేశించె నేని ఎవ్వరిమతమునైనను ఇతరమును నిందింపఁడు తనవాట్టుకు తాను అజ్ఞానమున మునుంగక గొంతెమకోర్కెలను కోరి చెడిపోక నిత్యమును ఆనందమయుఁడై సంచరించుచునుండును ఇట్టి లక్షణములు గలవాఁడె పండితుఁడు వాఁడె యందఱిలోను నుత్తముఁడు

తే. యాత్రలందలి ఫల మొంది యాగములను
మాత్రసమముగఁ జేసి సూక్ష్మ మొంది
పరమహంసను గెలిచి ప్రబలుచుండు
పరము గోరెడు ప్రాజ్ఞుఁ డిధరను వేమ. 84

మూర్ఖులు యాత్రలని యజ్ఞములని ఆరుభోరుమని ఆర్భాటములను చేసి సత్యమును గనలేక చెడదిరిగి చెడుచుందురు

విద్వాంసు లన్ననో అట్లుగాక యాత్రలను సూక్ష్మముగాఁ జేసి యందలి ఫలమును బొందుగురు. యజ్ఞములను సూత్రప్రాయముగా నొనర్చి పరమహంసను పరికించి ప్రబలుచుండును కావున పరమాత్మఁగోరు ప్రాజ్ఞుఁడగుపండితున కిట్టిలక్షణము లుండు

ఆ రాజవరుల కెపుడు రణరంగములచింత
పరమమునుల కెల్ల బరముచింత,
అల్పనరుల కెల్ల నతివలపై చింత, విశ్వ,.... 85

లోకములో కోర్కెలుగూడ వారితెలివితేటల ననుసరించి యోగ్యత ననుసరించి పుట్టుచుండును. చూడుడు. ఉత్తమక్షత్రియుఁడై పుట్టినయెడల నట్టివానికి సహజముగా రణచింత కలుగును జ్ఞానసంపన్నుఁడగుమునియైనయెడల బరమాత్మధ్యానము చేయఁగోరును అల్పుఁడైనచో నతివల గవయఁగోరును ఇట్లనుటచే విద్వాంసుని కైహికాముష్మికముల మేలు గూర్చు జ్ఞానముపై యాసక్తి కలుగునని భావము.

ఆ లోను బదిలపఱచి లోనివికారముల్
తలఁచి మెట్టువారు తెలియువారు,
ఆకసమున వేడ్క నరయంగ నుందురు, విశ్వ....

తానెవ్వరో ఇతరు లెవ్వరో ప్రపంచ మెవ్వనిరూపమో తెలిసికొని యుక్తముగా నడచెడి వారే విద్వాంసులు. వారు మూర్ఖులవలె తిరుగరు తమమనోవికారములను బయలుపుచ్చక లోననే యణఁచి వైచెదరు ఇట్టివారలే లోకములో తెలిసినవార

లనఁబడుదురు. వీరు ఇతరులవలె అజ్ఞానమున మునుంగక శబ్ద స్వరూపుఁడగు బ్రహ్మమును గనుచు నానందముతో నుందురు.

ఆ. వలయు నన్నరాదు వద్దన్నబోదది
తాను జేసియున్నధర్మ మనుచు,
ఉల్లమందు దలపఁ డుత్తమవిబుధుఁడు, విశ్వ....

పామరుఁడు జ్ఞానాజ్ఞానములను గాని పాపపుణ్యములను గాని ధర్మాధర్మములను గాని కోరుచుండును విద్వాంసుఁ డట్లు కోరఁడు ఏలయనఁగా నయ్యది తాను కావలయు ననునంత మాత్రమున రాదు వల దన్నంతన బోదు తనపాప ము గాని పుణ్యముగాని జ్ఞానముగాని అజ్ఞానముగాని ధర్మముగాని యధర్మము గాని తనతోడనే మెలఁగుచుండు నని నిశ్చయించుకొని వాటిని గూర్చియే మనంబులో తలంపడు ఇట్టివాఁడు పండితుఁడు.

ఆ. వాద మాడ డెపుడు పరుస నెవ్వరితోడ
జేరరాడు తాను జేటుఁదేడు,
జ్ఞానియగుచుబుధుఁడు ఘనతనొందగఁ జూడు,వి.

విద్వాంసుఁడు మూఱకును బోలి దుష్టము లగుకార్యములను గాని అకృత్యములను గాని చేయఁడు. ఊరక నిష్కారణముగా నెవ్వరితోడను తగవులాడడు దంభముగా నెవ్వరితోనన్న వారితో కలియఁడు తాను చేయుపనులవలన ముప్పుతీసికొని రాడు. తాను జ్ఞానియై గౌరవమునొందుటకు ప్రయత్నించును. కావున నిట్టివానిని పండితలక్షణములుగా తెలియవలయును.

ఆ. వార్ధియందుఁ బుట్టి వశముగా రావచ్చు

పూర్ణదృష్టియందు జూనవచ్చు,
పూని యెఱుకగలిగి బుధుఁడు గా గాలేడు,వి....

మూర్ఖులు మొదలగు వారెన్నియో వేషములను వేసికొని యితరులను అనుకరించెదరు కాని విద్వాంసులవలె మెలంగఁజాల రు. ఎట్లనియందురా? చూడుఁడు సముద్రములో పుట్టి స్వాధీనముకలిగి రావచ్చును పరిపూర్ణప్రజ్ఞ కలిగినవానివలె నావిషయము మున కనుపడవచ్చును కాని సంపూర్ణమును అగుజ్ఞానవంతుఁడై పండితుఁడుమాత్రము కఁజాల డనిభావము

ఆ విద్య లేనివాఁడు విద్వాంసులకడ
నుండగానె పండితుండు గాఁడు,
కొలని హంసలకడ కొక్కెర లున్నట్లు, విశ్వ....

పామరులు, "చదువవలెనా? పండితుఁ డగుటకు? విద్వాంసుల దగ్గఱనుండిన యన్నివిద్యలును అనాయాసముగా లభించును. పండితుఁడు గూడఁ గాఁగలఁడు" అని చెప్పెదరు కాని యిట్లె న్నటికిని కాదు విద్య లేనివాఁడు విద్వాంసునిప్రోల నున్నంత మాత్రమున పండితుఁడు కానేరాఁడు. ఎట్లు అనియెదరా? కొలని హంసలయొద్ద కొక్కెరలున్నంతమాత్రమున నవి రాజహంస యగునా? కావున విద్వాంసు డగుటకు కష్టించి చదువవలయును.

ఆ. విద్య లేకయున్న విత్తము లేకున్న
మూఢుఁడైనఁ దుదకు మూగయైన
నిష్టబంధుఁడైన గష్టమే గలుగును, విశ్వ ....91

మనుష్యజన్మమెత్తినపిదప ముఖ్యముగా నుండితీరవలసిన

గుణములలో విద్య యొక్కటి. విద్యరానివాఁడు నాల్గుకాళ్ల మృగమువాఁబడు ఇంతయేల? విద్యలేకున్నయెడల జీవయాత్రను చేయుట మిగులకష్టము జీవయాత్రను గడపుటకు వలయు నాల్గు గుణములలో విద్యయొక్కటి ఎంతగొప్పవాఁడైనను గాని తనకు కేవల మిష్టబంధువుఁడు గాని అట్టివానికి విద్యలేకపోయినను, విత్తము లేకపోయినను, మూర్ఖుఁడైనను, మూఁగయైన కష్టమేయగును.

తే. వినతిసేయును సద్గురు వేడుచుండు
మును భ్రమరకీటకన్యాయమునను నుండు
దాని నెన్నంగదరమె యీవసుధలోన
సాధుసన్మార్గ మదెయగుఁ జగతి వేమ. 92

బుద్ధిమంతు డగు నరుఁడు భ్రమరకీటన్యాయానుసారముగా సజ్జనుడును పండితుఁడు నగుగురువునకు వినతిసేయుచు ప్రార్థించుచు గురువుల యనుగ్రహమునకు బాత్రుఁడగును. అహా! అట్టి వానిని వర్ణింపదరమా! సత్ప్రథ మనినయెడల నట్టివారిదే యగును సుమా!

తే. విప్రవరులయందు విబుధులయందును
నీతినుంచువాఁడె నిర్మలుండు,
భక్తిగలుగువాఁడెపరమార్థపరుఁడయా, విశ్వ....

బ్రాహ్మణోత్తములయందును, పండితాగ్రేసరుల యందును నీతిగలిగి వర్తించుచు కల్లకపటములు లేక నిర్మలుఁడై మెలగు వాఁడె యుత్తముఁడు ఈరీతిగా మెలఁగుచు పెద్దలను చూచిన యప్పుడు భయభక్తులను సహజముగా గనంబఱచుచుండు

వాఁడె పరమార్థరతుఁడు గాడని భావము. కావున బుద్ధిమంతుఁ డిట్లుచేసి విద్వాంసుఁడై మెలఁగవలయు.

ఆ. విశ్వమనఁగ నేమొ? వివరించి చూచును
విశ్వ మైదువిధులు వెలయఁ గనును
విశ్వము మదిలోన వెదకును విబుధుఁడు, విశ్వ....

విద్వాంసునకును, అవిశేషజ్ఞుఁడు అనఁగా మూర్ఖునకును అట్టివానికిని చాలభేదము గలదు మూర్ఖుఁడు కంటికగుపడినదానిని ప్రతిదానిని నమ్మి శోధింపక పంచితుఁడగును ఇఁక పండితుఁడో అట్టులుగాక, ప్రపంచమనఁగా నేమొ వివరించి చూచును. ప్రపంచము పంచభూతస్వరూప మని తెలిసికొని పంచీకరణము జేయును ఆ ప్రపంచస్వరూపియే దేవుఁడై తనహృదయమునం దున్నందున ఆ ప్రపంచమును తనహృదయములో వెదకి కనుగొనును. ఇట్టివి పండితలక్షణములు

తే. విశ్వరూపము మదిలోన వెలయఁజూచి
హాస్య మమరఁగ బుద్ధిని నందిపట్టి
స్వస్వరూపము గనుచుండు సజ్జనుండు, విశ్వ....

విద్వాంసుఁడు ప్రపంచపురూపము నీరీతిగా తనమనంబులో కలయఁగనుఁగొనును దానిని సంగ్రహముగా మననము జేయును. అటుతరువాత నద్దానిసాయమున తా నెవ్వరో తనరూప మెయ్యదియో అను మున్నగుస్వరూపవిషయములను తెలిసికొని జీవన్ముక్తుఁ డగును. మూర్ఖుఁ డట్టులు గాదు.

ఆ. వీరుఁ డైనరాదు విబుధులగుణములు
చదువులంద రాదు సటలరాదు,
జన్మపాకముననె సఫలమౌ నరులకు, విశ్వ....

విద్వాంసులసద్గుణములను బాగుగవలయు ననినచో తాము కూడ కష్టించి చదివి విద్వాంసు లైననే వచ్చును గాని ఇతరముల నెన్నింటినో చేసినను రాదు ఇట్లే శూరుఁ డైనను రాదు చదివినను ఒకప్పుడు రాఁజాలవు ఇఁక నెట్లువచ్చు ననినయెడల పూర్వజన్మమునందు తాను చేసిన పుణ్యపరిపాకముననే యట్టి గుణము లబ్బి జన్మము సఫలము కావలయునే గాని ఇతరము లగు నుపాయముల కోట్లచేత గూడ రాఁజాలవు

ఆ. వెదకి కానలేరు వేదాంతవేద్యుండు
నుత్తముండె కాంచు నుర్వి మీఁద
కలిగెనే నతనిని గానంగలేరయా !, విశ్వ.... 97

చక్కఁగా విచారణసేయువారిఁ బోలి కొందఱు దేవుని వెదకి కనుగొందుమని వెదుకఁబూని తెలివి తక్కువను వెల్లడించి కొనియెదరే గాని వెదకి కనుగొనలేరు దేవుఁడు సామాన్యుఁడా? కాఁడు అతఁడు ఉపనిషత్తులచేత ప్రతిపాదింపఁబడదగిన వాఁడు అట్టివానిని ఒకవేళ ప్రయత్నించినచో నుత్తముఁడు చూడగలడే గాని తక్కినవారలు చూడఁజాలరు. ఇట్టివారు విద్వాంసులుగారు.

క. వేడుక మదిలోఁ జూడక
తోడగునా యొకమాటి త్రొక్కుడుపడ కా

జాడను మఱచినవాఁడే
వేడుకఁబరతత్త్వమంది వెలయును వేమా. 98

దైవస్వరూపము బోధయగుటలేదు లేదని త్రొక్కట పడుచుందురు మూర్ఖులు కాని త్రొక్కుడు పడినంతమాత్ర మున తనకుతోడయి కనుపట్టునా? కనుపట్టదు. అతనిఁ గనిపెట్ట వలయు ననిన నంతటిత్వరను (అనఁగా తొందరపాటును) పొంద గూడదు మనస్సును నిశ్చలమునుగా జేసి జాడను తెలిసికొన వలయును ఇట్లు తెలిసికొనినవాఁడే విద్వాంసుడని భావము.

ఆ వ్యాధికలిగెనేని వైద్యునిచేతను,
మందుదినక కాని మాన దెందుఁ,
జెంత దీపమిడక చీకటిపాయునా, విశ్వ.... 99

ఎంతటి స్వల్ప విషయమైనను ప్రతిక్రియచేయక కుదరని యట్లుతే, ఎంతకొద్దిపాటి యజ్ఞానమైనను విద్వాంసుల సదుప దేశము లేక నివారించిపోదు ఎట్లని యనిరొద రేమొ! చూడుడు. జబ్బుకలిగినయడల వైద్యునిద్వారా మందుపుచ్చుకొనకయున్నం దున గుదురునా? కుదరదుగదా? అట్టులే చీకటి సమీపమున దీపము వెలిగింపక యడగునా? అడఁగిపోదని భావము.

ఆ స్వానుభూతియందు శాస్త్రవాసనలందు
సంశయంబు లేనిసాధనమున
వెలుఁగు దీప మట్టు చిత్స్వరూపము నంటు,వి....

విద్వాంసుఁడు మూర్ఖునివలె ఇతరులమాటలనే నమ్మియుండఁడు. తనచేతనైనంతవఱకు స్వానుభవమును ప్రమాణముగా తీసికొని విషయమును విమర్శించికొనును అందునను సంశయము నొందినయెడల శాస్త్రవాసనవలన కలిగిన జ్ఞానముద్వారా నివర్తింప జేసికొనును. చివఱకు దీపకళి లాగున తత్స్వరూపమును జేరఁ బ్రయత్నించును ఇట్టిలక్షణములు గలవాఁడు పండితుఁడు కావున పండితునివలె చరించి సౌఖ్యముగని ప్రవర్తిల్లవలయును

---

# అర్థపద్ధతి.

---

అవతారిక. అర్థమనఁగా ధనముయొక్కయావశ్యకత. దాని ప్రయోజనములు, దానివలన గలుగులాభములు, అట్టివారి కీలోకములోగల గౌరవము మున్నగు వానిఁగూర్చి తెలుపుట కిప్పు డర్థపద్ధతిని ప్రారంభించుచున్నాఁడు.

ఆ. అధముఁడైన మనుజుఁ డర్థవంతుండైన
  నతనిమాట నడచు నవనిలోన
  గజపతింట నెన్న గవ్వలు చెల్లవా, వి.... 1

లోకములోని ప్రతివారికిని ధనము సంపాదింపవలసియుం డుట ముఖ్య మగుపని, ఎక్కువతక్కువ లన్నియును ధనమువల ననే నిర్ణయింపఁ బడుచుండును. ఎంతటి నీచుఁడైనను ధనముగల వాఁడైనచో నతని మాటకే తక్కిన యందఱికంటె చెల్లుబడి అధికముగా నుండును ఎట్లందురా? పరికించుము గవ్వ యెంత జేయును వెల? ఆగవ్వలు అగఁగా పనికిరానివే గజపతియింట రత్నములవలె చెల్లుటలేదా? అట్లే.

ఆ. అధికభుక్తిచేత మొదటిసొమ్ముకు హాని
  కుదువసొమ్ముకన్నఁ గొంతహాని
  మొదటిపక్షమునను మూలకర్తకు హాని, వి....

ధనమును సంపాదించినతరువాత వ్యర్థముగా ఖర్చుసేయఁ గూడదు ఎట్లైనను సంపాదించినదానిని నిలిపికొనవలయును. కొందఱు సంపాదించినసొమ్మును అతివ్యయముచేసి తిన మొదలు పెట్టెదరు అందుచేత మూలధనమున కెక్కువనష్టము గలుగును ఇఁకఁగొందరు కుదువయుంచుకొనుట నాచరింతురు ఇట్లు కొంత ఖర్చు చేయుదురు బుద్ధిమంతు లగువా రిట్లు సేయఁజనదు. మొదటిపక్షమం దిట్లు సేయుటవలన సంపాదకునకే హానిగలుగును

ఆ. అప్పు లేనివాఁడె యధికసంపన్నుండు
తప్పు లేని వారు ధరను లేరు
గొప్ప లేని బుద్ధి కొంచెమై పోవురా, వి.... 3

లోకములో భాగ్యశాలియనఁగా సంపాదించువాఁడు భాగ్యశాలి గాఁజాలఁడు. ఎవ్వఁడు తాను సంపాదించినదానిని వ్యర్థముగా ఖర్చు సేయఁడో అధికముగా నప్పులను తీయఁడో, వాఁడే సంపన్నుఁడగును అప్పు సేయుట గొప్పతప్పు సామాన్యముగా తప్పుసేయనివారు కనఁబడరు; కాని యోగ్యతాయోగ్యత నరయని బుద్ధిమంతులకు ఇట్లు చేయుటవలన చులకదనము గలుగును కావున బుద్ధిమంతు డర్థమును జాగ్రత్తగా కాపాడుకొనవలయును.

ఆ. అరయఁ దఱుచు కల్లలాడెడు వారింట
వెడల కేలలక్ష్మి విశ్రమించు
నీర మోటికుండ నిలువనిచందాన, వి.... 4

గృహస్థు డైనవా డసత్యములను పలుకరాదు. అరీతిగా

తలుచుగా నసత్యములు చెప్పెడివారిల్లు దరిద్రదేవతకు వాస స్థానము అట్టివారి యింటినుండి లక్ష్మి వెళ్లిపోక నిలుచునా? నిలవదు ఎట్లని యందురా? చూడుము. ఓటికుండలో నెన్ని నీళ్లుపోసినను నిలువగలవా? చాలవుగదా! అట్లే అసత్యవాదుల కైశ్వర్యములుండవు కావున ధనికులు గాఁగోరువా రసత్యము వాడుటను మానుకొనవలయును

ఆ. అర్థవంతుసొమ్ము నాసింతు రర్థులై
యర్థి కీయ సొమ్ము వ్యర్థమగును
వ్యర్థ మైనసొమ్ము వ్యర్థులజేరురా, వి.... 5

లోకుల కొకదుస్స్వభావ మున్నది ఎవ్వనికైన నొకనికి ద్రవ్యముచేకూరిన వీరందరును కష్టముసేయుటను మానివైచి అతనినిచుట్టును యాచకులై మూగి వానిధనమున కాసపడియెదరు ఇట్టివారికి ధనము నీయఁగూడదు. ఇచ్చినయెడల నీసోమరులు కష్టములేక వచ్చిన సొమ్మేగదా యని దుష్కార్యముల వినియోగించెదరు. కావున బుద్ధిమంతుఁడైన మనుజుఁడు వ్యర్థములగుఖర్చులను సేయక ధనమును జాగ్రత్తగా కాపాడుకొనవలయును

ఆ. ఆడువారిగన్న నర్థంబుఁ బొడగన్న
సార మైనరుచుల చవులఁ గన్న
అయ్యగారికైన నాశలు గలుగవా, వి.... 6

మేము గురువులము, మేము సన్యాసులము మేము విరాగుల మని చెప్పుచు తిరిగెడి యయ్యవార్లకైనను ధనము మీది యాస

పోనేరదు. ఆహా ధన మెంతవశీకరణౌషధము ఇట్టి జనవశ్యమును చేయునట్టి వీలోకమునఁ గొన్ని మాత్రమే కలవు. వానిలో నన్నిఁటికంటె ధనమధికము ధనము పొడఁగాంచిన కోరనివా రరుదు ఎట్లందురా? చూడుఁడు ఆడువారిని చూచినను, ధనమును చూచినను, రుచిగలపదార్థములఁ జూచినను ఎంతటివారికైన కాంక్షగలుగును కావున ధనములను జాగ్రత్తగా కాపాడుకొనుము

ఆ. ఆపదందు జూడు మారయబంధుల
భయమువేళఁ జూడు బంటుగుణము
పేదవడ్డ వెనుకఁ బెండ్లముమతిఁజూడు, వి.... 7

ముందువెనుకలఁ జూడక బంధువుల ముఖస్తుతుల కుబ్బిపోయిధనమును వ్యర్థముగా ఖర్చుసేయకుము ఈబంధువులు నీ కాపద గలిగినప్పుడు నీవంక కన్నెత్తియైనఁ జూడరు ఇట్టివారి నీకుఁ గొందఱిని జూడుము బుద్ధిమంతుఁడవగుము. బంధువులందరును నిజముగ ప్రేమగలవారని నమ్మకవేని పరీక్షించుము ఆపదలలో బంధువులను, భయసమయములలో బంటులను, పేదయైనతరువాత పెండ్లముచేయు ఆదరమున చూచి జాగ్రత్తగా మెలంగుము.

ఆ. ఆశచేత ధనము నార్జింపగానేల
మట్టిక్రిందఁ బెట్టి మఱవనేల
ధనము పోవువెనుక ధర్మం బదేలరా, వి.... 8

కొందఱు తెలివిలేక అత్యాశపడి సంపాదింపలేక సంపాదింపలేక ధనమును సంపాదించెదరు. అటుతఱువాత దానిని

తగునట్లు లనుభవింపక ముందెప్పుడో ధర్మమును సేత మని మాటి యుంచు మంటిలో పూడ్చెదరు. తఱువాత మఱచి పోయెదరు. ఆహా ! ఎంతతెలివి తక్కువ ! తనధనమంతయును మట్టిపాలై పోయిన తాను చేయఁదగిన ధర్మమేమున్నది ? అథవా ఉన్న దనినను ఆపాడు ధర్మమువలన ప్రయోజనమేమి ? కావున ధన మును జాగ్రత్తగా కాపాడవలెను

ఆ ఇంటిలోని ధనము నిదినాది యనుచును
మంటిలోన దాఁచు మంకుజీవి
కొంచుబోఁడు వెంట గుల్లకాసునురాదు, వి....

ధనమును సంపాదింపవలసియుండుట ముఖ్యము సంపాదించిన దానిని సద్వినియోగము చేయుట అంతకంటెను ముఖ్యము బుద్ధి లేనివాఁడీసమాచారమును తెలిసికొనలేక మూర్ఖుఁడై ఇంటిలో నున్నధనమును చూచి ఇది వాద ఇది నాది యని మట్టిలో దాచు ను. కాని తాను చచ్చిపోవునప్పుడు తనవెంట నేమైనను తీసికొని పోగలడా? లేక ఆధనము తనంట తా నేమైన గుల్లకానైనను రాఁగ లదా?లేదనిభావము. కావున ధనమును సంపాదించి సద్వినియోగ మును చేయువలయును.

ఆ. ఇరుగుపొరుగువారి కైనయుసంపదఁ జూచి
తమకు లేదటన్న ధర్మమేమి ?
ధర్మ మన్నఁ దొల్లి తన్నుక చచ్చిరి, వి.... 10

ధనముగలుగుట పుణ్యాత్మునికి కాని సంభవింపదు. దరిద్రులు దీనినితెలిసికొలేక తమ యిరుగుపొరుగున నున్న ధనికులను చూచి

మిక్కిలి దుఃఖపడుచుందురు. ఇట్లు దుఃఖించినందువలన ఫల మిసుమంతయును లేకు ఏలయని యందురా? పూర్వజన్మమున ధర్మము సేయక యీజన్మములో నేదియు గలుగదు ఈదరిద్రులు పూర్వజన్మములో ధర్మముపేరు చెప్పిన గిన్నుకొని పమ్ముచంత బాధ నొంది ధర్మము సేయక పోయిరి గదా! ఇప్పుడు వీరి కెట్లు లభించును. పుణ్యాత్ములకు గాని ధనము లభింపదు.

ఆ. ఇహమునందు చాలయిడుములు పడినను
బడుగు పొందగలఁడె పరమపదవి
పేద కనువు పడునె పృథివిపై భాగ్యంబు, వి....

పూర్వజన్మమునందు చేసినపుణ్యములవలనఁ గాని ధనములు చేకూరవు ఎట్లనఁగా ఈజనలోకమునందుపుట్టి యెన్నెన్నింటినో పడరానిపాట్లను బడినను నిర్భాగ్యుఁడు పరమపదమును అనఁగా మోక్షమును పొందగలఁడా? లేదుగదా! అట్లులే పేదయై పుట్టినవానికిఁ గూడ పూర్వమునఁ దాను పుణ్యముచేయని కారణమున భాగ్యము కలుగదు.

ఆ. ఇహమున సుఖయింప హేమతారకవిద్య
పరమున సుఖయింప బ్రహ్మవిద్య
కడమవిద్య లెల్ల గల్ల మూఢులకెరా, వి.... 12

ఇహలోకము పరలోకము నని రెండే రెండు లోకము లుత్తమములు. స్వర్ణవిద్య (అనఁగా బంగారుచేయుట) బ్రహ్మవిద్య యని రెండే రెండు విద్యలు సుఖకరములు. అందులో స్వర్ణవిద్య ఈలోకములో సుఖింపఁగలుగుట కుపయోగించును. బ్రహ్మవిద్య

పరలోకమునసుఖములనొందుట కుపయోగించునుగావున నివియే అందరిచేతను గౌరవింపఁదగినవి తక్కిన వన్నియును విద్యలే కావు. అసత్యములు అట్టివి మూర్ఖులకే గాని యుత్తములకు తగినవి కావు

ఆ. ఇహమునందు సుఖము లింపార లేదట
పరమునందు సుఖముఁ బడయు టెట్లు
ధనము లేక సుఖము తన కెట్లు కలుగురా, వి....

ధనము నార్జించి పరలోకములో సుఖమును బొందుటకై దానధర్మములను చేయుమని కొందఱయ్యలు పలుకుదురు బుద్ధిమంతు లద్దానిని విశ్వసింపకుఁడు ఏలయనియందురో? చూడుఁడు ఈలోకములో సుఖములు కలుగకయే పోయిన పరలోకములో నెట్లుకలుగును? మఱియు నింకనొకటి ధన మెవ్వరియొద్ద జేరునో వారికి సుఖముకలుగును తనధన మితరులఁ జేరఁగా ధనము లేకపోవునే గాని తనకు సుఖ మెట్లు కలుగఁగలదు? కలుగదు.

ఆ. ఊత కన్నలోతు నెంచంగఁ బనిలేదు
చావు కన్న గీడు జగతిలేదు
గోచిపాతకంటె గొంచెంబికను లేదు, వి.... 14

ధనములేనిది జీవయాత్ర గడవదని యందురు మాకు గడుచుటలేదా! అధనమువలన నేమి ప్రయోజనమని కొందఱువిరాగులగుజనులు పల్కెదరు. కాని వీరికి ధనములేక యున్నందువలన రాఁగలకొంచెపుతనము తెలియుటలేదు. విచారించినచో గోచిపాతకంటె మించిన కొంచెపుతనము లేనేలేదు. అనఁగా ధనమును వదిలినవారికి గోచిపాతయుఁగూడ దొఱకదని భావము.

ఎట్లనఁగా, ఈతకంటె లోతులేనియట్లును, చావుకంటెను గీడులేనియట్లులు

ఆ. ఉచితవంతుఁ డైన నుద్యోగపరుఁడైన
సంప దమరియున్నసమయముననె
పరుల కుపకరించి పాలింప కల్గును, వి.... 15

ఎంత యుచితముగా నడచు వానికైనను, ఎంతటిగొప్పయుద్యోగము గలవానికైనను ధనములేక యున్నను జరుగుట కష్టము. సంపద లున్నయెడల తానందఱికి నుపకరింపవచ్చును, పరోపకార మను పవిత్రకార్యమునకుఁ గూడ ధనావశ్యకత్వమే ముఖ్యముగా నున్నది ధనములేక యున్న నెట్లుపరుల కుపకరింప నేర్చును? ఎట్లు పాలింపకలుగును? కావున బుద్ధిమంతుఁడు ధనము నార్జింపవలయును

ఆ. ఉన్నయంత మనుజుఁ డుపకారి గాలేక
కన్ను గానఁడంచు ఘనుఁడు పల్కు.
దీనుఁ డైనతనకు దిక్కెవ్వరగుదురు, వి.... 16

కొందఱు జనులు ధనికుఁ డగువానియొద్దఁ జేరి వాఁడు గూడ తమవలె నొకపోసరిగానుండ లేడని వానిని పరిపరివిధముల నిందింప మొదలుపెట్టును ఇట్టిఘనుఁడు ధనికులను "ఉన్నంతటిలో కొంచెమో గొప్పో యుపకారము చేయుటకు ధనికునికి కృత్యము కాని ఉన్నంతవఱకు ఉపకరింపక కన్నుగానక తిరుగుచుండు" నని నిందించునే గాని ఈధనికుఁడు దరిద్రుఁ డగునప్పుడీతనికి దిక్కెవ్వరగుదురో? యనియోచింపడు కావున స్తోత్రప్రియులమాట విని ధనము నతిగా వెచ్చింపవలదు.

ఆ. ఉప్పులేనికూర యొప్పదో రుచులకు
పప్పులేని తిండి ఫలములేదో
అప్పులేని వాఁడె యధికసంపన్నుఁడు, వి.... 17

జ్ఞానమున్నను లేకయున్నను ఇతరములగు నావశ్యకవస్తువు లనేకము లున్నను, లేకయున్నను, అప్పులేని పప్పన్నము తినవలయు ననికొందఱు కోరెదరు ఎంతవెఱ్ఱి! కూరలో నుప్పుచాల దను కొనుడు అదిరుచింపదా? ప్రతినిత్యమును పప్పులేక ముద్దమ్రిం గుడు బడదేమొ? ఇట్లు తెగతినువారికి సంపద లెట్లువచ్చును? సౌఖ్యము లెట్లబ్బును? కావున బుద్ధిగలవాఁడు అప్పుదీయకయుం డవలయును అట్టివాఁడె సర్వసంపదలుగలవాఁడు

ఆ. ఉర్వి వారికెల్లనొక్క కంచముఁ బెట్టి
పొత్తుఁ గుడిపి కులము పొలయఁజేసి
తలను చేయిపెట్టి ధనపరుల్ గమ్మను, వి.... 18

ఎట్లయినను ఎన్నిపనులయందు కష్టములను పొందియైనను మనుజు లందఱును కష్టపడి ధనార్జనచేయునట్లు బోధింపుము ధనము యొక్క యావశ్యకత్వమును శ్రేష్ఠత్వమును తెలియఁజెప్పుము ప్రపంచములోనివారి కందఱికి ఒకేకంచములో గుడువ బెట్టి యైకమత్యమును గలుపుము. కులభేదమును రూపుమాపుము. నెత్తిచేయిపెట్టి ప్రమాణముచేసి యైనను సుఖకరమని చెప్పి ధనమార్జింపఁజేయ బ్రయత్నించుము.

ఆ. ఋణమొసంగు నాతఁ డినుఁడగు దొలుదొల్త
నదియు మరలనడుగ యముఁడగు నగు
అప్పుజేసి తీర్ప నఱయనివారికి, వి.... 19

ఎవ్వనికైనను సరియే ఎంతటియాపదయైనను సరియే. ఒకనికి అప్పు నీయకుము. నీవప్పుఁగొనకుము ఎందులకని యందువా? వినుము. ఋణము (అప్పు) నిచ్చువాఁడు మొదట సాక్షాత్తులోకబాంధవుఁడే యగును కాని దానిని తీర్చుమని మరల యడిగినయడల ప్రాణములఁ జేతికికొని పోవు యమాతుల్యుఁడగును అప్పుజేయుటకు ముందుగా నాయప్పు నెట్టుల తీర్పఁగలుగుదుమా యని యోజింపవలయును తీర్చుటకు తెలియకున్న కష్టమగును. కావున అప్పునీయకుము అప్పుగొనకుము

ఆ. ఎంతభూమి దిఱిగి యేపాటు పడుచున్న
నంటనీక ప్రాప్తి వెంటదిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా, వి....

ధనమును సంపాదించుట కనుపేరుతో ఎన్నియెన్ని దేశములు తిరిగినను, ఎన్ని పడరాని పాట్లుపడినను పూర్వకృతము లేనిది లభింపదు గనుక దారిద్ర్యము వెంటనంటుకొని కలసిరానీయక తిరుగుచునే యుండును. దీనిని తెలిసికొనలేక వెఱ్ఱులై తిరిగెదరు. ఇట్టివారు వెఱ్ఱు లెట్లని యందువా? చూడుఁడు. దేశములు క్రొత్తవియైన గీతలు క్రొత్తలా? కావున నదృష్టవంతులఁ జూచి విచారము పొందవలదు

ఆ. ఎద్దుమొద్దువాని కేలశాస్త్రంబులు
ముద్దునాతి కేల ముసలిమగఁడు
చద్దిమిగులనిల్లు సంసార మేలరా, వి.... 21

సంసార మనిచేయుచున్నప్పుడు అతిథి అభ్యాగతులపూజలను చేయుచుండవలయును. వీనిని చేయువలయు ననిన ధనార్జన

మవశ్యము చేసితీరవలయును. పోనీ ధనమే యక్కఱలేదు అతిథి పూజలే యక్కఱలేదు అని యందురా? అట్లయిన నాసంసార మెందులకు? నిష్ప్రయోజన మగును అని యర్థము ఎట్లనఁగా, ఎద్దుమొద్దుస్వరూపికి వేదశాస్త్రము లెట్లు నిరర్థకములో, చిన్నపాపకు పెద్దముత్యపుసరి మెడకుఁ డెట్లు వ్యర్థమో అట్లే వద్దిమిగులనియిల్లు వ్యర్థమగును కావున ధనము నార్జింపవలయును

క. ఎన్నాళ్లిల దానుండెడు
నన్నాధన మొప్పకుండ నందుచు సుఖముల్
కొన్నాళ్లకు దాఁజనినను
మన్నాగద మఱియునెల్ల మహిలో వేమా. 22

"మాకు ధనమే యక్కఱలేదు" అని కొందఱు బిఱ్ఱబిగుసుకొని కూర్చుండెదరు ఎన్నాళ్లిట్లు ధన మక్కఱలేక కూర్చుండ గలరు? ధనము అక్కఱలేక సుఖములు వచ్చుటెట్లు? సుఖములు లేనిమనుజులదేహములు వ్యర్థములై మంటిపాలగును కదా! కావున సౌఖ్యముల నొందగోరువారు తప్పక తమచేతనైనంత దనుక ధనమును కూర్చుటకొఱకు బ్రయత్నింపవలయును.

ఆ. ఓజమాలు మగువ కూలిమాడలచేటు
పాటులేని మగఁడు కూటిచేటు
పనికిమాలు దాసి బత్తెంబు చేటురా, వి.... 23

కొందఱు డబ్బునుదండుగచేసి దాసీలని పేరులతో కొందఱు సేవకురాండ్ర నుంచికొనియెదరు. వారివలన కలుగునుపయోగముమాట నటుంచెదము. కాని ప్రతిరోజును బత్తెముమాత్రము

పాడగుచుండును ఎట్లనఁగా, బలములేనిపడతిని కూలికిఁ బిల్చిన కూలిడబ్బులు దండుగయగునట్టులు పాటుపడనిమగవానికి పెట్టెడియన్నము దండుగయైనట్టులు కావున బుద్ధిమంతుఁడు ధనమును వ్యయముసేయుటయందు జాగ్రత్తగా నుండవలయును.

ఆ. కట్టుపేరు లోడిగట్ట చెప్పగరాదు
కానరాక యున్న కలిమితనము
జంగమైనవాని జాతి గన్పడదొకో, వి.... 24

కొందఱు తమ కెక్కువగా సంపదలున్నవని పురజనులకును ప్రేక్షకులకును తోఁపింపఁజేయుటకై వస్త్రాభరణముల నధికముగా నలంకరించుచుందురు ఇది యట్టిదే బెత్తనముని నాతలంపు నిజముగా సంపద లున్నవారు అందఱికిని తెలిసియే యుందురు వారి కలిమి ప్రయత్నము లక్కఱలేకయే ప్రకటితమగుచుండును. ఎట్లనియందురా? జంగముఅయినను జాతిగనుపట్టుటలేదా! యట్టులే కావున లేనిపోనివేషములచేత డబ్బునశింపఁజేయఁదగదు.

ఆ. కడుపునిండ దవుడు గంపలో బెట్టిన
జన్నుఁ బట్టనీక తన్ను గేదె
వారకాంత లెట్లువలతురో యూఁటక, వి.... 25

చేతినిండ పుష్కలముగా ధనమున్ననే యీలోకములో సుఖములు బడయఁగలుగుదుము కేవలధన మున్నంతమాత్రమున ప్రయోజనములేదు. ఉన్నధనమును జాగ్రత్తగా కాపాడికొనవలయును, కాని ధనములేక తలంపులు మాత్రము నెఱవేరవు. చూడుడు. కడుపునిండ తవుడుబెట్టినను చన్ను ముట్టుకొననీయక

గేద తన్నుచునే యుండునుగదా! అట్లే వేశ్యకూడను కావున ధన మత్యావశ్యకమని భావము.

ఆ. కనకపర్వతమునఁ గాపురం బుండిన
  ననిమిషేశ్వరునకు నాసపోదు
  కనకకుండలములు కర్ణుని నడుగఁడా, వి.... 26

ధనము చెడ్డదియని యును ధనముపై నాశనువిడువవలయు ననియు ననేకులు పెద్దలు చెప్పుచుందురే గాని తాము ఆచరించిన వారొక్కరును లేరు తెలిసినంతవఱకు దేవతలలో నైన నున్నారేమో? యని విచారించినయెడల లేరుసరికదా' దేవేంద్రునంతటి వానికిఁ గూడ నింకనుధనాశయే! అహా ఏమిధనము!! బంగరు కొండమీద కాపురముండినను ఇంద్రునికి కూడ ధనాశయే! ఎట్లని యందురా? కర్ణునిజేరి కనకకుండలముల నడుగుటయే సాక్షి. కావున ధనమునందు విరక్తినొందవలదు

ఆ. కనకమృగము భువిని కద్దు లేదన లేక
  తరుణి విడిచిపోడె దాశరథియు
  దైవమైన ధనముఁ దలచుచుండెను గాదె, వి....

బంగారము పేరు చెప్పినతోడనే యెంతటి మహానుభావుల కైనను ఆశలుఃపుట్టును. అట్లు ఆశలేనివాఁడు లేడు చూడుడు. రామునంతటినిస్పృహుఁడు "బంగారపుశేడివచ్చెను" అని యన్నంతనే "ఓసి బంగారములేడి యుండునా?" యని యైన నాలోచింపక భార్యను విడిచి లేడివెంటఁ బరువెత్తిపోలేదా! దేవుఁడైనను ధనమునే గోరుచుండును కావున బుద్ధిమంతు లింతటియావశ్యకవిషయమును వ్యర్థము పుచ్చకూడదు.

ఆ. కనక మున్నఁ బోడు కాముఁడు భీముఁడు
మిగులఁ దేజమంది మెలఁగుచుండు
విత్తహీనుఁడైన వెఱ్ఱులలో నేటు, వి.... 28

ధనములేకయే భీముఁడు బరణ్యావాసాదులం జేసిరి లేకున్న బోవునా? భీముఁడు కాముఁడు వీరిందఱును బంగారమున్న కష్టములకో ఱకు కాటికి బోవనే బోరు పైగా వెనుకటి కంటె నెక్కువతేజము నొంది వెలయుటకే ప్రయత్నములను సేయు చుందురు ఇఁక ధనములేనివానిఁ జూతము ఎవ్వఁడైన విత్త హీనుఁడయ్యెనా అట్టివానిని వెఱ్ఱివారిలో నేటుగా చెప్పెదరు.

ఆ కన్నపుత్రునాస కనకంబుపై నాస
పిన్నపెద్దతనము లెన్నఁబోదు
వాసుదేవు విడిచి వసుదేవు నెంతురా? వి.... 29

ఇతరవిషయములందును సమయములందును ఎంతటిగొప్ప వాఁడైనను కాని పిన్నపెద్దతనములను మానమర్యాదలను చూచె దరు కాని బంగారముదగ్గఱ మాత్రము మొగమోటము లేకయుం దురు.కన్నబిడ్డపై యాసయును,కనకంబుపై యాసయును, పిన్న పెద్దతనముల నెన్ననీయదు ఎట్లనియందురా? ధనికుఁ డగువాఁడు దేవుని విడిచి యాతనితండ్రి యగువసుదేవు నెంచెదరా? లేదు గదా! అట్టులనే ధనవిషయమునఁ గూడను

ఆ. కనియుఁ గానకుండుఁ గదురీవియా లేదు
వినియు వినకయుండు విస్మయంబు
సంపద లేదేని సన్నిపాతము పూను, వి.... 30

సంపదలేనివాఁడును సన్నిపాతరోగియును సమానులని చెప్పవచ్చును. ఏలయనఁగా, సన్నిపాతరోగియును సంపదలేనివాఁడును కన్నులతో చూచియును చిన్నపెద్దతనముల నెంచరు. వినినను విననివారిపోలిక నుందురు ఆశ్చర్యము! అహా! ధనము ఎంతలో మనుష్యునికి పిచ్చియెత్తించి వేయుచున్నది. కావునఁ బ్రతివారును నవశ్యముగా ధనము నార్జింపవలయును.

క. కన్నెమీఁది యాస కనకంబుపై నాస
లేనివాఁడు పుడమి లేనివాఁడు
కలిగెనే నతండు కానంగ రాఁడయా, వి.... 31

సర్వమును తెలిసినవారి మని లోకులు కొందఱు "కనకము నతిగా సంగ్రహము సేయరాదు ఇదియ బుధులకు కర్తవ్య"మని ధర్మోపన్యాసములు గావించుచుందురు విచారించితిమేని నిజముగా కన్యకలపైన గాని కనకముపైన గాని యాశలేనివాఁ డీ భూలోకములో నెక్కడను లేనేలేఁడు ఒకవేళ యుండుననియను కొందమన్నను నాతఁడిట్టులు వీరివలె పెనురచ్చలపైనను పెంటకుప్పలమీఁదను కనఁబడనే పడఁడు కావున నిట్టివారిమాట విని వ్యర్థులుగాక ధనము నార్జింపవలయును.

ఆ. కమ్మరీని దుడుకు కార్యవినాశంబు
వడ్లవాని దుడుకు వాలపిడుగు
కానువాని దుడుకు కాకుస్థబాణంబు, వి.... 32

అధికారముకూడను ప్రపంచమునందలి వస్తువులన్నిఁటి కంటె నర్థమునకు అనఁగా ద్రవ్యమునకే యెక్కువగా గలదు.

ఎట్లనియందురా ? చూడుడు. కమ్మరపనిచేయువాఁడు కుపితుఁడై పనిసేయుచున్న పని నిలిచి పోవును. వడ్లవాఁడు(అనఁగా కొయ్యలను చెక్కెడివాఁడు) సరిగా పనిచేయకపోయిన దినగండము వచ్చినట్టు లుండును. కాని ధనికునికి కోపమువచ్చి సాధింపఁబూనినచో రామబాణమువలె తక్షణమే తగిలి వచ్చును.

ఆ కర్ణుఁడొకఁడె గాని ఘనులెవ్వరును లేరు
దానశీలు డంచు దలఁపఁబడెను
తలఁప ధనము కర్ణుదాతఁ జేసెను సుమీ, వి....

నూతకులములో పుట్టినవాఁడైనను ధనముగలిగినందువలననే కదా "లోకములోన దాతయన్నను ఘనుఁడన్నను ఇనసముఁడన్నను గర్ణుఁడొక్కఁడే గాని మఱియొక్కఁడు లేఁడు" అని కర్ణుఁడు తలఁపఁబడెను ఆహా ధనపుమాహాత్మ్య మెంతటిదో చూడుడు. కర్ణుని కింతటి యుత్కృష్టతను యశంబును ఇచ్చినది ధనమొక్కటేసుమీ ! కావున బుద్ధిమంతుఁడైన నరుఁడు ధనము నార్జింపఁ బ్రయత్నంబు సేయవలయును

ఆ. కలిగినమనుజుండు కాముఁడై సోముఁడై
మిగుల తేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన నుత్తసన్యాసిరా, వి.... 34

ధనము కలిగినమనుష్యుఁడే సకలలోకములలో నుత్తముఁడగును. ఇట్టిమనుఁజుడే ! రూపములేకున్నను కాంతిలేకున్నను మన్మథుఁడై చంద్రుఁడై తేజోవంతుఁడై వెలయుచుండును. ఇంక ధనము లేనివాఁడో విత్తహీనుఁడై వట్టివాఁడై గోచియు

మొలత్రాడును లేని సన్న్యాసియై పోవును. కావున ప్రతివారికిని ధన మార్జింపవలసియుండుట యత్యావశ్యక కార్యము

ఆ. కలిగి ధర్మ మీయఁ గానని వారును
కలిగి తినక చాల గ్రాగువారు
కలిమి నెచటఁ జూడఁ గానక చెడుదురు, వి....

తనకు లేనియప్పుడు సరియే ఉన్నయప్పుడైనను పట్టునని బ్రాహ్మణునికి పదికాసులను ఈయలేనివారును, ఒకరికీ యున్నను తామైన తినియెదరేమో! యన నట్లును గానివారును ఇఁక పైని వచ్చు జన్మజన్మములకును సంపదను కనులతోఁ జూచెడి భాగ్యమును నోచుకొనక వ్యర్థులై చెడిపోవఁగలుగుదురు. కావున తాను ఆర్జించి ఎల్లనినంతవఱకు ఒరులకిచ్చి గాని తా ననుభవించిగాని యుండుట ధనికునకు చేయఁదగిన కృత్యము

ఆ. కలిమి యున్నవానిఁ గని పట్టి నిచ్చిన
మనుపుఁ బొంగుపాలు మఱిగినట్లు
లోన నిగిరి కలిమి లొట్టపోయెడునొకో, వి....

లోకములో బుద్ధిమంతు లగునరు లుందురేని, సంబంధ బాంధవ్యములను చక్కఁగా విచారించి సంపద గలిగినవానికే తన కొమరిత నీయవలయును. అట్లు ఇచ్చినయెడల వారిబాంధవ్యము (అనఁగా చుట్టఱికము) పాలుమఱిగినట్లు మఱిగి సారవంతమై యొప్పునేగాని ఇగిరిపోయి కుండ కంటికొని పోవునట్లులు కానేరదు. కావునఁ బ్రతివారును ధనికులనే యన్వేషింపవలయును.

ఆ. కలిమి కలిగియుండి కఠినభావముఁ జెంది

తెలియలేరు ప్రజలు తెలివిలేక
కలిమి వెన్నెలగతిఁ గానంగ లేదయా, వి.... 37

బుద్ధిమంతులు సంపదలు వచ్చినవని పొంగిపడరు. బుద్ధిహీనులన్నవో తమకు కలిమి గలిగినదని బిఱ్ఱబిగుసుకొని యెవ్వరితోడంగూడ మాటలనాడక, స్వయముగా తెలిసికొనంజాలక చెడిపోయెదరే కాని, కలిమిలేములు వెన్నెలరాత్రులఁ బోలి శాశ్వతములు గావని తెలిసికొనగాఁ జాలరు కావున తనకు సంపదగలిగె నని పొంగి యొక్కదినముననే కర్చుచేసి తరువాత విచారము నొందెదరు

ఆ. కలిమి కలిగెనేని గామునిగాఁ జూతురు
లేమిచేతఁ జిక్కు లేమ లధిపు
మదనువంటిదాని మాలఁగాఁ జూతురు, వి....38

ప్రపంచములోని తక్కినపదార్థము లొక్కటి ధన మొక్కటి నొకటి తక్కినవస్తువు లున్నను లేకయున్నను సంపదయుండినయెడల వానిని మన్మథునిగా నెంతురు. ఇఁక నొకవేళ వానికే దారిద్ర్యము వచ్చినా ఆస్త్రీలు వానిని మన్మథునితో సమాన మగురూపరేఖావిలాసములు కలవానినైనను మాలవానిని వలె దూరముగాఁ బొఱఁజూతురు కావున ధనము సర్వశ్రేయములకును తావలము, దానినే యార్జింపవలయును

ఆ కలిమి గలుగ సకలకులముల కెక్కువ
కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమి లేనివాని కులమేమి కులమయా? వి....39

సంపదయే యన్నిగుణములకును మూలకారణ మగుచున్నది. ఎట్లనియందురా? చూడుఁడు సంపదయే సమస్తము లగుకులముల కంటె నెక్కువకులమును తెచ్చుచున్నది సంపదయే తానుగోరిన సమస్తభాగ్యములకు పట్టుగొమ్మ ఇట్టి సంప లేనివాని జన్మము వ్యర్థము అట్టివాని భాగ్య మేమిభాగ్యము? కుల మేమి కులము? అనఁగా: సంపదలు లేకున్న నంతయును వ్యర్థము

ఆ కలిమిఁజూచియీయఁగాయమిచ్చినయట్లు
సమునకీయనదియుసరసతనమొ
పేదకిచ్చుమనవుపెన వేసినట్లురా, వి.... 40

ఐశ్వర్యములను పరికించి ఇచ్చుపుచ్చుకోళ్లను చేసికొన్న యెడల నది యంగిచ్చినట్లుండును తనతో సమానుఁడయినవాని కిచ్చిన నది యెవ్వరి యోగ్యతగ్గునను తెలియక గౌరవము లేక సరసమాడుకొనిన యట్లుండును ఇఁక పేదవానికిచ్చెనా? తట్టబుట్ట పెనవైచి నెత్తికిఁ గట్టిన నెంత చీకాకును గలిగించునో యంతటి చీకాకును గలిగించును కావున ధనికుఁడవై ధనికులతో వియ్యమందుము.

ఆ. కలిమి నాఁడు మగని గాపించి చూచును
లేమిఁజిక్కునాఁడు లేవకుండు
మనినమగనినైన మడియంగఁ జూచును, వి....41

అర్థములేనివాఁడు వ్యర్థుఁడు అట్టివానిని పిచ్చుకకులు కూడ నొల్లవు. ఇఁక పెండ్లమిష్టపడు నని వేఱుచెప్పవలయునా? చూడుఁడు. అర్థములపట్ల భార్యలస్వభావ మిట్టిదో? సంపదగలి

గినయెడల మాగనిఃత్యంతము ప్రేమతోఁ జూచును లేనివాఁడు చూచినను చూడనట్లులు నటించి లేవనైనను లేవదు పైపెచ్చు ఇట్టిమగనిచేత నేమిప్రయోజన మిట్టివాఁడు బ్రదికియుండుట కంటె చచ్చిన బాగుండునని కోరును కాఁబట్టి శ్రేయఃకాము లర్థముల నార్జింపవలయును

ఆ. కాంచనంబుపైనఁ గాంతలపైనను
బమ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
తోయజాక్షి విడుచు దొరయెవ్వరును లేరు, వి....

బంగారము పైని ఆసలేనివాఁడు ముల్లోకములలో నెక్కడను లేడని గట్టిగా చెప్పఁగలము ఇఁక వీరి వారి సమాచారము లేల, లోకముల నన్నిఁటిని పుట్టించిన బ్రహ్మకైనను గానిండు బంగారము గాని పడతిగాని కన్నుల కగుపడినవెంటనే వలయును నని వాంఛ గలుగునే కాని వలదని కలుగదు ఆఁడుదానిని విడుచు ప్రభు వెచ్చటను లేనట్లే అర్థము నాశింపనివాఁడును లేఁడు. కావున జాగ్రత్త వహించి ధనమును కాపాడుకొనవలయును

ఆ. కాంచనంబు మీఁది కాంక్ష మోహ మటండ్రు
విడువలేరు దాని విబుధులైన
కాంక్ష లేనివారు కానఁగా రారయా, వి....43

బంగరుపై నాసయుంచికొనుటకు యజ్ఞాన మనియును, ఆయాసను పోఁద్రోలని యంతవఱకు జనుఁడు మోక్షమున కర్హుఁడు కాఁడనియును కావున నవశ్యము విసర్జించి వేయవలయు నని విద్వాంసులు చెప్పుచుందురు, కాని ఎంతటి విద్వాంసులై

నను బంగారముపైని కోరికలేనివారు ఎక్కడనైన నుండిరేమో? యని వెదకిచూచినను కానరాకయున్నారు కాబట్టి తెలివి తక్కువచేత ధనము నపరిమితముగా వెచ్చించి చెడిపోవలదు.

ఆ. కావవలయు ధనముఁ గొంత నెల్లప్పుడు
కావలేనివాఁడు చావవలయును
కాపులేని దాని కాపుర మదుగనా?, వి.... 44

పురుషుఁడై పుట్టినందుకు సంపాదించు ఫలము వేరేపురుషార్థము పురుషార్థము గోరువాఁడు ప్రతివాఁడును విధిగా పడతిని భాగ్యమును జాగ్రత్తగా కాపాడవలయును ఈరీతిగా కాపాడలేనివాఁడు వ్యర్థుఁడు అట్టివాఁడు బ్రదికియుండుటకంటె చచ్చుటమేలు. కాపులేక ఇచ్చావచ్చినట్లు వెచ్చించు కాపురము యొక్కయు కనకము యొక్కయు నుండని వేరేయడుగవలయునా? కాపున సంపదను చక్కగా కాపాడుకొనవలయును.

ఆ. కుడువఁ గూడులేక కూడఁబెట్టఁగ లేక
విడువ ముడువ లేక గడన లేక
నడువ సాగకున్న నడపీనుగందురు, వి.... 45

ధనహీనుని బ్రతుకెంతనీచమైనదో చూడుఁడు తనకు తినుటకు అన్నము కావలయుననిన దొరకుట దుర్లభము. తా నొకరునికి పెట్టవలయుననిన నంతకంటె నుండదు పోనీ ఇట్టికాపురమును వదలివైచు నేమో? యనుకొందమన్నను విడువఁజాలఁడు. కాపురము స్వాధీనము చేసికొని గడుపఁజాలను చిల్లిగవ్వరైన ఆర్జన ముండదు. ఇఁక నాపైని దినము గడచుటయే కష్టమగు

చుండు ఇట్టిగానివి లోకులు చూచినప్పుడు నడపీనుఁగు అని నిందింప మొదలుపెట్టెదరు. కావున లోకనిందకు భయంపడి యైనను ధనము నార్జింపుము

ఆ. కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీఁగువారు
పసిఁడి గల్గువాని బానిసకొడుకులు, విశ్వ.... 46

“మాది సద్వంశము మాది గొప్పగోత్రము లోకము లోని యందఱికంటె మేము హెచ్చువారము.” అని కొంద ఱును, “అన్నివస్తువులను మించినది విద్య విద్యతో సమాన మీలోకమునందు లేదు మేము విద్య నార్జించితిమి మాతో సమా నులు లేరు” అని కొందఱును గర్వముచే విఱ్ఱవీఁగుచుందురు ఆహా! ఏమి వీరి తెలివి తక్కువ ఈకులముగొప్పవారలు గోత్రాలవారు విద్యాధికులు ధనములేమిని అందఱును భాగ్యవం తుని దాసీపుత్త్రులతో సమానులగుదురు కావున ధనమార్జింపుము

ఆ. కులము లేనివాఁడు కలిమిచే వెలయును
కలిమిలేనివాని కులముదిగును
కులము కన్న నెన్నఁ గలిమి ప్రధానంబు, విశ్వ

లోకమునందు నభిమానమును బుట్టించు వస్తువులు రెండు ఒకటి కులము రెండవది కలిమి గుణవంతుఁడైనవాఁడు కులము కంటెను కలిమినే ముఖ్యముగా చూడవలయును ఎట్లనఁగా:— కులము తక్కువయగువాఁ డుండినచో వాఁడు సంపదచే నధికుఁ డగును. ఇట్లే కలిమి తక్కువవాఁడు కులముచే హెచ్చగు నన

వలదు అల్పెన్నడు కాదు. కలిమి లేకపోయిన కులము తక్కువ యగును. కాబట్టి కులము కలుములలో కలిమియే ప్రధానము కావున కలిమి నార్జింపుము.

ఆ. కులుకుగుబ్బఁ జూపి గోబ్బున వలపించి
చేతికాసులెల్లఁ జేరఁదీయు
చేతఁ గాసులేక చేసెడిదేమిటి, విశ్వ.. 48

ధనముగలవాని నెక్కుడు నెవ్వరైనను చేరఁదీసి ద్రవ్యము నపహరింపనే చూచుచుందురు గావున జాగ్రత్తను వహించి యట్టివారి మాయలంబడక కాపాడుకొనవలయును ధనాశ గల వారు కావున వారికి సిగ్గువెగ్గులుండవు జనులను తమవశము చేసి కొనుటకు చన్నులసొగసుఁ జూపి వలపింతురు చేతిలోని కాసుల నన్నిటిని గ్రహింతురు పోనీ! యని యనెదవా? చూడు చేతిలో నొక్క చిల్లిగవ్వ యైనను లేనిచో నీవేమిచేయఁగలవు? కావున ధనమును జాగ్రత్తగా నుంచుము.

ఆ. కూరలేనితిండి కుక్కతిండనిపించు
మాఱులేనితిండి మాలతిండి
ధారలేని తిండి దయ్యపుతిండిరా, విశ్వ.... 49

డబ్బులేనివారికి సౌఖ్యము లెట్లువచ్చును? ఎట్లు జీవింపఁ గలుగుదురు? ధనికులు కానివారలు బ్రదుకుటలేదా? యని యనెదరేమో? సరి. ఇదియా, తిండితిప్పలు లేక మాడిచచ్చుటయా గొప్ప? అట్టివానితిండి యను నొకతిండియా? కాదు కూరలేని భోజనము కుక్కతిండితో సమానము మాఱులేని తిండి మాలని

తిండితోపాటి. అజ్యధారలేక యన్నముఁ దినుట దయ్యపు తిండి కావున భోగముల కాసించువారు ముందుగా ధనమును సంపాదింప వలయును

ఆ. కూలినాలిఁ జేసి గులాము పనిచేసి
తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు
లేమిఁ జిక్కు విభుని వేమాఱు దిట్టును, విశ్వ....

ఎన్నికష్టములనొందియైనను ధనము నార్జించుటయే పురుషార్థము. భార్య మున్నగువారిని పోషించుట కైనను ధనము నవశ్యముగా నార్జింపవలయును. అట్లు పోషించుటకు మర్యాదగా ధనార్జనముసేయుటకు వలనుపడనిచో కూలి నాలి చేసియైనను గులాముపనిచేసియైనను డబ్బును సంపాదించి ఆలుబిడ్డలను పోషించిన మెచ్చుకొనును అట్లుగాక దరిద్రము నొందిన చేసికొనిన పెనిమిటి నైనను అనేకమారులు తిట్టి దిగపాఱఁ బోయును. కావున ధనమును సంపాదించుట ముఖ్యమగు కార్యము

ఆ కోమటి మదిఁ గోరు కొమమేయెల్లెడ
వైద్యుఁ డోరులకెపుడు వ్యాధిఁగోరు
వాడవారు ధనికుఁ జేరఁగాఁ గోరును, వి.... 51

ఊరిలోని వారందఱు ఎంతగొప్పవారైనను ధనికు నాశ్రయించికొనియే బ్రదుకఁజూతురు ఇట్లగుట సహజము ఎట్టులని యడిగెదరా? చూడుఁడు. కోమటి తనవర్తకము వృద్ధినొందు నను నాశచే కఱవునే కోరుచుండుట లేదా? వైద్యుఁడు తన వైద్యమే ప్రసిద్ధిఁ జెందవలయు నని లోకులకందఱికిని రోగములం

రావలయు ననికోరుటలేదా ? అట్టులే వాడలోనివారు తాము ఇతరుల ధనము నపహరింపవలయును అని యత్నించుదురు.

ఆ. గోఁచిఁపాతఁ బెట్టి కోరి తా ముని నంచు
మనసులో ధనాశ మానలేఁడు
ఆకృ తెన్న వేఱె కాశయెన్నఁగ వేరు, వి....52

వేయిమాటలేల? ధనము అక్కఱ లేదని పొఱవైచినవాఁడు లేనట్టులే ధనమునకై అసపడి వేషములను వేసికొనని వాఁడు గూడలేఁడు గోఁచిపాఁతఁబెట్టుకొని మునీశ్వరుఁడ నంచు తిరిగి మనంబులో మాత్రము ధనముపైని ఆశను వదలుకొనఁజాలఁడు. ఎప్పటికిని బుద్ధిమంతులగువారలు ఆకారమును చూచి మోస పోకూడదు. ఏలయనఁగా ఆకృతి వేఱుగ నుండును. ఆశ వేఱుగా నుండును. కావున మోసపోయి ధనముఁ బోఁగొట్టికొనవలదు.

ఆ. చదువులందుఁ బొడి సౌఖ్యములందును
పెదవులందు రాజ్యపదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు గలరొకో, వి....53

ధనాశలేనివారు లెఱుచుగా లేరనుటకంటెను లే నేలేరని చెప్పుట యుత్తమము. ఏలయనియందురా? చదువులు, సంప దలు, ఆభరణములు అధికారములు, ఎంతటివారికైనను మోహ మును పుట్టించి కోర్కులను రేపునేకాని నిరసనమును పుట్టిం పవు ఇట్టివానియందు ఆశలేదని చెప్పుట యసత్యము. వీని యందు ఆశలనుడిగినఅయ్యలు కూడకలరా? లేరు.

ఆ. చమురు గల్గుదివ్వె సంతోషముగ వెల్గు
ధనముగలుగువాని తలఁపుఁ జెలఁగు
ధనములేని వాని తలఁపులు తీరునా, వి ....54

ధనముగలవాఁడే ఎట్టిధర్మకార్యమును గాని ఎంతటిపుణ్యకార్యమును గాని ఘనకార్యమును గాని చేయఁగలఁడే కాని ఇతరులగు దరిద్రులవల్ల నగునా? కాదు ఎట్లనఁగా చమురుకలదీపము చక్కఁగా వెలిగినట్లుతే ధనముగలవానికోర్కెలును అతిశీఘ్రముగా కొనసాగును చమురులేని దీపము వెలుఁగక ఆరిపోవునట్లుతే దరిద్రునికోర్కెలు కొనసాగవు సరిగదా చివరకు నశించికూడ పోవును కావున ధనమార్జించుట యత్యావశ్యకము

ఆ. చావు నేఁడో రేపో! జతపడివచ్చును
పెక్కునాళ్లు కూడఁ బెట్టనేల?
అనుమ నాశ లుడిగినంతటివారేరి, వి.... 55

ఏపనినైనను అందఱికిని చెప్పెడివారే గాని తాము చేసెడివారు లేనేలేరు. అట్లుతే ధనము చిక్కినంతకు ఖర్చుచేయుము మని చెప్పెడివారే గాని తాము చేసి చూపెడువారు లేరు ఎట్లనఁగా:—చావు నేఁడో రేపో రానేరావచ్చును కావున పెక్కునాళ్లు కూడఁబెట్టిన ప్రయోజనములేదు ఇదిగో ఏమ్మునుచూడుఁడు. మేము కర్చుచేయుచున్నామని ఆశలుడిగి ఖర్చుసేయు నంతటి ఘనులెవ్వరును లేరు కావున బుద్ధిమంతుఁడు తనధనము నితరులమాటప్రకారము కర్చునిక్కువగా చేయఁకూడదు

ఆ. జడలు దాల్చురెల్ల జగము నీ యనురెల్ల

నోడలు విఱుచు నట్టియోగ మెల్ల
లక్ష్మి తమకు తానె లభ్యమౌనని కాదె, వి. 56

విరాగిగాని రాగిగాని, లోకములోని ప్రతిమనుష్యుఁడును ధనముకొఱకే త్రిప్పటల నొందుచున్నారనుట కిసుమంతయును సందియము లేదు ఎట్లనియందురా? మానవుఁడు ఏదో మంత్రమును గాని యోగమును గాని యవలంబించిన ధనము సిద్ధించునని ఆశించియే కదా లోకములోని బైరాగు లందఱును జడలు దాల్చుటయును, లోకము నశ్వరము అని నిందించుటయును ఒడలు విఱిచికొనుటయుఁ గాఁబట్టి ధనమునందే ఏమఱరాదు.

ఆ. టంక మడుకకున్నఁ బొంకంబు గారాదు
స్వర్ణభూషణంబు జగమెఱుంగు
భటుఁడు వెంటలేక ప్రభుఁడు శోభించునా, వి 57

ధనసంపాదనకొఱకనేకవిధములగు కష్టముల నొందునని మూర్ఖులు నిందింతురే కాని ఏదో యొకయెత్తు వేయనిది ధన మెట్లువచ్చును? రాదు గదా! బంగారము సొమ్ము లున్నవని ధనము లేకపోయినచో జగత్తు మెచ్చుకొనుటయెట్లు? బంగారము లేక మనుజుఁడు ప్రకాశించునా? ప్రకాశింపఁడు ఎట్లనియందురా? భటుఁడు వెంటరాకపోయిన ప్రభువు ప్రకాశించునా? అట్లే కావున ధనము నార్జించుట ముఖ్యము

ఆ. డిందుపడినవాని నెందును లెక్కింప
రెందు నందుఁ గాన నెట్టు లయిన
మందమతివి గాక మహిమతో నుండుము, వి....

ఒకవేళ ధనమును సంపాదించి దాని నంతయును కర్చుసేసి కొంచెము లొంగిపోయినవానిని లోకులాదరింతురా? యని విచారింతము చూచితిమేని నిర్ధనుని ఈలోకములోను లెక్కసేయరు. పరలోకములోను లెక్కసేయరు. కావున బుద్ధిహీనుఁడవై తిరుగాడక జాగ్రత్తగా ధనమును కాపాడికొని పేరుప్రతిష్ఠలనొంది సుఖింపుము.

ఆ. డొక్క లెండిపోవ డొక్కు తానయ్యును
మమత మానఁ గలఁడె? మానవుండు
కాన ధనముఁ గూర్పఁగడఁగుము జ్ఞానివై, వి....

డొక్కలన్నియు తిండిలేక యెండిపోవునట్లు కృశించినప్పటికి నభిమానమును పోఁగొట్టుకొనఁగలఁడా? లేఁడుగదా! కావున బుద్ధిమంతుఁడైనవాఁడు వ్యర్థముగా కాయక్లేశమును గలిగించు తపోజపంబులతో తంటాలు పడుటకంటె నియతముగా ధనమువార్జించి జ్ఞానియై సౌఖ్యముల నొందుటయే యత్యుత్తమమగు కార్యము కాన నిపట్లుచేయుట కొఱకుఁ బ్రయత్నమును సేయుం

ఆ. తమకు బంధు వనుచు తానె తోడుకవచ్చి
కలిమిఁ గలయఁ జూచి కాంక్షపడుచు
దక్షిణల నొసంగి తరుణి నీయఁగఁ జూచు వి....

సంపదకలవానికీలోకములోఁ గలుగుమర్యాదలను సుఖములను పరికించుఁడు. కులహీనుఁడైనను గుణహీనుఁడైనను సంపద విస్తారముగా నున్నయెడల వానికిని తమకును ఇదివఱలో నెట్టి

సంబంధము లేకున్నను, తనబంధువని వానిని జెప్పుచు సంపదను ముఱియుచు కోరి వరదక్షిణలనొసంగి చక్కని చిక్కయను దగుపిల్లనిచ్చి పెండ్లిసేయఁ జూతురు. కావున ధనమార్జించుట యావశ్యము చేయఁదగును.

ఆ. తఱుచు కల్లలాడు ధరణీశునిండ్లలో
వేళవేళ లక్ష్మి వెడలిపోవు
నోటికుండలోన నీరము లుండునా,(?) వి.... 61

మహారాజులైనను గాని చక్రవర్తియైనను గాని సంపదలను జాగ్రత్తగా కాపాడుకొననిది నిలువదు. కొందఱు రాజులు వేళయుం లేక అప్పుడిప్పు డనక నెప్పుడును తగవుల నాడు చుందురు. ఇట్టసత్యములు పలుకుచు జగడములను వేయుం వారిం డ్లయందు రాజులుకావలయును గాక లక్ష్మి నిలుప నే నిలువదు. ఎట్లని యుందురా? ఓటికుండలో నీరు నిల్చునా? నిలువదుకదా! అట్లులనే తగవులాడి ధర్మస్థానముల కెక్కు వారికి ధనమెట్లు నిలుచును? నిలువదు.

ఆ. తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద
లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయ పురుగుపద్ధతి గానరో, విశ్వ ....62

ధనమును సురక్షితముగా చేయనెంచినవానికి భార్యలు చుట్టములు కొమరులు ధనము ధాన్యము ఎంతగా తనను చుట్టుకొనిన నంతచేటు కలుగును ఎట్లని యుందురా? పరికించుఁడు. పసిరికాయ పురుగు తననోటినుండి వచ్చుదారమును జాగ్రత్తగా చిక్కగాఁ

బడకుండ కండెగా చుట్టుకలదుననిపూనుకొని తనకాళ్లను బంధములను వైచికొని మృతినొందును అట్టులే ధనరక్షణమునఁగూడ నితరులు ప్రతిబంధకు లగుదురు.

ఆ॥ తలనుఁ బాగ పైని దగుపచ్చడము బొజ్జ
చెవులపోగు లరసిచేరు నర్థి
సుఖముఁ గోర ధనము సౌభాగ్యమును గోరు, వి

డబ్బులేనివానిదగ్గఱకు జబ్బుగూడరాదు ఎంతదరిద్రుఁడై నను గర్భయాచకుఁడైనను పైకలిగునిని చూచియే యాచింప మొదలుపెట్టును తలపైని బెట్టుకొన్నపాగను, పైనికప్పుకొనిన పచ్చడమును చెవులపోగులను చూచి సమీపించును కావున తన చుట్టుఁ బదుగురువచ్చి తన కెవ్వఁడు సౌఖ్యములు కలుగవలయు ననినచో తా నవశ్యము సంపదను కోరవలసియుండును

ఆ. తల్లిబిడ్డలకును దగవు పుట్టించెడు
ధనము సుఖముఁ గూర్చ దని వచింత్రు
కాని, గడన లేక గడచుట యెట్లురా, వి....61

మూర్ఖులైన కొందఱు జనులు ధనమును నిందించుచు "తల్లికిని బిడ్డకును తగువులను కలిగించును. ఛీఛీ! ధనమంతచెడువస్తువీలోకమున మఱొక్కటిలేదు కావున బుద్ధిమంతుఁ డగువాఁడు ధనము నార్జింపకూడ"దని చెప్పుచుందురు. సరి, వీరుచెప్పినట్టులే నడచుకొనియెదము గాని ఒక్క పైస గూడ యార్జనచేయక ఈలోకములోఁ గడచి బ్రదుకుట యెట్లో చెప్పఁడు? కావున వీరిమాటలను విశ్వసింపకుఁడు.

ఆ. తళుకుబెళుకుఁ జూచి ధరలోని జనులెల్ల
కద్దు లేద టంద్రు ఘనతగాను
ఇదిగో యదిగో యనుచు నీకె నెక్కడందురు, వి

మనుష్యుఁ డెంతవఱకు ధనికుఁడుగా నుండునో లేక ఎప్పటివఱకు ధనికవేషమును వైచికొనునో అంతవఱకు వానినందఱును గౌరవింతురు. అధనికుని తళుకు బెళుకును చూచియే యందఱును అడిగి దానిని కద్దనిగాని లేదనిగాని ప్రత్యుత్తరము లిచ్చుచుందురు ఒకవేళ దరిద్రుఁడుగాఁ గనుపడి దేనినైన నడిగనేని ఈయక ఇదిగో అదిగో యని త్రిప్పుచు చివఱకు లేదందురు ధనికునకును దరిద్రునకు నింతటివ్యత్యాసము గలదు. కావున ధనము అవశ్యము ఆర్జింపఁదగినది

ఆ తవిటికరయఁ బోవఁ దండులంబుల గంప
శ్వానమాశ్రయించు సామ్యముగను
వైశ్యవరుని సొమ్ము వసుధ నీచుల కబ్బు, వి....66

ధనము నార్జింప తలఁపు గలుగఁగానే సరియా? కాదు ఆర్జించిన ధనమును కాపాడుకొనవలయును అధికమునకుఁ బోవు నప్పుడున్నదానిని జాగ్రత్తచేయు నేర్పుకలిగి యుండవలయును. అట్లు లేకయున్నచో నసలునకే మోసము సంభవించును. ఎట్లని యందురా? ఇంటిలోనున్న బియ్యమును జాగ్రత్తచేయక తలుపుతెఱచికొని తవిటికిఁ బోయిన కుక్కలు చొరఁబడి తిని పోవునట్లులుగా, ఆర్జించిన దాని నఱయు తెలివి లేనివైశ్యవరుల సొమ్ము నీచులపాలగును.

ఆ. తాను గుడువ లేఁడు తగ వేది యాప్తులఁ
జేర నీయఁ డట్టి చెనటి పశువు
చేనిలోన బొమ్మఁ జేసి కట్టిన యట్లు, వి.... 67

ఒక్కొక్కఁడు ధనము నార్జించును, గాని దాని నెట్టు లుపయోగించవలయునో తెలిసికొనఁడు తాను అనుభవింప నైనను అనుభవింపవలయును. లేదా తన యాప్తులఁ జేరనిచ్చి యనుభవింప నైనను చేయవలయును ఈరెంటిపనులను తనకు తోఁచక యెదుటివాఁడు చెప్పిన వినని చెవిటి పశువు చేనిపంట పాడుపోకుండ గట్టెడి యొక విధమైన దృష్టిబొమ్మతో సమానుఁ డగునే కాని యితరము కాదు. కావున నార్జితములగు ధనముల సద్వినియోగముఁ జేయవలయును

ఆ. తాను దిరుగుభూమి తౌమడాంబరమైన
బరఁగు దేశమునకు జరుగవలయు
గోల నెండిపోవ గొక్కెరలుండునా? వి....68

బుద్ధిమంతుఁడై ధనార్జనము సేయు వాఁ డుండవలయును. ఒక్కొక్కప్పుడు తానుండు దేశమునందు కఱవు మొదలగు వానివలన నాదాయము లేకపోయిన యెడల నేనీ దేశమును విడిచి పోవుదునా యని దురభిమానమును పొందక ధనార్జనమున కనువగు మఱియొక దేశమునకు పోవలయును ఎట్లని యందురా? ఉదాహరణముఁ జూడుఁడు కొలనిలో నీరున్నంతకు గొక్కెర లుండునే గాని యా నీరెండిన తరువాతను కొక్కెరలుండని యట్లే.

ఆ. తిరిపగాఁడయినను దిరిప మెత్తినయట్టి
తిరిపమందె తాను దిరిప మిడిన
తిరిపము తిరిపమునఁ దిగఁబడిపోవురా, వి....69

కొందఱు అనాలోచితముగా తాము సంపాదించిన ధనమును వెచ్చించుదురు అట్టిసమయము నిదితగదని చెప్పిన నాకింతకంటెను దరిద్రము రాఁ బోవదనును కాని అట్లనుట మాత్రము సరిగాదు ఎందువలన ననఁగా —చూడుఁడు తిరిపె మెత్తుకొనువాఁడైనను గాని, తనకు వచ్చునది కొద్దియైనను, ఆకొద్ది తాను తిరిపమువేయుట మొదలుపెట్టిన క్రమముగా తఱిగి పోవునా? పోవదా? అట్లే ధనముకూడ

ఆ. తీపి కెల్లఁ దీపి తెలియంగఁ బ్రాణంబు
ప్రాణవితతికన్నఁ బసిఁడి తీపి
పసిడికంటె తీపి పరఁగెడునో లేదో, వి....70

ప్రపంచములోని పదార్థము లన్నిటిలోనికిని మిక్కిలి ప్రియమైన వస్తువు ప్రాణము. ప్రాణముకంటె తీపిగలపదార్థము సామాన్యముగా లేదుగదా! అప్రాణముకంటె కూడ బంగారము మిక్కిలితీపి (అనఁగా: ప్రాణాపాయము వచ్చినను బంగారమును వదలనిని పట్టుఁబట్టి యుందురు ) ఇట్లు క్రమక్రమముగా వచ్చి చిట్టచివఱకు బంగార మన్నిటికంటె ప్రీతియైన వస్తువయ్యెను అపసిడికంటె తీపి లేదా యనియుందురేమో? కాని దానికంటె నధికమగు వస్తువున్నదో లేదో చెప్పఁజాలము.

ఆ. తెలుపఁబడినవాఁడు దేవతాభక్తుండు
మాటలేనివాఁడు పోటుబంటు
కాసులేనివాఁడు కడుబ్రహ్మచారియా, వి....71

లోకములోని జనులొక్కొక్క విషయముచేఁ బ్రసిద్ధిని పొందుచుందురు ఏవిధములయిన యోగ్యతలు లేకన్నను చెప్పినట్టులు విని నడచుకొనినఁ జూచి "వీఁడమాయకుఁడు వీఁడు దైవభక్తుఁ"డను చుందురు ఇఁక తిన్నెమాట యున్నను సహించియూరక యున్నవానిని "పోటుబంటు" అనిపరిహాసము సేతురు. ఇట్టులే ఇతరగుణము లెన్నియున్నను వివాహితుఁడై యున్నను ధనము లేకపోయిన యెడల నట్టివాఁడు బ్రహ్మచారియగును, కావున ధనము నార్జింపుము

ఆ తోటకూరకైన దొగ్గలికైనను
తవుటికుడుముకైనఁ దవిటికైన
గావ్యములను జెప్పు ఘనులెల్ల ధనపరుల్, వి....

మేము లోకోపకారమునకై శిష్యులను తరింపఁజేయుటకై భగవత్ప్రీతిగా జనులకు కావ్యాదులను నేర్పితరణోపాయమును గల్పించుచున్నారము మేము ఘనులముగదా! "అని పలుకుచు తోటకూరకైనను సరే, దొగ్గలికూరకైననుసరే, తవిటిరొట్టెకైనను సరే, చివరకు తవిటికైనను సరియే! కావ్యపాఠములనుచెప్పుచుండు ఘనులందరును పరోపకృతికై పాటుపడుచున్నారా! లేదు వీరల్లను ధనపరులే కావున ధనమును జాగ్రత్తసేయుము.

ఆ దశగలారి నెల్ల తమబంధువు లటండ్రు

దశయు లేమి నెంత్రు తక్కువగను
దశయనంగను ధనదశయొప్పు నొక్క టే,వి....73

తినకు ఇతరుని యాచింప నవసరములేక యదృష్టముండి మాటయుఁబూటయును చెల్లుచుండిన యెడల వారిని దశగలవారని తలఁచి వంచకులై తినుబంధువులని వీరిని జెప్పుదురు ఎవనికి దశ సరిలేదో? వానిని తమకంటె నీచునిగా తలంచుచుందురు. ఇట్లు ధనమును ప్రేమించి యెల్లవారును చేరుచున్నారు కావున దశయనఁగా నొక్క ధనదశయే దశయనిచెప్పఁదగినది అయ్యది యే యుత్తమదశ

ఆ. దశయనంగ మెండు ధనముంటయే యంద్రు
కూడు నిద్ర లేక కుందుటెకద
రాగ నుండఁబోవఁ బాగుగా నేడ్పించు, వి....

కొంద ఱీ ద్దానిని సమ్మతింపరు. అనఁగా ధనము గల్గుటయే దశయనుట నిష్ప్రయోజనము అని వీరిఅభిప్రాయము ఇట్టివారీధనదశయందలి లోపముల నిట్లనిచెప్పెదరు "మూర్ఖులై ధనము ధనము, ధనమే దశయని చెప్పుదురు అహా! ఏమిదశ? రాత్రింబవళ్లు కూడు నిద్దురలేక పిశాచములాగునఁ గూర్చుండవలయును. ఈధనము రాకడయందును కష్టమే పోవుటయందును కష్టమే.

ఆ. దాచినధనమునకుఁ దానును గొడుకులు
వాంఛపడుట యెల్ల వట్టిభ్రమలు
భాగ్యహీనునకును ఫలము లభించునా?,వి....85

ఇఁక గొందఱు సోమరులై ధనము నార్జించుటయందలికష్టములను పొందఁజాలక యెచ్చటనైనను అప్రయత్నముగా హఠాత్తుగా నిధానము తమకు దొరకవలయునని గొంతెమ్మకోరికలను కోరుచుందురు. ఇట్లు గోరుటవ్యర్థము. ఏమనియందురా? ఎచ్చటనైనను దాచిన ధనమునకు తానును తనకొడుకులు నాసపడుట యేమిటి? భాగ్యము లేనివానికి ఫలముకలుగునా? కలుగదు. కావున నాశింపకూడదు. కాని చేతనైనంతవఱకు న్యాయముగా సంపాదింపఁ బ్రయత్నింపవలయును.

ఆ. దానములను చేయ ధర చేతులాడక
బహుధనంబుఁ గూర్చి పాతిపెట్టి
తుదను దండుగనిడి మొదలు చెడునరుఁడు, వి....

అత్యంతము కష్టములననుభవించి ధనముల సంపాదించెదరు. అట్లు సంపాదించినధనమునకు దానమో భోగమో యేదో యొక వ్యవస్థను చేయువచ్చునుగదా! అట్లు చేయరు. ఊఱక సంపాదించి సంపాదించి పూడ్చియుంచెదరు. చివఱకు దీనినేమి చేసెదరనఁగా—ఇట్లుచేసి చేసి కట్టకడపట మొదలుచెడి నశించి పోవుదురు కావున బుద్ధిమంతుఁడు ధనము నార్జింపవలయును. ఆర్జించినదానిని వ్యయముకూడ చేయవలయును.

ఆ. దినము మూఁడుమార్లు తిని నిదురించుచు
సొగసుచనులవారి సొంపుతోడఁ
జేరుచుండి ధనముఁ జెడుపకు మెప్పుడు, వి....

జగడములనాడి ధర్మస్థానముల కెక్కి దండుగలఁబెట్టునే కాని ధర్మముసేయ నొల్లఁడు ఇట్టివన్నియు దుర్జనలక్షణములు

ఆ. వాక్కుశుద్ధిలేని వైపగుదండాలు
ప్రేమ కలిగినట్టి పుట్టనేల ?
నొసలఁ బత్తిఁ జూపు నోరు తోడేలయా?,వి....90

దుర్జనులు అందఱివలెనే చూచుటకు వినయమును పైకి కనుపఱచు చుందురు అందులను యుక్తముగా నొకనమస్కారమును పెట్టిన నిట్టివారు అపస్వరములతో వంకవంకదండముల ననేకములను పెట్టి ద్రోహముచేయఁ బూనుకొందురు ఈద్రోహులు ప్రేమ కలిగినట్లు లిట్టిదండములను పెట్టు టెందుల కని యొదరా? ఇదియే దుర్జనలక్షణము నొసలు భక్తినిచూపును. నోరు హింసను జూపును. గావున నిట్టివారిని నమ్మరాదు

ఆ. వాడ కుటికి తిట్టు వలదన్న మొఱవెట్టు
ముందు మగనిఁదిట్టు ముసుఁగుపెట్టు
గడుసుగాలు మగని గంపతో నమ్మురా, వి....91

దుర్మార్గులు ఆఁడువారనక మొగవారనక పిల్లలనక పెద్దలనక యందఱిలోను నుండెదరు. దుర్మార్గురాలగు భార్యయున్న దనుకొనుఁడు ఆమె ప్రతియింటికి తిరిగి వాడవాడవారిని తిట్టివచ్చును. వలదని చెప్పినను వినక యేడ్వసాగును ముందుమగని కూర్చుండఁబెట్టుకొని మూలుగుచు ముసుఁగు పెట్టుకొని పరుండును ఎంతగడుసుది? ఇట్టివారు మగలను గంపలోపెట్టి యమ్మి వేయఁ గలరు కావున దుర్జనుల నమ్మరాదు

ఆ. వింతచదువుఁ జదువ వివరింపఁగా లేఁడు
హీనుఁ డవగుణంబు మాన లేఁడు
బొగ్గు పాలఁ గడుగఁ బోవునా మలినంబు, వి....

దుర్జనుఁడు ఎంతగా కష్టములను పొంది ఎంతెంతవింతలు గల విద్యలనుచదివికొన్నను మంచిచెడ్డలనుపరీక్షించి స్వయముగా కనుగొనఁ జాలఁడు.ఒకవేళ కనుఁగొనెను పో నాయవగుణమును మానుకొనఁజాలఁడు ఎట్లనియందురా ? పరికింపుఁడు బొగ్గును పాలతోఁ గడిగిన మాత్రాన దాని మాలిన్యము పోయి తెల్లఁబడ గలుగునా ? కలుగదుకదా! అట్లే దుష్టుఁడు గూడను

ఆ. వేముఁ బాలుఁబోసి వేయేండ్లు పెంచినఁ
జేదు విడచి తీపిఁ జెంద దెపుడు
నోగుగుణము వీడి యుచితజ్ఞుఁడగు నెట్లు ? వి....

దుర్మార్గుని చేరఁదీసి యాదరించి మేలు లనేకములను వానికి చేసి వృద్ధినొందించి యున్నను దుష్టుఁడు తనకుసహజమగు చెడ్డ గుణమునువదలిపెట్టి యుచితముల నెఱుఁగఁ గలుగునా? లేఁడు. ఎట్లనఁగా చూడుఁడు. వేముచెట్టు ఎంతటి విషవృక్షము? దానికి పాలను బోసి వేయిసంవత్సరములు పెంచినను చేఁదును విడిచి తీపినొందఁగలుగునా ? లేదుగదా! అట్టులే దుర్జనుఁడు గూడను

ఆ వేఱుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును
చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు
కుచ్చితుండు చేరి గుణవంతుఁ జెఱచును, వి.... 94

దుష్టుఁడు సజ్జనులచేరినచో చెఱుపుటకే ప్రయత్నించుచుండును ఇట్లు చేయుట దుష్టులకు ప్రకృతిసిద్ధమగు గుణము. ఎట్లనఁగా. చూడుఁడు వేరుపురుగు మొదలు చేరి తానున్న స్థలమనిరైన నెంచక చెట్టును కూర్చివైచును చీడపురుగు చెట్టుపై కెక్కి యాకులన్నిటిని తిని చెట్టును చెడిపివైచును ఇట్టులే కుచ్ఛితుఁడు గూడ గుణవంతునికూడఁ జెఱచివేయును.

ఆ. శుష్కబుద్ధిచేత శుశ్రూషలొల్లని
నిష్ఠఁబట్టి యేమి నిజ మెఱింగె
కష్టమైనవిద్య ఖలులకు నబ్బునా?, వి.... 95

దుష్టుఁడు విద్యలను చదివికొనినను అందేమియును సారమే లేదని గ్రహించును గురువులకు శుశ్రూషలను చేయనొల్లఁడు ఇట్లుచేసి యాదురాత్ముఁ డేమాత్రము నిజము నెఱిఁగెను? కావున కష్టసాధ్య మగువిద్య దుర్మార్గులకు ఉచితముగా నెన్నటికిని దొరకనేదొరకదు ఒకవేళ చిక్కినను అయ్యది విపరీతఫలమునే ఇచ్చుటకు సిద్ధమై యుండును

ఆ. సజ్జనస్నేహముఁ జాలింపఁగారాదు
ప్రకృతి నెఱుఁగకున్న భక్తిలేదు
పలువ లెట్టిరీతి భక్తి నిల్పుదురయా, వి.... 96

బుద్ధిమంతులైన సజ్జను లెప్పటికిని సత్పురుషులస్నేహములను వదలివేయరాదు ఎంత గొప్పవారైనను గాని ప్రకృతిని చక్కగా నెఱుంగకున్న నుపయోగము లేదు కావున దుర్జనులవలె చెడిపోవుదురు. దుష్టులు భక్తికలిగియుండిరా? మేముగు భక్తిని వహింపము అనియుందురా? అట్లనవలదు. దుర్మార్గులైన వారలు భక్తి నెట్టులు నిల్పఁగలుగుదురు?

ఆ. సారవిద్యలందు సరణి దెలియఁగలేక
దూరమందుఁ జేరు దుర్జనుండు
పరముఁ దెలియ నతఁడు భావజ్ఞుఁ డెట్లగు, వి....

సజ్జనదుర్జనులను చక్కగా విచారించినయెడల చాల భేదము బయలుపడును విద్యలలోని సారములయందు మార్గమును తెలిసికొనలేక దుష్టుఁడు దూరముగా నిలిచి దూషింప మొదలుపెట్టును పరమేశ్వరుని భావింపలేఁడు ఇట్టిమూర్ఖుఁడు భావజ్ఞుఁడై సజ్జనుఁడై యుండునా ? యుండఁడు

ఆ. స్థిరులు గాక క్షుద్రపరకూటములఁ జేరి
యెచ్చుతగ్గుఁ జేసి హీనమతులు
గాడ్దె లగుచు ఖలులు గ్రక్కునఁ జెడుదురు,వి....

దుర్మార్గుల కొక త్రోవ ఒక తెన్ను లేదు వారికి మనస్సులో నెట్లుతోఁచిన నట్లును సేయుదురు ఏకార్యమునందైనను కాని వారు స్థిరబుద్ధి కలవారు కాఁజాలరు నీచులఁ జేరుచుందురు. ఎచ్చుతగ్గులచేసి బుద్ధిలేక చెడిపోయి గాడిదలవలె తిరుగుచుందురు కావున నిట్టి దుష్టులతో నిష్టగోష్ఠి నెప్పుడును జరుపకుము

ఆ. హీననరులతోడ నింతులతోడను
పడుచువాండ్రతోడఁ బ్రభువుతోడఁ
బ్రాజ్ఞజనులతోడఁ బలుకంగరాదయా, వి....99

పెక్కుమాటలేల ? పలుకఁదగనివారలతో నెప్పుడును బలుకకుము అట్లుగాక వారితో నతిగాఁ బలికితివా ? తప్పక చెడిపోయెదవు. అట్టివార లెవ్వరెవ్వరని యందువా ? చెప్పెదను వినుము.

తక్కువకులపుమనుజులతోను, స్త్రీలతోడను, పసుచుపిల్లల తోను, ప్రభువుగారితోను, విద్వాంసులతోను ఇచ్చ వచ్చినట్లు మాటలాడకుము. కావున దుష్టునికి దూరముగా తొలఁగియుండ వలయు.

ఆ. హీనుఁ డెన్నివిద్య లిల నభ్యసించిన
ఘనుఁడు కాఁడు జనుఁడు ఖలుఁడె కాని
పరిమళముల గర్దభము మోయఘనమౌనె?, వి.

ఎంతకష్టపడినను ఖలుఁడు ఖలుఁడే యగును గాని గుణవంతుఁడు కాఁడు. ఇట్టి నీచుఁ డెన్నెన్నియుత్తమము లగు విద్యలను నేర్చికొన్నను గొప్పవాఁడు కాలేదుగాని ఖలుఁడు మాత్రము అగును. ఎట్లనఁగా గాడిద మడ్డిజంతువు అత్యాది పరిమళము గలబట్టలను మోసినమాత్రాన గొప్పది యగునా? కాలేదు గదా అట్లే దుర్జనుఁడుగూడ చదివికొన్నను మోతచేటే కాని లాభ మిసుమంతయు నొందఁడు.

# సజ్జనపద్ధతి.

ఆ. అచట నిచటఁ జూడఁ డమరఁగా గురుభక్తిఁ
బ్రచురముగను నాత్మ బయలు చేయు
రుచిరముగను సుజనుఁ డచలమై కన్పడు, వి....

సుజనుఁడగువాఁడు దుర్జనునివలె చిత్తచలనము కలిగి ఒకదానియందును విశ్వాసహీనుఁడై యటునిటుఁ జూడఁడు. గురువు నేర్పఱచికొని యాతనియందు భక్తిగలిగి హృదయకుహరమున నడంగియున్న యాత్మస్వరూపమును బయలు సేయుచుండును. ఎప్పుడును చూడ నింపు జనింప చేయుచుండును. వేల కొలంది యిడుములు తనను జుట్టికొన్నను కొండవలె ఇసుమంతయును చలింపక ధైర్యయుక్తుఁడై యొప్పుచుండును.

ఆ. అంటి యంటకుండు నమలుని తెఱఁగున
మింటిమంటినడుమ మెఱుఁగుదాని
నొంటి స్తంభమందు జంటించి చూచును, వి....

యుక్తాయుక్తజ్ఞానమును మంచిసెబ్బరలను తెలిసినవాఁడగుటచేత పరమాత్మునిబోలి విషయములయం దంటియు నంటక యుండును భూమ్యాకాశములనిండి నిబిడీకృతమై వర్షాకాలము మెఱుపువలెఁ దళతళ మెఱయుచుండుతత్త్వస్వరూపమును తన శరీరమునం దనుసంధానము చేసి సదాధ్యానము సేయుచుండును. ఇట్టివాఁడే సుజనుఁడు.

ఆ. అండ దప్పిన నరుఁ డతిధార్మికునియిల్లు
చేరవలయుఁ బ్రదుకఁ జేయు నతఁడు
ఆవిభీషణునకు నతి గౌరవం బిడె, వి....

లోకములో నందఱికంటెను మిగుల ధర్మాత్ములు సజ్జనులు ఎవ్వఁడైనను తనకు దైవవశమున నేవేని యాపదలు వచ్చి యండ తప్పి యల్లాడునప్పు డిట్టి ధర్మస్వరూపులదరిఁ జేరవలయును. ఇట్టిసజ్జనులు దుర్జనులఁ బోలి తమయండను చేరిన వారిని కష్టములపాలు కానీయక బ్రదుకచేయుదురు ఎట్లని యందురా! చూడుఁడు మున్ను విభీషణుఁడు రాముని శరణు సొచ్చి అతిగౌరవము నొందెను

ఆ. అడుగడుగునఁ జిత్ర మఖిలవస్తువులను
భోగభాగ్యములను బొలుపు మిగుల
తాను తిరుగుచుండు తనతోడునీడరైె, వి.... 4

పరమాత్మయొక్కయును సజ్జనులయొక్కయును చరిత్రము ఆశ్చర్యమును గల్గించుచుండును అడుగడుగున చిత్రముగా నుండును. సమస్తభోగభాగ్యములు చెలరేగుచున్నను తనకు తాను మాత్రమే తోడై తిరుగుచుండును.

ఆ. అంతరంగ మెఱుఁగ హరుఁ డౌను గురుఁ డౌను
అంతరంగ మెఱుఁగ నార్యుఁ డగును
అంతరంగ మెఱిగినతఁడె పో శివయోగి, వి....5

సత్పురుషుఁడగువాఁడు తనయంతరము నెదుటివాని యంతరము నెఱుంగవలయును. అంతరంగము నెఱిఁగి మెలఁగ వలయును. అంతరంగ మెఱిఁగిన సాక్షాదీశ్వరుఁడు కాఁగలఁడు.

అట్టివాడే సజ్జనుఁడగును ఎవ్వఁడు అంతరంగము నెఱుఁగఁజాలు నో? వాఁడే శివయోగియగును గాని యితరుఁడు కాఁజాలఁడు.

ఆ. అంతరాత్మను గుర్తించి యాశ లుడిగి
చింతలను ద్రొక్కి మదియందు సిద్ధుఁడగును
వింతలను జూచి భ్రమయఁడు వెఱ్ఱివలెను
సందుగొందుల పూర్ణత నందు వేమ. 6

సజ్జనుఁడగువాఁడితరులను బోలి యుండక యంత రాత్మను చక్కఁగా గుర్తింపఁగలుగును. వస్తువులపై (విషయములపై) యాశల నుడిగి చింతల నన్నిటిని పోఁద్రొక్కికొని మనంబులోఁ గలుగువికారములకు లోనగు వెఱ్ఱివానివలె భ్రమయక పూర్ణప్రజ్ఞుఁడై మెలఁగును.

ఆ. అంతరాత్మానుభవ మంది యార్యమతిని
సంతతార్చన మది నిష్ఠ సలుపఁ గోరి
వంతు కెక్కినవాఁడె పో వరుఁడనంగ
వానికెవ్వఁడు సరి గానరాఁడు వేమ. 7

సజ్జనుఁడగువాఁడు అంతరాత్మానుభవము నొంది పూజ్య బుద్ధితో నెల్లప్పుడును పూజలను సలుపుచు మనంబులో నిష్ఠల నాచరించుచు వంతు కెక్కువలదును అట్టివాఁడే శ్రేష్ఠుఁడు. అట్టివానితో నెవ్వరును సరిరారు

ఆ. అతులవైరాగ్యబోధోపరతుల నెఱిఁగి
సతులవలపునఁ జిక్కక సత్య మెఱిఁగి
మతిని జెదరక పట్టుట మాన్యరీతి
ఇద్ది కుదిరినసజ్జనుఁ డిలను వేమ. 8

దుర్మార్గులవలె దంభమునకు గాక నిరుపమానమగు వైరాగ్యబోధలను చక్కఁగా తెలిసికొనును స్త్రీలవలపులలోఁబడి మోసపోఁడు. యథార్థమును కనుఁగొనును. మనస్సును భ్రమింపఁజేయు విషయముల నేమఱఁడు ఈరీతిగా మెలఁగుట బ్రాజ్ఞులకు లక్షణము ఇట్టిరీతి కుదిరిన వాఁడే సజ్జనుఁ డనఁబడును.

ఆ. అధిహితమగునట్టు లాడినమాటకు
సంతసింతు రెల్ల సత్పురుషులు
అధికభాషణంబు లాయాసదంబులు, వి.... 9

ఎదుటివానికి సంతసము కలుగునని లేనిపోని కల్లమాటలకు ముఖస్తుతులకు సత్పురుషులు సంతసింపరు, కాని హితవుగా పథ్యముగా తనకు నెదుటివారికి మంచికొఱకుఁ బలికిన పలుకులకు సత్పురుషు లెల్లరును సంతసింతురు ఇదియె సజ్జన లక్షణము. అధిక ప్రసంగసంభాషణములు మిక్కిలి ఆయాసమును కలిగించును

ఆ. అనల మించుకైనఁ గనలి మండును గాని
చనువుగాని యొఱుక మనికి విడదు
తనువు మఱచువాఁడె తత్త్వజ్ఞుఁ డగుసుమీ, వి

నిప్పు నలుసంతయైనను గణగణమండు నే గాని చనవులేని జ్ఞానము తనతొల్లిటియునికిపట్టును వీఁడదు. శరీరమును మఱచి (అనఁగా: అభిజాత్యాదులగు నభిమానముల బొత్తిగా మఱచెడివాడే) తత్త్వజ్ఞుఁ డగును. వాడే సజ్జనుఁడగును.

ఆ. అనువు గానిచోట నధికుల మనరాదు

కొంచె ముందుఱెల్ల కొదువకాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా?, వి

కొందఱు బుద్ధిహీనులై తమశక్తి ఎదుటిశక్తి తెలిసి కొనక యుక్తాయుక్తముల నెఱుంగక మెలంగెదరు సజ్జనులైన వా రట్టులు చేయరాదు అనువుగానిచోట నధికులమని బిగియఁ గాదు. తమయొద్ద కొంచె మున్నదని కొదవపడఁగూడదు. ఎట్లనఁగా కొండ యద్దములో కొంచెముగా నుండదా? అట్లే యని భావము.

ఆ. అన్యులకును వచ్చు నాపదఁ దనదిగా
నెన్నువాఁడు భువిని నున్నవాఁడు
ఎన్ని దానిలోనియిహపరంబుల లెస్స
గన్నవాఁడు మిగుల ఘనుఁడు వేమ 12

లోకములో జన్మించినవారిలో నెవ్వరికి సజ్జనరీతిలేదో వారు బ్రతికినను చచ్చినవారితో సమానము ఇతరులకు వచ్చెడి యాపదనుగూడ తనదానినిగా తలఁచుకొనెడివాఁ డొక్కఁడే భూలోకమున నున్నవాఁడనఁదగును ఈరీతిగా నిత్యానిత్యవిచారమును చేసి ఇహపరములను సజ్జనుఁ డగువాడు సాధింపవలయును

ఆ. అమలమైనపలుకు లభిషేకవారిధి
తనువు దేవళంబు తాల్మి నొంది
ఆత్మ శివుని జేర్చు నాతఁడే శివయోగి, వి ....

నిష్కపటములగు సంభాషణములు మున్నగునవి యుల వడు సజ్జనులు తీర్థయాత్రలకొఱకు వేఱుగా తిరుగ నక్కఱయే

లేదు దుష్టమనస్కులకు వలెనున్నట్టులు వారి శిరములకు నభిషే కాదులు పనిలేదు నిర్మలమైన సంభాషణవాక్యములే వీరికి అమృతాభిషేకములు. శరీరమే దేవాలయములు అగును ఇట్లు శాంతచిత్తుఁడై ఆత్మను శివసాన్నిధ్యమును చేర్చువాఁడే శివయోగి యనఁబడును.

ఆ. అలలు లేనిజలధివలె నుండి మదిలోన
తెలివిగూడి తన్ను తెలియునతఁడె
తలఁప సజ్జనుఁ డన ధరఁ జెప్పఁబడునయా, వి....

రూపము సజ్జనదుర్జనులకు సమానముగానే యుండినను ప్రవర్తనములో మిగులభేదము గలుగుచుండును సజ్జనుఁడగు వాఁడు ఇతరుని బోలి దంభకృత్యములను చేయక తరంగములు లేనిసముద్రమువలె నిశ్చలుఁడై తెలివిగలిగి యాత్మసాక్షాత్కార మును సేయుచుండును. విచారించితి మేని ఇట్టివాఁడే సజ్జనుఁడు అనఁబడును

ఆ. అల్పుఁ డెన్నిపలుకు లలయక పల్కిన
నధికుఁ డూరకుండు నదిరిపడక
కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా?, వి

సత్పురుషులకు నసత్పురుషులకు ప్రవర్తనములో మిక్కిలి భేదముగలదు నీచుఁడగువాఁడు తన్ను ఎన్నిమాటలను నిష్ఠుర ములుగా పలుకుచున్నను సజ్జనుఁడు అధికుఁడు గావున ఉలికి పడక మాఱుమాటాడక అన్నిటిని శాంతభావముతో విని సహిం చును ఇయ్యది యుక్తమే. ఎట్లనఁగా · కంచు మ్రోగునట్టులు కనకము మ్రోగదు గదా. ఇట్లే సజ్జనులు గూడను.

ఆ. అసువినాశ మైన యానందసుఖకేళి
సత్యనిష్ఠపరుని సంతరించు
సత్యనిష్ఠఁ జూడ సజ్జనభావంబు, వి .... 16

అసజ్జనుఁడు అసత్యములు పల్కినను శరీరపోషణము గావించి సుఖింపఁబూనుకొనును సజ్జనుఁడైనవో ప్రాణములు నశించినను పిమ్మట పరమాత్మధర్మమువలన గలిగెడి సుఖక్రీడ నాశించి యసత్యములు పలుకఁడు అసత్యనిష్ఠయే యతనిని తరింపఁజేయును కావున 'సత్యము నే చెప్పవలయును' అను నిశ్చలమైన ప్రతిజ్ఞయే యుండుట సజ్జనులకు గుర్తు అగును.

ఆ. ఆత్మనున్నవాని ననుదినంబును జూచి
యతనిమహిమవలన నతనిఁ దెలియు
నతఁడు సజ్జనుండు నవనీతలంబున, విశ్వ....17

సజ్జనుఁడని పేరుపెట్టుకొన్నంతమాత్రాన సజ్జను డెన్నటికిని కాఁజాలఁడు బాహ్యములగు వేషములను వేసి డంభము చేయక తనయాత్మలోనిదైవరూపమును ప్రతిదినమును ధ్యానించుచు ఆధ్యానమువలన శరీరాదులు లేని యమరుఁడగునీశ్వరుని ఎవఁడు కనుగొనఁజాలునో వాఁడే సజ్జనుఁడు

ఆ. ఆత్మశుద్ధి గలిగి యధికులమనఁబోరు
ధీరవృత్తి గలిగి తిరుగఁబోరు
రూపు కుదురనుంచి రూఢి గావింతురు, వి....18

మఱియును సజ్జనదుర్జనుల కెంతో భేదము గలదు. సజ్జనులగువారు ఇతరులఁ బోలియుందురు. వీరు ఆత్మశుద్ధిగలవారలై యందఱికన్నఁ దామె యధికులమని చెప్పికొనరు. అపదల

యందు దిగులునొందినవారివలె తిరుగక ధైర్య మవలంబించి యుందురు మఱియును పరమేశ్వరుని విగ్రహాము ను మనములో నిల్పికొని తన్మయు లయ్యెదరు

ఆ. ఆదిశక్తి గూడి యనుభవ మొందును
వేదవిద్య మఱగి విడువఁబోఁడు
సాధువృత్తి నిలను స్థైర్యము నొందును, వి....19

దుర్జనులగువారు ఎవ్వనియందును విశ్వసింపక స్వయముగా తమ కనుభవము లేక యుందురు ఇఁక సజ్జనుఁడగువాఁడన్నను పరాశక్తి సాక్షాత్కారము నొందును ఉపనిషత్స్వరూపమును గుర్తించి మఱవఁడు ఎల్లప్పుడును సాధువృత్తితో చిత్తస్థైర్యము నొందియుండును

ఆ. ఆర్యులైనవార లనుభవ మూడిని
తెలియఁ జెప్పుచుంద్రు తేటపడఁగ
గుఱుతుఁ గననివాఁడు గుఱి యొప్పఁ జెప్పునా?,వి

సజ్జనదుర్జనులను సులభముగా గ్రహింపవచ్చును ఎట్లనఁగా: సజ్జనులు చక్కగా బ్రహ్మపదార్థమును పరికించి అనుభవించి ఆ యనుభవమువలన చక్కగా తెలియునట్లితరులకు చెప్పెదరు. ఇక దుర్జనులో ఆజ్ఞలు గుఱుతు తెలియనివారు నూటిగా నెట్లు చెప్పనేర్తురు? కావున ప్రాజ్ఞత సజ్జన లక్షణము.

ఆ. ఆడితప్పువార లభిమానహీనులు
గో డెరుఁగనివారు కొద్దివారు
కూడి కీడుసేయఁ గ్రూరుండు దలపోయు, వి....

కంటికి కనిపించినవారిని తీయగా మాటలాడువారిని మొద లగునందఱిని సజ్జనులని తలంపఁ బోకుము కొందఱు అభిమాన మును బొత్తిగా వదలివైచి స్వార్థపరులై మిక్కిలి బొంకుచుం దురు మఱియు నత్యల్పులును యుక్తాయుక్తము నెఱుంగనివా రునై యుందురు అట్టివారలు క్రూరులని నిశ్చయింపుము. క్రూరుఁ డెప్పుడును కీడుసేయనే కోరుచుండును గాని సజ్జనుని బోలి మేలు సేయఁ గోరఁడు.

ఆ. ఇల్లు కల్లఁ జేయ రిహపరములఁ జూచి
దీనవృత్తిచేతఁ దిరుగుచుంద్రు
భక్తికలిగియుండి ప్రాజ్ఞులౌ సజ్జనుల్, వి.... 22

సజ్జనుల నేర్పరించుట కనేకములగు మార్గములు గలవు. సజ్జనులగువారలు ఇహపరముల నాలోచింపక తాము చేరినయిం టిని నాశనముచేయుచు దుర్జనులఁ బోలియుందురు మఱియు నిట్టి సజ్జనులు అహంకారమును విసర్జించి సాధుభావము కలవార లై సంచరింయుచు దైవభక్తి గలిగి ప్రాజ్ఞులై వెలయుచుందురు.

క. ఉక్కు కత్తిని చేఁ బూని యున్నవాఁడు
కుక్కనక్కలు బెదరింపఁ గొంకువడఁడు
దృక్కుదృశ్యంబులను మించ తెలియుచుండు
చక్కగా నొప్పుమనమున జరుగు వేమ 23

సత్పురుషుఁడు ఇతరులఁబోలి యైహికసుఖములనుమాత్రమే నమ్మియుండక ఆత్మానాత్మవిచారణము చేసి బ్రహ్మపదార్థమును గమనించి మించియుండునే కాని సంసారికదుఃఖములవలన భయము నొందఁడు. ఎట్లని యందురా ? వాడి యగు నుక్కు

కత్తిని చేతఁ బూని యుండువాఁడు కుక్కనక్కల బెదరింపులకు అదరునా?

ఆ. ఉప్పుఁ గప్పురంబు నొక్కరూపున నుండుఁ
దవిలి చూడ దానిచవులు వేఱె
పురుషరూపములను బుణ్యాత్ము లిట్టులె, వి....24

సజ్జనుఁడును దుర్జనుఁడును వేషభాషల నొక్కరూపుగా గానిపించినను లోతు పరికించినచో వేఱు వేఱు గాఁ గన్పట్టును. ఎట్లనఁగా ఉప్పును కప్పురమును చూచుటకు తెల్లగా నున్నను రుచిచూచుకొలఁది భేదము కనుపట్టునట్టులే

ఆ. ఋషులు గానిపింత్రు హీనులయట్టుల
వారిబోధ పెద్దమేరువంత
లోన నున్నయట్టిజ్ఞానంబుమహిమరా, వి.... 25

ఋషులు ఆకారముచేత చూచుటకు నీచజాతివారిని పోలియున్నట్లు కనుపడుచుందురు, కాని వా రుపదేశించుబోధ పెద్దమేరువుఁ బోలియుండును ఇట్లు వీరుండుటకుఁ గారణము వా రార్జించి పదిలము చేసికొనినలోని జ్ఞానపుమహిమయే కాని వేఱు గాదు ఇట్టులే సజ్జనుల మార్గముకూడ నుండును.

ఆ. ఎండచీఁకటులకు నిమ్మయినుండెడు
నిండుకుండలోన నిద్ర మఱచి
దండిగాను పరమతత్వంబుఁ దెలియును, వి....26

సత్పురుషుఁ డితరునియట్టులు సంపదాపదలకు సంతోష దుఃఖముల నొందఁడు. వానికి సుఖదుఃఖములు సమానములు. ఎండకును చీఁకటికిని సరిగా ఒకేరీతిగా నిమ్మయి యుండును.

మఱియును అవిరతముగా ధ్యానము నొనర్చుచు వలయునట్టులు పరతత్త్వంబు నుపాసనము చేసి తత్త్వము గాంచెదరు.

ఆ. ఎండనీడచంద మెఱుఁగనేర్చినయోగి
యుండునెల్లకాల ముర్విమీఁద
తిండిపోతువశమె? తెలియఁగ జ్ఞానంబు, వి....27

ఇంత యేందులకు? సజ్జనుఁ డగువాడు సంతోషమునకుఁగాని దుఃఖమునకుఁగాని వశుఁడు కారాదు ఏల యనియందురా? వినుఁడు. ఎండనీడలస్వభావమును సహజముగా నెఱింగనేని ఎల్లకాలము స్థిరుఁడై నిలువంగలఁడు ఇట్లు చేయుట సజ్జనునకే స్వాధీనమగును ఏల యనియందురా? తిండిపోతుకు జ్ఞానస్వరూపమును తెలిసికొనఁగారాదు

ఆ. ఏకమైనవర్ణ మెఱిఁగినయోగికి
పరము నెఱిఁగి చూడ భావ మొందు
నాకృతులను జేరి యున్నిటఁ దానౌను, వి....28

పరమాత్మ అన్నివస్తువులయందును ఒకేరూపుగా ప్రవర్తించుచున్నదని తెలిసినయోగి పరము నెఱుగఁగలఁడు. దుఃఖాభావమునందు చొనుపఁగఁబఁడు. పిమ్మట సదాధ్యానము చేయుటచేత తానే ఆబ్రహ్మపు ఆకృతిని దాల్చి సర్వగుఁడగును ఇట్లగుట సజ్జనులకు స్వభావము

ఆ. ఒకటిక్రింద నొక్కటొగి గుణకముఁ బెట్టి
సరగున గుణియింప వరుసఁ బెరుగు
నట్టిరీతి గుణులు నరయ సజ్జను లిల, వి.... 29

సజ్జనదుర్జనులలో గలభేదమును చూడుఁడు. సజ్జనునకును దుర్జనునకును గుణములు సమానముగా నీయఁబడినను, సజ్జనుఁడ

గువాఁడు ప్రతిదినమునను అంకెల నెచ్చవేసి పెంచునట్లు తనస ద్గుణముల నభివృద్ధి సేయఁబూనుకొనునే కాని దుష్టునిఁ బోలి తగ్గించుకొనఁ బ్రయత్నింపఁడు ఇట్టివారలే విచారించిన సజ్జను లనఁబడుదురు.

ఆ. ఒక్కమనసుతోడ నున్నది సకలము
తిక్కఁబట్టి నరులు తిరుగుచుంద్రు
ఇక్క నెఱిఁగి నడవ నొక్కఁడే చాలఁడా, వి....30

ఇన్నిచెప్పుట యెందులకు? ప్రపంచమంతయు నొక్కస త్స్వభావముతోడనే జరుగుచున్నది కాని దీనిఁ దెలియఁజాలక మనుష్యులు పిచ్చవారివలె పలుపోకలఁ బోవుచుందురు ఇట్టి వారగు నెందఱు నిరర్థకులకంటె తా నెఱింగి మెలఁగు నొక్కఁడు చాలును.

ఆ ఓగుబుద్ధి విడిచి యోగి గావలెఁ జుమీ
భోగ మమరు యుక్తిఁ బూనరాదు
సద్గుణంబు మొదలఁ జవి గాని చూడరా, వి....

మానుజుఁడై పుట్టినందులకు ఫలమేమి యనఁగా —చెడ్డసంక ల్పములను బోనాడి సజ్జనుఁడు కావలయునే కాని లోకుల మోసము చేయుటకు రితనమును బూనక యుండుటయే కావున నోయీ! మొట్టమొదటనే సద్గుణమును చక్కగా నలవర్చికొనుము.

క. ఓర్పులేనట్టివారల కోరులయుశము
విన్నకొలఁదిని పెంపొందు వెఱ్ఱితెవులు
దానిపరిహారమునకు నై మానవుండు
తమఘనంబును చాటింత్రు ధరణి వేమ. 32

సజ్జనులగు వారివలెఁ గాక దుర్జను లిట్లు లోకమున కపకారము చేయుటకు కారణము లేకపోలేదు వీరికి ఓర్పు చాలతక్కువ, ఇట్లుండుటవలన నితరుల కీర్తిని విని సహింపఁజాలక వెఱ్ఱియెత్తుదురు ఇట్లు పట్టినపిచ్చను మాన్పుటకై దుర్మార్గుఁడు తన ఘనమును చాటుకొనుచు లోకుల కపకృతిని సలుపుచుండును

ఆ ఓర్పులేనిభార్య యున్నఫలం బేమి
బుద్ధిలేనిబిడ్డ పుట్టి యేమి
సద్గుణంబు లేనిచదువది యేలరా, విశ్వ....33

ఇతరులకలిమిఁ జూచి యోర్చియుండుట సజ్జనులకున్నలక్షణములలో నొక్కటియగుఘనపదార్థము. ఈయోర్పుండిననే జన్మసాఫల్యము గలదు, లేకున్న లేదు ఎట్లనఁగా లోకమున నెంత గుణవతియైనను నోర్పు లేకున్న నాభార్యచే నేమి ప్రయోజనము కలదు ఇట్లే పుత్త్రుఁడు పుట్టినబుద్ధిమంతుఁడైననే ఫలము, లేకున్న లేదు. ఇట్టులే చదు వెంతయున్నను సద్గుణంబు లేకున్న నిష్ఫలము

ఆ. కంటిదృష్టిచేతఁ గను విశ్వ మెల్లను
దర్పణంబుగల్గఁ దన్ను గనుచు
నాత్మతత్త్వమార్గ మరయును సుజనుండు, వి 34

సత్పురుషుఁడు తనదృష్టిచేత ప్రపంచము నంతయును సామాన్యజనుఁడు చూచునట్టులే అద్దములో తననీడను చూచికొన్నట్టులే తత్త్వమార్గమును తనయందే చూచికొనఁగలఁడు

ఆ. కంటిలోన మిన్ను కలయిక నగుముక్కి
నంటి తిరుగువాఁడె యమలుఁ డగును
వంటకంబుకొఱకు వాగ్దాటిఁ జూపఁడు, వి....35

లేనిపోనిదంభములు దుర్జనులఁ బోలిచేసినవాఁడు ఎప్పటికిని ముక్తుఁడు కాఁజాలఁడు కంటిలో నెల్లప్పుడును మెలగు పరమాత్మరూపమును గుర్తించి విడువక ధ్యానించువాఁడె ముక్తుఁడగును. ఇట్లగుటయే సజ్జనలక్షణము సజ్జనుఁడగువాఁ డిట్లుకాక యుండఁడు ఎట్లనియందురా? సత్పురుషుఁడు భోజనముకొఱకై దంభము చేయఁడు.

ఆ. కంటిలోనివాని కఱకంగు నెఱుఁగుము
కంటిలోనివాని మింటఁ జూడు
కన్నుమిన్నుహృదయకమలమం దెఱుఁగుము, వి

బుద్ధిమంతుఁడా! సజ్జనుఁడవై త్రుళ్లిపడక ముక్తుఁడవగుటకు యత్నింపుము కంటిలో నున్న పరమాత్మరూపమును ధ్యానింపుము. సదా భ్రూమధ్యమున నిల్పి హృదయకమలమున నాతని గుర్తించి ముక్తుండవు కమ్ము

ఆ కడఁగి గాలిలేని గగనంబుభంగిని
బలుతఱగలు లేనిజలధిమాడ్కి
నిర్వికారమునను నిశ్చలుఁడై యుండు, వి....37

సజ్జనరూపమును బ్రహ్మరూపము నొక్కరీతిగా నుండును. ఎట్లనియందురా? గాలి మేఘములు లేక ఆకాశము నిర్మలముగా నున్నయట్లు అలలు లేనిసముద్రమును బోలి నిర్వికారులై నిశ్చలులై మెలఁగుచుందురు. ఇట్టివారు సజ్జనులు

ఆ. కడుపుచిచ్చుచేత కామానలముచేత
క్రోధవహ్నిచేతఁ గుటిలపడక
యుక్తమనసుతోడ నుండును సుజనుఁడు, వి 38

సజ్జనుఁడగువాఁ డితరునిబోలి తుచ్ఛసుఖములకై నిర్మలములగు పరలోకపదవులను పోఁగొట్టుకొనఁడు ఆఁకలిచేతను, కామముచేతను, కోపముచేతను కుటిలుఁడై యెప్పుడు నుండక తగినట్లు మంచిమనస్సుతో నిర్మలుండై మెలఁగును.

ఆ. కడుపుకేల మీరు కళవళపడెదరు
కడుపుచల్లపడఁగఁ గలదు భుక్తి
కడకు రాతిలోని కప్పకు లేదొకో, విశ్వ....39

బుద్ధిమంతులారా! పాడుపొట్టకై మీరందఱు దుర్మార్గపు పనుల చేయఁబూనుకొనకుఁడు అయ్యో! తెలివితక్కువవారలారా! కడుపుకై యేల యిట్లు కళవళము నొందవలెను? ఏమియును అధైర్యము నొందకుఁడు కడుపు చల్లఁబడుటకు దేవుఁడే యాహారమును కూర్చి యున్నాఁడు ఇంతయేల? చివరకు రాతిలోనుండు కప్పకుఁ గూడ నాహార మిడలేదా?

ఆ. కనులు పోవువాఁడు కాళ్లుపోయినవాఁడు
ఉభయు లరయఁ గూడి యుండినట్లు
పేదపేదఁ గూడి పెనఁగొని యుండును, వి....40

సజ్జనగుణములలో నైకమత్యము కూడ నొకటియై యున్నది దుర్మార్గులగువారలు మాత్రమే ఐకమత్యహీనులై యుందురు ఇఁక సత్పురుషులో అట్లుకాదు —ఏలయందురా? చూడుఁడు. కన్నులులేనివాఁడు కాళ్లులేనివాఁడు పరస్పరసాయమున తరించినట్టులే సజ్జను లైకమత్యముతో పరస్పరసహాయులై తరించెదరు.

ఆ. కప్పువీడి మనసు కాంక్షింప దెద్దియు
జ్ఞానతపము నూని కదలకుండు
మెచ్చునాత్మక్రమము మిన్నంటి యుండును,వి

మనస్సు "రాతుమెత్తనయిన గుఱ్ఱము మూఁడుకాళ్ల నడుచు" నన్నట్లు వారివారియోగ్యత ననుసరించి ప్రవర్తించుచుండును చూడుఁడు. సత్పురుషునిమనస్సు మాంద్యమును వదలి విషయముల నాసింపక జ్ఞానతపముఁ జేయుచు కదలక యుండును అద్దానిచేత నాత్మవిద్యాభ్యాసము కలుగును. గాన సజ్జనుఁ డందఱకంటెఁ గొప్పవాఁడై యుండును

ఆ. కామమోహములను గలిగియుండు నరుండు
ఇష్టదేవగురుల నెఱుఁగలేఁడు
ఇష్టు నెఱుఁగునతఁడె ఇలసజ్జనుం డగు, వి....42

దుర్జనుఁ డగువాఁడు సజ్జనునిబోలి మెలఁగఁ జాలఁడు. కామమును మోహమును కలిగియుండును ఈ యజ్ఞానముచేత హితులను గురువులను దేవులను గుర్తింపఁజాలఁడు అందువలన నధఃపాతి యగును. కావున నెవ్వఁడు హితు నహితు నెఱింగి మెలఁగఁగలఁడో వాఁడే సజ్జనుఁడు.

క. కాలము తెలియక చాలఁగ
కాలము గల దంచునున్నకాలమునందున్
కూళఁడు తనుఁ దాఁ దెలియఁడు
కూలెడు తొలిజామునందు గొబ్బున వేమా! 43

బుద్ధిహీనుఁడు తాను బ్రదికియున్నకాలమున సత్కార్యములను చేయక చాలకాలము ముందున్నది లెమ్మని తలం

చుచు కాలమునంతయు దుశ్చింతలతోడ వెళ్లఁబుచ్చి తన్ను తాను తెలిసికొనఁజాలక చివర నందఱికంటె ముందుగా నరకమునఁ గూలును

ఆ. కాలునికిని జిక్కి కక్కసపడనేల
మేలుగాను గురునిమెప్పు వడసి
ప్రాలుమాలకుండ పరమార్థ మందుము, వి....44

నరులారా! బ్రతికియున్నంత కాలమును దుష్టపనుల చేసి పాపముల నొడిఁగట్టి చివర బుద్ధిపూర్వకముగా యమునివాతఁబడి ఏల కష్టము నొందెదరు? బ్రదికినంతలో నందఱికి హితవులగు పనులఁజేసి గురువుల యనుగ్రహమును సంపాదించికొని ప్రాలు మాలక పరమార్థము నొందుటకై యత్నించుఁడు

ఆ. కూళకూళ మెచ్చు గుణవంతు చెడనాడు
నట్టిహీను మెచ్చ రెట్టివారు
మ్రానిదూలమునకు జ్ఞానంబు దెలియునా,వి....

దుర్జనుఁడు దుర్జనునే మెచ్చుకొనును కాని గుణవంతుఁడగు సజ్జనుని మెచ్చుకొనఁడు ఇట్టి నీచుని ప్రపంచములో నెవ్వరును మెచ్చుకొనరు ఏల యని యందురా? మొద్దుదూలమునకు జ్ఞానము లేనట్లే యాదుర్జనునికి మంచిలేదు కాన మెచ్చికొనరు కావున సజ్జనుఁడవై యుండుము

ఆ. కూళతోత్తుపొందు కుజనునకే కాక
సజ్జనునకుఁ గాదు సమ్మతంబు
పేడఁ దిన్నపురుగు బెల్లమే మెఱుఁగును,వి....46

దుర్మార్గునితో స్నేహము చేయఁదగి యుండుట దుర్మార్గునకే తగియుండును గాని సజ్జనునకు ఇష్టము కాదు. ఏల యని యందురా? ఒకవేళ దుర్జనుఁడు సజ్జనునితో చెలిమి చేసినను వాని మంచిగుణములను గుర్తింప లేఁడు. ఎట్లనియందురా? పేఁడ తిను పురుగునకు బెల్లపురుచి తెలియునా? తెలియదు గదా! అట్లులే

ఆ. కూర యుడుకు వెనుకఁ గూడునా కసవేర
నెలుకగల్గి మును పె యేరవలయు
స్థలము తప్పు వెనుక ధర్మంబు పుట్టునా, వి....47

ఎప్పుడో సత్పురుషుఁడ నయ్యెదనని బ్రదికియున్న కాలము వ్యర్థపుచ్చరాదు ఏలందురా? సమయము తప్పినవెనుక సద్గుణములు పట్టుపడవు ఎట్లనఁగా — కూర యుడికినతరువాత గడ్డి నేలుటకు వీలుపడునా? పడదు కావున గడ్డి తీయవలయు ననినచో ముందుగానే యేరవలయును అట్లులే సద్గుణములు సత్కార్యములు కూడనని భావము

ఆ. కోటిదాన మిచ్చి కోపంబు నొందుచోఁ
బాటిసేయ రతనిఁ బ్రజలు మెచ్చి
సాత్త్వికగుణముల సజ్జనుం డగు నయా, వి....

నీవు సజ్జనుఁడవు కాఁదలంచితివేని కోపమును నశింపఁజేయుము. కోపమంతటి చెడ్డవస్తువు వేఱొక్కటిలోకములోలేదు. కోటిరూపాయలను దానమిచ్చినను కోపము నొందెనేని అట్టివాని నెవ్వరును పాటింపరు. ఏలయనఁగా. — సత్పురుషుఁడు అగుట సాత్త్వికగుణములు సంభవించును గాని ఇతరవిధముల కాదు.

ఆ కొంపలోన నున్నకోర్కుల ఛేదించి
పరఁగ హృదయ మట్టె పదిలపఱచి
గృహము నిల్పువాఁడు గుజనుఁ డెట్లగునయా,వి

కొందఱు అజ్ఞులు యోగులను ధ్యాననిష్ఠులనుచూచి దుర్జను లని నిందింపఁజూతురు. ఎవ్వరు దుర్జనులో పరికింపుఁడు మనస్సులోని కామములవలన నందఱును భ్రష్టులగుదురు కదా! అట్టిచో మనసులోని కోర్కుల నణంచి హృదయమును పదిలపఱచి పరమాత్మను ధ్యానించువాఁడు దుర్మార్గుఁ డెట్టు లగును? చెప్పుఁడు

ఆ. కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను గుణము కొఱఁతవడును
కోపమునను బ్రదుకు కొంచెమై పోవును,వి....50

సజ్జనుఁడు ముఖ్యముగా కోపమును వదలిపెట్టవలయును. ఏలయనఁగా —నింతటి చెడ్డవస్తువు వేఱొదియు నిలలో లేదు. ఇది ఎట్లు చెడ్డదని యందురా ? చూడుఁడు:— కోపముచేత గౌరవము తగ్గిపోవును. గుణములు నశించును. చివఱకు బ్రదుకు తెరువుగూడ నశించిపోవును కావున సజ్జనుఁడా కోపమును వదలిపెట్టుము.

ఆ. ఖలులు తిట్టిరంచు కలవరపడనేల
వారితిట్ల నేమి వాసి చెడును
సజ్జనుండు తిట్ట శాపం బదానయా, వి....51

లోకములో కొందఱు పిఱికివారలు దుర్జనులతిట్లకు భయపడి సత్పురుషులనాదరింపక యుందురు. అయ్యది తెలివితక్కువ.

వందమతులగు జనులారా! దుర్జనులు తిట్టిరని కలవరము నొందవలసినపని లేదు. ఏలయనఁగా, నీదుర్మార్గుల తిట్లవలన వస్త్రమైనను చెడదు వానియందు తెలియఁగదు. వీరు కేవలము వ్యర్థులు ఇఁక సత్పురుషులన్ననో అట్లు గాదు. వీరు తిట్టిన శపించినట్లు తగిలివచ్చును. కావున సజ్జనుల సత్కారింపుము.

ఆ. గంగగోవుపాలు గంటెఁడైనను చాలు
కడవెఁడైన నేమి ఖరముపాలు
భక్తి గలుగుకూడు పట్టెఁడైనను చాలు, వి....

లోకములో నూర్గురు దుర్మార్గులకంటెను విచారించిన నొక సజ్జనుఁడు మేలు ఎట్లనఁగా పవిత్రములైన గంగగోవుపాలు ఒకగంటెఁడు చిక్కినను ఉత్తమములై పావనము నొందించును గాడిదపాలు పంటెఁడు అయినను తృప్తిచేయ గలుగునా? లేదుగదా! భక్తితో పెట్టిన అన్నము పట్టెఁడైనను తృప్తి నొందించును. అట్లులే సజ్జనుఁడుకూడ నని భావము.

ఆ. క్రొవ్వుపట్టుపోరలుఁ గ్రూరకర్ములు పోరల్
నొవ్వఁ జేసినట్టిరవ్వపోరలు
ఎవరివైన నేమి యమజువాకిట నిల్చు, వి....53

దుర్జనులు కొందఱు హింసకైనను భయపడక పాపమునకొడిగట్టి, క్రొవ్వినవని నోరెఱుఁగని మృగాదులకు కండలు పట్టినవి అని చంపి తెచ్చి పొట్టనిండ మెక్కి కన్నుగానక తిరుగుచుందురు, కాని ఈదుష్టుల పోరలు గూడను ఎప్పుడో నొకప్పుడు యమధర్మరాజు వాకిటనుండవలసినవియే గదా! కావున హింసకు రోసి సజ్జనుఁడ వగుము

ఆ. గట్టిసాధువిద్య కాసంతె యనుకొని
గాఢవిద్య నేర్చి కనుము ఘనత
సాధుసజ్జనముల సాంగత్య మెఱుఁగుము, వి....

స్వచ్ఛముగు విద్య కొలఁదిగా లభించినను అదియే గొప్ప దని తలంచుకొనుము ఘనత నొందుటకు యత్నింపుము. బుద్ధి మంతుఁడై సాధువులయొక్కయు సజ్జనులయొక్కయు సాంగత్యమును సంపాదించికొని తెలివితో తత్ఫలము నొంద యత్నింపుము.

ఆ. గుణగణంబు లెల్లఁ గుచ్ఛితమును బొంద
తగిలి భ్రమలఁ జిక్కి దండధరునిఁ
దోడి తెచ్చుఁగదర తొలఁగింపకున్నను, వి....55

ఎంతటిబుద్ధిశాలికైనను దౌష్ట్యము, పరులమోసపుచ్చుట తగనిపనులు ఇవి కుత్సితపుపనులు ఇట్లుండిన గుణములన్ని కుత్సితమును బొందినయెడల మేలునొందలేకుండుట యట్లుండఁగా చివఱకు ఇవియే యమధర్మరాజును పిల్చుకొనివచ్చుటకు కారణము లగును, అనగా పాపులను చేయును. కావున కుత్సితముల విడిచి సుజనుఁడ వగుము.

ఆ. గుణములు గలవాని కులమెంచఁగానేల?
గుణము కలిగెనేని కోటి సేయు,
గుణము లేకయున్న గ్రుడ్డిగవ్వయు లేదు, వి....

గుణము ప్రధానము గాని కులము ప్రధానము గాదు గుణవంతుఁడు ఏకులపువాఁడైనను పూజింపఁదగినవాఁడే! అట్టివాని

కులమును ఎంచరాదు. గుణ మొక్కటి కలిగిన నెంతనీచకుల జుఁడైనను కోటివరహాలను జేయును గుణము లేకయున్నను, గుడ్డిగవ్వను కూడ కొలఁదిగాఁడు కావున గుణవంతుఁడ వగుటకు యత్నింపుము.

ఆ. గుణము కల్గియున్నఁ గులసతినెవ్వారు
నిందఁ జేయలేరు నీతిఁ జూచి
గుణము లేకయున్నఁగులహీనురాలయా వి, ....

భార్య సద్గుణవతియై యున్నచో నెటువంటి నిష్ఠాపరు లైనను నిందింపఁజాలరు. ఏల యనఁగా ఆయమ నీతియే యందులకుఁ గారణము అట్టిభార్యయే గుణము లేకయుండి నచో ఎంతటిగొప్పవంశములో పుట్టినను కులము తక్కువ గలది యనియే చెప్పఁబడును కావున గుణముల నార్జింప యత్నింప వలయును.

ఆ. గుణయుతునకు మేలు గోరంతఁజేసినఁ
గొండయగును వానిగుణముచేత,
కొండయంత మేలు గుణహీనుఁ డెఱుఁగునా?,వి,

గుణవంతుఁడగువాఁడె సజ్జనుఁడు, సజ్జనదుర్జనులతారతమ్య మును కనిపెట్టుము. గుణవంతున కుపకారము గోరంతగా (అనఁగా కొలఁదిగా) చేసినప్పటికిని అయ్యది వానిగుణముచేత కొండంతయగును. దుర్జనునిపట్ల ఇట్లు కాఁజాలదు. ఏల యనఁ గా: వానికి కొండంత మేలుచేసినను గుణహీనుఁడు గనుక గుర్తింపఁ జాలఁడు. కావున సుజనులకు మేలు సేయఁ బూనుము.

ఆ. గుణముతీరు లేక కులమెల్లఁ జెడిపోయె
స్త్రీలనడతవలన సిగ్గుపోయె,
చవిటినేలవలన జలమెల్ల చెడిపోయె, వి....59

లోకములో నొక్కొక్క చెడుపదార్థమువలన ననేకవస్తుజాలములకు నాశనము కలుగుచున్నది ఎట్లనఁగాఁ చూడుఁడు. గుణమొకటి తప్పియున్నఁ గులమంతయును చెడిపోవుచున్నది. స్త్రీలు గుణవతులు గాకున్న సిగ్గు పోవుచున్నది. చవిటినేలలో వర్షించినందువలన జల మంతయును నిష్ప్రయోజనమైన దగుచున్నది.

ఆ గురువు వచ్చుచున్నఁ గూర్చుండి లేవని
తుంటరులకు నెల్లు దొరకు ముక్తి
మగని లెక్క గొననిమగువకు గతియున్నె? వి....

పిన్నపెద్ద తారతమ్యము సజ్జనలక్షణములలో నొక్కటి. అందులో గురువు అందఱికంటెను గొప్పవాఁడు. అట్టివాఁడు వచ్చినప్పటికిని కూర్చుండి లేవక గర్వించియున్న ఖలులకు ముక్తి వచ్చునా? రాదు ఎట్లనఁగా తన ప్రాణనాథుఁడైన భర్త యరుగుదెంచినప్పుడు లేచి వినయముఁ జూపనిసతికి గతి యున్నదా! లేదు కదా అట్లే దుర్జనులకుఁగూడ.

ఆ. గువ్వకొఱకు మేనుఁ గోసి యాశిబిరాజు
వార్త విడువరాక కీర్తికెక్కె,
నోగు నెంచఁ బోవ రుపకారి నెంతును, వి....61

సజ్జనుఁ డగువాఁడు సర్వకాలములయందును సర్వావస్థలయందును పరోపకారము చేయుచుండును. అందువలన నాతనికి

యశము గలుగును. ఎట్లనఁగా: పూర్వము గువ్వ కుపకారము చేయుటకై తన శరీరమునుండి మాంసమును గోసియిచ్చి రక్షించెను ఆశిబి పోయెనుకాని ఆయనచరిత్ర మిప్పటికి నున్నది కావున అపకారిని ఎవ్వరును అనుకొనరు ఉపకారియగు సుజనుని అందఱు కొనియాడుదురు.

ఆ. చిత్తశుద్ధి యొకటి శ్రేష్ఠలాంఛన మగు
నిఖలపుణ్యకార్యనిర్వహణము,
నద్ది లేక చేయ ననువుగా దేరికి, విశ్వ .... 62

మనస్సు పరిశుద్ధముగా నుండుట సజ్జనునకు శుభమును గొప్పదియునగు గుర్తు ఇయ్యది సమస్తపుణ్యకార్యములను నిర్వహింపచేయును ఈచిత్తశుద్ధి కలుగదేని ఎంతటి గొప్పమేధావియు నైశ్వర్యశాలియు నైనను ఏపనినినైనను సరే చేయుటకు అనువుపడదు

ఆ. చిన్నెలంతె కాని సృష్టి లౌకిక మగు
నందువల్ల నేమి యాశ కద్దు,
ఒక్కడైనవాఁడె యుత్తమపురుషుండు, వి....63

దుర్జనులు కొందఱు తమను దాము ఆత్మవిజ్ఞానఘనులని ప్రదర్శించుకొఱకు అనేకరీతుల వేషభాషల మెలఁగెదరు వాటి వలన మోసపోవలదు ఇవి యన్నియు చిన్నవే కాని వేఱు కాదు సృష్టి లౌకికము అయినంతమాత్రముచేత కలుగులాభము కలదా? లేదు గదా. కావున నొక్కటనే యొప్పుచుండువాఁడే యుత్తమపురుషుఁ డగును

ఆ. చెడ్డవాని మిగులఁ జెఱుచును దైవంబు
అడ్డపడఁడు వాని కాపదైనఁ
చెడినచేనుఁ చూచి యొడయఁడు మెచ్చునా?, వి

సద్బుద్ధి కలిగియుండిననే దైవము కూడ నోర్చి యుపకరించును. అట్లుగాక చెడుపనులు చేయు దుర్మార్గుని దైవమే చెఱుపఁబూనుకొనును. అట్టి దుర్మార్గుని కాపద వచ్చినప్పుడైనను సాయము రాఁడు. ఎట్లని యందురా తాను స్వంతయజమానుఁడైనను తనపొలమే యైనను చెడినచేనుఁ జూచి మెచ్చుకొనునా? మెచ్చుకొనఁడు గదా! అట్లే

ఆ చెడిన మానవులను జేపట్టి రక్షించి
కడకుఁ జేర్చువారె ఘనులు తలఁప,
విబుధజనులు గాంత్రు విశ్వేశుసన్నిధి, వి....65

లోకములో మేము గొప్పవారమని చెప్పుకొనెడివా రెన్నటికిని ఘనులు కారు. ఇఁక ఘను లెవ్వరందురా? చెడినవారిని దగ్గఱకుఁ జేరఁదీసి రక్షించి సాయముచేసి గట్టెక్కించువారే ఘనులు. ఇట్టి మహాత్ములు కైవల్యమును పొందుదురు.

ఆ. చేకొని పరోపకారం, బేకొఱఁగా మహిమ లెల్ల
నెఱిగెడువిధిమై, ధీకాదికులను జేయును, సాకార
ముగాఁగ నతఁడు సాధువు వేమా. 66

ఎవ్వఁడు తనబ్రతికియున్నంతకాలమును తనజన్మము నంతయును పరోపకారముకొఱ కని యెఱిఁగి బుద్ధిపూర్వకముగా చేయుచున్నాఁడో అట్టి సత్పురుషుఁడే సమస్తయోగముల నధ్య

సించినవాఁ డగుచున్నాఁడు. అతఁడే సగుణబ్రహ్మపదార్థము నెఱింగినసాధువుగూడ నగుచున్నాఁడు కావున సజ్జనలక్షణ మిట్టిది

ఆ. చేకొనుచును తమకు చేసాచి నంతలో
చెడినప్రజల రక్ష సేయకున్న
తనదు సాగు లేమి తనతనువది యేమి, వి....67

పలువురు తాము ధనికులమని విఱ్ఱవీగుచు ప్రజల కొక్కింతయు సాయము చేయక గర్వింతురు కాని ఇదియును నొక ఘనకార్యమా? కాదు. ఎట్లనఁగా పిలిచి చేయిపట్టినప్పుడు తన కున్నంతలో చెడినవారిని చేఁదీసి రక్షసేయవలయునే కాని లేదని చెప్పరాదు అట్లు చేయకున్నయెడల తనది యొక ప్రభుత్వము, సాగుదలయు నగునా? కాదు. తన శరీరముమాత్రము నిత్యమా? కావున సాధుభావము నొందవలయును

ఆ. చచ్చువారిఁ జూచి చావని పుట్టని
తత్త్వ మెల్ల నాత్మఁ దలఁపుఁ జేసి
యరసి చూచినట్టియతఁడె పో సుజనుఁడు, వి....

లోకములో తమ్ము దాము సుజనులమనుకొనువా రెల్లరును సుజనులు కారు ఇఁక నెవ్వరని యందురా? తాను ప్రతిదినము చచ్చిపోవువారిని చూచి శరీర మనిత్యమని తలఁచికొని తత్త్వోపదేశమును చేసికొని చక్కఁగా విచారించి పరమాత్మను చూడఁగల సమర్థుఁ డెవ్వఁడో వాఁడే సుజనుఁ డగును.

ఆ. చదివినయ్యకన్న చాకలయ్యే మేలు

గృహము వేల్పుకన్న గేదె మేలు
బాపనయ్యకన్న బైనీఁడుమేలయా, వి.... 69

చదివికొన్నవారమని చెప్పుచు పరలోకమువలన నొక్కించుకయును భయము నొందక యిచ్ఛను వచ్చినట్లు మెలఁగెడి వారికంటె చదువురాక మైల బట్టలు నుదికెడి చాకలియే యుత్తముఁడని చెప్పవచ్చును ఎట్లఁగా: అడిగిన పదార్థమీయని కామధేనువుకంటె నింటిలోనుండు గేదమేలు. అట్లే సదాచారములేని బ్రాహ్మణునికన్న జమునిక వాయించు బైనీఁడు మేలు

ఆ. చదువులన్నిచదివి చాలవివేకియౌ
కపటికెన్నఁడైనఁగలదెముక్తి,
నిర్మలాత్మకునకెనిశ్చలంపుసమాధి, వి.... 70

ఎన్నిచదువులను చదివికొన్నను మిగుల తెలివితేటలను ఆర్జించినను కపటమును విడలేకపోయిన వానికి ఎప్పటికైనను ముక్తి గలదా? లేదు. మఱియెవ్వరికిఁక ముక్తి కలుగునని యడిగెదవా! వినుము. నిర్మలమగు (అనఁగా: ఇతరునకు ద్రోహచింత లేని) మనస్సు గల సుజనునకే ముక్తి కలుగును. అట్టివాఁడే సుజనుఁడనఁదగును.

ఆ. చంపఁదగినయట్టి శత్రువుతనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు,
పొసఁగమేలుచేసి పొమ్మనుటేచాలు, వి.... 71

ద్రోహము చేయుటయును హింసించుటయును సజ్జనులైన వారికి ధర్మములు కావు. అపాయము చేయువారిని చంపవలదా?

అని యడిగెదరా? అట్లు గాదు. కనఁబడినవెంటనే చంపివేయఁ దగిన శత్రువు తన చేతిలో చిక్కినయెడల వానికట్టి యుపకార మును చేయరాదు ఇఁక వానిని శిక్షించు టెట్లందురా? వానికి మేలుచేసి పొమ్మనుటే శిక్షయగును.

ఆ. చూచువారికెల్లఁ జూడ వేత్తై యుండు
చూపుఁజూచి తెలియఁజూచువారె,
చూచువారలైన సుజనులనిక్కము, వి.... 72

కన్నులున్నను అందఱును గ్రుడ్డివారే యగుదురు చూచెడి వారందఱికంటె వేఱై యన్నిచూపులలోనే తానై యే బ్రహ్మ మున్నదో దానిని చూచినయెడలనే చూపుగలవార లగుదురు గాని కానిచోఁ గాఁజాలరు అట్టివార లెవ్వరని యందురా? సజ్జ నులని తెలిసికొనుము.

ఆ. చూరగొనుముదొరకు సుజ్ఞానమెల్లను
పారవేయుమెల్లపాపగుణము,
దారి తెలియబుధులదాపునమెలఁగుము, వి.... 73

సజ్జనుఁడవు కాఁదలంచితివేని నేను చెప్పినట్లు చేయుము. ఏమనఁగా. నీకు సాధ్యమైనంతవఱకును దుష్టులసాంగత్యమును వదలిపెట్టుము. సజ్జనులదాపున తిరుగుచుండుము. వారివలన నీకు దొరకెడి జ్ఞానమునంతను బీరువోనీయక చేకొనుము. నీ యొద్దఁగల పాపగుణములను వదలివేయుము. ఇట్లయిన కొలఁది రోజులలో సజ్జనుఁడ వయ్యెదవు

ఆ. చదలుభంగిఁ గండ్రు సాధువు మూఢులు

తానువారినట్లు కానఁగును,
దీనికెంతదవ్వొ దానికినిదియంతె, వి.... 74

తెలివిలేని దుర్జనులు సజ్జనులను సత్పురుషులను గన్నుల గాంచినప్పుడు అసహ్యముగా చదలుపురుగులను వలె నీచుల నుగా చూచుచుందురు. ఇట్టివారిని వారును మన్నించక అట్లే చూడవలయును. ఏలయని యందురా వినుఁడు. ఈవస్తువున కది యెంతదూరమో దాని కిదిగూడ నంతయే కదా! కావున దుర్జనుల కోపింపరాదు

ఆ. చాయ నొసఁగు చెట్లు సాధువు బోధలు
అడిగిదరినిజేరఁ బడయవచ్చు,
నట్టునిట్టుదాఁటనడిపోవదిదిరాదు, వి.... 75

సత్పురుషుల యుపదేశములు వినయవివేకములచేత నాఁగి మణగి యుండినవే పొందవచ్చును, గాని అటునిటు తప్పుడు త్రోవలఁ బోవ దొరకదు. ఎట్లనఁగా. నీడనిచ్చు చెట్ల దగ్గఱఁజేరి వంగి విధేయతమై నుండినవే నీడ దొరకును గాని అటునిటు కదలుచుండిన దొరకునా?

ఆ. జఠరమందు జ్యోతి చాలదేదీప్యము
కాన లేరు నరులు కలుషమతులు
కన్నువిచ్చిచూచు ఘనుఁడగునుజనుఁడు వి....76

పరమాత్మునిరూపము సదాసన్నిహితమై తన తను పొట్ట లలో పెద్ద జ్యోతియై ప్రకాశించుచున్నది. అయినను పాపా త్ములు దానిఁ గాంచలేరు. అట్టిజ్యోతిని కన్నుదెఱచి యెవ్వఁడు

చూచునో వాఁడు సుజనుఁ డగునే కాని పైకి నోటికివచ్చినట్లు ప్రేలి ఇతరుల మోసము చేయువాఁ డగునా? కాఁడు.

ఆ. జనుఁడు తెలివినొంద చంచలింపదు మది
దయయు నీతిగలుగఁ దగులుబుద్ధి
తివురుభానుఁజూచి తిమిరంబునిల్చునా? వి .... 77

మనుజుని శక్తియుక్తులను కనుఁగొని మనసుకూడ నట్లుతే ప్రవర్తింపఁ జూచును. మనుజుఁడు తెలివి గలిగియున్న మనస్సు చలింపదు. దయ ధర్మము నీతి కలుగునట్లు మంచిమర్గమునఁ బ్రవర్తించును ఎట్లనఁగా చీఁకట్లను బాఱఁద్రోలెడి సూర్యుని యెదుట చీఁకటి నిలుచునా! నిలువదు గదా' అట్లె ఇది యుఁ గూడను.

ఆ. జక్కి నెక్కి వీథిఁ జక్కగా వెలువడఁ
గుక్క లిన్ని వెంట కూయుఁదొడఁగు
ఘనున కోర్వలేని కాపురుషులు నిల్లె, వి.... 78

దుర్జనులస్వభావమేమో కాని సత్పురుషుని జూచి సహింపఁ జాలరు. మంచిగుఱ్ఱము నెక్కి రాజవీథిని పోవుచుండు వానిని జూచి కుక్కలు మొఱుగుచు చుట్టుకొనుట లేదా? అట్టులే దుర్జనుఁడోర్వలేక పోవుట స్వభావసిద్ధమగు నీచగుణమే కాని వేఱుకాదు

ఆ. డాగుపడినవెనుక దాఁగ నశక్యము
అరసి చేయుమయ్య యన్నిపనులు
తెలియకున్న నడుగు తెలిసినవారిని వి.... 79

బుద్ధిమంతుఁడా! నీవు ఏపనిని చేయవలసివచ్చినప్పటికిని సద్బుద్ధితో చక్కఁగా విచారించి చేయుచుండుము. ఏలయనఁగా — ఏదైన నొకకళంక మొకసారివచ్చినయెడల నిఁక నది దాఁగుట అసాధ్యము, కావున విచారించి చేయుచుండుము నీకు తెలియకున్న ఇతరుల నడిగి చేయుచుండుము ఇయ్యాదియే సజ్జనులకు లక్షణము

ఆ. తట్టు నెక్కి తిరుగ నట్టె నేటయ్యెనా ?
యెపుడొ క్రిందఁబడిన నేదొ విఱుగు
చెల్లియుండి యోర్పుఁ జెందిన భూషింత్రు, వి

బుద్ధిహీనులగు దుర్జనులు సజ్జనులగౌరవమును చూచి తమకు నట్టిగౌరవము వలయునని వాహనములనెక్కి తిరుగఁబూనెదరు అందువలన నపాయము కలుగును ఏమనఁగా — గుఱ్ఱము నెక్కినంతమాత్రమున వాఁడంత గొప్పవాఁడగునా? కాఁడు ఎప్పుడో క్రిందఁ బడును ఏదో విఱుగును కావున చెల్లుచుండినను యోర్పు గలిగి యుండుట సజ్జనులకు భూషణ మగును

ఆ. తండ్రికన్న సుగుణి తనయుఁడై యొప్పెనా
పిన్నపెద్దతనము లెన్నరెవరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంచిరా? వి.... 81

గుణమును ప్రధానముగా సజ్జను లెన్నుచుందురే కాని ఇతరుల రీతిగా వయస్సులోని చిన్నపెద్దతేకముల నెంచరు. ఏలయనఁగా: తండ్రికంటె గుణవంతుఁడైన కొడుకునే కొని యాడెదరు కాని పిన్నతనమును లెక్కింపరు. ఎట్లనఁగా —

వాసుదేవుని లెక్కపెట్టక ఎవ్వరైన వసుదేవుని లెక్కించిరా? లేదు గదా! ఇట్లే సజ్జనులఁగూడను.

ఆ. తనసతి నధర్మమునఁ దనుదాని చొనుపఁగా
సాటిపూరుషుండు సగగు దెలుప
నెఱుఁగఁ లేనినరుఁడు నరమాత్రుఁడును గాఁడు, వి

తనభార్యను తనంతట తానె యధర్మమునందుఁ బ్రవేశింపఁ జేసియు నంతటన్నైనను తెలివితెచ్చుకొని దుర్జనుఁ డూఱక యుండునా? యుండఁడు. తనతో సాటి యగువారు తనకా విధమును తెలియచెప్పినను తెలిసికొనఁజాలఁడు. ఇట్టివాఁడు కూడ మనుష్యమాత్రుఁడే యగునా! కాఁడు

ఆ. తనను బోలె నవియు ధరఁబుట్టినవి కావొ?
పరఁగఁ దన్నుఁబోలి బ్రదుకఁ గాదె
జ్ఞాని జ్ఞానిఁ జంపఁగారణ మేమిరా? వి.... 83

దుర్జనులు సజ్జనస్వభావము నొందక ప్రాణిహింసఁ జేయఁబూనుకొందురు పాపమా ప్రాణులును తనవలె నే పుట్టినవి కావా? తనను బోలి బ్రదుకుచున్నవి గావా? తనకీడుమేళ్ల నెఱింగినవాఁడు తనకుఁ బోలియున్న నితరుల నేల చంపవలయును? కావున నిట్లు చేయుటను సజ్జను లంగీకరింపరు

ఆ. తప్పు లెన్నువారు తండోపతండము
లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెఱుఁగరు వి.... 84

సజ్జనుఁ డొకరుఁడు ఇతరులకు సతతము మేలుచేయువాఁడు కలఁడు అని చెప్పినప్పుడు వానిని తప్పుపట్టుట కనేకులు

బయలుదేరి వచ్చెదరు, కాని యిది సజ్జనులకు మర్యాద కాదు. ఏల యనఁగా —తప్పులను లెక్కపెట్టు వారనేకులు గలరు ప్రపంచములో తప్పులేనివారే లేరు, కాని తప్పుల నెంచువారు తమతప్పులు తెలిసికొనఁగలరా? లేరు.

ఆ. తమకుఁ గలుగు పెక్కుతప్పు లటుండఁగా
నొరుల నేరమెంచి నోగి కాఁడు
చక్కిలంబు విడచి జంతిక లేరునా? వి.... 85

బుద్ధిమంతుఁడవై యితరులతప్పులఁ బట్టుపోవక సాధుత్వము నొంది యుండుము. తమ తప్పులను దాచుకొని ఇతరుల తప్పు లెన్నువాఁడు దుర్జనుఁ డగును దుర్జనున కిట్లు చేయుట స్వభావము. ఏల యని యందువా? చూడుము ఎవ్వరైనను చక్కిలమును వదలిపెట్టి జంతికను నేఱునా? అట్లే వాటమైనవి గాన ఇతరుల తప్పులను వెదకును ఇది మంచిది కాదు

ఆ తల్లి కెదుఱుకొనుట తండ్రి కెదురుకొనుట
యన్న కెదురుటయును నవఁగ మూఁడు
పాతకము లటంచు పాటించు సుజనుఁడు వి....

సజ్జనుఁడగువాఁడు ఎల్లప్పుడును తల్లితండ్రులయెడలను నన్నలయెడలను వినయము గలిగి ప్రవర్తింపవలయును. అట్లు కానిచో దుర్జనుఁడగును. సత్పురుషుఁ డెల్లయెడలను తండ్రికి తల్లికి అన్నలకు నెదురు సెప్పుట లను మూఁడిటిని మూఁడుపాతకములని భావించి ప్రవర్తించును కాన సజ్జనపద్ధతి ననుసరింపుము.

ఆ. తివిరి లేమియింట తెరువ రేమెఱుఁగును?

మొట్టఁబెట్టి నెత్తి మొత్తుఁగాని
ప్రథితధర్మ మధమభట్టు లెఱుఁగుదురొకో, వి....

ఉత్తమములగు ధర్మములను తెలియవలయునన్న సజ్జనుఁడే యెఱుఁగఁగలఁడు, గాని ఇతరునివల్ల నెట్లు అగును ఏలయని యందురా, శ్రోత్రవాఁడు దీపము లేని చీఁకటింటిలోఁ బ్రవేశించిన దారి యే మెఱుఁగఁగలఁడు నెత్తిమొత్తుకొని కేకలనే పెట్టును అట్లే సుప్రసిద్ధములగు ధర్మము నధములగు బట్టువార లెఱుంగు టెట్లు? ఎఱుఁగఁజాలరు

ఆ. తేనె తెఱలజాడ తేనెటీఁగ యెఱుంగు
సుమరసంబుజాడ భ్రమర మెఱుఁగు
పరమయోగిజాడ భక్తుఁడెఱుంగును. వి.... 88

మఱియును తేనెతెట్టెలోని పొరల ముందువెనుకలఁ దెలియవలయు ననిన తేనెటీఁగయే యెఱుంగును. పువ్వులలోని పుష్పొడిరుచిని తెలియవలయునని తుమ్మెదయే తెలిసికొనవలయును. ఉత్తముఁ డగుయోగిరీతి నెఱుంగఁగోరిన భక్తునకే స్వాధీన మగును. ఇట్లే సజ్జనరీతుల సజ్జనుఁడే యెఱుంగునది.

ఆ. దిక్కులేనివానిదీనతఁ బాపిన
పురుషుఁ డిహమునందె పూజ్యుఁడగును
పరమునందు వానిభాగ్య మేమనవచ్చు? వి ....

సజ్జనులలక్షణములలో దిక్కులేనివారిని రక్షించుట యొక్కటి ముఖ్యమగు ధర్మము. కొందఱు దీనివలన ఫలములేదని మానుపఁజూచెదరు; కాని నిజముఁ బరికించిన ఫలము లేదా? మానుఁడు.

దిక్కు లేనివానిని రక్షించిన ఈలోకములోనే యసామాన్యమగు గౌరవము గలుగుచుండుట లేదా? ఇహముననే యిట్లయినచో నిఁక పరమును గూర్చి యేమని చెప్పవచ్చును

ఆ. దూలముల న కెక్కి దొమ్మరిగడ నెక్కఁ
జాలుదు ననఁ జెప్పు సజ్జనుండు
వీలుమాలుపనుల వెఱ్ఱియె చేయునా? వి.... 90

దుర్జనునివలె సజ్జనుఁ డెప్పుడైనను లేనిపోనిదంభభావములను కపటపుగౌరవములను తనపైని ప్రచురించుకొనఁడు దూలముల నెక్కగు నని దొమ్మరిగడ నెక్కుదునని సజ్జనుఁడు చెప్పునా? చెప్పఁడు మఱియు బుద్ధిహీనునివలె తనకు వీలులేని పనులను చేయుదునని వెఱ్ఱివానివలె చెప్పునా? చెప్పఁడు కావున సత్యము పల్కుట సజ్జనలక్షణము.

క. దేవతార్చన జపతీర్థయాత్ర
దానధర్మక్రతువులును దలఁచి చూడఁ
బుణ్యసాధనవృత్తులు పుడమిలోన
కల్మషము లేని హృదయము కలుగ వేమ. 91

సజ్జనులు సర్వదా పుణ్యకార్యములను చేయుటయందే తమ జీవితములను గడుపుచుందురు. వారు నిష్కల్మషహృదయులు కావున వారికి దేవతలను పూజించుట, జపము చేయుట, తీర్థముల సేవించుట మున్నగునవి పుణ్యమును ఆర్జించుటకు సాధనములు.

ఆ. దోషరాశిఁ బుట్టి దోషంబుఁ దెలియక
దూషణములు సేయుదుష్టజనులు
నరకకూపమందు నాటియుండెదరయా, వి....92

సజ్జనులు అయియుండనివారికి ఎన్నిజన్మములకైనను తరింపు గలదా? లేదు ఏలయనఁగా ఎల్లప్పుడును పుట్టుకసహితము దోషముల గుంపులోనే పుట్టి మంచియేదియో చెడ్డయేదియో తెలియక దూషించుచుందురు దుష్టులు కావున వారు నరకకూపములలోఁ గూలియుండెదరే కాని ఉత్తీర్ణులు కాఁజాలరు

ఆ. ధార్మికునకుఁ గాని ధర్మంబు గనరాదు
కష్టజీవి కెట్లు కానఁబడును?
నీరు చొరమి లోఁతు నిజముగా తెలియదు, వి

ధర్మాత్మునకే ధర్మముయొక్క నిజరూపము తెలియునట్లు సజ్జనుఁడైననే సద్గుణములు తెలియనగును లేనివానికి తెలియఁగారావు ఏలయందురా? పాపాత్మునకు ఆదారి తెలియుటయెట్లు? నీళ్లలోనిలోతు లోపలఁ దిగినవానికే తెలియును గాని యితరునకు తెలియునా? అట్టులే సజ్జనగుణములు కూడను

క. నది నుదకంబులు చనుక్రియ,
మదిఁ బొడమెడుతత్త్వవిధులమహిమాన్వితులై,
పృథివిని గలనరులొందవఁగఁ,
బదపడి సద్గతుల నొంద బాగగు వేమా. 94

ఏటిలోఁ గలసి నీరు ప్రవహించెడిరీతిగా మనుజు లందఱును తమతమ మనంబున నుదయించు తత్త్వమార్గములచేత మహిమము గలవారలై సద్గతిని బొందిన బాగుగా నుండును.

ఆ. నీచగుణము లెల్ల నిర్మూలమై పోవు
కొదవలేదు సుజనగోష్ఠివలన,
గంధ మలద మేనికం పడంగినయట్లు వి.... 95

సజ్జనసాంగత్యమువలన నేమిలాభమని కొంద ఱనెదరు దీనఁగలుగు లాభ మితరమే దానివలనను లేదు సజ్జనసాంగత్యము వలన నీచగుణము లన్నియును నశించిపోవును ఏవిధమైన కొఱంతయును కలుగఁబోదు ఎట్లనఁగా —ఒకవిలికి గంధమును బూసినచో కంపుఁబడగినట్లులె

ఆ॥ నేర నన్నవాఁడు నెఱజాణ మహిలోన
నేర్తునన్నవాఁడు వార్తకాఁడు
ఊరకున్నవాఁడె యుత్తమోత్తముఁ డయా, వి.

అనవసరములగు పనులలోఁ బ్రవేశింపక తనకు తెలియని సాధ్యమైనంతవఱకు నుడువఁ బెట్టిపనులకంటె తొలఁగి చనవలయును తెలియనివాఁడను అని యనినవాఁడు నేర్పరి యాఁగగును అన్నియును తెలిసినవాఁడననువాఁడు మాటలప్రోగు ఏమియును తెలియనివానివలె ఊరకయున్నవాఁడు అందఱ కంటె నుత్తముఁ డగును ఇట్లుండుటయే సజ్జన లక్షణము

ఆ॥ పరఁగ ఋషులు భువిని పరమపవిత్రులై
మించి లోకమునకు మేలుఁ జేయ
సంచితార్థములను సమసింపఁజేయరే, వి... 97

సజ్జనులు ఏకులమున నుదయించినను తమ తపశ్శక్తిచేత జ్ఞానులై పరమపవిత్రులై లోకమునకంతకును మేలు చేయఁ జూచి తాము తాము సంపాదించిన పాపములను నశింపఁజేయ దొరకొందురు అట్టివారికి ముక్తి హస్తగతమై యుండును.

ఆ. పట్టరానిపట్టుఁ బట్టి యుండినవాఁడు

పుడమిలోన కీర్తిఁ బొందలేఁడు,
సుగుణలక్షణముల సుజ్ఞాని యౌనయా, వి....98

పట్టుకూడని మూర్ఖుఁబట్టును పట్టినవాఁడు యోగమును గాంచ లేఁడు ప్రతివిషయమునను యుక్తాయుక్తముల నెఱుఁగవల యును కావున జ్ఞానవంతుఁ డగు సాధనము సజ్జనలక్షణము లల వడునట్లు ప్రయత్నింపవలయును

ఆ పదిలపడఁగ మనసు పట్టనేరనివాఁడు
కదియఁబోఁడు పూర్ణకలితుఁడుగను
గుదురుకొనెడివాఁడు గోవిదుఁడగునయా, వి....

పదిలముగా మనస్సును పరుగులు వ ఱనీయక పట్టియుంచ వలయును ఇట్లు మనస్సును పట్టనేరనివాఁడు బ్రహ్మపదార్థము నొందినవాఁడుగాఁ గాఁజాలఁడు కావున బ్రహ్మముఁ గోరు వారెల్లరును మనోనిగ్రహమును అభ్యసింపవలయును

ఆ పాలుపెరుఁగునేయి పరఁగునన్నము తిని
స్త్రీలఁ గననివాఁడు శీలవంతుఁ
డొక్కఁడైనవాఁడె యుత్తమశివుఁడయా, వి....

పాలు, పెరుఁగు, నేయి, శాల్యన్నము మున్నగు నుత్తేజకములను మత్తుకలిగించుపదార్థములను భక్షించుచుండినను స్త్రీలను చూచి యుపేక్షించువాఁడొక్కరుఁడే శీలవంతుఁడు అట్టివాఁ డొక్కఁడైనను నుత్తముఁడగును వాఁడె శివస్వరూపము నగును.

ఆ. ఫక్కి దెలిసి పలుక నొక్కవాక్యమె చాలు

పెక్కులేల వట్టి ప్రేల్పుటేల?
దిక్కు కలిగి మ్రొక్కు దొక్కటి చాలదా?,వి

పలుమాటలను పలికినందుచేత నాకించుకయైనఁ బ్రయోజనము లేదు ఫక్కి తెలిసికొని మాటాడినమాట యొక్కటైనను చాలును వట్టి ప్రేలుడుమాట లనేకము లెందులకు? వ్యర్థము లనుట. ఎట్లని యందురా? చూడుఁడు దిక్కుతో మ్రొక్కిన మ్రొక్కు ఒక్కటి చాలదా? అట్లే

ఆ. మఱతునేమొ యనుచు మది సుజనుం డెప్డు
నెవరొనర్చు మే లదెంత దైన,
మాఱుమేలుఁ జేసి మర్యాదగాంచును,వి....102

సజ్జనుఁడగువాని సుందరలక్షణములలో నొక్కటి మిగుల నుత్తమమైనది కలదు అయ్యాగ కృతజ్ఞత, అనఁగా చేసిన మేలు మఱవక యుండుటయే సజ్జనుఁ డెప్పుడును తన కితరులు చేయు మే లెంతపాటిదైనను "మఱచిపోవుదు నేమో?" యని యనుకొనుచు సమయమును వేచి మాఱుమేలు చేసి మర్యాదను పొందును.

---

# దైవపద్ధతి.

---

ఆ. అండమందు నుండు నఖిలమౌ జనులార,
ఎందు లేకయుండు నెఱుఁగుఁ డతఁడె,
యతనిపూజఫలము నందెనా శివయోగి, వి....

దైవస్వరూప మన్నిపదార్థములలోను నిండియుండును చివలను మిగుల కొద్దిపాటిది యగు గ్రుడ్డులోఁ గూడ నిండియుండును కావున సమస్తములగు జనులారా! అట్టి సమస్తవస్తుస్వరూపుఁడగు నీశ్వరుని పూజించి ఫలమునొందెనా యట్టివాఁడు శివయోగి యనఁదగును

ఆ. అందు నిందు నుండు నఖిలుండు నూడఁగా
నెందు దానె నిండి యెఱుఁగునుండు,
నతనిపూజఫలము నందఁగవలె నయా?, వి....

దైవ మఖిలవస్తురూపుఁడు ఆతనికి అనువుగానిచోటు వేఱు లేదు అచ్చట నిచ్చట నుండును విచారించినఁ బ్రపంచములోని యేపదార్థమునం దైనను తానె నిండియుండెడి స్వభావము గలవాఁడు మనుజుఁడై పుట్టినందులకు ఫలముగా నట్టి మహానుభావుని పూజల నొనర్చి ఫలము నొందవలయును

ఆ. అనువుగానిచోట నధికుల మనరాదు
కాల మొక్కరీతి గడుపవలయు,
విజయుఁ డిమ్ముఁ దప్పి విరటుని గొల్వఁడా,వి....

తా నెంత పోటుమానిసియైనను దైవబలము లేనిది నెగ్గఁ జాలఁడు కావున మన జాఁడీవిషయమును గుర్తుంచుకొని తన కనవుపడనిచోటుల నేనెక్కుడు వాఁడనని పెనఁగఁగూడదు. సమయములను గుర్తెఱింగి కాలము నొకరీతిగా గడుపుకొనవలయును ఎట్లందురా పూర్వము మేటివీరుఁడని పేరుగాంచిన యర్జునుఁడును అనువు దప్పి విరటుని కొలుచుట లేదా? అట్టులే.

ఆ అల్పుఁడైనను నేమి యధికుఁడైనను నేమి
చెప్పవలయురీతిఁ జెప్పినాఁడ
హరుని యొఱుక లేక యాకు లల్లాడునా?, వి....

కొద్దవాఁడైనను గాని గొప్పవాఁడైనను గానీ యందఱకును దైవబలమే బలము గాని ఇతరములు కావు దీని చెప్పవలసినంతగా చెప్పినాఁడను ఒకవేళ ఎవ్వఁడైనను తన ప్రయత్నములచేత దైవము నొంపఁ బ్రయత్నించెనేని సఫలుఁడు కాఁ జాలఁడు ఏలయందురా ఈశ్వరుని యాజ్ఞ ఇసుమంత యైనను లేనిచో అనుగూడ కదలఁజాలదు

ఆ ఆకుమీఁది వ్రాత యందఱికిఁ దెలియుఁ
జేతిలోని వ్రాఁతఁ జెప్పవచ్చు
తోలుక్రిందివ్రాఁత దొడ్డవాఁడెఱుఁగునా?, వి....

తాటియాకులు మున్నగువానిపై వ్రాసినవ్రాఁత లందఱికిని తెలిసినవే ఇట్టులే చేతిపైని వ్రాసినవ్రాఁతలఁ గూడ తెలిసికొని చెప్పవచ్చును, కాని ఎంతటి బుద్ధిమంతుఁడైనను ఎన్నిపాట్లు పడినను దైవనిర్దిష్టమగు వ్రాఁతల నెఱుఁగఁజాలఁడు

ఆ ఆకులందుఁ జదివి యందఁగ రానిది,

ఏక మమర యుక్తి నెఱుఁగవలయు
దాకిపూర్తిగానుతన్మయ మొందుఁడీ, వి.... 108

దైవ మధిక బలము గలది దేవుని భావ మీరీతి నుండునని గ్రంథములలో చదివి కనుఁగొందమనిన వలనుగానిది అట్లుగాక తెలియవలయునని పట్టుదల కలిగినయెడల నైక్యబోధక మగు యుక్తిని తెలిసికొని కలిసికొని తన్మయము నొందుఁడు

ఆ. ఇంటియింటిలోని యీశ్వరు నెఱుఁగక
అంటిచూడ లేక యడవులందు
నుండఁగోరుదైవ ముండ నీయఁడు వాని, వి....

సర్వసాధారణముగా నీశ్వరుఁ గనుగొనవలయుననిం నైక్య భావముతోను సర్వసత్వబుద్ధితోను మెలఁగవలయును ఇట్లయిన సర్వజగన్నివాసుఁడగు ఈశ్వరు నెఱుంగఁగలుదురు కాని ఇంటిలో నున్న నీశ్వరుని తెలిసికొనఁజాలక యడవులలోఁ బడి యెండఁ గోయుగురు జనులు దేవుఁ డిట్టివారలకు కొంచెమైన నంటనీయఁడు

ఆ. ఇయ్యనతనిచేత నిప్పించుకొన ప్రాప్తి
ఇచ్చువానిచేత నీయనీదు
ఇయ్యఁ గైకొనంగ నీశ్వరుఁడే కర్త, వి.... 110

మనుజుఁడు ప్రయత్నింపఁ గలవాఁడు మాత్రమే ఫలము దేవుఁ డీయవలసినదియే ఈదైవమునే అదృష్ట మనియు ప్రాప్తి యనియు నందురు. దీని ప్రభావ మతివేలము. ఎన్నడును దానము పేరైన నెఱుఁగనివానిచేత నిప్పింపచేయును.ధారాళముగా

నిచ్చువాని చేత నిప్పింపదు కావున ఇచ్చుటకును పుచ్చుకొనుట
కును ఈశ్వరుఁడే కర్తగాని యితరము కాదు

ఆ ఇష్టలింగ మేది యిల శిల లింగంబె
నిష్ఠమీఱ మెడను నీల్గఁ గట్టి,
కష్టపడుటె గాని కలుగదు దైవము, వి.... 111

కొందఱు దైవము నిజరూపమును తెలిసికొనఁజాలక వెఱ్ఱి
వారలై ఇష్టలింగమిష్టలింగ మని మెడలలో లింగమును గట్టికొని
తిరిగెదరు ఎంత వ్యర్థులో చూడుఁడు. ఏమందురా! ఏది యిష్ట
లింగము? శిల యందురా? శిల లింగముగునా? కాదు లావు
మెడలలో శిలల నీలగకట్టికొని కష్టమునొందుటే గాని దైవముఁ
గనుగొనఁజాలఁడు

ఆ. ఈనినట్టిపులిని బూని చంపఁగవచ్చు
మనసు మర్మ మరసి కనఁగవచ్చు,
దైవమాయ తెలియ తన కసాధ్యం బగు,వి....

ఈనినపులినైనను పట్టుకొని చంపఁ గలఁడు వివేక
బలమువలన మనస్సులోని మర్మములను తెలిసికొనవచ్చును కాని
ఎంతటిశూరుఁడైనను ప్రాజ్ఞుఁడైనను పరమేశ్వరునిమాయ నెఱు
గఁజాలఁడు.

ఆ ఉదకమందు పాచియున్నది చూడరా
మదిని నున్నమాయ మట్టువడక
సదనమందు బ్రహ్మ సాక్షిగా నెంచుము, వి....

దైవరూపము మనకంటి కగపడు ప్రతివస్తువునందును
కలదు, కాని ఆయ్యది మనలఁబోలె మాయచేఁ గట్టువడదు ఎట్లం

దురా నీటిలోనుండి పాచి నీళ్ల కంటని యట్టులే కావున మెలకువతో నీనిలయమునందె దైవముండె నని యెంచికొనుము

ఆ. ఉన్నవార లెవరొ చన్నవా రెవ్వరో
కన్నవార లెవరొ కానరారు
ఉన్నచన్నకన్న నొక్కఁడే చూడరా, వి.... 114

మనుజుఁడు ప్రజ్ఞలేక భేదబుద్ధిచేత నభిమానియై తిరుగాడుచుండును అయ్యది యుక్తము కాదు ప్రపంచములో స్థిరమెవ్వరో ఎవ్వరు లేరో పరికింపుము దైవమునకంటె నితరు లొక్కరును గనరారు ఉన్నను చనినను ఒక్క దైవమని యెఱుఁగుము

ఆ ఊరు కాడు దిరిగి యున్నది గనలేక
పోరి గురులఁ గనక పొందుపడక
తాలుమాలుగాను తత్తరపడ నేల?, వి....115

ఊరూరికి తిరిగి, నిజముగా లోకముల నిండియున్న దైవ రూపము నజ్ఞానివై తెలియవైతివి గురువులతో విరోధించి నిజ రూపమును పొందఁజాలవైతివి వెఱ్ఱివాఁడా! యిప్పుడు తారు మార్గ మేల తత్తరపాటు నొందెదవు

ఆ. ఎచటనుండి వచ్చు నెచటికిఁ దాఁ బోవు
నిద్రచంద మెఱుగఁ నేర్చునేని
ఆత్మరాకపోక లతఁడపో శివయోగి, వి.... 116

ముక్తుఁడు ముక్తుఁడనఁగా నట్టివాఁడొక్కరుఁడే ముక్తుఁ డగును ఎవ్వఁడు ఈజీవ మిచ్చటినుండి వచ్చునో, ఎచ్చటఁ

బోవునో నిద్రించుట యనఁగా నేమి? యని ఈ రీతిగా నాత్మ
నాకపోకల నెఱుఁగునో, వాఁడె శివయోగి యగును.

౭ ఎంత వింత మదికి నేమేమి తోఁచినఁ
జింత సేయరాదు చిక్కు లెట్టు
వింతలోనిగుట్టు వివరింపఁదానగు, వి.... 117

పరమేశ్వరుని ధ్యానించునప్పుడు మాయాప్రభావమువలన మనస్సునకు ఎట్టివింతలు కనుపించుచున్నను వానిని లెక్కసేయ రాదు ఏమన: ఇవియే పరమేశ్వరుని విలాసము లని బ్రమసిన నేక రహస్యము తెలియు టెట్టులు ?

౮ ఎన్నాళ్లు బ్రతికిచచ్చిన
దన్నెఱుఁగని మర్త్యులకును దలఁగునుబరమా,
పున్నమచంద్రుని విమలపు
వెన్నెలలో బయలు సేరి వెలయుము వేమా.

ఈలోకములోని ప్రతివాఁడును ఆముష్మికముపై ధన్యముంచికొనవలయును అట్లుగాక బ్రదుకే ఫలముగాఁ గొంటారని ఎన్నిదినములు బ్రదికినను తన్నుఁదా తెలియనేరనివానికిఁ బరము లేదు కావున పున్నమచంద్రునివలె ప్రకాశమానుఁడగు పరమాత్మఁ జేరి సుఖముండుము

౯. ఎన్నిభూములఁ గని యేపాటు పడినను
నంటనీక శనియు వెంటఁ దిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా, వి....119

తా నెన్నిదేశములకేఁగినను ఎన్నెన్ని పాట్లుపడినను తన యదృష్టముకూడ వెనువెంటనే తిరుగుచుండును (ఇద్దానినే

యదృష్టమందుము) ఏలయందురా మనము వెడలిపోయినభూ
ములు కొత్తవైనను వాని ననుభవింపవచ్చిన మనముమాత్రము
ప్రాఁతలమే. గనుక—

ఆ. ఎఱుక గలుగునాతఁ డేయూరనుండుట
తిరుగ నేలఁ దనదు దివ్యమైన
పండు పండ వెనుక ఫలము లేకుండునా?, వి....

నిక్కమగుజ్ఞానము గలవాఁడు ప్రతియూరు నెందులకు
తిరుగవలయును? అతఁ డెక్కడనుండిన నచ్చటికి తనకోరిన
వస్తువులు వచ్చును ఇందుకు సందేహము వలదు ఎట్లంగురా?
చూడుఁడు ప్రయత్నించి ఫలింపచేసినవెనుక ఫలము లేక
యుండునా? యుండదుకదా! అట్టులే.

ఆ. ఎవ్వరెఱుఁగకుండ నెప్పుడు పోవునో
పోవు జీవ మకట బొంది విడిచి
యంతమాత్రమునకె యపకీర్తి నెఱుఁగక, వి....

బుద్ధిమంతుఁ డగువాఁడు పరము నాసింపక ప్రాణములు
స్థిరము లనుకొని మెలఁగరాదు అల్పప్రప్రాణము ఎవ్వరికిని తెలి
యకుండ ఎప్పుడు పోవునో తెలియదు కావున నింతమాత్ర
పుదేహమునకై యపకీర్తి పాలు కకయుండవలయును

ఆ. ఏడ్వ మది నోవ ఫలమేమి యెవరు నిన్ను
దిట్టఁగా నేమి లేక నుతింపనేమి
కలుగుభువిలాభలోభముల్గాలమహిమ
మనుచు సరిపెట్టికోరాదె యరయ వేమ. 122

మనుజుఁ డిప్పు డెంతయేడ్చినను తనకు దైవప్రాప్తియెంతో యంత కాలానుసారముగా కలుగుచుండును. ఇతరులు తిట్టి నను పెట్టినను ఒక్కటియే యని బుద్ధిమంతులై సరిపుచ్చు కొనుచుండవలయును.

ఆ. ఏది కులము నీకు నేదిమతంబురా
పాదుకొనుము మదిని పక్వ మెఱిఁగి
యాదరించుదానియంతము దెలియుము, వి....

నే నున్నతకులమువాఁడ నను నభిమానముచేత నజ్ఞాని వగుచున్నావు ఓయి పిచ్చివాఁడా నీ వెవ్వరు? నీకు కులమున్నదా? లేదు కావున మదిలో పరిపక్వము చేసికొని దైవరూపము నెల కొలుపుము దీక్షఁబూని దానియంతము దెలియఁ బ్రయత్నింపుము.

క. ఏ దేశముఁ దిరిగినఁ బని
లేదట తనమనసుకుదురు లేకుండినచో
నాధారం బిఁక నింతియు
తాఁ దెలియుట మనసు శుద్ధి తత్త్వము వేమా.

మనసు కుదిరికఁ గన్నవాఁడు దేశదేశములను భ్రమ్మఁ బనిలేదు మనసు కుదురకున్నను దేశములను దిరిగినఁ బనిలేదు. కావున తనకు తాన యాధార మనుకొనటయే శుద్ధమగు దైవ రూపమునుగా తెలియుము

క. ఏనాఁడు సుభిక్షము తన
కేనాఁడిరవయ్యె నచటి కేఁగుమృగంబుల్,
తానున్నచోట విసికిన
మానవులను జివుక నేల మహిలో వేమా. 125

ఉదరపోషణకై దేశముల ద్రిమ్మరుచున్నామందురు అది పశుపక్ష్యాదులకును సమానమే, చూడుఁడు ఏరోజున నెచ్చట సుభిక్షమో దుర్భిక్షమో అచ్చట నుండితిరుగు మృగములు కావున నిఁక మనుష్యునియందలి విశేషము తెలియనులేదు

ఆ. ఏమహాత్మునందు నీజగంబులు పుట్టె
నామహాత్ముభజన యనువు మీఱ
నీమనిష్ఠ నెఱపి నెమ్మదిఁ గనవలె, వి.... 126

అవివేకిపై యల్లాటక ఏమహానుభావునియందు ఈచరాచరమైన జగత్తు పుట్టుచున్నదో, ఆమహానుభావుని నియమములతో నుపాసించి శాంతత నొందుము

ఆ. ఒకరి కీడు వేఱె కొక్కరి కీయఁడు
ఒకరిమేలు వేఱు ఒకరికీడు
కీడు మేలు వారు పోడిమి దెలియరు, వి .. 127

అజ్ఞానివై దైవమును నిందింపకుము ఆయన సర్వసముఁడు నీపనికి తగినఫలము నిచ్చును ఇంతియే కాని ఒకరికి కీడు, నతియొక్కరికి మేలు నియ్యఁడు లోకములో నీవలె నున్నవారందఱును కీడుమేలుల తారతమ్యము నెఱుంగని వారలే

ఆ. కంకుభట్టనంగఁ గాషాయములు గట్టి
కొలిచె ధర్మరాజు కోరి విరటుఁ
గాలకర్మగతులు కనిపెట్టవలెనయా, వి.... 128

తెలివిలేక యేల దేబిరించెదవు దైవము నెంతవారైనను తప్పింపఁగాన లేరు ధర్మరాజంతటివాఁడు దైవమును తప్పించుకొనలేక కాషాయము ధరించి కంకుభట్టు ననుకొని సాటివిర

టుని కొల్చెను కావున కాలకర్తగతులు కనిపెట్టి మెలఁగవల యును.

ఆ కట్టె పైనున్నఁ గట్టెకు ఘనమేమి?
చెట్టుపైన ఘనముఁ జేరఁగలఁడె
కట్టె చెట్టు రెండు గలసె దైవంబులో, వి ...129

అశాపీడితులై మిద్దెల మేడలు నని యేర్పచుందురు కట్టె పైనున్న నింకొక కట్టెం ఏమి ఘనము నచ్చెను? మేడ గాదను కొమ్మ చెట్టుపైన (అనఁగా అంతియెత్తున) నున్నను ఘనతఁ గాంచఁగలఁడా? లేదు ఎవని కీకట్టెయును ఆచెట్టును దైవములో కలియునట్టివై యుండును గావున నజ్ఞానివై సుఖముల కాశింపకుము

ఆ కట్టెయందు నిప్పు గానసిచంద మీా
తనువునందు నాత్మఁ దగిలియుండు
మఱుగు దెలిసిపిదప మార్కొనవలెనయా, వి

అజ్ఞానులు తెలిసికొనఁజాలరు గాని దైవము మనశరీరములోనే ఇమిడి యుండును ఎట్లనఁగా కట్టెలో నిప్పు ప్రత్యేకముగా కనఁబడక యున్నట్లు శరీరములో చేరి యాత్మ యుండును. కావున ఆత్మయున్న రహస్యమును ముందెఱిఁగి ఆ పిదప స్వాధీనము చేసికొనవలయును

ఆ కడక నఖిలములకు నడినాళమందున్న
వేగుఁజుక్కవంటి వెలుగుదిక్కు
వెలుగుకన్న దిక్కు వేఱెవ్వ రున్నారు, వి....131

సమస్తప్రపంచమునకు ఆధారమై బ్రహ్మానాళము నంటి యున్నాఁడు దేవుఁడు ఆదేవుఁడు తెల్లవారుజామున మొలచు చుక్కలాగున వెలుగుచున్నాఁడు ఆయనయే మనలను దిక్కు. నిక్కముఁ బరికించిన నంతకన్న వేఱెవ్వరును లేరు

ఆ. కడగి పట్టియూస కడతేఱనీయదు
ఇడుములందుఁ బెట్టి యీడ్చుఁగాని
పుడమిజనులభక్తి పొడమంగ నీయదు, వి....

ఎప్పుడును ఆశకుఁ జిక్కిపోకుము అయ్యది నిను మేలు చేయుదానిఁబోలి కావలయునని ప్రయత్నించి నిన్ను గట్టెక్క నీయదు నిన్ను ఎప్పుడును ఆపదలలో వైచి పడ నీడ్చుచుం డును నిన్నే కాదు భూలోకమునందలి జనులకు భక్తినే కుదుర నీయదు

ఆ. కడుపు కేల మనస కలవళపడియెదు
కడుపు కేడ దృప్తి కలుగుచుండు
కరపరాతిలోనికప్పకుఁ గలుగదా?, వి.... 133

ఛీఛీ! పాడుమనసా! ఈపొట్టకై రాత్రింబవళ్లు ఇంతగా ఏల దుఃఖించెదవు? పట్టెడన్నము దొరకకపోదు ఒకవేళ దొరకుచున్నను నీకు తృప్తియనమాటయైనను లేదు విచారిం చుము నల్లరాయిలోని కప్పకు నైవేద్యము నీయలేదా? కావున చింతింపకుము

ఆ. కనకమృగము భువిని గలుగ దంచెఱుఁగఁడా?
రాముఁ డెఱుక గల్గురాజు గాఁడొ?
చేటుకాలమునకు చెడుబుద్ధి పుట్టెడు, వి.... 134

ఎంతటి బుద్ధిమంతుఁడైనను కానిమ్ము దైవమాయను దాఁటఁ జాలఁడు ఎట్లంగురా? చూడుఁడు రాముఁ డంతటిమేధావి యయ్యును బంగరులేడి ఏలోకమునను లేదని యెఱుఁగఁడా? లేక ఎఱుకగలవాఁడు కాఁడా? కాకేమి? కావున చెడుకాలమునకు చేఱుబుద్ధి పుట్టుచుండును

ఆ కాల మధికమైనఁ గడచిపోవఁగ రాదు
ధర్మరాజుఁ గొల్చె తగనిచోటఁ
కంకుభట్టనంగఁ గటకటా యేమన, వి.... 135

తన ప్రయత్నముకంటెను దైవబల మాధికమైనచో నెంతటి వాఁడైనను తప్పించుకొని పోరాగు. ధర్మరాజంతటివాఁడు దైవమునకు బద్ధుఁడై కంకుభట్టునికొని సేవించెను ఇఁకను తక్కిన వారిగూర్చి యేమని చెప్పవచ్చును?

ఆ కలియుగమునఁ బట్టి కడతేఱఁగా లేక
యొడలు జడలఁజేసి యుగ్రతపము
తమరుచేసి యేమి తత్త్వంబు గనలేరు, వి....

తపములు దానములు మున్నగువానిచేత దైవమును తల క్రింద చేయఁబూనుట వెఱ్ఱితనము ఈకలియుగములో పుట్టినందుల కెట్టులో కడతేఱవలయును; గాని యుగ్రముగా తపంబుఁ బూనుట తప్పిదము. చేసినమేలందురా? చేసినవారేమి సంపాదించిరి?

ఆ. కాఁగలపనులెల్ల కా కెట్లుపోవును
కానిపనులు కాను కావు భువిని
మహిమ వేఱ గలదు మనతోడ నున్నదా?, వి

దైవబలమునకు మారుచెప్పుటను లేనే లేదు అతని యుద్దేశమే కొనసాగును అతఁడు కావలయునని తలఁచినవి కానే యగును కానివి కానే కావు కావున కార్యసాఫల్యము మదిలో లేదని తెలియవలయును

ఆ. కసవుఁ బసికి చేసె గాలి ఫణికిఁ జేసె
మన్నెరలకుఁ జేసె మఱవ కెట్లొ
కుంభినీజనులకుఁ గూడెట్లు చేసెరా, వి.... 138

దైవసృష్టి విచిత్రము ఆయన సృష్టిలో నేమియును లోపమును చేసియుండలేదు పశువులను సృజించెను కసవును పుట్టించెను. సర్పమును పుట్టించెను దానికి ఆహారముగా గాలిఁ జేసెను మన్నెఱ్ఱలకు ఆహారముగాఁ జేసెను అట్లే భూమిలో ఎల్లవారికిని కూడును గూడ సృజించెను

ఆ. కానలేఁడు నుదురు కర్ణముల్ వీపును
నెఱులఁ గాన లేఁడు నెత్తిమీఁద,
తన్నె కానలేఁడు దైవము నెఱుఁగునా?,వి ....

మనుజుఁడు అజ్ఞానియై దైవమునకు ప్రతిఁజేయుచుండును గాని తనసామర్థ్యమును తా నెఱయఁడు తనచెవులను వీపును నెత్తిమీఁదనుండు వెండ్రుకలను గూడ గనఁజాలఁడు అట్టి తన్నే తా నెఱుఁగనివాఁడు దైవము నిఁక నెట్లెఱుఁగఁగలఁడు?

ఆ. కానలేరు గాని కలియుగంబున నున్న
మనుజులందఱికిని మాన మొకటె
దార్ఢ్యమున్నయెడల దైవంబుఁ జూచును,వి....

మనుష్యులు అజ్ఞానవశులై "అందఱు నొక్కటే అందఱి కును సమానముగానే సుఖదుఃఖములు కలుగును" అని తెలిసి కొనలేకపోవుట యొక్కటిమాత్రమే కాని మానవసంపదఅగును సమానమే తనకు దైవభావములను చూడ శక్తిగలిగినయెడల దైవమును సమానముగా చూచును

క కాలగతి యెంతవారికి
వాలాయము చులకఁదనము వచ్చుట యరుదా?
వ్రేల గిరినెత్తు కృష్ణుఁడు
తేలఁడె వటపత్రమందు తెలియుము వేమా!

ఎంతగొప్పవారికైనను కాలగతిని తప్పించుకొనుటకు శక్యము కాదు సమస్తప్రపంచమునకు ఆధారభూతుఁడైన కృష్ణుఁడు ఒక్కవ్రేలితో పర్వతమును మోసెనుగదా! అట్టివాఁడు సైతము కాలమునకు కట్టుపడి పత్రమునందైన తేలఁడా?

ఆ కాలచక్ర మెఱుఁగఁగా లేక యెప్పుడు
సంధ్యజపము చేయుజాణలార
సంధ్యజపములోనిజాడ లెట్లుండును?, వి....142

"ఈసమయ మెట్టిది? ఇప్పు డేమి చేయవలయును? కాలము నారాధించుట యెట్లు?" అని కాలచక్రపుమాహాత్మ్యమును తెలుసుకొనఁజాలక సంధ్య జపము చేయునట్టి జాణలారా! సంధ్యజపములో జాడ లెట్లుండునో చెప్పఁగలరా?

ఆ కాలచక్ర మెల్లఁ గలవారిమన సెల్ల
సాగి తిరుగుచుండుఁ జంచలించి
చక్రగతిని విడువ స్తంభించు మన సప్డు, వి....

లోకులు తమంత దాము మనస్సును సుదర్శికొని యున్న సాధనములతో కార్యమును సాధించికొనఁ గవురవలయునే కాని ఎప్పుడో సమయము వచ్చునని ఎదురుచూచుచుఁ గూరు చుండఁగా రాదు కాలమును కలవారిమనస్సు ఒకరీతిగా నుం డేది కాదు ఎప్పుడును చంచలములై తిరుగుచుండును కావున చక్రగమనమును విడిచిపెట్టిన మానస్సు కుదురుబడి కార్య సిద్ధి కలుగును

క. కాలము కాల మటనకను
మేలుగ తా నొక్క రీతి మితిమీఱఁగఁ దాఁ
గాలు నెదురొక్కను జప్పిని
వాలాయము శివుని గూడి వర్ధిలు వేమా!

దైవము దైవమని కొండఱు కాలము నెగుచు చూచుచుం దురు బుద్ధిమంతులగువారట్లు లెప్పుడో కాలము మంచిదగును దైవ మనుగ్రహించు నని కూర్చొనక సాధ్యమైనంతవఱకు ప్రయత్నము చేసి మరణము లేనిమార్గము నారసి ముక్తినందుట మంచిది

ఆ. కాళ్లమ్ముంద తేరు కడ కీదఁగా లేక
ముగ్గురీతగాండ్రు మునిఁగినారు
నరుఁడె యీదు నన్న నగుబాటు గాదొకో, వి.

దైవకృతము నెట్టివారైనను తప్పించుకొనఁజాలరు సర్వ శక్తియుతులగు త్రిమూర్తులంటివారలే సంసారమనునదిని దాటలేక నిమగ్నులై పోవుచుండగా ఇఁక సామాన్యుఁడగు మనుజుఁడు ఈదునని చెప్పుట నవ్వులచేటు గాదా!

ఆ. కీలకము లడంచి బైలెఱింగినవాఁడు
సింధుపుత్రిమాయఁ జిక్కె నతఁడు
శౌరియంతవాఁడె జనులకు శక్యమా?, వి....

విష్ణుమూర్తి యంతటివాఁడు పరమయోగియై సమస్తలోకములను బోఁదోలి బ్రహ్మము నెఱింగినవాఁడగు వ్యాసు శౌరియు యయ్యును లచ్చిమాయలలోఁ జిక్కెనఁగా సాధారణజనులు మోహమును గెల్వలేరనుటలో నాశ్చర్యమేమి కలదు?

ఆ కుక్క యే మెఱుంగు గురులింగజంగంబు
పిక్కఁ బట్టి యొడిసి పీకుఁ గాక
సంతపాకతొత్తు సన్యాసి నెఱుఁగునా?, వి .. 147

మూర్ఖులు ముముక్షుని చూచి పరిహాసింతురే గాని యాతనికి గల్గినమోహమును గుఱుతింపఁజాలరు ఎట్లనఁగా అశుద్ధమును భక్షించెడి పందజాతి ఎటువంటి గురువులే జంగములే యని సన్మానించునా? సన్మానింపదు కండలు వెదకివచ్చునట్టులు పట్టుకొని పీకవేట్టును సంతపాకతొత్తు సన్యాసులను (అనఁగా స్వాములవారిని) తెలిసికొనఁ గలుగునా? తెలిసికొనఁజాలఁదు

ఆ. కూటవాసి యగుచు గుణములఁ బచరించి
నీటనీడవలెను నిలిచియుండు
నుదకఘటములందు నుపరిసూర్యునిబోలె, వి.

దైవము ఇక్కడనక్కడయని లేక సమష్టిని సర్వవ్యాపియై గుణములచే నొప్పుచు నుండును నీటిలోని నీడచొప్పున సాక్షిమాత్రుఁడై యొప్పుచుండును నీటికుండలలోని సూర్యుఁ డొక్కఁడైనను భిన్నులుగ నగుపడునట్టులు ఈశ్వరుఁ డుపాధి భేదమున వేర్వేరుగా గాన్పించుచుండును.

ఆ. కోరి ద్రుపదుపుత్రి కొప్పుపట్టీడ్చిన
సింహబలునిచావుఁ జెప్పఁదరమె!
ముగియుకాలమునను మొనగాఁడు నిల్గఁడా?, వి

కర్మములను చేయునప్పు డొడ లెఱుంగక యహంకరించి చేయును కాని ఫలకాలమున నెంతటి మొనగాఁడైనను దైవదత్తమగు నాఫలము ననుభవింపక పోఁజాలఁడు ఎట్లందురా? చూడుఁడు కావలయునని పొగరుచేత ద్రౌపదిని కొప్పుబట్టి యీడ్చి కీచకుఁడు అఘము ననుభవింపక తప్పించుకొనెనా? లేదు గదా!

ఆ కొండరాళ్లఁ దెచ్చి కోరికఁ గట్టిన
గుళ్లలోన దిరిగి కుళ్లనేల?
పాయరాని శివుఁడు ప్రాణమై యుండఁగ, వి....

కొండరాళ్లతోఁ జేర్చినగుళ్లలోఁ బడి యేల కుళ్లి చచ్చెదరు? పాయఁజాలని శివుఁడు ప్రాణమై మిమ్ములను చుట్టికొనియే యుండినను మూర్ఖులై చెడిపోయెద రేల?

ఆ. కొడుకును బ్రతికించుకొనలేఁడు శంభుండు
కొడుకును బ్రతికించికొనఁడు శౌరి
దైవబలము లెల్ల దానసే గనుపించె వి, ....151

సమస్తజగములను సృష్టింపఁగలిగిన నీశ్వరు నంతటివాఁడైనను దైవబలము నుల్లంఘింపఁగాఁజాలఁడు శివునంతటివాఁడు కొమరుని బ్రదికించుకొనెనా? విష్ణువునంతటివాఁడు మన్మథుని బ్రదికించుకొనలేకపోయెను. దీనివలన తక్కినబలము లన్నిటికంటెను దైవబలమే బలిష్ఠమని తెలియుచున్నది.

ఆ. కొండదండిమామ కొండకూఁతురె యాలు
కొండమేటివిల్లు కొండయిల్లు
కొండవంటిదొరయు గుండయి పోయెరా, వి ...

దైవబలముముందవటి నెవ్వరిబలము నేమాత్రము నుపయోగింపదు ఈశ్వరుని యుదాహరణముగా తీసికొనుఁడు ఆయన దారిద్ర్యమును తప్పింపఁ గలిగెనా? ఆయన మామగారు నిశ్చలుఁడగు హిమవంతుఁడు కొండపట్టియగు పార్వతి పెండ్లాము కొండయేవిల్లు అయిన నంతవాఁడైనను దైవబలముముండటి కొండుకను పనికిరాక చూర్ణై పోయెను

ఆ గతము చేసినట్టికర్మబంధము లెల్లఁ
బరిసిపోవు సత్యగురినివలనఁ
కుమ్మరి కొకయేఁడు గుదియకు నొకనాఁడు, వి....

ఎన్నిపాపములను చేసియున్నను ఎట్టికర్మబంధములు అడ్డుపెట్టుచున్నను అవి యన్నియును యథార్థముగా గురులక్షణములు గలసద్గురునికృపచేత హరిసిపోవును ఎట్లందురా? సంవత్సరమంతయును నగిషీ తెచ్చి చేసిన కుండలన్నియును ఒకదినములో గుదియపాటుఁ గూలుచుండును గదా! అట్లుతే

ఆ గతముఁ జూతమన్నఁ గలదన్నయర్థంబు
నడచుకాలమేని నమ్మరాదు
క్షణములోని బ్రదుకు సంసారవిభ్రాంతి, వి....

ఈ ప్రపంచమంతయును కేవలము బూటకముగా గనుపించుచున్నది ఇందు దినుమంతయైనను సత్యపదార్థము గన్పట్టదు గతకాలమును పరికించినఁ గలలోనిధనమువలె నదృశ్య ముగు

చున్నది. రాఁబోవుదాని నెఱుంగనే యెఱుంగము కదా ! పైని వర్తమానమునుకూడ నమ్మఁదగు విలువపడదు క్షణకాల మీ బ్రదుకు సంసారమంతయును భ్రాంతికరము. కావున పరముఁ గనుము

ఆ. చక్రధరుని వేడి జలధి దాఁటఁగవచ్చు
విక్రుతమైనబుద్ధి వెతలఁ బెట్టు
నక్ర మెన్న గజము నయమార భక్షించు, వి....

అత్యంతము నను గుణాఢ్యములగు పనుల నైనను చేయవచ్చును గాని దైవబలము నల్లంఘింప నసాధ్యము ఎట్లందురా ? విష్ణువును ప్రార్థించి వరము నొంది సముద్రము నైనను దాఁటవచ్చును వికృతి గరుబుద్ధిని వెతలఁ జిక్కింపవచ్చును మొసలి ఏనుఁగునంతటిదానినైనను భక్షించును కావున దైవబలము నెంతటిసమర్థము లైనపనులనైనను పడఁద్రోయును

ఆ. చర్మమునకు స్పర్శ చక్కఁగా తెలియదు
కర్మముల్ పొసగుటఁ గానఁ గలఁడె?
చర్మకర్మములుండు జగతిని నరులకు, వి.... 156

మనుజుఁడు ఎఱుఁగకయే పాపముల నాచరించును. చేసినవానిని మఱల గుఱుతింపలేఁడు అచేతన మగుచర్మమునకే ఒక్కొక్కప్పుడు దానిసహజగుణమగు స్పర్శజ్ఞానముఁ దెలియఁజాలదు ఇఁక మనుజుఁడు కర్మములఁ గానఁగలఁడా ?

ఆ. చిప్పలోనఁ బడ్డచినుకు ముత్యం బయ్యె
నీటఁబడ్డ చినుకు నీళ్ల గలసె,
బ్రాప్తము గలచోట ఫలమేల తప్పురా?, వి....

వస్తువులు ప్రాప్తిలేనివానియొద్దకు వచ్చినను ఫలము నీయవు ప్రాప్తి గలవాఁట ఫలము నీయక తప్పించుకొనఁజాలవు. ఎట్లందురా? చూడుఁడు వర్షము కురియుట అన్నియెడలను గలదు ఆవర్షము నీటిలోఁ గురిసిన నీర్తై ఏమియును ఫలము కన్పింపకపోవును ముత్యపుచిప్పలోఁ బడినా ముత్తియ మగును.

ఆ చిలుకగర్భమందు శ్రీశుకుఁ డుదయించి
మునివరేణ్యులయందు ముఖ్యుఁ డయ్యెఁ
బ్రత్తికాయఁ జిత్రపటములు పుట్టవా, వి ...158

మహానుభావులగువా రొక్క యుత్తమకులములనే గాక నీచకులములందును పుట్టుచుందురు అందువలన వారిసామర్థ్యమున కేకొంతయు నుండదు చూడుఁడు చిలుకగర్భమునందు శ్రీశుకులవారు పుట్టిరి సమస్తమునులకు ముఖ్యుఁ డయ్యెను ఇట్లులనే బ్రత్తికాయ యెంతటిదో చూడుఁడు దానివలన చిత్రవిచిత్రములగు బట్టలు పుట్టుట లేదా? అట్టులే

ఆ చీమ కుట్టినేని జివ్వు కనుపించును
చీమ యెంత దాని సృష్టి యెంత
చీమవంటివాని సృష్టిలో నెఱుఁగుము, వి....

దేనినైనను చూచినమాత్రాన నలక్ష్యము సేయకుము. దైవబలము అన్నిఁటియందును గలదు అయ్యది యలంఘ్యము. నొకచీమను ఉదాహరణముగా తీసికొనుము అది మనశరీరముతోఁ బోల్చిచూచిన ఎంతపాటిది? అయిన నది కుట్టినా చివుకు మనిపించును కాన చీమవంటిసామర్థ్యముగల ఈశ్వరు నెఱిఁగి మెలఁగుము

ఆ. చేటు వచ్చువేళఁ జెడనాఁడు దైవంబు
మేలువచ్చెనేని మెచ్చుకొనును
గరిమ మేలుకీళ్లు కావటికుండలు, వి.... 160

మూర్ఖుఁడు తన కీడయినను చెడుగుగలిగిన దైవము చేసె నని తిట్టును మేలు కలిగిన తన ప్రభావమును తానే మెచ్చుకొనును. అని ఈ మే లీతనిదా? కాదు. దీని కంతకు దైవబలమే మూలకారణము. ఆ యనుగ్రహముచేత మేలుకీళ్లు కావటికుండల వలె ముందు వెనుకలగును.

ఆ. చేయఁదగినవేళఁ జేసెడికార్యంబు
వేగపడి యొనర్ప విషము దాను
బుడమకాయచేదు ముదిసిన తీపయ్యు,వి....161

ఏపని నెప్పుడు చేయవలయునో యని పెట్టి చేయుచుండ వలయును చేయఁదగినసమయములలో చేయుకార్యము త్వర నొంది యుండును గా చేసిన పనులును కసకాయను గోసిన చేదు పుట్టును గదా! అట్లే

ఆ చుట్టుగోడఁ బెట్టి చెట్టుఁ జేమయుఁ గొట్టి
యిట్టునట్టు పెద్దయిల్లుఁ గట్టి
మిట్టిపడును మీఁదిప ట్టెల యెఱుఁగఁడో,వి ...

జనుఁ డజ్ఞానియై సర్వమును తనవశమునందే యుండు ననియును తాన యీ ప్రపంచమున స్థిరుఁడుగా నుండువని యుఁ దలఁచి చెట్టుచేమఁ గొట్టి పెక్కుకష్టముల ననుభవించి యింటి నొకదానిఁ గట్టి మిట్టిపడును; కాని రానున్నదాని నెఱుఁగఁ జాలఁడు

ఆ చూపు కొంచెమైనఁ జుక్కలు కాన్పించు
ప్రాపు వెలుగు లేదు పరువు గాదు
జ్ఞానదీపమువలెఁ గన్నులకును దోఁచు, వి....

దైవస్వరూపము వివరింప నశక్యమై యుండును అయ్యది లఘువుగా కన్పట్టును అయినను చుక్కలు గన్పట్టును అద్దానికి మూలాధారమగు వెలుఁగు లేదు కేవల జ్ఞానదీపశిఖవలె కన్నులకు కన్పట్టుచుండును

ఆ. జ్ఞానవంతుఁ జూచు సత్కర్మబుద్ధులు
వెఱ్ఱియండ్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కవనిఁ బ్రకృతి వెదకినఁ గల్గునా? వి... 164

కర్మబద్ధులగువారు జ్ఞానప్రకాశునిఁ జూచి నిజము నెఱుఁగఁజాలక వెఱ్ఱివాఁడని యనుచుందురు, కాని వెఱ్ఱివానికి ప్రకృతి లోకమున నున్నదా?

ఆ జ్ఞానుల మని యెంచి చపలాత్ము లగువారు
తెలివిలేమి తమ్ముఁ దెలియలేక
కష్టగహనమందు గట్టిగాఁ జిక్కిరి, వి.... 165

మూర్ఖులై లోకమునందు తామె జ్ఞానులమని యెంచుకొనుచు చపలురై తమ్మును తాము గుర్తింపనేరక కష్టగహనములఁబడి తిరుగుచుందురే గాని దైవస్వరూపము నెఱుఁగ జాలరు

ఆ తనకులేనినాఁడు దైవము దూరును
తనకుఁ గలిగెనేని దైవ మేల?
తనకుఁ దైవమునకుఁ దగులాటమే శాంతి, వి.

మనుజుఁడు తనకు వీలగునంతవఱకును తానే యన్నిటికిని మూలమనుకొనును తన ప్రయోజకత్వము కొనసాగనినాఁడు దైవమును నిందింపఁబూనుకొనును. ఇయ్యది కేవలము మూర్ఖత్వము. తనకును దైవమునకును గలసంబంధమే శివము దానిఁ దెలియఁ జాలరు

ఆ. తనకు ప్రాప్తిలేమి దాత లీయక యున్న
దోషబుద్ధిచేతఁ దూఱు దెల్ల
ముక్కువంకఁజూచి ముకురంబు దూఱుట, వి....

తనకు దొరకఁదగినయదృష్టము లేనియప్పుడు తెలివిమాలినమనుజుఁడు దైవమును దాతలను దోషబుద్ధియై నిందింపఁ బూనుకొనును నిజముఁ బరికించిన నిది యుచితము గాఁ జాలదు ఎట్లంగురా? చూచుఁడు అద్దములో ముక్కు వంకరగా గానుపించిన యద్దమును తిట్టవచ్చునా? కూడదు కదా! అట్టులే

ఆ. తనదుమనసుచేతఁ దర్కించి జ్యోతిష
మెంతఁ జేసె ననున దెంచిచూడ
తనయదృష్ట మెల్ల దైవంబ యెఱుఁగును, వి....

తనకు తానె ముహూర్తమునఁ బెట్టుకొని కార్యసాఫల్యముఁ గాంచఁజాలక జ్యోతిష మెంతటియాపదఁ దెచ్చిపెట్టె నని యనుచుందురు కాని తనకు ఫలాఫలములు గలుగుటయును అదృష్టమట్లగుటను దైవమే యెఱుంగునని మూర్ఖుఁ డెఱుఁగఁజాలఁడు

ఆ. తనువు తను వటంచుఁ దపియింత్రు జనులార
తనువు లస్థిర మని తలఁపరాదె

తనువు కొనఁబడమిఁ దగులునా మోక్షంబు, వి.

శరీరము శరీరము అని రాత్రింబవళ్లు పరితపించుచుందురు మూర్ఖచిత్తులగు జనులారా! ఆశరీరము లస్థిరము లని తలంపరాదా? శరీరము నిక్కముగునది ఏదియో గానరాక మోక్షము దొరకునా? దొరకదు

ఆ తన్నుఁ దా నెఱుఁగడు తా నెవ్వరికి నేర్పు
ప్రాలుమాలి తిరుగుపశువుకొడుకు
కాసులకొఱకైన గర్మముల్ గట్టునా?, వి....

ధనలుబ్ధులై ప్రపంచమున నుపదేశము నొసంగెద మని బయలుదేఱుచుందురు ఎంతటి మూర్ఖులో చూడుఁడు తన్ను తా నెఱుఁగఁజాలఁడు కాని తాను నేర్పఁజూచును ఎవ్వరితని యుపదేశముల వినెదరు? ఇంతియు త్రిమఁ దెలియఁజాలక తొత్తుకొడుకు తిరుగుచుండును ఇవి యన్నియును ధనలోభమువలననే కలుగును కదా!

ఆ తలఁప వశము గాదు దైవంబు బ్రహ్మంబు
తెలియరాదు బ్రహ్మదేవుకైన
నిసుకబావి త్రవ్వ నెవ్వరివశమయా, వి.... 171

దైవరూపమగు బ్రహ్మమును కన్నులతో గాంచుటకు అశక్యము సరి కదా! మనస్సుతో నాలోచించుటకును అశక్యమై యుండును బ్రహ్మదేవునంతటివాని కైనను వశము కాదు ఎట్లనఁగా ఇసుకలో బావి త్రవ్వుటకు ఎవరు శక్తు లగుదురు?

ఆ తల్లితండ్రిపూజ దాఁటఁ గనక కొంత
పాపరూపమందుఁ బడుట యేల

దానధర్మములకు దైవంబు తానాయె, వి....

దానములకు గాని ధర్మములకు గాని దైవము కారణము. అట్టిదైవము తల్లితండ్రులస్వరూపమున నున్నాఁడు మనుజులు మూర్ఖులై ప్రత్యక్షదైవతము లగు తల్లిదండ్రుల పూజింపక యేలకో పాపకూపములఁ బడిపోయెదరు ?

ఆ. తాము నిలుచుచోట దైవము లేఁడని
పామరజనములు తిరుపతుల కరుగ
జోగి జేయు చేతిసొమ్మెల్ల బోఁజేయు, వి.... 173

మనుజుఁ డెన్నిచోట్ల కేఁగినను దైవము సమానముగనే ప్రతిఫల మిచ్చుచుండును. ఎట్లందురా ? చూడుఁడు మూర్ఖులై కొందరు పామరులు తాము నిలుచుచోటుల దైవము లేఁ డని తిరుపతులకు దేవస్థానములకు పోవుచుందురు అట్టివారు ముక్తి లేక జోగియగుట యట్లుండగ చేతిలో నెట్టిదియో గాని సైనను లేకుండునట్లు ఖర్చు చేసికొని బిచ్చగాండ్రయ్యెదరు

ఆ. దశరథుండు రామధరణీశుపట్టంబుఁ
గట్టఁజేయఁదలఁపఁ గట్టె జడలు
తలఁపుమనది గాని దైవికమది వేఱె, వి.... 174

మనుజుఁ డెన్నివిధములఁ బ్రయత్నించినను దైవగతియే నెగ్గుచుండును చూడుఁడు దశరథుఁడు గొప్పచక్రవర్తి అంతటివాఁడు రాముని పట్టము గట్టుటకు ప్రయత్నము చేసెను, కాని దైవము జడలు గట్టచేసెను కావున కోరిక మనస్వాధీనమైనది గాని కొనసాగుట దైవనిదశమె యని యెఱుఁగుడు

ఆ. దాచినధనముకుఁ దానును కొడుకులు

వాంఛపడుట కాని వట్టిభ్రమలు
భాగ్యహీనునకును ఫలము లభించునా, ...వి

మనుజులు తెలివితేమిచేత దాచిపెట్టినధనమునకు తామును తమకొమరులును వారసులని భ్రమింతురే గాని ఫలముమాత్రము లభింపదు ఏలయని యందురా! భాగ్యము దైవాయత్తము కాని మనుజుని స్వాధీనము కాదు కావున భాగ్యహీనునకు ఫలము లభింపదు

ఆ దానధర్మములకుఁ దగు తేపు తేపని
కాలవ్యయము సేయుకష్టజనుఁడు
తాను నేమి యౌనొ? తనబ్రదు కేమౌనొ?వి....

మనుజుఁడు తానే స్థిరుఁడ ననుకొని బ్రతికియున్నంతలో దానధర్మములను చేయక రేపు రే పని కాలమును జరిపి కష్టపడుచుండునే కాని తా నేమి యగునో, తనబ్రదు కేమి యగునో యని విచారింపఁడు

ఆ. దైవమతుల నరులు తమవంటివా రని
యరసి గూఢతత్వ మెఱుఁగ లేరు
ఇల్లు మూయఁబడిన నెట్లు మర్మ మెఱుంగు, వి.

దైవబుద్ధి గలపెద్దలను చూచి మూర్ఖులు వారిని గూడ తమవంటివారినిగనే తలఁచి పరిహసించుచుందురే గాని చక్కగా విచారించి యందలి రహస్యము నెఱుంగఁజాలరు ఇల్లు మూయఁబడిన పిమ్మట ఇంటిలోని నిజస్థితి తెలియఁజాలరు గదా? అట్లే వీరును

ఆ ధనమదంబుచేత దైవంబు నెఱుఁగరు
కుటిలభావ మొంది క్రూరజనులు
మదము మించినంత మన్నన లేదయా, వి....178

మూర్ఖులై మేము ద్రవ్యము కలవారము కదా! యని మదించి దైవమును నక్రబుద్ధులై గుర్తెఱుఁగక క్రూరులై మెలఁగు చుందురు అట్టివారికి గతి లేనేలేదు. ఏల ననఁగా మదము మించినమాత్రాన వారికి మన్ననయే లేదు

ఆ ధరగ్రహములు రాశి చరియించు చుండిన
మంచిచెడుగు గానుపించుచున్న
బుద్ధిమయత్నమనుచు బొంగుదు రేలరా? వి....

భూమియందు గ్రహములు నక్షత్రములుఁ దెటివే యస్వాధీనగమనమున ప్రత్యక్షముగా తిరుగుచుండినప్పటికిని మంచి చెడ్డలు వేరువేరుగా నగుపించుచున్నప్పటికిని మూర్ఖజనులు అంతయును పురుషప్రయత్నమని బోరగిలఁ బడుచుందు రందుఁకో తెలియదు

ఆ. దైవకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను చాలఁ దనిసి
కడకు తాను మేలు గానక చెడిపోవు, వి....180

దైవమును నిందించువాఁ డెప్పటికిని బాగుపడఁజాలఁడు. అట్టివాఁడు కేవలమును ధనకారణమువలన గర్వించి సమస్తసంపదలను తృప్తుఁడై చివఱకు తనంత తానే మేలును పొందక చెడిపోవఁ గలఁడు.

ఆ ధర్మబుద్ధిచేత దైవంబు తెలిసినఁ
గాలుఁ డేమిసేయఁగలఁడు ప్రజల
ధర్మమంటి వెంట దైవంబు నుండును, వి.... 181

ధర్మాధర్మములఁ బరికించి ధర్మవర్తియై దైవ మిట్టిది యని తెలిసికొనినవానిని యమధర్మరాజయినను ఏమియును కదల్పఁ జాలఁడు దైవ మెల్లప్పుడును ధర్మము ననుసరించియే మెలఁగుచుండును

ఆ. నక్క నోటికండ నదిలోనిమీనుకై
తిక్కపట్టి విడిచి మొక్కు చెడఁగ
ముక్కునపడి గ్రద్ద మాంస మెత్తుక పోవు, వి....

దైవగతుల నెఱుఁగ నెవ్వరికిని శక్యము కాదు నక్క యొకటి నోటితో మాంసఖండము కఱచుకొని దైవము చేవంచి తమ్మై యేటిలోని చేపను పట్టుకొను బుద్ధిని నోరు తెఱచెను అంత నది పడిపోయెను ఆసమయమున గ్రద్ద యామాంసమును తన్నుకొని పోయెను. ఎవనిసొమ్మెవనికి ప్రాప్తమో చూడుఁడు

ఆ నీళ్లమీఁద నోడ నిలచి తిన్నఁగ సాగు
బైట మూరెఁడైనఁ బ్రాక లేదు
నెలవుఁ దప్పుచోట నేర్పరి కొఱగాఁడు, వి.... 183

సమయము ననుసరించి మనుజుల ప్రయత్నములు ఫలించుచుండు నేగాని యితరమువలనఁ గాదు ఎట్లందురా? చూడుఁడు. నీటిలో పోఁగలయోడ గట్టెక్కిన మూరెఁ డైనను పోవఁజాలదు. అట్లే మనుజుఁడును నెలవుదప్పిన పిమ్మట నేర్పరి కాఁజాలఁడు.

ఆ. నీళ్లలోన మొసలి నిగిడి యేనుగుఁ బట్టు
బయటకుక్కచేత భంగపడును
స్థానబలిమి కాని తనబల్మి కాదయా, వి....184

మనుజుఁడు స్థానమును కాలమును దైవము ననుసరించి మెలఁగవలయును. అట్లయిననే ఫలసిద్ధి గలుగును. నీళ్లలో నుండి యేనుగును పట్టుకొనునంతటిబలము గల మొసలియును నీటినివదలి బయటఁ బడినేని కుక్కలచేతఁ జిక్కి చావఁ గలదు. కావున స్థానబలము ప్రధానము గాని తనుతఘుబలములు ప్రధానములు కావు. ఈస్థానబలముకూడ నొకవిధమగు దైవబలమే.

ఆ నొసట వ్రాయువాని నొసలు కొంచెము సేయు
నొసటికంటె వాని నొసలు వ్రాత
నొసటిమీఁది వ్రాత నులిమినఁ బోవునా?, వి....

ముఖముమీఁద వ్రాయును ఈశ్వరుఁడు కాని ఆనొసలు అత్యల్పమే. నొసటికంటెగూడ నద్దానిపైని వ్రాసినవ్రాఁతయే యెక్కుడది. అయ్యది తుడిచినను పోక ఫలము నిచ్చునట్టిది. కావున బలవత్తరము

ఆ. పరగఁ దా నొసఁగఁడు పరులు చెప్పిన నైన
నీయఁజాలక విధి నెసఁగువాఁడు
పొట్టు దినెడులండి బువ్వలు పెట్టునా?,వి....186

మనుజుఁడు ఒకొక్కఁడు తాను కలవాఁడైనను దైవబలవంచితుఁడై లుబ్ధుడగుచుండును. అట్టివాఁడు స్వయముగా గ్రహించి తా నీయఁడు సరి కదా! పైన ఇతరులు చెప్పినను వినఁడు. వాఁడారీతిని చావవలసినవాఁడే యగును. ఎట్లందురా?

చూడఁడు పోఁడు గూడ భక్షించుచుండి యన్నమును దానము చేయఁడా చేయుఁగదా! యట్లైతే

ఆ పరభృతమ్ము కాకపాలితమైనట్లు
దారిఁ జూపవలయుఁ దద్జ్ఞుఁ డొకఁడు
తొంటిజన్మఫలము తుద కట్లు లొప్పిన, వి ...

పూర్వజన్మసుకృతఫలము లెట్లున్నను సజ్జనుఁడగువాఁ డొక్కఁడైనను దారిచూపినంతవఱకు లోకులు దైవరూపమును గాని ఆత్మతత్త్వమును గాని తెలియఁజాలరు ఎట్లనఁగా కోకిల కాకముచేత పెంపఁబడుచున్నను పెఱుఁగఁజాలని యట్లు.

ఆ ప్రళయకాలమందుఁ బ్రమథులచేతను
నష్టమైరిగాదె నాటిజనులు
తెలియనేర్పరైరి దేవుని ద్విజు లెల్ల, వి.... 188

అట్టి వ్యక్తులయు కర్మము ననుసరించి దైవము భిన్న భిన్నములగు రూపముల నావిర్భవించి ప్రపంచమున కుత్పత్తి స్థితిలయములు కలుగుచుండును అని యట్టివానిని సామాన్యులు గుర్తింపలేరు ఎట్లనఁగా మున్ను ప్రళయకాలమునందు ప్రమథులచేత నాటిజనులు నష్టమైరి కదా! వారిని అప్పటివారు దైవరూపులనుగా నెఱుఁగకపోయిరి

ఆ బల్లిపలుకులు విని ప్రజ లెల్ల తమపనుల్
సఫలము లగు ననుచు సంతసించి
కానిపనులకు తమకర్మ మటందురు, వి.... 189

లోకులు మిక్కిలి మూర్ఖులు కలసివచ్చునంతవఱకు తమ

బలము కలసిరాకున్న కర్మబలము అని యుందురు శకునములను బుద్ధిని బల్లిపలుకులు మున్నగువానిని విని సంతుష్టులై కార్యములను నెఱవేర్పక యుండి పిమ్మట కర్మము కర్మమని విలపించుచుందురు

ఆ. మరణమన్న వెఱచి మది గలఁగఁగ నేల
నిగుడు ముందటేఁడు నిన్న మొన్న
తనువు విడిచినతఁడు తనకన్న తక్కువా?, వి....190

పండితులును పామరులు ను గూడ నందఱును మరణమనిన భయము నొందుచుందు రేలయో! తెలియరాక యున్నది మరణము ప్రపంచమునకెల్లను సహజమైనదియే కదా! గడచిన దినము గతించినవారును ఆకిందటి సంవత్సరమున గతించిన వారందఱు మృతి నొందిరి. మనకంటె వారు తక్కువవారా?

ఆ. మఱియు దధిని ఘృతము మ్రానులం దనలము
సౌమ్యసుమములందు సౌరభంబు
తిలలతైల మట్లు తేజరిల్లు చిదాత్మ, వి.... 191

దైవము చిదాత్మరూపుఁడై మనము ప్రతిదినమును చూచుచుండు పదార్థముల నెల్లయెడలను వ్యాపించి వేర్పడి కనుపించుచుండును ఎట్లనఁగా పెరుగునందు నెయ్యి కలసియుండి వేర్పడునట్లే మ్రానులలో నగ్ని యంతర్భూతమై యుండి తెఱచిన బయలుపడినట్లే పూవులనుండి పరిమళము పుట్టునట్లుతే తిలల తైలము నేర్పడునట్లే ఈశ్వరుఁడును జగదంతర్భూతుఁడై యున్నను వేఱుగా వెలుగుచుండును.

ఆ. మన్ను మెత్తి కడిగి మరిరూపు గావించి

గుంటనిండఁ బూడ్చి గుఱుతు నిల్పి
మనుజు లెల్లఁ గూడి మఱి దేవుఁడందురు, వి....

ఈశ్వరుని ఆరాధకులగు భక్తులు ఏర్పఱచు రూపమే కాని స్వతస్సిద్ధమైనట్టి రూప మితర మేదియును లేదు. ఆయన నిరూపుఁడు అయినను ఆతని ధ్యానించువార లాతనికి రూపవిశేషముల నొసఁగి సిద్ధిస్థాపక గుణముల గల్గించుచుందురు. అట్టిగుఱుతునే దైవ మందురు కాని వేఱు కాదు.

ఆ మాయ జగ మటంచు మనుజుఁ డెఱుఁగ లేక
మాయలోనఁ దాను మగ్నుఁడయ్యె
మాయఁ దెలియునతని మర్త్యజ్ఞుఁ డందురు, వి....

మనుజుఁడు మోహితుఁడై ఈ ప్రపంచమంతయును మాయావిలసనమే యని తెలిసికొనఁజాలక తానుకూడ మాయయందు మగ్నుఁడయ్యెను అనఁగా ముగ్ధుఁ డయ్యెనని భావము. ఆ మనుజుఁ డెంత కాల మట్లు లున్నను వివేకి యనఁ బడఁడు. మాయ దెలిసికొనునట్టి మనుజుఁడే సర్వ మెఱిఁగినవాఁడని యనెదరు.

ఆ. ముక్తి యొవరిసొమ్ము ముక్కుమీఁదుగఁ జూడ
భక్తి యొవరిసొమ్ము భజన సేయఁ
శక్తి యొవరిసొమ్ము యుక్తిచే సాధింప, వి....134

అకృత్రిమము నలౌకికమునగు శక్తి భక్తిముక్తుల నొందుటకు యత్నింపవలయునే గాని కేవలమును దంభానుసారములగు వాని నొందయులవఁగూడదు. అట్టివారి కీప్సితములు నెఱవేఱవు. ఏమందురా? శ్రద్ధాళువగు సాధకునకు సాధ్యములగు నీశక్తి భక్తి ముక్తులు శ్రద్ధలేనివాని కబ్బుట కాతని సొమ్మా? కాదు గదా!

ఆ. ముద్ర చేతఁ బట్టి మొదటిఁ దెలియ లేక
విశ్వకర్మఁ బట్టి విడువ లేక
విశ్వకర్మ దిట్టు వెఱ్ఱులుపడుదురు, వి.... 195

యోగము నవలంబించి మూలాధారుని కనుఁగొనవలయును. ఈరీతిగ యోగము నవలంబింపలేక మూలాధారుని దర్శింపను లేక కేవలము దైవము పశుపాతియు నొనర్చునని ప్రపంచనిర్మాత యగు దేవుని మూర్ఖులు తిట్టుచుందురు అట్టివారు [illegible]ంతురు

ఆ మునిగి మునిగి మునిగి ముద్దయై ముద్దయై
వనరి వనరి వనరి వక్కి వక్కి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరై యుండుగా, వి .. 196

పరమాత్మను వివరించి చూడఁబోయిన నతఁడెంతయో చిత్రముగా నుండును. ఆయన ఈప్రపంచమునందు ఏయేవస్తువులలోఁ జేరి యున్నాఁడు? అని కనుగొనుటకై యెంతగా ధ్యానము నవలంబించి యవలంబించి చూచినను ఎంతగా నలసట నొందినను ఎన్నివిధముల కృశించినను ఎన్నిక్షేత్రములు తిరిగినను దీనితోఁపాటు భ్రమరియై వేర్పడకయే యుండును

ఆ మొక్కఁ జేసెడువాఁడును మేను మరప
నిద్రఁబోఁ జేయువాఁడును నిఖిలగతులఁ
జూపి యిల బద్ధులను చేయు సూక్ష్మరూపుఁ
డా మహాదేవుఁడే కదా యవని వేమ!. 197

మనల నీజగములందు పుట్టించి బ్రదుకుటకు జీవనమును గల్పించి సుఖ మొనఁగూర్చి హాయిగా నిదురింపఁజేసి సమస్త

విగ్రహములచేతను నడపించి బద్ధులను జేయుసూక్ష్మరూపుఁడే ఆమహా దేవుఁడని యెఱుఁగవలయును

ఆ. మెలత నడవి నుంచి మృగము వెంటనె పోయె
రామచంద్రుకన్న రసికుఁ డేడి
చేటుకాలమునకుఁ జెడుబుద్ధి పుట్టును, వి....198

ఎన్నియుక్తులు తెలిసినను ఎంతటి విజ్ఞులయినను చెడుకాలము దాపురించినప్పుడు దైవముచేత నడిపింపఁబడి చెడిపోవుదురు ఎట్లనఁగా? చూడుఁడు శ్రీరాముఁ డంతటి రసికుఁడు కాఁడా చెడుకాలమునను బద్ధుఁడై ఆతఁడు దాని నడవిలో నుంచి లేడివెంటఁ బడిపోయెను గదా! ఇట్లే

ఆ మ్రాను తగిన దైవ మహిమతమావస్తువు
గా నొనర్చు నట్లుగాక యున్న
కాల్చు రట్ల కాదె కష్టంబులకును పాల్చు, వి ...199

కొందఱు లోకులు కొందఱకిని సుఖమిచ్చుట నాకొక్కనికి కష్టము నొసఁగను వారు దైవాని నిందించెదరు కాని, కర్మాను గుణాగుణముల మాన నొసలేరు కదా! చూడుఁడు మ్రాను మంచిదయిన మంచివస్తువుగాఁ జేసి చెడుదయిన కాల్చివేయు నట్లే జనులకు కర్మము మంచిదైన సుఖమును చెడుదయిన దుఃఖము నొసగుచుండును

ఆ మృగములకు నరులకు మేలుఁగా బశువులు
తినఁగ దున్నఁ బాలుకొనఁగఁ బుట్టి
కష్టపడును వాని కర్మ మీఁదేర దే, వి.... 200

ప్రపంచమునఁ బుట్టి మనుజుఁడు ఎన్నియోవిధముల

కొంద ఱింటిలోనె సాయము గొని కృషివాణిజ్యము మున్నగు వాని నొనర్చి వాటివాటికష్టములపాళ్ల నపహరించి కష్టముల నొందుచుండును కదా। అట్టివానికి ఎన్నిజన్మము లెత్తినను కష్టములు ఈడేరవు

ఆ. గాళ్లు పూజచేసి రాజ్యముల్ తిరిగియు
కానలేరు ముక్తికాంత నెపుడు
తానయుండుచోట దైవంబు నుండఁడా,? వి....

దైవము నెఱుఁగదలఁచినవాఁడు తనలో దాగు ఒరికించి యాత్మనిజరూపము నెఱిఁగి ముక్తినొంద యత్నింపవలయునే కాని ఎన్నివిగ్రహములఁ బూజించినను ఎన్నెన్నిదేశములను తిరిగినను ముక్తికాంత నెఱుఁగజాలరు

ఆ లంకపోవునాఁడు లంకాధిపతి రాజ్య
మంత కీశసేన లాక్రమించె
చేటుకాల మైన జెఱుప నల్పుఁడె చాలు, వి....

కాలము విపరీతమై వచ్చునప్పుడు అల్పవస్తువుకూడ నధికమగునుపద్రవమును చేయుఁజాలును ఎట్లందురా? లంక పోవలసినకాలము దాపించినప్పుడు అంతటిరావణునికూడ లక్ష్యము సేయక క్రోతిమూకలు ఆక్రమించి కొల్లపెట్టలేదా! అట్టులే

ఆ. వర్ధనంగఁ బోదు వలె ననఁగా రాదు
తాను జేసినట్టి దానఫలము
ఉల్లమందు పగవకుండుటే యోగంబు,వి....203

తాను మనపూర్తిగా నైనను అయిష్టముగా నైనను చేసియున్నదానిఫలము వలదని వారించినను పోఁజాలదు. లేని

యెపుడు కావలయునన్నను రాదు కావున ఫలలుబ్ధుఁడై వగవ
కుండుట బద్ధిమంతునికి తగును

ఆ విత్త మొకరి కిచ్చు వితరణగుణమును
చిత్త మొకరి కిచ్చి చెన్నుపఱుచు
బ్రహ్మచేఁత లన్ని పాడైనచేఁతలు, వి.... 204

దైవనిర్మాణము లన్నియు నగమ్యమహిమములు అయియుం
డును. సాధ్యసాధనములను ఒకచోట కూర్చుకుండుట కాఁతఁడు
యత్నించుచుండును ఎట్లందురా? చూడుఁడు ధన మొకరి
కిచ్చును దానగుణ మితరునికిచ్చును చిత్తము నొకరి కిచ్చును.
వికాసము నొకని కిచ్చును

క. విధికృత మందురె యన్నియు
విధికిని విధి లెస్స యయ్యె విష్ణు నుతింపన్
విధి యెవ్వఁ డందు రావల
విధి బ్రహ్మము తలఁపఁ దలఁప వెలయుర వేమా!.

ఏమాత్రము అవశ్యమగు కార్యము కలిగినను జనులు విధి
కృతము అని యందురు కదా? విచారించితిమేని అవిధికినిగూడ
విధి లెస్సగా నున్నాఁడు అతఁడే విష్ణువు. ఈరీతిగా విధికి విధి
కిని నుత్తరోత్తరముగా పరికించిన అన్ని విధులకును బ్రహ్మ
మొక్కటియే మూలకంద మగునని తెలియఁ గలము

ఆ. విప్రవరులమూర్తవిభవము నమ్ముచు
పెద్దల నొగి గూర్చి పెండ్లి చేయు
నువిద ముండయౌ ముహూర్తము నిజ మెట్లు, వి.
మానవునియూహాపోహ లెప్పటికిని సత్యములు కాఁజాలవు.

ఎట్లందురా ? మనుజుఁడు తనచేత నేమో కానున్నట్లు యూహించి బ్రాహ్మణులఁ గూర్చి ముహూర్తము సుహూర్తము అని పెండ్లి సేయుచుండును అయినను ఆ స్త్రీ విధవయే యగుచున్నది గదా ! ఇఁక ముహూర్తము నిశ్చయమని యెట్లనఁగలము ఆయూహాపోహ లెట్లు సత్యము లగును ?

ఆ. వెడలివచ్చువేళ వెనుకఁ బోయెడివేళ
తేను లేదు కొంచుఁ బోను లేదు
ధన మెచటి కేగునో తా నెందుఁ బోవునో, వి.

ఆశాపీడితులై చచ్చువారలను ఆశచేత నా ధనము నా ధనము అని మిక్కిలి గొప్పవారుగ నుందురు, కాని అట్టివారి ధనము కాఁజాలదు ఎట్లనఁగా శరీరమున జన్మించు నప్పుడు కూడ తేలేరు పోవునప్పుడు తీసికొనిపోలేరు కావున కేవలము మోహ మాత్రమే కాని పిమ్మట ధన మెచ్చట కేగునో తా నెచ్చటికిఁ బోవునో తెలియఁజాలరు.

ఆ. వీరుఁ డైన లేదు విద్య నేర్చిన లేదు
సత్కులమున లేదు సటల లేదు
జన్మఫలమె కాని జపియించినను రాదు, వి....

మనుజునకు భోగభాగ్యము లన్నియును జన్మఫలముననే కలుగవలయును గాని వీరుఁడైనను విద్య నన్నిఁటిని నేర్చుకొనినను సత్కులమున జన్మించినను సన్యాసుల జడలఁ దాల్చి కష్టముల పాల్పడినను జపించినను రాఁజాలవు

ఆ. వెండికొండ పసిడికొండయుఁ దన కుండ
దేవుఁ డేలఁ బోయి తిరిపె మెత్తె

దైవబలము కాని తనబల్మి కాదయా, వి....209

కలిమిలేములకు దైవము కారణమగును కాని తాను కాదు. ఎట్లనియుందురా? వెండికొండయును మహామేరువును తనకు కరతలామలకములవలె సన్నిహితములై యుండఁగా నీశ్వరుఁ డంతటివాఁడుకూడ తిరిపము ఎత్తికొనవలసినదాయెనుకదా! కావున దైవబలమే బలము

ఆ. వేలకొలఁది భువిని వేషము ల్దాల్తురు
ప్రాణమూలి బుద్ధిఫలముకొఱకు
మేలు కాదు మదిని మిన్నందియుండుము, వి....

ప్రపంచములోన నేరును మూర్ఖులై వేలకొలఁది వేషములను వేసికొనుచుందురు. అవి యన్నియును పొట్ట నింపుకొనుటకే కాని పుణ్యముకొఱకుగాదు. అట్లు చేయుట మంచిదికాదు. కావున నీ వట్లుగాక మనస్సునఁ దృప్తుఁడవై యుండి మంచి భావమున మెలఁగుము.

ఆ. వ్యాధిపీడితంబు వ్యసనసంతాపంబు
దుఃఖసంభవమునఁ దొరఁగు భయము
లేనివార లెవరు లేనాఁటికైనను, వి.... 211

ఎట్టివారికైనను దుఃఖము కలుగక నే నుండుట పూర్తిగా లేదు. బుద్ధిమంతుఁడగువాఁడు వాని నన్నిటిని సహజములుగా తలంచి విచారము నొందక మెలగవలయును. నిజమును పరికించిచూచిన యీ ప్రపంచమునందు రోగము విచారము భయము మున్నగునవి లేనివారలెవ్వరైన నుండనే యుండరు

ఆ. శాంతమానసమునఁ జల్లనై శీతల

భ్రాంతినున్నవాఁడు పరమయోగి
అట్టివాఁడు ముక్తి నతివేగఁ గైకొను, వి....212

ఇతరులదూషణభూషణాదులకు వికారము నొందక కేవలము శోకమోహవర్జిత మగుబుద్ధిగలవాఁడై శాంతుఁడై చల్లగానున్నవాఁడే యోగులలో నుత్తముఁ డనిపించుకొనును ఇట్టివాఁడు మోక్షము నతివేగముగా పొందగలఁడు

ఆ. శిలలు దేవతలని స్థిరముగా రూపించి
మంటిపాలె యైరి మనుజు లెల్ల
మంటిలోని రాళ్ల మదిలోన తెలియరు, వి....213

మూర్ఖులై రాళ్లనే దైవరూపములని లోకులకు నిరూపించి చిట్టచివఱకు అశాశ్వతులై మంటిలో కలసిపోయిరి కదా! ఇప్పటికైనను తత్త్వము ప్రత్యక్షముగా నున్నప్పటికిని రాళ్లను మనవలె మృద్వికారములే యని తెలియరు

ఆ శివునియనుభవంబు సృష్టిలోపల లేక
సంశయం బుడుగదు సాధకులకు
వెలుఁగు దివ్వె లేక చీఁకటి వాయదు, వి....214

ఎంతటిసాధకులయినను ఎన్నివిధములగు నుపకరణములను కలిగియున్నను శివునియనుభవము జన్మాంతర్య లేక సందేహము నశింపదు తత్త్వము బోధపడదు. ఏలయని యందురా? చూడుఁడు. దీపములేక చీకటి పోవునా? పోదు గదా! అట్టులే!

ఆ. శుద్ధదృష్టి లేక శుక్రునంతటివాఁడు
పట్టు లేక మనసు పారవిడిచి
కన్నుపోవ పిదప గాకి చందం బయ్యె, వి....215

వక్రబుద్ధి యెట్టివారికైన నండరాదు వానివలన తప్పక ముప్పు నొందును, శుక్రునంతటి యాగతానాగతవేదియుకూడ శుద్ధమనస్కుఁడు కానికారణమున మనస్సును జయింపలేక లుబ్ధతఁ జొనిపి యెందులకు ఫలముగా కన్ను పోఁగొట్టుకొని కాకివలె యుండలేదా? కావున పరిశుద్ధబుద్ధియై మెలగవలయును.

ఆ. శూలి నెంచి మదిని శుద్ధాంతరంగుఁడై
కాలకర్మములను గాలఁ ద్రొక్కి
మేలుపూర్ణపదవి మెచ్చును శివయోగి,వి....216

ఉత్తముఁడగుయోగి మొదలమొదల నీశుని భజించి యంతః కరణమును నిర్మలముగా నొనర్చికొని కాలకర్మములను అడఁచి వైచి యుత్తమోత్తముఁడగు పరేశునిపూర్ణస్వరూపమును గని వదలక సర్వదా తదేకచిత్తుఁడై యానందించుచుండును

ఆ. సకలతనువు లెత్తి సంచరించును జీవి
కలిమి బలిమి తగిలి కలవరించు
నాత్మతేజ మూని యచ్చుగాఁ జూడరా, వి....

ఈజీవుఁడు సమస్తజన్మముల నుత్తమముల నధమములగు వాని నన్నింటిని ఎత్తి తిరుగుచు కలిమిబలముల కష్టముల నొందుచు జనన మరణములఁ బడి కొట్టుకొనుచుండును కావున నీవు మఱలమఱల జన్మము నొందనక్కఱలేకుండ జేయఁగల యాత్మతేజమును పరికించి తృప్తుఁడవై మెలగుము

ఆ. సకలవస్తువులను సంతతతనువుల
వుసురి కేఁడ పంచభూతములను
దానిదానిచేతఁ దగుభూషణము చేయు,వి....218

ఏవస్తువును పరికించినను ఎన్నియో శరీరములందు గుణభావము లగుచుండును ఇట్లు యుండినచో నిక యీగుణరహితమైనది పంచభూతములను పంచభూతములతో నలంకరించుటకిక యావసరమేమి యుండునదే దనిభావము

ఆ. సగరు డుర్వి రాజచక్రవర్తియు నయ్యు
పరుల తన్నుఁ బొగడ బ్రదుకుచుండె
నిట్టిఘనత వీరి కెందున కయ్యెరా?, వి ... 219

సగరుఁడు అంతటివాడనే రాజై యుండియును చక్రవర్తిత్వము నొందియుండియును ఇతరులచే గుణవర్ణనముల కలరుచు బ్రదుకుచుండెను ఈకాలపు వారు గొప్పతనములు వీరి కెందువలన నయ్యెనో తెలియదు అంతయు దైవనిర్ణయమని భావము

ఆ సత్యము విడనాడి సాహసంబుల నూని
బంటుపంత మూను బత్తిలేక
కర్మజీవి తాను కానంగలేడయా, వి .. 220

కర్మబద్ధుఁడగు ప్రాణి తనకుఁ గలిగిన కర్మానుభవము వదలి వైచి సాహసప్రవృత్తి నవలంబించి భక్తిలేక పంతములను బూనుచుండు నేకాని ఆపిమ్మట కలుగఁబోయెడిఫలములను అంతరిక్షముల నెఱుఁగఁజాలక యుండును

క. సర్వము దైవం బనియెడి
నిర్వాణికి గాక ముక్తి నిలువఁగవశమా?
యుర్వెల్లఁ దానుఁ దిరిగినఁ
బర్వతబిలజలధులందు బడినను వేమా!. 221

మనుజుఁ డెన్నిదినములు ఏయేవిధమున ప్రపంచమునంత

ముగ చెడఁదిరిగినను గుహాలందు సంచరించినను సమస్త ప్రపంచముగ దైవమే యని బుద్ధిపొడమనంతవఱకు ముక్తినొందఁగాఁ జాలఁడు

ఆ సర్వ మొకటె చూడు సమకూరు ననుభ్రమంబు
రెప్పవేయఁబోకు రేయిఁబవలు
పగలులోనిపగలు పరమాత్మభావము, వి... 222

సూక్తి పలుకు నేని నా చెప్పిన వొప్పు నవలంబింపుము సమస్తమును ఒకబుద్ధితో చూడుము అంగుళల స్థిరత యలవడును అప్పుడు జాగ్రత్తగా సహించి యేమఱక రాత్రింబవళ్లను ధ్యానించి యీశ్వరుని గనుము తేజస్సునందు తేజరిలఁ జేయునదియే పరమాత్మునికు సన్నిధానమ్ము

ఆ సాటివారు నిన్ను సాధింపఁగా లేరు
దైవ మెపుడు నీకు తప్పకున్న
భారతంబులోనిపరమార్థ మిదె కదా,' వి....223

నీయందు దైవము అనుకూలముగనున్నట్లు ప్రపంచమునకు మేలుచేయుచు మెలఁగుము అట్లైన దైవము నీకు తప్పిపోక నీవాఁడై యుండును అటుపిమ్మట నెట్టివారైన నితరులు నిన్ను సాధింపఁజాలరు భారత మంతయును బరికించినను కలిగెడిసారమిదియే కదా!

ఆ. సౌఖ్యమరయునట్లె సౌఖ్యంబు కలుగును
వారునికృపను సౌఖ్య మమరియుండు
సుఖ మసుఖములకు శూలి కారణుఁడగు, వి....

సౌఖ్యమునకై వెదుక నవసరములేదు. దైవ మనుకూల

ముగా నుండినచో వెదకి తెచ్చినట్లులు సౌఖ్యమే కలుగుచుం డును ఇవ్విధముగా సౌఖ్యము కలుగుటకు ఈశునికృప నార్జింప వలయును కావున సుఖాసుఖములకు ఈశుఁడే కారణుఁడని మెఱుఁగవలయును

ఆ. సూదినంటురాయి సూత్రముగా నాత్మ
సాధనంబుదిగాటి సంతరించి
పాదుకొల్పునరులు పరమాత్మరూపులు, వి....

సూదినంటురాయి సంయోగమున ఇనుమును ఆకర్షించు నట్లులే ముముక్షువు అతిసాధారణములగు సాధనముల నవలంబించి ఈశ్వరుని సందర్శించి తాను తరించు యుక్తులహృదయములను ఈశ్వరుని నిలిపి ఆరంపఁజేయుదురు వారే పరమాత్మస్వరూపులుగా నెన్నఁబడుచుందురు

ఆ. స్వాతిమెఱుపు జూచి సంతోషపడుదురు
స్వాతిమెఱుపులేమి సఫల మన్న!
మెఱుపునుఱుము లేక మేఘంబు గుఱియునా?, వి

జనులు స్వాతికార్తికలో మెఱుపుంటను జూచి వర్షము కురియునని సంతసించుచుందురు నిజమును విచారించిన స్వాతిలో మెఱిసినంతమాత్రాన నేమైన ఫల మున్నదా? లేదు మెఱుపు నుఱుమును లేక ఎప్పుడును వర్షము కురియదు గదా. కావున సాధనము లెన్ని యున్నను మూలాధారము వశమగునంతవఱకు తృప్తి నొందరాదు.

ఆ. హరికి దొరకె నందురా సిరి యప్పుడే

దొరకెఁ గాదె విషము హరున కరయ
నెవని కెట్టు లగునొ ఎవ్వ డెఱుంగును?, వి....

ప్రయత్నమువలన ఫలము లభ్యమగు నని విష్ణువు ప్రయత్నించినందుననే లక్ష్మి నొందఁగల్గెనని యూహించెదరు ప్రయత్నముననే ఫలముగల్గెనని ఈశ్వరునికి విష మేల కలుగవలయును? కావున ఫలము దైవాధీనమై యుండునే గాని సుసాధ్యము కాదు

క హరివిధి సురముఖు లాదిని
మెఱసియు జన్మించి పిదప మేలుల కెడఁగా
జరయందు మరణమందును
పరుస న్వర్తిలిరి దైవవశమున వేమా! 228

బ్రహ్మవిష్ణ్వాది దేవతలను ముందు ముఖ్యగుణసత్తమోత్తము లందఱును దైవబలమునను కట్టువడియే జననమరణాదులను ప్రవర్తిలిరి కావున దైవబల మధికము నజయ్యము నగును

క. హరివిధులు కనుట వినవా?
హరుఁడు నిమిత్తంబులందు నాడుట వినవా
గురిగల చదువులు వినవా?
తఱివచ్చిన దైవ మనుచు తలఁపుము వేమా!.229

బ్రహ్మవిష్ణ్వాదులను పుట్టిరని వినలేదా? ఈశ్వరుఁడు పరాజితు డగుట లేదా? వేదములు విరి నిట్లని చెప్పఁగా చూడలేదా? కావున అన్నిఁటికిని దైవ మొకటియే కారణ మగు ననుకొనుము.

ఆ. క్షితివెలఁదికిఁ దగు శృంగారములు నున్న
విభునికరుణ లేక వెలయనట్లు
దైవకృపలు లేక తలఁపులు చెల్లవు, వి.... 230

స్త్రీకి ఉత్తమోత్తమములగు నాభరణము లెన్ని యున్నను భర్త యనుగ్రహము లేక ప్రకాశింపని యట్టులే దైవకృప కలుగనిది ఎట్టి కోర్కులను చెల్లఁజాలవు.

# కర్మపద్ధతి.

ఆ. అడవి దిరుగఁ జిక్క దాకసమున లేదు
అవని తీర్థయాత్రలందు లేదు
కర్మ ననుసరించి కలసి వచ్చుచు నుండు, వి....

మానుజానకు భోగభాగ్యములు కర్మము ననుసరించియే వచ్చుచుండును, గాని ప్రయాసపడుటను పరిశ్రమము వలనను అడవులఁ దిరుగాడుచుండుటవలనను తీర్థయాత్రలనను నిసుమంత యును పయోగము లేదు

ఆ అండమండముఁ గన నన్నియు నటుపిండ
మండమెట్లొ బ్రహ్మయండ మట్లె
కర్మబంధమునను గానరు బూసరుల్, వి ... 232

అండాండపిండముల యుత్పత్తి యగునట్టులుగనే బ్రహ్మాండమును కలుగుచున్నది ఇయ్యది సులభముగా గోచరించుచున్నను మనుజాలు కర్మబద్ధులయి యుండి తెలిసికొనఁజాలక క్లేశముల ననుభవించుచుందురు

ఆ అడుగడుగున చిత్ర మఖిలవస్తువులను
భోగభాగ్యములను బొలుపు మిగులు
తాను జేయుకర్మ తనతోడునీడయౌ, వి....233

ప్రపంచ మపరిస్థితియె మిక్కిలి చిత్రమైనది ప్రతి పాదవిన్యాసమునను సమస్తవస్తువులను భోగభాగ్యములును అభివృద్ధి నొందుచుండును. అయినను అవియన్నియును పురుషుని

వెన్నంటివచ్చునవి కావు పురుషునికి తాను చేయుకర్మ మొక్క-టియే తోడునీడయై వచ్చుచుండును.

ఆ. అతిథిరాకఁ జూచి యదలించి పడవైచి
కఠినచిత్తు లగుచు కానలేరు
కర్మబద్ధు లగుచు ధర్మంబు సేయరు, వి.... 234

ఎవరైన నింటికి నతిథియై చనుదెంచిన వెళ్లునఁ దిట్టుచు మూర్ఖులు కఠినచిత్తు లయ్యెదరు వారు కర్మబద్ధులై తత్ఫలంబుల ననుభవించుతలంపున నేధర్మంబుల నాచరింపక చెడుచుందురు

ఆ. అపుడు నాదుమాట ననుసరింపఁగలేక
ఇపుడు రమ్మటన్న నేమి కలదు
మదము నిల్చువఱకు మనసులు నిల్చునా, వి....

మూర్ఖులగు జనులు వయోఽతిరేకమున మదించి పెద్దల మాటలను వినకయుందురు అట్టివారు సమయములయందు పెద్దలమాటలను తోసిపుచ్చి పిమ్మట వగచినఁ బ్రయోజన మేమి? వీరి మదము నిలచునంతవఱకు మనసు నిలుచునా? నిలునదు గదా!

ఆ. అరయ కర్మమునను నాహరిశ్చంద్రుండు
ఆలిబిడ్డ నమ్మి యతఁడు కూడ
మాలవాని కెపుడు మఱి లోకువై యుండె, వి.

మంచికిగాని చెడుకుగాని తమతమ కర్మములు ప్రధానములగు కారణములు. విచారించితిమేని హరిశ్చంద్రునియంతటి మహానుభావుఁడు కూడ కర్మబద్ధుఁడై పెండ్లమును బిడ్డలను అమ్మి మాలవానికి దాసుఁడై యుండ లేదా!

ఆ. అరయ నాస్తి యనక యడ్డుమాటాడక
తట్టువడక మదిని తన్నుకొనక
తనది గా దనుకొని తాఁ బెట్టునది పెట్టు, వి....

అతిథి వచ్చి యార్తుఁడై తన్నర్థమును యాచించెనేని నాస్తి యనక అడ్డుమాటలను పలుకక తట్టుపడక మనస్సులో నెట్టు లివ్వగలనా యని తన్నులాడక తనచేత నున్న దానిని తనదికా దనుకొని అర్థి సంతసించున ట్లొసగవలయును. అట్టిదియే దాన మనఁబడును

ఆ అలను బుడగ పుట్టినప్పుడే క్షయమౌను
కలను గాంచులక్ష్మిఁ గనుట లేదు
ఇలను భోగభాగ్య మీతీరె కానరు, వి.... 238

మనుజులు మూర్ఖులై యాగతానాగతములఁ దెలియఁజా లరు. ప్రపంచమంతయు నస్థిరమే బుడగ పుట్టినప్పుడే నశించును కలలో కనుపడినసంపద నొందుటలేదు ఇట్టులే ప్రపంచములో భోగభాగ్యాదులగు ప్రతివస్తువును అశాశ్వతమై యొప్పుచుండును.

ఆ అష్టకష్టి బ్రదుక దగ్నిపాలై పోవు
నిర్దయాత్ము బ్రదుకు నీటఁ గలియుఁ
గ్రూరకర్ము బ్రదుకు చోరులపా లౌను, వి....239

ఎన్నివిధముల తప్పించుకొనఁజూచినను కర్మఫలముల ననుభవింపక తప్పదు అష్టకష్టములఁ బడి యార్జించిన దంతయు నగ్నిపాలై పోవును. నిర్దయుఁడైన వాని బ్రదుకు నీటిలో కలసి

పోవును ఇట్టులే క్రూరతఁ దుష్పపనులఁ జేయువారిసిరులు దొంగలపాలఁ బడును

ఆ. ఆఁకలి గొని వచ్చె నని పరదేశికి
పట్టె డన్నమైనఁ బెట్టలేఁడు
లంజెదానికొడుకు లంజెల కిచ్చును, వి.... 240

మనుజుల మూర్ఖత నేమని నిందింపవచ్చును? ఎంతటి సిరిగలవాఁడైనను ఉన్నదానిలో గొంతనైనను ధర్మము సేయఁజాలఁడు ఆఁకలిగొని యార్తుఁడై వచ్చిన యతిథికి పట్టెఁడన్నము నైనను పెట్టలేఁడు కాని ముండలకుమాత్రము పెట్టి మోదము నొందుచుండును

ఆ ఆదితుదల నరయు కల్పుఁడై దినమెల్ల
మార్పుచేత బుద్ధి మఱగి తిరుగు
మ్రానుమ్రాను దిరుగు మహిఁ గోతికైవడి, వి.

మనుజుఁడు మూర్ఖుఁడై తానేకర్మములసేతవలన నట్టులుండెనో ఇఁక నెద్దానివలన నెట్లు కాగలనో యని ఆద్యంతములను విచారింపక మతిస్థిరత లేనివాఁడై యూఱక పిచ్చిబట్టిన వానివలె చెట్టుచెట్టునకును తిరిగియాడెడి కోఁతిరీతిగను తిరుగుచుండునేగాని కర్మఫలముఁ గనఁజాలఁడు

ఆ, ఆలుమగనిమాట కడ్డంబు వచ్చెనే
నాలుగాదు నుదుటివ్రాలు గాని
యట్టియాలి విడిచి యడవినుండుట మేలు, వి....

భార్య భర్తకనుకూలవతియై మెలఁగవలయును గాని ఎదిర్పియుండరాదు. అట్లుగాక మగనిమాటల కాలు అడ్డుపడు

చుండెనేని అయ్యది అలుకాదు. అపురుషుని ముఖము వ్రాతే యగును బద్ధిమంతుఁడై అట్టియాలిని విడిచి యడవిఁ బడుటయే మేలగును

ఆ. ఆలు సుతులు ధనము లరయంగ మీరని
మొనసి కర్మమునను మోసపోయి
కాలుఁగన్నయపుడు కడ తేరఁజాలఁడు, వి.... 243

మనుజుఁడు కర్మబద్ధుఁడై సంబంధము లేనిసతీసుతులను ధనమును కని మీరతే దిక్కని మోసపోయి తిరుగాడుచుండును కాని మృత్యువాసన్నమై యముని దర్శనము కలిగినప్పుడు కడ తేరఁజాలఁడు

ఆ ఇంచుకంతబోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁ బోవునతఁడు
కర్మసూక్ష్మములను గనవలె ఘనులెల్ల, వి....244

కర్మములో నే ప్రపంచమంతయు నిమిడియున్నది అందులోని దుర్జ్ఞేయములగు సూక్ష్మములు పెక్కులుగలవు కొంచెమన్నమును ఈశ్వరున కర్పణముఁ జేసినచో జనుఁడు పుణ్యలోకములకుఁ బోవును కావున కర్మసూక్ష్మముల నరసి మెలఁగవలయును

ఆ. ఇంచుకంత సుఖమె యీరేడుజగములు
కంచమునకు బిల్లి కాచినట్లు
పంచబాణుబారిఁ బడలుచు నాసింత్రు, వి....

పదునాల్గులోకములను చక్కఁగా పరికించినను ఎందైనను గాని సుఖ మొక లేశమాత్రమేకాని వేఱు కాదు. ఇట్లయినను

జనులు మూఢులై మన్మథవశంవదులై విషయముల నాశించి ఎంగిలి కంచమునకు బిల్లి కాచుకొని సుఖింపలేనట్టు లుందురు. కావున కర్మములను జాగ్రత్తగా నరయవలయును.

ఆ. ఇంటిమగనిఁ జూచి యిల్లాలు దుఃఖించి
వెంట విటుని దగిలి వెతలఁబడును
తుంటరైన దానిఁ దొలగింప మేలురా, వి....246

బుద్ధులు అపరిజ్ఞేయములు స్త్రీ లెంతటి విదుషు లయ్యును దుర్గుణపూరితలై యుందురు చేసికొనినమగని వదలి విటపురుషులతో తిరుగఁ గోరుదురు అట్టియిల్లాలిని తొలఁగించుటయే మేలగును.

ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మె లన్నియుఁ దప్పు
గాల మొక్కరీతి గడపవలయు
విజయుఁ డనువు దప్పి విరటుని గొల్వఁడా, వి....

కాలకర్మలసంయోగమువలన సుఖదుఃఖములు కలుగుచుండును సమయ మనుకూలమై యుండునంతవఱకును దాను చేయుపనులన్నియు నెగ్గును కాని ప్రతికూలమైన చెడిపోవును. కావున కాలము నొక్కతీరుగా గడుపుకొనవలయును అర్జునుఁ డంతటి వాఁడు కాలకర్మబద్ధుఁడై విరటుని గొల్వలేదా?

ఆ. ఇఱుకువచ్చువేళ నీశ్వరుఁ దలఁతురు
గరుణఁ గనునె వట్టిగాసిగాక
సుఖము వచ్చువేళ చూడంగ నొల్లరు, వి....248

మనుజులు తమకు సుఖములు కలిగినప్పుడు ఈశ్వరుని తలంపక కొంచె మాపదకలుగునప్పుడు ఈశ్వరుని తలంపఁ

టూనుదురు గాని ఆమాత్రమున భగవంతుఁడు దయగలవాఁడు కాడు. కనుక వ్యర్థముగా గాకిల్లక కర్మఫల మనుభవింప వలయును.

ఆ. ఇరుగుపొరుగులందు నిమిడికతో నుండి
తనకు దాని మొదలితలఁపుఁ జూపి
ధర్మ మనఁగ కర్మ తనకుఁ దాఁ బొడసూపు, వి.

కర్మయే ధర్మస్వరూపము. అయ్యది ముమ్మందు తనచుట్టు ప్రక్కల నివసించి తనంతదానె పొడసూపి పిదప మెల్ల మెల్లగా ఇచ్ఛానుసారియై వర్ధిలి ఫలము ననుభవింపఁ జేయును

ఆ. ఇనుకబొగ్గురాయి యినుముఁ జర్మంబును
కసవు పొల్లుగడ్డి కట్టిపెట్టి
పల్లుఁ దోమినట్టిపాపాత్ముఁ డెవఁడయా, వి....250

లోకమునందు సాధారణముగా బాహ్యమున నేదో యొకరీతిగా పరిశుద్ధతగలవారలే గాని కర్మములఁ బరిత్యజించి బాహ్యాంతరంగముల పరిశుద్ధులగువార లరుదు ఇనుక బొగ్గు మున్నగువానితో నంతశ్శుద్ధుఁడగువాఁ డొక్కఁడును లేఁడు.

ఆ ఉచ్చ వచ్చుచుండు నిచ్చకు సరిగాను
మచ్చికైన మనసు మర్మమెఱిఁగి
హెచ్చుకర్మములయు ముచ్చట లిట్లెరా, వి....

కర్మల ననుసరించియే బుద్ధులు కలుగుచుండును. ఇచ్ఛ ననుసరించియేగదా యుచ్చ వచ్చుచుండును అట్టులే కర్మములును వారి యూహాపోహాల ననుసరించి మనుజులవెంట నంటి ఫలముల నొసఁగుచుండును.

క. ఉచ్చసరి తూఁగి పుట్టెడు
నచ్చట నేమనుజుఁ డైన నేర్పడ భువిలో
నిచ్చట కులజుం డెవ్వఁడు ?
విచ్చలవిడి కర్మ మగును వినరా వేమా! 252

ఎంతటి గొప్పవాఁడు పుట్టినను ఉచ్చలోనే పుట్టుచుం డును కావున నిట్టి మాత్రిక రజనితులలో కులజుఁ డెవ్వఁడు ? ఎచ్చుతగ్గులు జననమాత్రమున రాఁజాలవు ఇట్టివాని కన్నిటికి నొక్క-స్వకీయకర్మముమాత్రమే కారణ మగును

ఆ ఉండఁడే సుశీలి యుండును కొన్నాళ్లు
యుండి యుండి యుండి యుండలేక
కర్మజాలమునను కడు డస్సిపోవును, వి.... 253

సత్స్వభావమును సదాచరణమును కలవానికి నాశము లేదు అతఁడు స్థిరుఁడై యుండును ఇట్టివాఁడు కూడ ప్రపంచమునం దుండియుండి కర్మాచరణమువలన డస్సియే పోవును కావున కర్మ మన్నిటికంటె బలిష్ఠము.

ఆ. ఉన్నతావు వదలి యూరూరుఁ దిరిగినఁ
గన్నదేమి నరుఁడు గ్రాసమునకు
దన్ను లోనఁ జూడఁ దమమెల్ల వీడును, వి....254

మనుజుఁడు కర్మబద్ధుఁడై యూరకున్న నాయూర నెక్కడనుకొని యున్నతావును వదలిపెట్టి యూరూరును తిరుగుచుండునే కాని బువ్వకంటె మించి సంపాదించినది కన్పింపదు. కావున నిజరూపము నరసియుండిన మేలు

ఆ. ఋతువు ననుసరించి స్థితికాలమున నొప్పు

గతిని బట్టి మనుజు మతియు నొప్పు
స్వేచ్ఛఁ బట్టి యువిద చెల్లాటమును నొప్పు, వి.

ప్రపంచములో నందఱును వారివారికర్మల ననుసరించియే ఫలముల ననుభవించుచున్నారు ఋతువుల ననుసరించి కాలస్థితి మాఱునట్లుతే స్వేచ్ఛకొలఁది స్త్రీలు చెలరేగునట్లుతే మనుజునిగతి (కర్మము)ని పట్టి మతియును కలుగును

ఆ. ఎదుటికలిమిఁ జూచి యేడ్చెడువారికి
భాగ్య మెటులఁ గూర్చుఁ బరమగురుఁడు
తనదుపూర్వకర్మ దైవ మెఱుంగఁడా?, వి....

తా నెంతటి తక్కువస్థితి నున్నప్పటికిని ఎదుటివానిస్థితిని గూర్చి వగవరాదు ఎదుటివానికలిమికి వగచెడువారికి ఈశ్వరుఁడు ఫలము నెట్లీయఁగలఁడు? తాను చేసినకర్మము నతఁడు మఱచినను దైవముమాత్రము మఱువక ఫలమొసఁగును

ఆ ఎద్దుకన్న తెలియ నెనుబోతు తక్కువ
వివర మెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెరయోధుఁ డందురా, వి....

ప్రతివానికిని బుద్ధి ప్రధానము గాని యొడ్డుపొడవులు కావు ఎట్లందురా? చూడుఁడు! ఎద్దుకంటెను దున్నపోతు ఎందులో తక్కువ? వృత్తి మున్నగువానిలో సమములేకదా ? అయినను నేర్పు లేనందువలన తక్కువ యయ్యెను. కావున బుద్ధిమంతుఁడై యుండవలయును

క. ఎన్నఁగ కర్మము కారణ
మన్నిటికిని జూడ జూడ నాత్మఁడు తానై

యున్నంతకాల మిలలో
నన్నా యిదె తెలియవలయు నవనిని వేమా!

సమస్తకర్మలకును ఈశ్వరుఁడు సాక్షిమాత్రుఁడై యుండును. కారణము మాత్రము మనుజులకు తా మొనర్చెడి కర్మయే యగును. ఈరహస్యము నే బుద్ధిమంతుఁడై మెలఁగవలయును

ఆ. ఎన్నితపము లేర్చి యెన్నినోములు నోచి
యెంతకష్టపడిన నేమిఫలము
కర్మఫలము గాని కలుగ దెందును ముక్తి, వి.

మనుజుఁడు కర్మఫలమునకు విరుద్ధముగా నుండవలయు నని ఎన్నితపముల నేర్చి ఎన్నివిధములగునోములను నోచి యెంతటికష్టముల ననుభవించినను ప్రయోజన మినుమంతయును కలుగదు కర్మఫలముతప్ప ముక్తి యెద్దానను లేదు

క. ఎన్ని దేవత లైనను నీరహస్య
చిహ్నాలను బట్టి కనలేరు చిన్మయంబు
తన్ను తనలోనఁ గనుటయే తన్మయంబు
చెన్ను మీఱంగ నిదె మేటి తెన్ను వేమా! 260

ఎందరు దేవతలయినను ఈకర్మరహస్యము ను అనఁగా కర్మలలోని మర్మములను గుఱితించి చిద్రూపము నెఱుఁగనే లేరు. తనరూపమును తనలోనే గనుటయే తన్మయత్వ మనఁబడును ఇయ్యది ముక్తికిరివగుమార్గము

ఆ. ఎన్ని ఫలము లున్న నీఫలం బెక్కుడు
అన్నిసుఖములందు నధిక మగుచు
కన్నది కననిదయి కనుపించు కర్మము, వి....261

ఎన్నిఫలము లున్నను కర్మఫలమే యెక్కుడుది కర్మ ఫలమువలన కలుగుసుఖమే యన్నిటికంటె నెక్కుడుది యగును. కర్మస్వరూపమును పరికించిన దృశ్యము అగునట్టిపదార్థముకూడ కర్మమహిమవలన విపరీతముగా కనుపట్టును

ఆ. ఎఱుకకన్నను సుఖ మేలోకమున లేదు
ఎఱుక నెఱుఁగ నెవని కెఱుకలేదు
ఎఱుకసాటి దెఱుకె యెఱుకయే తత్త్వము, వి.

జ్ఞానమునకంటె మించిన సుఖము ఏలోకములో గూడ లేదు ఇట్టిజ్ఞానస్వరూపము నెఱుగుట కెవ్వనికిని జ్ఞానములేదు. విచారించిన జ్ఞానముతో సమాన మగునట్టి యొకతత్త్వమే కాని వేఱు కాదు

ఆ. ఎల్లలోకమందు నేవస్తు వున్నదో
తల్లిపిల్లసందు తగులు నదియె
నిస్తరంగవార్ధి నియతిని జూడుము, వి.... 263

సమస్తలోకములయందు వ్యాపించియున్నవస్తువే తల్లి పిల్లలమధ్యమున జన్యజనకభావముచే మెలగుచుండును కావున చంచలతను వహింపక నియమము నవలంబించి పరమేశ్వరుని నిజరూపమును చూడుము

ఆ. ఎసగువేత్త యనుచు నెఱుఁగరే యీనరుల్
వేయిమార్గములను వేలు పణుఁడు
అవని సృష్టికర్త యంతకు గురుఁడౌను, వి....

సమస్తప్రపంచమునకు సృష్టికర్తయగు వేలుపే దేవుఁ డనియును, నాతఁడే వేత్త యనియును జనులు ఎఱుఁగఁజాలరు.

నిజమును పరికించిన నాతఁడే సర్వమునకు గురుఁడగును, కావున నతని సేవింపుము.

క. ఏడ్వ మది నొవ్వ ఫలమేమి యేరు నిన్ను
 దిట్టఁగా నేమి లేక నుతింపనేమి
 కలుగు భువిలాభలోభము లర్మమహిమ
 మనుచు సరిపెట్టుకో రాదె యరసి వేమా! 265

నవ్వుచు కర్మముల నాచరించి ఫల మనుభవింపవలసివచ్చి నప్పుడు ఏడ్చినను నొచ్చుకున్నను ఇసుమంతయైన ఫలము లేదు దూషించినను భూషించినను నప్పుడు నిష్ఫలము. కావున కలిగినంత వఱకు కర్మఫలమని సరిపెట్టుకొనవలయును

ఆ. ఏమిగొంచువచ్చె నేమి తాఁ గొనిపోవు
 బుట్టువేళ నరుఁడు గిట్టువేళ
 ధనము లెచటి కేఁగు తానేఁగు నెచటికి, వి....

మనుజుఁడు కేవలము లుబ్ధత నొందునే గాని నిజము బరికింపఁడుగదా! తాను పుట్టునపు డీలోకమున కేమిగొనివచ్చెను? పోవునప్పు డేమి కొనిపోవును కావున లోభి గాక మెలఁగ వలయును ?

ఆ. ఒక్కతోలుదెచ్చి యొనర బొమ్మను చేసి
 ఆడునట్లు చేసి యట్టె వైచె
 దన్నుఁ ద్రిప్పువానిఁ దానేల గానఁడో, వి....

మనుజుఁ డజ్ఞానియై తన్నిట్లు మోహితుఁ జేసినవాని నెఱుఁగడు అతఁడు కర్మరూపి. చర్మమయమగు పుత్తలికఁ జేసి యాటలాడించుచున్నాఁడు. అయినను తన్నిట్లు త్రిప్పు వాతనిఁ దా నెఱుఁగఁ జాలఁడు.

ఆ. ఒల్ల నన్నఁ బోదఁ గొల్లై నెన్నఁగ గాదు
తొల్లి చేయుకర్మ ధూర్తఫలము
ఉల్లమందు వగవకుండుటే యోగ్యంబు, వి.

పూర్వజన్మమునం దాచరించినకర్మములకు ఫలము అవశ్యము వచ్చియే తీఱును ఆఫలము ఒప్పుకొనకున్న పోవునది కాదు ఒప్పిన వచ్చునట్టిది కాగు కావున వచ్చినఫలమును నిర్విచారుఁడై యనుభవించుటయే యుక్తము

ఆ. కంటికంటి ననుచుఁ గర్మాధికారంబు
వెంట గొనుచుఁ జెడును వెఱ్ఱిజనుఁడు
బట్టబయల ముక్తిఁ బాటించి జూడుఁడు, వి....

అన్నియును తెలిసినవి విజ్ఞుఁడనైతిని ఇఁక నేను గాని తనకు లేనిపోనికర్మాధికారమును మీఁదనైచికొని మనుజుఁడు వెఱ్ఱియై చెడిపోవుచుండును కావున ముక్తికై ప్రయత్నించి ఫలము నొందుము

ఆ. కంటిమంటచేతఁ గాముని దహియించి
కామమునను కడకు గౌరిఁ గూడె
నట్టిశివుని నైన నంటును కర్మము, వి.... 270

శివుఁడు అమితమగు సామర్థ్యము కలవాఁడై తేజోబలమున కన్నులు నిప్పులుగాలఁ జూచి మన్మథుని నశింపఁ జేసెను. కాని చివఱకు కర్మవశమున కామవశంవదుఁడై గౌరిని పెండ్లాడెను. కావున కర్మము శివునకుగూడ నలంఘ్యము.

ఆ. కర్మమయుఁడు గాక కర్మంబు దెలియఁడు

కర్మజీవి మేలు గాన లేఁడు
నీరుసారక లోతు నికరము తెలియదు, వి....

ఎంతటివాఁడైనను కర్మముల గాలు పెట్టవచ్చు కర్మమునకుగల నిజరూపము నెఱుఁగఁజాలఁడు కర్మజీవి కెప్పటికిని మేలురాదు. ఎట్లందురా ? నీళ్లలో దిగనిది నీటిలోఁతు తెలియునా? అట్టులే.

క. కర్మము జ్ఞానికి దవ్వగుఁ
గర్మమునకు జ్ఞాని దవ్వు కలనిజ మిదె యా
కర్మజ్ఞానము లుడిగిన
నిర్మలునకుఁ గలుగు ముక్తి నిజముగ వేమా!

కర్మమునకు జ్ఞాని దూరుఁడై యుండును అకర్మమును జ్ఞానికి దూరముగా నుండును ఇట్టి పరస్పరవిరుద్ధములగు కర్మ జ్ఞానములు నుడిగినట్టివానికే ముక్తి కలుగును కాని యితరునకు కలుగదు

ఆ. కర్మఫలములన్ని కపటంబుగాఁ జూచి
ధర్మఫలము లన్ని తగిలియుండి
ధర్మమర్మములను దాటుటే ముక్తిరా, వి....

కర్మఫలముల కాసింపక వానిని మృషాప్రాయములనుగా తలంపవలయును ధర్మఫలములను స్వీకరింపవలయును. ఈరీతిగా ధర్మకర్మములలోని మర్మములను దాఁటుటయే ముక్తి యనఁ బడును

ఆ. కర్మమునను బుట్టి కర్మంబులోఁ జేరి
కర్మ మేరుపడుటఁ గాన లేరు
కర్మబంధమునను కడతేఱ లేరయా, వి.... 274

జగలు పుట్టునది కర్మములోఁ జేరునదియును కర్మమునఁనే యైయున్నది అయినను కర్మము ఏర్పడుటనే యెఱుఁగరు కదా! చివఱకు కర్మబంధముననే కడతేఱలేక యలయుచుందురు.

ఆ కర్మవశమున సంసారకష్టములను
 జెంది మోహాతిశయమునఁ జెడును నరుఁడు
 కర్మరహితత సుజ్ఞాన కలితతయును
 జెంద మోహాదు లేటికిఁ జేరు వేమ!. 275

జనుఁడు కర్మవశమువలన సంసారకష్టములను పొంది మోహాధిక్యతచేత చెడుచుండును కర్మలు లేకపోవుటచేతను తత్త్వజ్ఞానము నొందుటచేతను మోహాదులు జనుని పొందఁ జాలవు కావున కర్మము నుత్తమజ్ఞానముచేత తొలగించికొని నిర్మోహుఁడై మెలఁగవలయును

క. కర్మాకర్మలకోటకును
 నర్మిలి నొక డుండు లోన నాత్మయుఁ గర్తై
 ధర్మాధర్మములకు నగు
 నిర్మలమతి యైనవాఁడు నిలుచును వేమా!. 276

కర్మమునకుఁ గాని కర్మాభావమునకుఁ గాని కర్తయగు వాఁడు తనకంటె వేఱొక్కరుఁ డుండును. అతఁడె ధర్మమునకు నధర్మమునకు సాక్షిభూతుఁడు. జనుఁడు నిష్కలుష చిత్తుఁడైనచో అకర్త స్థిరుఁడై తోచును

క. కర్మాకర్మము లెఱుఁగని
 మర్మంబులు నింద్రజాలమహిమలు విద్యల్
 కర్మలమర్మము ప్రాణులు

నిర్మలమతిఁ దెలియవలయు నిజముగ వేమా!.

ఇది కర్మ మిది కాదు అని రహస్యము తెలుపలేనివిద్య లన్నియు నింద్రజాలము లనియె చెప్ప నొప్పగును. నిశ్చలహృదయులై ప్రాణులు గురుకృపవలన కర్మలలోని మర్మముల నెఱుఁగ వలయును.

క. కర్మనివృత్తైనప్పుడు
నిర్మలుఁ డగుభవ్యుఁడు వాని నిక్క మెఱుంగున్
కర్మము తీఱెడు వేళను
ధర్మమె తన దేవుఁ డనుచు తెలఁతురు వేమా!

పూర్వసంచితమగుకర్మము ననుభవించిన పిమ్మట నిష్కల్మషుఁడై పరేశుని నిజరూపమును ఎఱుఁగఁగలుగును. కర్మము తీఱిపోయెడివేళలలో ధర్మమే తనకు దైవముగు నని తలఁచుచుందురు అనఁగా: కర్మస్వరూపమే ధర్మము

ఆ. కర్మగుణము లన్ని కడబెట్టి నడవమిఁ
దత్వ మెట్టు తన్ను తగులుకొనునొ?
నూనె లేక దివ్వె నూవుల వెలుగునా?,వి....279

కర్మగుణముల నన్నిటిని తీర్చికొని ప్రవర్తింపవలయును ఎందాక మనుజుఁడు కర్మగుణములను తొలగించికొనఁడో యందాక నతనికి తత్వమే బోధపడదు ఎట్లందురా? చూడుఁడు! నూనె లేక దీపము వెలుఁగనట్టులు

ఆ. కాడు సేరి యున్న గతిలోన యున్నను
వీటినడుమ నున్న విధము లోకమె
జాడ విడనిమదిని జర్చించి చూడరా, వి....280

అడవిలో నున్నను మార్గమధ్యమున నున్నను భవనరాజములలో నివసించుచున్నను మనుజునకు కర్మఫలము ఏకరూపముగా ననుభవమునకు వచ్చుచుండును. పరిపూర్ణమగు మనస్సుతో చర్చచేసి తెలిసికొందుము

ఆ. కూడ దేమి చేసెఁ గులమేమి చేసెను
భూమి యేమి చేసె బొందికట్టె
నరుఁడు పడెడుపాట్లు నగుబాట్లు చూడఁగా, వి.

కొంద ఱుపవాసాదుల కర్మములు నశించు నందురు కాని అదియంతయును కల్ల ఏలననఁగా: అన్న మేమిచేసినది? కులము స్థలము మున్నగునవి వీని కేమి యపకృతిఁ జేసినవి? కావున మనుజుఁడు పొందెడుపాట్లు నగుబాట్లగుచున్నవి

క. కొడుకును వరియింపఁ గోరి వచ్చినదానిఁ
దండ్రి పెండ్లియాడ ధర్మమగునె ?
తప్పని తెలిసియుఁ దాఁ జేయుకర్మంబు
తప్పదెపుడు భువిని దగులు వేమా!. 281

కొమరునిపెండ్లి చేసికొనఁగోరి వచ్చినపడుచును తండ్రి పెండ్లియాడుట తప్పు. అయినను రాజనరేంద్రుఁడు కర్మవివశుఁడై తెలిసియు ధర్మముఁ దప్పి నడిచెను. కావున కర్మ మవిలంఘ్యమై యుండును.

ఆ. క్రొత్తసుద్దులైనఁ గురుబోధచే విన్నఁ,
గర్మయుక్తియోగకాండతతులు
ప్రాతసుద్దులైన పాయునా కర్మముల్, వి....282

క్రొత్తక్రొత్తయుపదేశములయినను గురువు లనుగ్ర

హాముచే నుపదేశించినసైనను యుక్తియుక్తముగా సాధించినసైనను కర్మఫలములు అనుభవింపనిది తొలఁగిపోవఁజాలవు.

ఆ. చిఱుతనాఁడు నీవు చేసినకర్మంబు
మఱతువేమొ మదిని మల్లడించి
తఱిమిముట్టుఁజావు తలపడినప్పుడు, వి.... 283

నీవు బాల్యమున కర్మల నాచరించితిననుబుద్ధిని మఱచి పోయెదవేమొ కదా! అట్లయినచో నవి వెంటనంటి మరణకాలమునందుఁగూడ వెంటనంటి వచ్చుచుండును. అనుభవించునంతవఱకు నవి నశింపవు

ఆ. చేటు వచ్చెనేని చెడనాడు దైవంబు
మేలువచ్చెనేని మెచ్చుకొనుమ
గరిమ మేలుకీళ్లు కావడికుండలు, వి.... 284

మనుజుఁ డజ్ఞానియై చేటు వచ్చిన దైవమును తిట్టును. మేలువచ్చిన తనను దాను మెచ్చుకొనును. కాని నిజముఁ బరికించినఁ గీడుమేలులు సహజములు అయ్యవి కర్మవశములై యొకదానివెనుక నొకటివచ్చుచునే యుండును.

ఆ. చదివిచదివి కర్మసారముఁ గనలేక
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరాయె
మరిగితిరిగి మొఱిగి మత్తిల్లి చచ్చెరా, వి....285

జనుఁడు వేదములని వేదాంగములని చదివి చదివి కర్మలఁ జేసిజేసి యందలిసార మేమో తెలిసికొనలేక దేశమంతయును తిరిగి మత్తుఁడై చచ్చెనే కాని కర్మఫలమును తప్పించుకొనలేక పోయెను.

ఆ. చాకి కోక లుదికి చీకాకుపడ వేసి
మైల దీసి లెస్స మడిచినట్టు
బుద్ధి చెప్పువాఁడు గ్రుద్దిన మేలయా, వి....286

చాకలవాఁడు మైలబట్టలను ఉదికి మైలదీసి శుభ్రము చేయునట్టులే యుపదేశకుఁడు అజ్ఞానపరిహారార్థమై కొన్ని దుస్సాధ్యములగు కార్యములను కర్మలను చేయించినను ఒక్కింత యైన దోసగులేదు ఏల ననఁగా బుద్ధిచెప్పెడివాఁడు గ్రుద్దినను మేలేయగును

ఆ. తనకు ప్రాప్తిలేక దానము చిక్కదు
దైవనింద వెఱ్ఱితనము గాదె!
కర్మజీవు లేలఁ గర్మంబుఁ దెలియరు?,వి.... 287

తమకు దానము దొరకలేదని మూర్ఖులు దైవమును నిందింతురే కాని ప్రాప్తి లేనందువలన దొరకలేదనియును దైవమును నిందించుట వెఱ్ఱితనమనియును కర్మజీవులు తెలిసికొని మెలఁగరు.

ఆ. తనకుఁ బ్రాప్తిలేదు దాత యిచ్చునె యంచు
నొరుల దూఱు టెల్ల నోగుబుద్ధి
కలిమిలేమి కతనఁ గష్టమె తోఁచురా, వి....

తనకు బ్రాప్తిలేదు అనుకొనక లోభియై ఈయలేదని దూషించుట యంతయును బుద్ధిహీనతయే కాని వేఱుగాదు. ఎంతటిజ్ఞాని యైన నీరీతిగా నిందింపఁబూనుకొనును. ఇట్లగుటకు దారిద్ర్యమే కారణముగాఁ గనుపట్టును.

క. తనప్రాప్తి తనకు నుండఁగఁ
దనదుఃఖము తనకె కాక తగులునె యొరులన్

తన చేయుమంచితనకే
యనుకూలించెడిని జేర దన్యుల వేమా!. 289

ప్రతిమనుజుఁడును ఈర్ష్యాళువై యితరులఁ జెఱుతునని పోవును. ఎవ్వరి ప్రాప్తి వారికి ఎవరిదుఃఖము వారికి ఎవరిచేత వారికి నభిముఖమై యుండి ఇతరులఁ జెందనే చెందదు కావున నట్లు చేయుట మంచిది గాదు.

ఆ. తనకుఁ బ్రొద్దువోనితరుణంబ బదైనచో
విసక తీర దధికవిద్యలైన
పొలతి విసనె ప్రియునికొఱకు కాకధ్వని, వి....

తనకు తగని సమయమైనయెడల నెంతటి బుద్ధికుశలత గల వారైనను మంచికాలము వచ్చునంతవఱకు కాచుకొని యుండవల యునే గాని వేగిరపాటు నొందరాదు. ఎట్లనఁగా ప్రియా గమనమును కోరుచిన్నది కాకికూతలకు కాచియుండుట లేదా? అట్టులే.

ఆ. తనదుకర్మచేతఁ దాను లోకములోన
తనదుతల్లి గర్భమునను బుట్టె
తనదుకర్మ మఱచి తగనివి చేయునా?, వి....

తాను చేసినకర్మమునకు ఫలముగనే తాను లోకములో మాతృగర్భమునఁబుట్టె ననుటను మఱచి జంతువు అజ్ఞానియై తగనిపనులను నత్తినివైచికొని ప్రవర్తించుచుండును.

ఆ. తనదునీడ శిశువు తాఁ జూచుచుండును
తనదునీడఁ జూచి తన్ను మఱచి
పను లొనర్చుచుండు భ్రాంతుల నేమందు, వి.

పిల్లవాఁడు కూడ తా నేమి చేయుచుంటివని నీడను బరికించి సదా జాగరూకుఁడై మెలగుచుండును కదా! ఇట్టులుండ తాము జేయుపనులు ప్రత్యక్షముగా కనుపట్టుచున్నను భ్రాంతులై యింకను కర్మలఁ జిక్కువారి నేమనవలయును ?

ఆ తనదుభాగ్య మెల్ల దానంబు సేయంగ
తనకుఫల మటంచు మిణుకరాదు
తనదు కాలుఁ గోయ తనతమ్ముఁ డేడ్చునా?, వి.

ఎవరికర్మఫలము వారిదే గాని యొకరి దొకరికి రాదు. తనయన్నదమ్ములందఱును దానము లొనర్చిన తనకుఁ గలుగు నని కొందఱు మిట్టిపడుదురు కాని ఫలముమాత్ర మభావమే, ఎట్లనఁగా. తనకాలిని కోసినఁ దనకే నొప్పికలుగును కాని తమ్మునకు కలుగదు కదా !

ఆ తెలివి నొందలేక తిరమును బడయక
తిరుగునస్థిరుఁడయి దేహి జగతిఁ -
దిరుగనేల ? కర్మఁ దెలియు డయ్యజ్ఞాని, వి....

దేహి యుత్తమజ్ఞానశూన్యుఁడై స్థిరత్వమును పొందలేక ప్రపంచమున నెప్పుడును తిరుగుచుండును గదా! ఏల యిట్లు తిరుగవలయును ? కర్మ నెందుల కెఱుఁగడు ?

ఆ. ధర్మమార్గములను దప్పుఁగాఁ జూచును
కర్మజీవి మేలుఁ గానలేఁడు
నిర్మలహృదయుండు నీరూపమున నుండు, వి....

కర్మబద్ధుఁ డగువాఁడు పైత్యరోగి ప్రపంచమును పచ్చగా చూచినట్టులే ధర్మపుమార్గముల నన్నిటిని తిప్పలనుగా

గాంచుచుండును ఇఁక నిర్మలహృదయుఁ డగువాడు ముగ్ధుఁడు కాక యాత్మరూపమున వెలుగొందుచుండును

క. ధర్మార్థకామమోక్షము
లర్మిలి మదిఁ దెలిసినంత నామోదం బా
నిర్మలగతిఁ దాఁ గనవలె
కర్ములకును లేదు ముక్తి గదరా వేమా!. 296

ధర్మము, అర్థము, కామము, మోక్షము ననుచతుర్వర్గ మిట్టిది యని తెలిసినమాత్రాననే సంతసము కలుగునా? కలుగనే కలుఁగదు తెలిసికొని దానిని ప్రత్యక్షముగా చూడవలయును. అంతవఱకును కర్ములకు ముక్తిలేదు

క. నరజన్మముఁ దా నెత్తియుఁ
బరమాత్మ నెఱుంగలేక పాపాత్ముండై
కోఱగాని పను లొనర్చినఁ
దిరిగి యధోగతికి నేగుఁ దిరముగ వేమా! 297

ఎన్నిజన్మములనో యెత్తినఁ గాని దొరకని నరజన్మమును పొందియును అజ్ఞానియై కోఱగానిపనుల నొనర్చెనేని తిఱిగి యధోగతులఁ బడియుండునే కాని యుత్తీర్ణుఁడు కాఁజాలఁడు.

ఆ. నరుఁడైనను లేక నారాయణుం డైన
తత్త్వబద్ధుఁడైన ధరణి నరయ
కర్మభావములను ఘనత నొప్పఁగవలె, వి....

సాక్షాత్తు శ్రీమన్నారాయణుఁ డంతటివాఁడైనను సరి యే బ్రహ్మసాక్షాత్కారము నొనర్చికొని సర్వదా బ్రహ్మానంద

మున నోలలాడువాఁడైనను సరియే కర్మఫలములను ఒప్పుకొని అనుభవించి తీఱవలయును

ఆ. నింగినెగయువాఁడు నేలలోకమున లేఁడు
బంగిఁ ద్రాగువాఁడు బలియఁబోఁడు
కొంగయోగములను కోరుక లడంగునా, వి....

యోగులమని చెప్పుచు నాకాశగమనసిద్ధి మాకు గలదని ప్రజలను వంచన సేయఁ గొండఱు యత్నింతురు. వారిచేత నన్నియును వ్యర్థములు ఏలోకమునందును ఆకాశగమనము గల మనుజుఁడు లేఁడు బంగి ద్రాగినంత మాత్రాన బలిసిన వాఁడును లేఁడు కావున నట్టివారిని నమ్మవలదు

ఆ. పదియసంగతములు పదిసార్లు చేసినఁ
దప్పుదారిఁ ద్రొక్కఁ దార్ఢ్య మొదవు
కూడదేల యట్టి కుదిరిక మంచికి? వి.... 300

మనుజుఁడు పది తప్పుపనులు పదిమారులు చేసియుండినా యటుపై నాతనికి ఎల్లప్పుడును తప్పుత్రోవలను బోవుటకు దార్ఢ్యము కలుగుచుండును కదా! అట్టులే మంచికికూడ దార్ఢ్యముకలుగునేమొ చూత మనినకలుగనే కలుగదు ఇట్లగుట కర్మఫలము ననుభవించుటకే యగును.

ఆ. పరఁగ నింతవఱకుఁ బడినపాటెఱుగరు
ఘనత నొప్పుమనుజుఁ డనఁగ బుట్టి
కీడుమే లెఱుఁగక క్రిందాయెఁ జూడర్యా, వి....

మనుజజన్మము నెత్తియును ఇంతవఱకు ఎ[illegible]

పడి యిట్టులైనదియును స్మరింపనే స్మరింపరు. కర్మమునఁ గల విశేషము నరయరు చివఱకు అజ్ఞానగౌరవమున కీడుమేలులను గుర్తింపలేక క్రిందు లగుచుందురు.

ఆ. పరఁగ నిలను ముందు బ్రదుకురీ తెఱుఁగక
సకలసంపదలును సతము లనుచు
కర్మమర్మములను గనలేరు మూర్ఖులు, వి....

మూర్ఖులు సంపదలే శాశ్వతము లని నమ్మికొని కర్మములయందలి మర్మములను గానలేక ఇంతవఱ కెవ్వానివలన నిట్లున్నదియును ముం దేతీఱుగా నుండు నదియును తెలిసికొన లేక కర్మబద్ధులై యల్లాడుచుందురు

ఆ. పాపమనఁగ వేఱె పరదేశమున లేదు
తనదు కర్మములను దగిలియుండు
కర్మిజనుఁడు తాను కన్నులఁ జూచిన, వి.... 303

పాపము అనఁగా వేఱుగా నెచ్చటనోయుండెనని తలంపవలదు. పాపము ఎల్లప్పుడు తనచేయుకర్మములలోనే మిళితమై యుండియున్నది కాని కర్మి యగుజనుఁడుమాత్రము తానద్దానిఁ జూచియును గుర్తింపలేక మోసము నొందును.

ఆ. పుట్టువుఁ దెలియనిపురుషాధములు భూమి
బుట్టనేమి లేక గిట్టనేమి ?
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి....304

జనన మన నేమి యది యెందువలన గలుగుచున్నదో దాని నెఱుగఁజాలని నీచులు ప్రపంచమునందు పుట్టినను లేక

చచ్చినను సమమే యగును. ఇట్టివారు పుట్టలోని చెదలువలె పుట్టు టయును గిట్టుటయును నిష్ప్రయోజనములే యగును.

ఆ. పుట్టుముద్ధ తిరిగిపోయెడు నీముద్ధ
తేరముద్ధ తన్ను తెలియలేడు
ఉన్ననాటికైన నుపకారిగా లేడు, వి.... 305

పుట్టునప్పుడును జీవుఁడజ్ఞానియే యగును. పోవునప్పుడు నజ్ఞానియేయై యుండును అజ్ఞానముగాఁడై తన్ను తా నుద్ధరించి కొనలేడుకదా ! ఉన్నంతవఱకైన నుపకారియైనను గాలఁడు.

ఆ. పుట్టుటకు ముదంబు గిట్టుటకును వెత
యందఱెఱిఁగినట్టి యల్పవిద్య
చచ్చుఁగానఁ బుట్టఁ జప్పున నేడ్వరే?, వి....306

పుట్టినప్పుడు సంతసించుచుండుటయును చచ్చినప్పుడేడ్చుచుండుటయును అందఱికిని తెలిసిన విద్యయే కావున సుత్తమ మగుజ్ఞానము కలవాఁడు పుట్టినవాఁడు తప్పకఁ చచ్చిపోయెడి వాడే గనుక, పుట్టినప్పుడే యేడ్వఁదగును

ఆ. పుడమిఁ దిరుగఁబడియుఁ బుణ్యంబు లెల్లను
గలుగు సాధుజనులఁ గన్నయపుడె
వడిని నీరు నదిని గడుదేటయై యుండు,వి....307

భూమిలోని సమస్తతీర్థములను సేవించినందువలన గలుగఁ బోయెడి పుణ్యమంతయును సత్పురుషులఁ గన్నంతమాత్రమున గలుగుచుండును. ఇట్లగుట సహజము. వేగవశమున నదినీరు తేటయైయుండదా! అట్టులే.

ఆ. పుడమి గర్మవశతఁ బురుకుత్సుఁ డనుమేటి
ధర్మమనుసరించి ధాత్రి నేలి
తనకు గానివేళఁ దాఁ బడెఁ గష్టముల్, వి....308

పురుకుత్సుఁడను చక్రవర్తి ధర్మానుసారియై సమస్తభూమండలము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలి చివఱకు తనకు కానివేళ కష్టములనన్నిఁటిని కర్మవశమున నే యనుభవించెను

ఆ. పురుషు లరసి కొన్నిపుణ్యభూము లటంద్రు
బుద్ధిలేదొ యిదియు భూమిగాదొ
పుణ్య మనఁగ నేమి? పురుషునికర్మమే, వి....309

కొందఱు పురుషులు విచారించి కొన్ని క్షేత్రములను పుణ్యమయములని పలుకుచుందురు. అట్టివారికి యుక్తాయుక్తముల నరయుబుద్ధి లేకయుండి యుండవచ్చును లేకున్న, తక్కినవి క్షేత్రములు కావా? ఇంతకును పుణ్యమనఁగా నేమియో వారికి తెలియనే తెలియదు. పుణ్యమనఁగా పురుషుని కర్మమే గాని వేఱుగాదు

ఆ. పూతగడ్డి కేల పుట్టించెవాసన
కనకము తన కేమి కల్లఁ జేసె
బ్రహ్మచేఁత లెల్లఁ బాడైన చేఁతలు, వి....310

బ్రహ్మ లోకములోనివస్తువు లన్నిఁటికిని వానివాని కర్మముల ననుసరించి ఫలమును గుణమును పుట్టించునని యందురు కదా! చూడుఁడు. ఆదేవుని చేఁతలెంత తెలివితక్కువవియో! పూఁతగడ్డికి వాసన యేలపుట్టించెను? బంగరున కేల తగ్గించెను?

ఆ. పెక్కుజనులఁ గొట్టి పేదల వధియించి
డొక్కకొఱకు నూళ్ల దొంగలించి
యెక్కుడీ కరిగిన నెఱుగదే కర్మము, వి....

అనేకులగు జీవులను బాధించి చంపి కుక్షిపోషణమునకై యూళ్లను దోచి తినుచుండెడివారు లోకమున కేఁగినను కర్మము వెంటనంటియే వచ్చును గాని వదలునది కాదు కావున మిక్కిలి జాగరూకుఁడవై మెలంగవలయును

ఆ. కర్మజాల మనుచు ఘను లెల్ల బల్కెరు
కర్మమేమి? దానిఘనత యేమి?
తెలుపరొ నలుపొ యెఱుపొ తెలిసినఁ బల్కుఁడు, వి.

ప్రతియాపదలకును తమతమకర్మములు కారణములని పలుకుచుందురు గదా! విచారించిన నిట్లు పలుకువారికి కర్మమనఁగ నేమో, యందలి గొప్ప యెట్టిదో నలుపో తెలుపో తెలియనే తెలియదు నిక్కముగా తెలిసెనందుమా యిట్టులు పలుకనే పలుకరు గదా!

ఆ. ప్రాణమాత్మ మెన్న ప్రాణిజీవిత మగు
జీవిప్రాణ మాత్మ చేరి యొకటె
కర్మబంధమునను గట్టువడి యుండును, వి....

ప్రాణము ఆత్మ ప్రాణిజీవితము ననువీటిని అజ్ఞులు వేర్వేరుగా తలంచుచుందురు కాని నిజముఁ బరికించితి మేని జీవియును ప్రాణమును ఆత్మయును నొక్కరూపే యగును గాని వేఱు కాదు. అట్లయిన వేఱుగా దోఁచుట యెందుల కనఁగా కర్మవశమువనే.

ఆ. మంచిగంధముఁ గన మనసు రంజిల్లును
ఎంతొ వాస ననుచు నెన్నుచుంద్రు
తా మెఱుంగ లేరు తమపూర్వవాసన, వి....

మూర్ఖులగు జనులు తామెవ్వరో ఎట్టిజన్మము నెత్తిరో ఏవాసనలు గలవారో యెఱుగఁ జాలరు; కాని యితరములను లెక్కింపఁబోయెదరు కదా! ఎట్లందురా? చూడుఁడు. మంచి గంధమును చూచినమాత్రాన మంచివాసన యని బల్కెదరు కాని తమపూర్వజన్మవాసనను మాత్రము నెఱుఁగలేరు

ఆ. మంచి నీరుపోయ మల్లె పూచును గాని
ఫలిత మొనరు రెట్లు పని జొరమిని
వంట చేయ కెట్లు వంటక మబ్బును, వి.... 315

మంచినీళ్లు పోసినందువలన మల్లె పూచును కాని ప్రయత్నింపకయే కాయఁజాలదు అట్టులే మనుజుఁడును ప్రయత్నించి కర్మముల నాచరింపక ఫలము నొందలేఁడు ఎట్లనఁగా వంటచేయుక వంటకము కలుగునా?

ఆ. మంచిరుచులఁ గోరు మంచిస్త్రీలను గోరు
మనుజుఁ డెంత చెడ్డమనసొ చూడు
డించుకంత యైన నేలని విడువఁడు, వి.... 316

మనుజుఁ డెంతటివిషయాసక్తుఁడో పరికించుఁడు. మంచి మంచి పదార్థము లన్నియును తనకు కావలయునని కోరుచుండును. స్త్రీల నుత్తమురాండ్ర నెల్లరను తనకు వలయు ననునే కాని విడచిపెట్టఁడు.

ఆ. మంచిశకునములని యెంచి పెండిలి సేయు
వారలొకరు లేరు వసుధలోన
జనులకర్మములను శకునముల్ నిల్పునా ?, వి.

అన్నిశకునములను మంచివిగానే చూచి పెండ్లి చేయఁగల వారలీలోకములో నెవ్వరును లేనేలేరు. ఒకవేళ చూచి యట్లు చేసినను అయ్యవి మనుజులు చేసినకర్మములను పోఁగొట్టఁ జాలవు.

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెరిఁగి
మన్ను జూచి నరులు మగ్నులైరి
మన్నుమన్ను జేర మది నిల్పలేరయా ?, వి....

మృద్వికారములగు దేహములవలనఁ బుట్టి యామృత్తునకే మగ్నులై పరమును కాన లేక ప్రయాసపడి చిట్టచివరకు మన్నును మన్నుతో చేర్చునంతవఱకును మనస్సును నిగ్రహింపలేక పోయిరి. జీవులు ఎంతటియజ్ఞానులో కదా !

ఆ. మతపుభేదము గలమాయసంసారియై
దారిఁ దెలియ లేఁడు తమకమొంది
దారి తెలియు నతఁడు ధన్యుఁడు గాఁడొకో!, వి.

ఎంత చక్కగా చదివికొనిన మనుష్యుఁడయ్యును మత భేదమను తమస్సుచే నావరింపఁబడి దారి దిక్కు తోఁచక పరిభ్రమించి పడుచు లేచుచుండునే గాని యుత్తీర్ణుఁ డగుట దుర్లభము. కావున నట్టులు గాక దారితెలియు నాతఁడు ధన్యుఁ డగును

ఆ. మతము లెన్నియైన సతములు కావవి
సతము కర్మ మగును జగతియందు
అన్నిమతములందు నరయ నొక్కటి లేదు, వి.

మతము లెన్నియైనను స్థిరములు గానేరవు. లోకములో నెప్పుడు స్థిరముగా నుండునది కేవల మొక్క కర్మమే. ఏమతము లను ఎంతవిమర్శముతో బరికించినను కొంచె మైనను స్థిరపదార్థము లేదు

ఆ. మద్యమాంసరుచిని మాదిగదైవాల
యెంగిలిఁ దినఁగానె నింగి కలదె?
భక్తిని హరుఁ గొల్చి భవ్యులు గండయా, వి.

మాంసమును దినుటకును కల్లును త్రాగుటకును మఱిగి యనాచారపుదైవముల యెంగిలిని మెక్కి నిక్కినంత మాత్రానసే స్వర్గముకలుగునా? కలుగనేరదు కావున ఈశ్వరుని సేవించి పవిత్రులు కండు.

ఆ. మధురసంబు గోరి మక్షికంబులు చేరి
చొచ్చి వెడల లేక చొక్కినట్లు
మునిఁగి విడువలేఁడు మూఘఁడు కర్మల, వి....

మూర్ఖుఁడు విషయములఁ జొరఁబడి తీపివాననఁ బట్టి తేనటీగలు తేనెలో బడి బయలు వెడలలేక పోయినయట్టులే విషయములను వదలి ముక్తుఁడు కాఁజాలఁడు.

ఆ. మనసులోనిముక్తి మఱియొక్కచోటను
వెదుకఁబోవువాఁడు వెఱ్ఱివాఁడు
గొఱ్ఱెఁ జంకఁ బెట్టి గొల్ల వెదకినరీతి, వి....

మనసులోనే సర్వదా సన్నిహితమై ముక్తి యుండఁగా ఎచ్చటనో కలదని వెదుకఁ బోయెడివాఁడు చంకలోగొఱ్ఱెను బెట్టుకొని గొఱ్ఱెను వెదుకఁబోవు గొల్లవానివలె వెఱ్ఱివాఁడే యగును.

ఆ. బ్రదుకులన్ని మాయ భవబంధములు మాయ
తెలివిమాయ తన్ను తెలియ మాయ
తనదుకర్మ మొకటె తనరును స్థిర మయి, వి....

బ్రదుకులన్నియును మాయలే, సంసారబంధములును మాయలే, తెలివియును మాయయే, ఈమాయ యంతయును తెలివి వలన నశించి పోవును కాని తనకర్మముమాత్ర మొక్కటి నశింపక స్థిరముగా నుండును.

ఆ. మర్మ మెఱుఁగ లేక మతములు గల్పించి
యుర్విజనులు దుఃఖ లోనర నుంద్రు
గాజె యింటకుక్క కళవళపడురీతి, వి.... 325

యథార్థము నెఱిఁగినవార లొక్కరును లేరు. మర్మము లను తెలిసికొనఁజాలక లోకులు మతములు మతము లని లేని పోని చిక్కులను కల్పించికొని చీఁకటింటిలో దూరినకుక్కల వలె కళవళము నొందుదురు

ఆ. మాట చెరుపుమాట మర్మమే కర్మము
ఆశలు కెడగండు లప్పుముప్పు
పాపకారణములు పలుకులు ములుకులు
లేశమైనఁ దెలియ లేరు వేమా!. 326

లోకు లజ్ఞానముచేతఁ దెలియలేరు గాని ప్రపంచ మం

తయును దుఃఖరూపమే. ఎట్లందురా ? చూడుఁడు. మాటలే చెఱుపునట్టివి. మాటలలోనిమర్మమే కర్మ మగుచున్నది. ఆశ లన్నియు కడగండ్లు అప్పే గొప్పముప్పగును. పాపమునకు హేతువు లగుపలుకులే బాణములుగా నున్నవి.

ఆ. మాట నిలుపలేనిమహితుండు చండాలుఁ
డాజ్ఞ లేనినాథుఁ డాఁడుముండ
మహిమ లేనివేల్పు మండఁ జేసినపులి, వి....

ఆడినమాటఁ దప్పక నెఱవేర్చుకొనవలయును పలికిన మాటలను నిలుపుకొనలేనివాఁడే చండాలుఁడు దొరయై యా జ్ఞను చెల్లించుకొనలేనివాఁడు ఆఁడుదానితో తుల్యుఁడు. సామ ర్థ్యము లేనిదేవతయును దెబ్బతోసాటియే యగును. కావున సమర్థుడై మెలఁగవలయును.

ఆ. మాటలోనివానిమహిమ తాఁ దెలియక
మాట తెలియలేక మమతఁ జిక్కె
మాట తెలిసెనేని మహితుఁడు యోగియౌ, వి.

గురువు ఉపదేశించినవాక్యములో నంతర్హితుఁడుగా నున్నవానిమహిమను నెఱుఁగలేక మంచిచెడ్డలను తెలిసికొనఁ జాలక మనుజుఁడు మమతను చిక్కుకొనుచుండును. అట్లుగాక ఆవాక్యమును మంచిచెడ్డలను తెలిసికొనునేని అట్టివాఁడే యోగి యగును.

ఆ. మానసమున మంచి మల్లెపూవుల చవికె
బావితోటఁ జేసి బాలఁ గూడి
భోగి నయ్యెద ననఁ బోయెఁ బో కాలంబు, వి.

బ్రదికినన్నిరోజులును గొంతెమకోర్కెలను కోరుచు ఫలసిద్ధికై యత్నింపకయే గాలిలో మేడల గట్టుదు ననుకొను చుండినవాఁ డెన్నటికిని తరింపలేఁడు అట్టివానికి ఆయుష్య మంతయు నాయాలోచనలతోనే గడచిపోవును.

ఆ మాయజగ మటంచు మనుజులు సెప్పేరు
మాయగాదు కర్మమయము గాని
మాయయైన జగము మఱి యేడ నున్నదో?, వి.

మనుజులు గురింపనేరక ప్రపంచమునంతయును మాయ యని చెప్పుచుందురు గాని పరికించిన నిది మాయగా తోఁచుట లేదు. అంతయు కర్మమయముగా నన్నది వారనుకొను నట్టులు మాయయే యనుకొందు మన్నను మాఱి జగము లెక్కడివి?

ఆ. మాయజగములోని మమకారవృత్తిచే
మాయఁ దగిలి మనసు మంకు విడక
మదపుసేఁత చేత మహిఁతు లెట్లాదురు?, వి....

ఈమాయావిశిష్టంబగు ప్రపంచమునందు జనులు మోహితులై మమకారములఁ బడి మనోమాలిన్యమును వదలి వేయఁ జాలక మత్తులై దుష్కర్మముల నాచరించుచుందురు. కాని యట్టివారు మహానుభావు లట్లు కాగలరు?

ఆ మాయయన్ చెరసాల మన సను గొలుసును
భేదమనెడి బొంద బెరసియుండు
నిట్టికర్మబద్ధు కెన్నఁడు మోక్షంబు?, వి....232

కర్మబద్ధుఁడు చెఱఁబెట్టఁబడినవానితో సమానుఁడు. ఇట్టి వానికి విమోచనము దుర్లభము అగును ఎట్లనఁగా: వీనికి మాయ

యే యొక చెఱసాల, మనస్సే కాలిసేతులకు గొలుసులు భేదబు
ద్ధియే బొందకొయ్య కావున కర్మబంధము దుర్విమోచనము.

క. మాయమమకారమును ద్రుంచి మఱగినంత
కర్మకడగండ్లు చెప్పను కాలుఁ డెఱుఁగు
దీనిఁ గని మెలఁగెడివాఁడు ధీజితుండు
నాయతుల్ లేనిచో గతుల్ మాయు వేమ!. 333

మాయను మమతను పోఁగొట్టుకొని యెల్లప్పుడును జ్ఞానమును మఱగియుండినయెడలను కర్మలలోనికష్టములును తొలఁగును. ఈయుక్తి నెఱిఁగి మెలఁగెడివాఁడే మనస్సును జయించినవాఁడు. ఉత్తరకాలమునందలి ఫలాపేక్షలేనివానికి సంసారప్రవృత్తియును నష్టమగును.

ఆ. మాలయింటనున్న మఱినీళ్లు మునిఁగిరి
మాలకర్మచేత మాలఁడాయె
ఏల తెలియలేరొ! యానరపశువులు, వి.... 334

మాలవానినిఁ జూచి యంటుపడితిమని పలుకుచు స్నానములను జేయుచుందురు ఆమాలవాఁడును కర్మవశముననే మాలఁడయ్యెను. ఈమాత్రము వివేకములు మనుజులు ఎందువలన తెలియలేరో గదా!

ఆ. మాలదానియింట మంచినీళ్లను బోవు
తుఱకవానియింట త్రుళ్లఁబోవు
మ్రుచ్చువానియింట చచ్చిన పోవునా?, వి....

మాలఁడు తాకిన గలుగునంటుదోషము స్నానమునఁ బాసి

పోవును. తురకయంటు నిట్టులే కాని పైకి మంచివానివలె యుండుదొంగను స్పృశించినయంటు చచ్చినను పోఁజాలదు

ఆ. ముక్కుపట్టి యిాడ్చుముండను చేపట్టి
తిక్కయెత్తి నరుఁడు తిరుగుఁగాక
ఎక్కడి తలితండ్రు లేమియుఁ దనకేల, వి....

కర్మవశుని గావించికొనిపోవుముండు నపుడు తిక్కయెత్తి మనుజుఁడు తిరుగుచుండును లేనచో ఎక్కడి తలిదండ్రులు ఏటిసంబంధము ?

ఆ. మీఁదియాకఁ దీసి మిగులఁ బెద్దల మని
కానరాక తిరుగుఁ గర్మజనులు
బయలుకోరినట్లు భావంబుఁ గోరరు, వి....337

తల బోడిచేసికొని యోగులము సన్న్యాసులము అని కర్మబద్ధులై తిరుగుచుందురు ఇట్లగుటయంతయు నజ్ఞానవిలసితమే కాని వేఱుగాదు బయలు రీతిగా భావమును కలదా! యని మాత్రము పరికింపరు

ఆ. ముక్తి యెవ్వరిసొమ్ము ముక్కుమీఁదుగఁజూడ
భక్తి యెవరిసొమ్ము భజన సేయ
శక్తి యెవరిసొమ్ము యుక్తిచే సాధింప, వి....338

శక్తిభక్తియుక్తులు కాని ముక్తికాని పరమేశ్వరానుగ్రహము కలవారికి మాత్రమే యబ్బును ఇతరులు ఎన్నివిధములగు ప్రయాసముల ననుభవించినను ఈశ్వరాజ్ఞాత్రమైనను వారికి ఫలలబ్ధి కలుగదు

క. ముక్తులకు నేల బెట్టెడు మూఢజనుఁడు
దూదిమూటనఁ జాలినఁ దొడ్డకడుపు
నింపుచుండును సతమని నిత్యముగను
కడుపు తన్నుద్ధరించునే కడకు వేమ!. 339

మూర్ఖులు స్థూలసూక్ష్మములు నెఱుఁగఁజాలఁడు ఎట్లని యందువా? ముక్తులకు ఏమాత్రము నొసఁగక బాహ్యటోపములకు లొంగి కడుపును నింపుకొనుచుండును. ఇయ్యది వీరి నుద్ధరింపఁజాలదు.

ఆ. ముండఁ జూచినంత మొగమోటమిని గంద్రు
ముండ కూడు దినక ముక్తి లేదు
ముండకూటికెల్ల మూలంబె కాదయా, వి....

అజ్ఞానావిష్టులైన మనుజులు కామాసక్తితో స్త్రీని పొందఁ గనినయప్పుడు వివశులైన అన్నము నీళ్లను వదలి తిరుగాడుచుందురు. ప్రపంచమునకంతయును మూలాధారము స్త్రీయే కదా! ఏమి వింత?

ఆ. ముండలందగుగోష్ఠి మునుగుచుఁ దేలుచు
విడువలేరు నుబ్బి వెఱ్ఱినరులు
అందుఁ బాయు వెనుక సన్నియుఁ బోవురా, వి....

స్త్రీలపై గలవ్యామోహమున మూర్ఖులైన జనులు పడుచు లేచుచు వెఱ్ఱివారలై తిరుగుచుందురు. కాని శరీరము నశించి కర్మక్షయమైనచో నీవ్యామోహాగులును నశించును.

ఆ. ముదిత నడవినుంచి ముసులేడి వెన్నంటె

రామచంద్రుకంటె రసికుఁడేఁడి?
పాలువు తోలఁగువేళ బుద్ధు లట్లుండురా, వి....

కాలమును కర్మమును చక్రాగా లేనిచో మనుజులబుద్ధులు చెడుమార్గమున నడుచుచుండును శ్రీరామచంద్రునంతటివిజ్ఞుఁడు ఒంటిగా నాఁడుది యగుసీత నడవినుంచి పోవలేదా? శ్లో

ఆ. ముందుజ్ఞాన మెల్ల మోసమైశిశువులు
కర్మబంధమునను గానలేక
జననమరణములకు సత్పాత్రు లగుదురు, వి....

పూర్వజన్మసంచితమైనజ్ఞాన మెల్లను మాయచేత కప్పఁబడి యజ్ఞులై కర్మరూపముల నిజస్థితుల నెఱుఁగలేక జననమరణాదులకు పాత్రము లగుచుందురు

ఆ. మునిజనములు కలఁగ మునిఁగి వెళ్లినబావి
బ్రహ్మకుఁ దలలెత్తరానిబావి
మొలలబంటిగాను ముంచు నెవ్వరినైన, వి....

ఈసంసారము మిక్కిలియును ప్రాచీనమైనది ఇయ్యది అగాధమగుకూపముతో సమానమైనది ఈకూపమునందే మునిజనులు బ్రహ్మాదులును పడికొట్టుకొనుచుందురు దీనిసామర్థ్య మెంతటిదో కాని ఎంతవారినిగూడ మొలబంటిలో ముంచివైచును.

ఆ. మును తెలిసినవారు మొగి నష్టమైరిల
తిరిగి చెప్పి తనుచుఁ దిట్టవలదు
తెలియఁ జెప్పువాఁడఁ దెలియుము కర్మంబు, వి

ఈయుపదేశములు క్రొత్తవిగావు మున్నున్నవియే యని యనెదరేమో! కాని యట్లు గాదు. తెలిసిన వారందఱు నశించిరి.

కావున తెలియఁజెప్పుచున్నాను సావధానముగా వినుఁడు సర్వ బంధములకు మూలము కర్మమే యగును

ఆ. ముఱికికొంపలోన నిఱికించి జీవుని
కర్మపాశములను గట్టివేసె
నిట్టికర్మజీవి కెట్లొకో మోక్షంబు, వి ...346

ఈదేహ మొక ముఱికిగుహవంటిది ఇందులో జీవుని చిక్కించి కర్మపాశములచేత గట్టిగాఁ గట్టివేసి యున్నారు ఇట్లు సర్వదా బంధనస్థితుఁడగుజీవికి ఎట్లు విముక్తికలుగునో యూహింపుము.

ఆ. ముఱికికోలుకంత మూలంబె మఱిచింత
నరక మబ్బఁజెంతనలుగు డెంత
పరము గోరినంత బయలగు నీవింత, వి... 347

సమస్తదుఃఖములును కలుగుటకు కేవల మొకమలినమగు నింద్రియము కారణముగును అహా! ఈయింద్రియములవలన నలుగుడుకష్టము ఎంతెంతయో గలదు.

ఆ ముఱికిలోనఁ బుట్టి ముఱికిలోనఁ బెఱిగి
ముఱికికర్మమునకు ముఱి పెమేల !
ముఱి కెఱుంగు నతఁడు ముఱికిలోఁ బుట్టునా, వి

మూర్ఖులు జ్ఞానుల మని చెప్పుచు ముఱికి కూపములో తుల్యమయిన సంసారమునఁ బడి మునుఁగుచుందురు ఇట్టి ముఱికిలో విజ్ఞుఁ డగువాఁడు జన్మింప నొల్లఁడు.

ఆ. మూఁటి నీమణముల మొదలంటఁ జెరుపక

చిత్తమేల నిలుచు స్థిరముగాను
చిత్తశుద్ధి లేక శివుఁడు కాన్పించునా?,వి....349

ఈషణాత్రయమును సమూలముగా నశింపఁజేయనిది చిత్తస్థైర్యము కలుగదు. చిత్తము నిలువనిది శివసాయుజ్యము కలుగదు

ఆ. మూఁడుగుణము లొకట మొదలనె యుండఁగా
కలిపి మూలఁ బెట్టి తెలివిలేక
భ్రమలఁ జిక్కి కర్మ బలువెట్టివాఁడురా, వి....

గుణత్రయము ఆరంభమునుండియే యుండినను వానిని కలిపినిలుపుకొను తెలివి లేక భ్రమలలోఁ జిక్కికొని కర్మబద్ధుఁడై తిరుఁగువాఁడు నొకవెట్టివానితో సమానుఁడే యగును

ఆ. మూఢభక్తిచేత ముక్కంటిఁ బూజింప
మొన్నఁ బోయె నరుఁడు ముక్తుఁడాయె
పూజకేమి తనదుబుద్ధి ప్రధానంబు, వి....351

పూజకంటెను బుద్ధియే ప్రధానమైనది బుద్ధి మంచిది గలవానికి తక్కినసాధనసంపద యేదియు నక్కఱలేదు మూఢుఁడు. మూఢభక్తిగలవాఁడు చిరకాలమునుంచి ఈశ్వరు నారాధించువార లట్లే యుండఁగా, తనమనోరూఢి నాతని బూజించి త్వరగా సిద్ధుఁ డయ్యెను

ఆ. మూల మెవ్వరనుచు ముగ్గురిలోఁ గల
మూల మెఱుఁగలేరు మూఢజనులు
మూలమంతటికిని ముఖ్యము కర్మము, విశ్వ....

త్రిమూర్తులలోపల నెవ్వరు ముఖ్యులని జనులు తగవులాడెదరే కాని సారము నెఱుఁగలేరు నిజమును విచారించితిమా ఆత్రిమూర్తులకును ప్రపంచమునకంతికును కర్మమే ముఖ్యము అగునని తేలును.

ఆ మూలవిద్యయందు ముఖ్యతేజములోన
మెలఁగుచిత్పరుండు మిహిరుపగిది
కాలకర్మములకు గాలుండె సాక్షిరా, విశ్వ ...

ఆత్మవిద్యయందును ఆత్మతేజమునందును జిత్తునారాధించువాఁ డెల్లప్పుడును మగ్నుఁడై యుండును అట్టివానిని లోకులు బరిహాసింతురు అని యట్లు గాదు

ఆ మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు
మంత్రముడుగకున్న మది కుదురదు
మనసు నిలుపకున్న మఱిముక్తి లేదయా, వి....

మౌనము వహింపని సంతవఱకును మంత్రసిద్ధి కాఁజాలదు. మంత్రసిద్ధియైనఁగాని మనస్సు నిలువదు మనస్సు నిలిచినఁ గాని ముక్తిలేదు

ఆ. మైథునమునఁ బుట్టి మానవుండదఱు
తిరుగుచుందు రెపుడు తెరువులేక
యొందులోన బుట్టు కందులో నేగతి,విశ్వ.... 355

తాత్పర్యము సులభము.

ఆ. మొదటితరువునందు మూఁడుకొమ్మలు పుట్టె
అనలుకొనలు తీగలాకు లమరె
పువ్వుపిందెపండ్లు భువనము ల్నిండెరా, విశ్వ....

మూలాధారమునందు త్రిగుణములు పుట్టి వానితో సమస్తప్రపంచమును అల్లుకొని లోకములు నిండిపోయెను.

ఆ. ప్రాను తగినదైన మహితమౌవస్తువుఁ
గా నొనర్తు రట్లుకాక యున్నఁ
గాల్తు రట్లె కాదె కర్మలగతి గూడ, విశ్వ....357

కర్మము మంచిదైన ఫలమును మంచిదే యగును ఎట్లనఁగా ప్రాను మంచిదైనచో అపురూపమగువస్తువును గా నొనర్తురు లేకున్న కాల్చి వేయుదురు అట్లె కర్మలనుగూడ సుఖ దుఃఖములు

ఆ ముచ్చుమూఁకకేఁగ ముల్లె విడుచుఁ గాని
మొక్కఁ బ్రొద్దు లేదు మొనసి యెపుడు
దొంగకుక్కకుండ దొంతులు మోయునా?, వి.

తాత్పర్యము సులభము

ఆ. యోనిబంధుఁ డగుచు నొనర జన్మము నొంది
హానివృద్ధిచేత నలసుఁ డగును
కాని వానిమహిమఁ గడమొదల్ దెలియదు, వి.

జననము నొంది హానివృద్ధులవలన మందుఁడై కర్మ యొప్పచుండునే గాని ఆకర్మపునిజరూపు నెఱింగి విముక్తుఁ డగుటకై యత్నింపఁడు

ఆ. యౌవనమున నీశుని ధ్యానమున మది
నిలుపనపుడు ముందు నెగ్గఁ గర్మ
చేయనియతనికి క్షితిసౌఖ్య మేదయా?, విశ్వ....

యౌవనదశయం దీశ్వరుని ధ్యానించుమ తద్రూపముమ

మనస్సులో నిలుపక యుండినచో ఎన్నిజన్మము లెత్తినను కర్మములు పక్వము రాఁజాలవు. రానిచో సుఖమును కలుగదు.

ఆ. రాయిమైయ యహల్య రాముపాదము సోకి
యాడుదయ్యె నందు రవనిజనులు
చేయుసుకృతము లిల శిలలైనఁ దప్పవు, విశ్వ

అహల్య శిలారూపమై రామునిపాదధూళిసంయోగము వలన స్త్రీరూపమును ధరించెనని పురాణములఁ బల్కుచుందురు కాని చేసినకర్మములు రాళ్లైనను తప్పవు

క. లోకము తను ఛీ యననా
యాకీడులో నర్చుచుండు నధముఁడు ధర్మం
బేకోలఁదియొ తా నెఱుఁగనె
కాకులు మడివస్తు వెఱుఁగఁగలవా వేమా! 362

నీచుఁడు తనను లోకు లందఱును ఛీ ఛీ యని పలుకుచున్నను పెడచెవిని పెట్టి లోకముల కపకృతియే చేయుచుండును. అయ్యది వాని స్వభావము ఎట్లనఁగా పెంటలలో తినెడికాకి మడివస్తువు నెఱుంగ గలుగునా ? లేదుకదా ! అట్టులే

క. వచ్చునది పోవునది మఱి
వచ్చెడిదియుఁ గాన లేరు వరుసయె యనుచున్
విచ్చలవిడిగాఁ దిరుగుచు
జచ్చునఁ బడుమిడుతవలెను క్షితిలో వేమా! 363

కర్మలు జరుగుచున్నట్టిదానిని జరుగఁబోవుదానిని జరిగిన దానిని గుర్తింపలేక యజ్ఞులై నిప్పులోఁ బడుమిడుతచందమున చచ్చిపోయెదరు.

ఆ. వలపుఁ జూపి మదిని వర్ణించినంతనె
వెతలఁ జిక్కుచుండు వెఱ్ఱివాఁడు
కులముఁ గోరువాఁడుగుణహీనుఁ డగువాఁడు,వి.

లేనిపోని ప్రేమను ప్రకటించినంతమాత్రాన మనుజుఁడు మోహజాలములఁ బడి యుత్తమకులుఁడ నని యనుకొనుచుండును విచారించిన నిది కర్మమూలము

ఆ. వలలు పన్ని దుష్టవన్యమృగంబులఁ
బట్టవచ్చుఁ గాని పాడుకర్మ
గురునిబోధ లేక కుదుట నొందదు సుమీ, వి.

అడవిలోని దుష్టమృగములనుఁ గూడ వలలొడ్డి పట్టుకొనవచ్చును గాని ఈదుస్సాధ్యములగు కర్మములను గురుబోధ యొక్కటి లేకుండఁగనే సాధించుట కష్ట మగును.

ఆ. వాక్కుచేతఁ దప్పు వావులు వరుసలు
వాక్కుచేతఁ దప్పు వనితగుణము
వాక్కుచేతఁ గలుగు వరకర్మములు భువి, వి.

మాటయే లోకమున కంతకును మూలము. వావిని వరుసను దప్పించునది మాటయే. స్త్రీల స్వభావమును మార్చునదియును కర్మములను గట్టునదియును మాటయే యనఁదగును

ఆ. వాగు లడ్డుగట్టి వల్లకాడులు దున్ని
మును నడిచెడి త్రోవ ముండ్లు గొట్టి
పైరుఁ బెట్టునట్టిపాపులు గలరొకో, వి.... 367

వాగులు వంతలు బిగించి శ్మశానవాటికలను చెడఁ దున్ని

తోవలనిండ ముండ్లకంచెలను వైచి పైరు వేసికొని కర్మబద్ధుఁడై యల్లాడుచుండును

ఆ. వాడ కులము లేక వర్తిల్లు మనుజుండు
కర్మబద్ధుఁడగుచు ఘనత లేక
లేనివాని బోలి దీనవాక్యము లాడు, వి.... 368

కులము శీలములు లేక మనుజుఁడు కర్మవశమున తనకు గలగొప్పను గూడ సరకుసేయక నీచముగను బొంగును

క. వాదమున నడచు నరుఁడగుఁ
గాదనఁగా భూమి దిరుగుఁ గమసరి యైనన్
యేదైన హానివచ్చిన
సాధనవాదంబు నడవఁ జరుగదు వేమా!. 369

ఎప్పుడును ఏదారి యనిన ఆదారి యను మనుజుఁడు ఎప్పటికిని మంచిత్రోవకు రాఁజాలఁడు. అట్టివానితో సాధువాదమునకుఁ గడఁగినను నిష్ప్రయోజనమే యగును

ఆ వానరాకడ మఱి ప్రాణంబు పోకడ
కానఁ బడదు కాలకర్మవశతఁ
గానఁబడిన నెడ్డు కలి యిట్లు నడచునా?, వి....

కాలకర్మలవశమువలన వర్షపురాకడ యును ప్రాణపుపోకడయును కనుపట్టవు అట్లుగాక ముందు రాఁబోవువిషయములు తెలిసియే యుండునేని కలి యిట్లు గడ్డలగునా?

క విడువని మాయాకర్మము
గడువఁగ లేరైరి జనులు కడుఁ జిత్రముగాఁ

నుడివడి పుట్టుచుఁ జచ్చుచుఁ
గడతేరుట గాన్పుకెట్లు ఖలులకు వేమా!. 371

జనులు అవిరతముగా మాయావృతులై దానిని దాఁట నేరక నుడిలోఁ బడి తిరుగునట్లు అమాయలోఁ బడి చచ్చుచు పుట్టుచుందురు ఇట్టివారు ఏవిధముగా నైనను కడతేఱఁజాలరు.

ఆ విత్తర్గుణుండు తానె విజ్ఞానరూప మూని
మతికి గతి యటంచు మాన్యబుద్ధి
సతతమాత్మఁ గర్మసందేహములు బోయు, వి.

త్యాగియగువాఁడు తిరిగి తానే విజ్ఞానము నార్జించి కొని పూజ్యభావముతోఁ మెలఁగి సందేహములను వదలి వైచి ఆత్మ సాక్షాత్కారము నొందుచుండును.

ఆ విత్తవంబు గురువు విశ్వంబునకు నెల్ల
ప్రణవ మంత్ర మరయఁ బరమ గురువు
కర్మగురువు సుమ్ము గాయత్రిమంత్రంబు, వి....

సమస్త ప్రపంచమునకు మూలకారణము గురువుతే యగుదురు అట్టిగురువుల కంతటికి గురువు ఓంకారము ఆయోంకారము గాయత్రిరూపమున కర్మలనుండి కడతేర్చుటకు గురురూపగును

క విత్తును నుముకయుఁ దమలోఁ
బొత్తున పుట్టగను పొట్టుపోయినభంగిన్
వేత్తగు నాతనికర్మం
బిత్తెఱఁగునఁ గడచిచనును నసువుగ వేమా!.374

ధాన్యముపై నున్నపొట్టుగడ్డి మొదలయినవానిని తొలఁగించి శుద్ధము చేసి దంచి లోనిబియ్యమును పొందునట్టులు గానే విజ్ఞానియును గర్మలను తొలఁగించి లోనున్న బ్రహ్మమును కనవలయును.

ఆ. వ్రాఁత వెంటఁ గాని వరమీఁదు దైవంబు
చేతికొలఁదిఁ గాని వ్రాఁత కాదు
వ్రాఁత కజుఁడు కర్త చేఁతకుఁ దాఁ గర్త, వి.

దైవము వ్రాత ననుసరించి యుండును వ్రాఁత చేతి కర్మము ననుసరించి యగుచుండును కావున నొసలివ్రాఁతకు ఈశ్వరుఁడును చేఁతకు తానును కర్త లగుదురు

ఆ. శనియె చాల దనుచు ననిరట కొందఱు
శనికి చాలనిపది కనఁగ లేరు
కర్మఫలమె మిగులఁ గష్టముల్ గుడుపురా, వి....

లోకు లనేకులు శనిచాలకపోవుటవలన తమకు కష్టములు వచ్చిన వని యందురు కాని ఆశనికి ఏమి చాఁకున్న నిటు యిల్లిల్లు అల్లాడవలసివచ్చినది? కావున నందఱికిని కర్మమే మూలమగును

ఆ. శూలి నెంచిమదిని శుద్ధాంతరంగుఁడై
కాలకర్మములను గాలఁ ద్రొక్కి
మేలుపూర్ణపదవి మెచ్చును శివయోగి, వి....377

ఈశ్వరుని వేడి పరిశుద్ధమగునంతఃకరణము గలవాఁడై కర్మములను తుదముట్ట నణఁగఁద్రొక్కి యుత్తమ మగుపూర్ణపదమును పొందవలయును.

ఆ. సతిని చూచి చూచి సౌఖ్యంబు తాఁ గోరు
గతిని కానలేఁడు కర్మజీవి
గతులు సతులవలనఁ గానంగ లేరురా, వి....349

స్త్రీని చూచి తాను సుఖింపవలయునని యజ్ఞుఁడై కోరు చుండునే కాని చివఱకుఁ గలుగఁబోవుగతి నెఱుఁగలేఁడు. గతు లెప్పటికిని సతులవలన కలుగఁజాలవు

ఆ. సతులఁ జూడఁ జూడ సంసారి కాఁగోరు
సుతులు పుట్టఁబుట్ట వెతలఁబడును
గతులు చెడఁగ చెడఁగ గర్మముం జేయును, వి.

స్త్రీలను చూచుకొలఁదిని సంసారి కావలయునని కోరు చుండును కొడుకులు పుట్టినపిమ్మట దుఃఖములపాల్పడును ఈ రీతిగా గతి తెల్లవారినపిమ్మట గర్మ మని యజ్ఞతచేత నేడ్వఁ జూతురు.

ఆ. సుఖములెల్లఁ దెలిసి చూడంగ దుఃఖముల్
పుణ్యములును కర్మపూర్వకములె
కొఱత వేయ దొంగ కోరిన రీతిగా, వి.... 350

సుఖములన్నియు దుఃఖరూపములే పుణ్యములును పాపపు రూపులే. అయినను మనుజులు కర్మపరతచేత దొంగ తనంత తాను కొఱత వేయుమని కోరినట్లు సుఖములను పుణ్యములను కోరు చుందురు

ఆ. సుతులచేతఁ బుణ్యసుఖము నొందుదు నని
మనుజుఁ డుండు కర్మమతముఁ దగిలి
ఏనుఁగు పడియున్న నెత్తునా మశకంబు, వి....

కొడుకులు పుట్టిన వారిమూలమున నుత్తమలోకసౌఖ్యములను పొందఁగలనని మనుష్యుఁడు కర్మబద్ధుఁడై మెలఁగుచుండును ఇది భ్రమ ఎట్లందురా? చూడుఁడు ఏనుఁగు ఎత్తుపడిన దోమలు ఎత్తఁగలవా? అట్లుతే

ఆ. సేతువందు మునుఁగ జీతిఁ గాకి తెలుపౌనె?
కాశికేఁగఁ గ్రద్దఁ గరుడుఁ డగునె?
బదరి కరుగ వృద్ధ బాలుండు గాఁడయా, వి....

మనుజులు తమతమపురాతనకర్మములవలన పుణ్యులయ్యెదరుగాని కాశీబదరికాశ్రమాదులకు పోయినఁ గాఁజాలరు సేతువులో మునిఁగినకాకి హంస కానియట్లుతే కాశికిపోయినగ్రద్ద గరుడుఁడు కానియట్లులనే వీరును కాఁజాలరు

ఆ. స్థిరులు గాక క్షుద్రజీవులలోఁ జేరి
యెచ్చుతగ్గులందు హీనమతులు
గాడ్దెపిల్ల లగుచుఁ గ్రక్కునఁ జెడుదురు, వి...

స్థిరభావముఁ గనలేక చంచలులై నీచులలోఁ జేరి నీచులు తెలివిలేనివడ్డిజంతువులై చెడిపోయెదరు

ఆ. హరికి దొరకె నందురా సిరి యప్పుడే
దొరకె గాదె విషము హరున కరయ
ఎవని కెట్టు లగునొ యెవ్వఁ డెఱుంగురా?, వి.

తాత్పర్యము సులభము

క. హరివిధి సురమును లాదిని
మొఱసియుఁ జన్మించి పిదప మేలుగ్గ కేడఁగా

జరయందు మరణమందును
పరుసన్ ప్రవర్తిలిరి కర్మవాసన వేమా!. 385

బ్రహ్మవిష్ణు మహేశ్వరాదులంతటివారు కూడ కర్మవశమున జననమరణములను ముదుసలితనము నొందుచును కర్మవాసనలను తప్పించుకొనలేక పోఁగా నిఁక మనుజమాత్రు లెంతటివారలు!

ఆ. హంస మానసోద మంటక తిరుగునా?
ముట్టుఁ గర్మచయము ముఖ్యముగను
యోగి తిరుగు హంసభోగముతోడను, వి.... 386

హంస మానసోదకమూలలో దిరుగుచు నందలిపంకముచేత స్పృశింపఁబడనియట్టులే జ్ఞాని కర్మలయందు సంచరించుచున్నను నిరుపమాన మగుపరమహంససాక్షాత్కారభోగముతోఁ దొలఁగుచుండును

ఆ. హేమనగము చేతనెప్పుడు గలవాఁడు
వెండికొండపైని వెలయువాఁడు
ఎత్తనలసె బిచ్చ మేమన వచ్చురా, వి.... 387

మేరువుచేతులో గలిగి రజతాద్రియందే కాపురముండు నీశ్వరునంతటివాఁడును కర్మవశమున భిక్ష మెత్తుకొని జీవింపవలసి వచ్చె ననఁగా నిఁక సామాన్యులను గుఱించి చెప్పవలసిన దేమియున్నది

---

# ధైర్యపద్ధతి.

---

ఆ. అచ్చుపడఁగ మనసు మచ్చికఁ జేఁబట్టి
మచ్చటించి శివునిమూర్తిఁ జూచి
కుచ్చితంబు మాని చొచ్చుటే యోగంబు, వి.

కుదిరికగా మనస్సును మచ్చికఁ జేసికొని నిరంతరధ్యానము నొనర్చుచు ఈశ్వరునిరూపును గుఱితించి కుత్సితగుణములను మాని ధైర్యమున్ఁ బరేశుని జొచ్చుటయే యోగ మనఁబడును.

ఆ. అరసి ధైర్య మూని యతిశయకాముఁడై
నిన్ను నమ్మి నిష్ఠ నెగడుచుండి
నిన్ను గొల్వ ముక్తి నిశ్చయముగ గల్గు, వి....

పరమేశుని నిజరూపును విచారించి ధైర్యమును వహించి యాధిక్యమును గోరుచు దేవుని నమ్మి మిక్కిలి నియమముతో ప్రవర్తించుచు సేవించువేని ముక్తి నిశ్చయముగాఁ గలుగును.

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
తలఁపఁ దలఁప ముక్తి తనకుఁ గలుగు
బాహ్యరంగమందు భయమొంద ఫల మేమి?,

మనస్సులో నితరవిచారములను దలఁపక జన్మమరణాది శూన్యుఁడగు నీశ్వరుని నిరంతరము ధ్యానించిన ముక్తి కలిగి తీరును కావున బాహ్యవిషయములకై భయము నొందనుము.

ఆ. అదరిపడక మనసు నానందమును గోరి
మదిని మెలఁగువాఁడు మాన్యుఁ డరయ
సదమలత్వమునను శాశ్వతేశ్వరుఁ డగు, వి....

ధ్యానకాలమున నేవి యైనను విఘ్నములు పొసఁగె నేని యధైర్యము నొందక యానందకాముఁడై మనస్సున నీశుని ధ్యానించువాఁ డుత్తముఁ డనఁబడును అట్టివాఁడు నిర్మలత్వమున నీశ్వరభావము నొందఁగలఁడు

ఆ అదరి బెదరు లేని నందంగరానిది
ఉండుఁజూడఁ బెద్దపండు గాను
పండుపడినఁ జెట్టుఁ బట్టంగ లేరయా, వి.... 392

విఘ్నభయమువలన నులికి యదరి బెదరు టెందులకు? ఈశ్వరునిరూపుఁ బరికింపఁగా నొకదివ్యమగుఫలమువలె నగుపడు చున్నది కాని దానిని చివఱవఱకు ధీరులై పట్టఁగా జాలరు.

ఆ. అరుణునుదయసంఖ్య యస్తమానపుసంఖ్య
జననమరణసంఖ్య జాతిసంఖ్య
దీని నెఱిఁగి యోగి ధీరుఁడై యుండును, వి....

యోగి యుశిరమనుజాలవలె జననాదిదుఃఖములచేత నిరుత్సాహుఁడు కాక ధీరుఁడై యుండును ఆతని కిట్టి ధైర్యము ప్రతిదినమునుకలుగు సూర్యోదయ సూర్యాస్తమయాదులవలన కలుగుచున్నది.

క. అష్టాంగయోగసాధన
కష్టంబుల కోర్వలేఁడు కనలేఁడు గదా

చేష్టలు విడువని జీవికి
కష్టంబగు పుట్టఁ జావఁ గతి యగు వేమా!. 394

సోమరియై సామాన్యుఁడగు జనుఁడు అష్టాంగయోగములయందలి సాధనములకును కష్టములకును సహింపఁజాలక చేష్టల విడువక యుండును. అట్టివాని కయ్యది జననాదిక్లేశదాయక మగును.

ఆ. ఆత్మలోనిజ్యోతి యమరుట లింగంబు
తెలివిచేతఁ గాని తేటఁబడదు
అది యధైర్యపరుని కంటదు మదిలోన, వి....

హృదయములో నున్న ప్రత్యగాత్మజ్యోతియే లింగరూపము అయ్యది పరిశీలనానిహిత మగుబుద్ధిపాయ మున్నగాని తేటతెల్లము గాదు అయ్యది ధైర్యము కలవానికే కాని అధైర్యము కలవానికి అంటనేఱదు

ఆ. ఆది నెవరు పుట్టి రది తెలియంగోర
సోఱది యగును పిదప సుఖము లేదు
ఆదిశక్తి యన్న నది బయలని నమ్ము, వి....396

ప్రపంచమున కంతకును అది యెవ్వరని మూలకారణమును వెదుకఁబోవ సోదివలె నెప్పటికిని తెగక చిక్కుకలుగును. ఒకవేళ తెగినను దానివలన నిసుమంతయును ప్రయోజనము లేదు. కావున నొక్కమాటతో జెప్పెదను ఆదిశక్తి యనఁగా నది యాకాశరూపమని నమ్మి సేవింపుము

ఆ. ఇంతి వగవ దేల ? ఏకాంతబుద్ధితో

హరిహరాదులందు నాశ లుడిగి
శాంతబుద్ధి నుండ సమకూడును సుఖంబు, వి.

పరేశునిధ్యానమునకు దారపుత్రాదు లడ్డని యేల చింతి లెదవు. ఏకాంతబుద్ధి గలవాఁడవై శివవిష్ణ్వాదులయం దగు ప్రత్య భిజ్ఞను వదలి కేవలము శాంతిబుద్ధితో నుండుటకు యత్నింపుము.

ఆ. ఇలను జ్ఞాన మనెడి యోడ నేర్చినవాఁడు
జలధి యనెడిలేమను జడియక విడి
విలయ మనెడిగట్టు వెలువకె దాఁటును, వి.... 3

ఎట్టిసంసారమును దాటెనమా యని యనేకుల ధైర్యము జెందుదురు కాని నీవు భయపడకుము జ్ఞాన మనునది యోడ వంటిది ఇట్టియోడ నేర్చినవాఁడు అజ్ఞానయుక్తమగుసంసార మనుసముద్రమును ఈద ప్రళయమునుగట్టును తప్పక దాట గలఁడు

క. ఉచితమిత్రులు సతిసుతు లూరుపేరు
ధనము ధాన్యంబు పాడియు ఘనమతములు
నాశమొందును ధీరుఁడై నమ్మఁబోకు
నీవె స్థిరుఁడ వెఱుంగరో నిన్ను వేమా!. 399

మిత్రులు భార్యబిడ్డలు ఊరుపేరు మున్నగునవి యన్ని యును నశించునట్టివే గనుక ధైర్యము వహించి వీటిని నమ్మక నీలోనిరూపమును గాంచి తరింపుము.

ఆ. ఉడుముతోఁకఁ బట్టి యురిదిగా లాగిన
అడుగువిడక పూని యూని యుండు
ముఱికి పైనఁ జేరు ముద మొందవలెనయా, వి.

మనస్సు మిక్కిలి చంచలస్వభావము గలయుడుము వంటిది. దానిని పట్టుకొని బంధించిన నిలువఁబడి కష్టములను సహించిన యాత్మసిద్ధికి సహాయకారి యగును ఇట్లు చేసి సాధకుఁడు గడతేఱవలయును

ఆ. ఊతకఱ్ఱఁ బట్టి యురిదిగాఁ బోవుచు
గోతి కొమ్మలందుఁ గుదిరినట్లు
జ్యోతియందు పొంచి సోహంబు గనుమయా, వి

సాధకుఁ డగువాఁడు అస్థిరములగు నీశరీరాదుల తఁ కార్యసిద్ధి యగునంతవఱకు వదలిపెట్టక ఊతకఱ్ఱను చేతఁబట్టుకొని నిమ్మదిగా తిరుగుచు కోఁతి చెట్టుకొమ్మలపైన లాఘవముగా సంచరించినట్టులు సంచరించుచు నంతర్జ్యోతినిఁ గని కైవల్యము నొందవలయును

ఆ. ఊపఁబోయి కొంత యూఁగించి విడిచిన
నూఁగు గాని గమ్య మొంద లేదు
పట్టుపూన్కి కొలఁది పనిసేయులక్ష్యంబు, వి....

మనస్సును స్వాధీనము చేసికొనుటకై యత్నించి కొంత వఱకు నియమించి సాంతముగా ఫలసిద్ధి యగునంతవఱకు చిక్కపట్టక విడిచిన విడిచిపోవునే కాని ఫలము నొందలేఁడు కావున మంచిపూన్కితో సిద్ధికొఱకు యత్నింపుము.

క. ఊరులు పల్లెలు మానుక
వారక యడవిం జరించు వాఁడరుదెంచు
న్వేరులు కూరలు మెసవెడు
వీఱిడి కిట మోక్షపదవిఁ జిక్కును వేమా!. 403

ఊళ్లను పల్లెలును తిరుగుట మాని నిస్సంగుఁడుగా నుండవలెనని చెప్పికొనుచు అడవులలో తిరిగి యింద్రియజయమును ధైర్యముతో గాంచలేక ఆకులలముతో పొట్టనింపికొనువానికి మోక్ష మెట్టులు కలుగును? అనఁగా—కలుగదు

ఆ. ఎండనీడవన్నె యేక మౌనట్టుగ
నిండుకుండలందు నిలువఁజేసి
దండితత్త్వ మెల్ల తలపోసి చూడరా, వి.... 404

సుఖదుఃఖములను ఎండనీడలను ఏకరూపముగా తలఁకించి నిశ్చలుఁడై దైవరూపమును తలపోయుచు తత్త్వముయొక్క పూర్ణరూపమును ప్రత్యక్షముఁ జేసికొనవలయును

ఆ. ఎదుటి తనబలంబు లెంచుకోనేఱక
డీకొని చెలమునను తీర్చ నేని
వెలుఁగుదివిటిసేవ కేర్పడు చందము, వి.... 405

తనబలము నెదుటిబలమును చక్కగా యోజించికొని డీకొనవలయును. అట్టులుగాక కపటముగా పోరుటకు తలపడనేని వ్యర్థమే యగును ఎట్లనఁగా కాంతి దివిటీసేవ కేర్పడిన రీతినియని భావము

ఆ. ఎఱిఁగిన శివపూజ యెన్నఁడు చెడిపోదు
మొదలఁ బట్టుపట్టి వదలరాదు
మొదలు విడిచి గోడ తుదిఁ బెట్టఁగల్లునా?, వి....

తనకు తెలిసినంతవఱకు నెన్నియేండ్లు గడచినను జ్ఞానము మాసిపోదు. ఏపనికైనను పట్టుఁబట్టి నెగ్గింపనిదే వదలివేయరాదు. ఏల యనఁగా: పని మొదలునుండియే చేయ సాధ్యము

గాని తుదినుండి కాదు. గోడ మొదలునుండి వదలి తుదినుండి బెట్టగలుగునా ? కలుగదు.

ఆ. ఎఱిఁగి మనసుఁ బట్టి యేకాంతమునఁ జేర్చి
పలుగువిడక భావపరమునందు
తరముగానిబయలు దాకుట పరమగు, వి....407

యుక్తాయుక్తములను నిజానిజములను గమనించి యేకాంతముగా నుండి త్వరపడక తనకు గలిగెడియనుభవజ్ఞానము నంతయును భావరూపమునుగా తలఁచి బయలుఁ జెందుటయే పరమగును.

ఆ. ఏకరూప మమర నెందాఁకఁ జూచినఁ
బోక యొఱుకవలనఁ బొందుపడదు
తాఁకి మదిని నిల్పు తత్తర మందకు, వి.... 408

ప్రపంచము నంతయును ఐక్యభావమునఁ బరికింపవలయు నని యెన్నివిధములఁ బ్రయత్నించినను జ్ఞానము లేనిది సాధ్య పడదు. కావున జ్ఞానమును పూర్తిగా నార్జించి ఈశ్వరుని సేవింపుము అధైర్యమునుబొందకుము

ఆ. కట్టువార లేరి కట్టనివా రేరి
కట్టికట్టనట్టి కర్త లేరి
గట్టిపఱచి లెస్స కనుగల్గి చూడుము, వి.... 409

•మనస్సును అరికట్టలేకపోయితిమి కదా యని విచారము నొందకుము. నిజమును పరికించితిమా ఈ ప్రపంచములో కట్టుసామర్థ్యము గలవారు గాని కట్టలేనివారు గాని కట్టియును కట్టలేనివారుగాని లేరు. కావున నారూఢజ్ఞానుఁడవై ధైర్యము వహించి పరమాత్మునిఁ జూడుము.

ఆ. గుణవికారంబులను ద్రొక్కి గుట్టు తెలసి
ధణధణాన్వితప్రణవంబు దాటఁ గాని
తృణము సర్వం బటంచును తృప్తి గలిగి
గణుతిఁజేయును మిన్నక ఘనుఁడు వేమ!. 410

సమస్తగుణవికారములను మొదలంట తొ్రొక్కి వాటిగుట్టునంతయు నెఱిఁగి ఓంకారస్వరూపమును చక్కగా నెఱిఁగినఁగాని సమస్తము నాబ్రహ్మమే యనుజ్ఞానము గాని యానందముగాని కలుగదు అయ్యది కలుగునంతకు సంతృప్తుఁడు కాక గొప్పవారు ధీరులై యత్నించుచుందురు

ఆ. గుఱుతు గూడు చేసి గుణము వత్తిగఁ జేసి
సరవి గర్మసమితి జమురు సేసి
మూల నొక్కజ్యోతి ముట్టించి చూడరా?, వి.

బ్రహ్మమును కొంచలేను కాబోలు నని యధైర్యము నొందకుము. అందుల కొకసాధనమును తెల్పెదను. అట్లు చేయుము. బ్రహ్మము మాయ యను చీకటికోనలో నిమిడియున్న యది దానిని గనుటకు దీపము కావలయును గాన లక్ష్యమును గూడుగా చేసి గుణమును వత్తిగా చేసి కర్మను చమురుగా చేసి జ్యోతిని వెల్గించి కనుము.

ఆ. చీఁకటింటఁ జేరి చింతింపఁ బనిలేదు
తాకపోక లెఱిఁగి రంగుమీఱ
నేక తేజమునను నిలఁద్రొక్కి చూడరా, వి....

అజ్ఞానాంధకారమునఁ బడి యధైర్యమునఁ జింతింపవల

నినఁ బని లేదు. మఱి యుపాయ మేమియనెదవా? జ్ఞానము రాకపోకలను గుఱించి తద్ద్వారా తేజోరూపునిఁ గని వెలయుము.

ఆ. చుట్టుపరిజనంబు సుఖలీల చెలువంబు
నడుమ నాయకతయు నర్తనంబు
బ్రహ్మపదము మీఱు బ్రదుకుఁడీ జనులార, వి.

బ్రహ్మానందము రాజసౌఖ్యములాఁటిది చుట్టును బరిజనమును సుఖలీలయును నడక రాజరీవియును మహానందప్రవర్తనముఁ గలిగి యొప్పుచుండును కావున నిట్టియానందము నొంది బ్రదుకుఁడు.

ఆ. ఛేద్యమైనదానిఁ జేపట్టినాఁడని
మూలవస్తు వెట్టు కేలఁ జిక్కు?
దాని మానఁ గలుగు దార్ఢ్యంబు నిక్కము, వి.

నశ్వరమగుమాయఁ బ్రవర్తించినకారణమున మూలకారణమగు బ్రహ్మము వాని కేరీతిగా సిద్ధించును? సిద్ధింపదు కదా కావున నామాయను విడచిన ధైర్యము చిక్కి జీవన్ముక్తి కలుగును.

ఆ. జాతి వేఱు లేక జన్మక్రమంబున
నెమ్మదిని నభవుని నిల్పెనేని
నఖిలజనులలోన నతఁడు ఘనుండయా, వి....

జాతిగుణక్రియాదిభేదములను నశింపఁజేసి కేవలమును జన్మపురీతిగా అనఁగా: జన్మము మొదలుకొని ఈశ్వరుని హృదయపీఠిని ధ్యానింపవలయును. ఇట్టివాఁడే సమస్తజనులలోకెని ఘనుఁ డనఁదగును.

ఆ. తనువనఁబడు వెంటఁ దగుశత్రుమిత్రుల

తెలియలేనివాని తెలి వదేల ?
తెలిసి చక్కఁబఱప దివ్యామృత మ్మదే, వి....

శరీరము ఒకయింటివంటిది. ఈయింటిలో ననేకులు శత్రువులు గలరు ఈశత్రువులను గుర్తింపలేకున్న తెలివాత వానితెలివి తేట లెందులకు ? వారిని గుర్తించి ఆబాధను తొలగించుకొనువానికి నే యీయమృతత్వము అక్కఱయే లేదు.

ఆ. తాము వెలయునూర తామంబు వాటిల్ల
నట్టియూరువిడిచి యవలఁ బోరె ?
కొలఁకు లెండినంత కొక్కెర లుండునా ?, వి.

ఉన్నయూరు కఱవు వచ్చిన దానిని వదలి మఱియొకచోటికిఁ బోవలయును. అట్లు అయిననే బుద్ధిమత్త్వమునకు లక్షణము అగును ప్రపంచధర్మము నిట్టిదే మడుగులెండిన నింకొకచోటికి కొంగలు పోవుట లేదా !

ఆ. తారకంబుఁ జూచుదారి వేఱుగ గద్దు
సమముగాను జూడఁ జక్కఁబడును
వెఱ్ఱిగాను జూడ వెలుగెల్లఁ బాఱురా, వి....

బ్రహ్మమును పరికించు దృష్టి యొకవిధమైనట్టిది. అయ్యది వేఱుగనే యున్నది దానిని తగినదృష్టితో చూచిన కార్యము సిద్ధించునే కాని వెఱ్ఱివెఱ్ఱిచూపులఁ జూచిన నిసుమంతయును ప్రయోజన ముండదు.

ఆ. దేవుఁ డనఁగ వేఱుదేశ మందున్నాఁడె ?
దేవుఁడనఁగఁ దనదుదేహముపయి
వాహనంబు నెక్కి వడి గదలును జూడు, వి....

దేవుఁడనఁగా వేఱొకదేశములో లేఁడు తనదేహము లోనే యున్నాఁడు అతఁడెప్పుడును మూలఁబడియుండక వాహనారూఢుఁడై బయలువెడలుచుండును.

ఆ. ధైర్యయుతున కితరధన మైన నదు రేమి?
దాన మిచ్చినపుడె తనకు దక్కు
నెలమి మించుపనికి నెవ రేమి సేతురు, వి....

ధైర్యము గలవానికి తనది యితరులది యనుభయము లేనే లేదు. అతఁడు తనచేతికిఁ జిక్కినదానిని తనకు దక్కినదాని వలెనే దానముఁ జేయుచుండును. పని ముగిసిన పిమ్మట నెవ్వ రును నేమియుఁ జేయఁజాలరు

ఆ. నియమితాసనమున నిలచినచిత్తంబు
తామసంపునిద్రఁ దలఁగఁ ద్రోయు
నిద్రదొలఁగినంత నిర్భీతి యుదయించు, వి....

మనస్సు నియతమగుస్థానమునందు నిలిచి యుండిన అజ్ఞానమును పాఱఁద్రోలును ఆయజ్ఞానజనితమగుమాంద్యము పోయినేని నిర్భీతి కలిగి ఈశ్వరసాక్షాత్కారము గలుగును

ఆ. పట్టుఁ బట్టినతఱి పరవాదము లవేల?
నెట్టుకొన్నతలఁపు నిలుపవలయు?
వట్టిపలుకుల విడువారల నగుదురు, వి.... 422

ఈశ్వర సాక్షాత్కారమునొందవలయునని పట్టుఁ బట్టిన వాదోపవాదములతో నేమిప్రయోజనము గలదు? కావున నిత రులు విని నవ్వఁదగిన వ్యర్థప్రలాపములతో కాలమును పుచ్చక ప్రయత్నించి ఈశ్వరునిఁ గని కైవల్యము నొందవలయును.

ఆ. పంద నధిపుఁ జేసి బవరంబునకు బంపఁ
బాఱిపోవుఁ గార్యభంగ మగును
పాఱునట్టిబంటు పనికిరాఁ డెందును, వి.... 423

పనికిమాలినవానిని యుద్ధమునకు బంపెద రేని యాతఁడు పిఱికియై పాఱిపోవును. అందువలనఁ గార్యము చెడును నిట్టి బంటు ఎచ్చట నైనను పనికిరాఁడు కావున పిఱికితనము నొందక ధైర్యము గలిగి మెలఁగవలయును

ఆ పొంకములకు మనసుఁ బోనీక సర్వేశు
వంకనిల్పువాఁడు వంశపరుఁడు
వంక నిల్పుకున్న వచ్చునా పదవులు? వి.... 424

విషయములపైకి మనస్సును బోనీయక లాగిపట్టి ఈశ్వరునిపై పునకు మరల్చి యుంచువాఁ డుత్తముఁ డనఁదగును. మనస్సు నిలుపలేనివానికి ఆపదలును వచ్చును కావున ధైర్యము వహించి మనోనిగ్రహముఁ జేయవలయును

ఆ ప్రజ లెఱుంగఁ బ్రదుకుఁ బట్టభద్రతఁ గాదు
పైఁ గిరీటముండుఁ బ్రభుత కాదు
బాగు నెఱుఁగు ధైర్యపరుఁ డాతఁడని నమ్ము, వి

ధైర్యము గలవానికి సమస్తైశ్వర్యములుఁ గలవనవచ్చును. ప్రజలందఱచేతను విదితుఁడై బ్రదుకును కాని చక్రవర్తి మాత్రము కాఁడు. కిరీటముకూడ కలిగియుండును. ప్రభుత్వమున కది చిహ్నము కాదు. కావున ధీరుఁడవై యుండుము.

ఆ. బంటుతనము గాదు బలములోఁ గట్టిఁగా

వెంటనుండి మనసు వెతలఁ బఱచు
నింటఁ గెల్చి రచ్చ నిల గెల్వవలెనయా, వి....

మనస్సును జయించి బంధించుట మాటలని యనుకొనకుము. అయ్యది మిక్కిలియును దుస్సాధ్య మగుకార్యము ఏల యనఁగా మనస్సు వెంటనుండిన ట్లుండియే చిక్కులఁ బెట్టును. కావున ముందుగా నింట గెల్చి పిదప రచ్చఁగెల్చినట్లు మనస్సును నిగ్రహింపవలయును.

ఆ. బోనులోనియెలుక పోఁజూచునట్టుల
జ్ఞానమొందఁ దెలుక చనును మీఁదఁ
గాన ధైర్యపరత ఘనత త్త్వమందుము, వి....427

బోనులో జిక్కినయెలుక పాటిపోఁజూచినట్టులే జ్ఞానమును పొంద ప్రయత్నించినప్పుడు అజ్ఞానము ఎట్లయినను తప్పిపోవలయునని మనస్సు యత్నించును కావున ధీరుఁడవై పరతత్త్వము నొందుము

ఆ. మంటిమింటిసంధి మన్నవా రెందఱో
ఎన్నగాను దరమె యేరికైన?
నున్నవారు చావ నున్నవారే సుమీ, వి....428

భూలోకస్వర్లోకములమధ్యను ఎందఱు పుట్టలేదు ఎందఱు చనిపోలేదు వారినందఱను లెక్కపెట్టలేముగదా! కావున నున్నంతమాట్టునకును మరణమే విధియని ధైర్యము వహించి మోక్షము నొంద యత్నింపుము

ఆ. మట్టువెట్టి కోర్కె మది నిల్పి చూచిన
గుట్టు మిగులు దానిగుణము దొరకు
నట్టు నిట్టు చెదర నమరదు తత్త్వంబు, వి....

మనస్సును కట్టివైచి కోర్కెల నడంచి పరికించిన బ్రహ్మ మనఁగా నేమొ దానిస్వరూప మెట్టిదో చక్కఁగా బోధపడును. అట్లు బోధపడునంతవఱకును తత్త్వము దొరకదు.

ఆ. మత్సరంబు మదము మమకార మనియెడి
వ్యసనములను దగిలి మసలఁ బోక
పరుల కుపకరించి పరముఁడ వగు పొమ్ము, వి....

అజ్ఞానివై పరమునకు శత్రుభూతములగు మదమాత్స ర్యాదివ్యసనముల బాఱిఁ దగుల్కొని బాధనొందక సర్వసమత్వ మును ఐక్యమును అవలంబించి పరోపకారివై పరఁగుము.

ఆ మత్తచిత్తులు కలమర్మంబుఁ దెలియక
చిత్తచలన మంది చెడిరి భువిని
చిత్త మచట లేక చిక్కునా పరమాత్మ? వి....

మదించినచిత్తము గలవారు మర్మము తెలియఁ జాలక చిత్తసంచలనము నొంది చెడిపోయెదరు. అట్టివారికి ఫలసిద్ధి లేదు ఏలయనఁగా చిత్త మచ్చట లేనిది పరమాత్మ చిక్కదు కదా!

ఆ. మదిని గానవచ్చు మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్నయంత మహితుఁ డగును
వెదకి తనువులోన విశ్వుని నరయుము, వి....432

బ్రహ్మమును దర్శించుట కెక్కడికో పోవ నక్కఱలేదు. ఆ బ్రహ్మమును మనస్సులోనే ధ్యానించి కనవచ్చును అట్లు కను గొనె నేని యాతఁ డుత్తముఁ డగును. కావున ధీరుఁడవై వెదకి నీశరీరములోఁగల యీశ్వరు నెఱుఁగుము.

ఆ. మననవృత్తిఁ బూని మౌనసమాధిలో
తనదుజ్ఞప్తి మఱచి తాల్మితోడ
పెంపుఁ జెందువాఁడె ప్రియభక్తుఁ డగునయా, వి

మననమును వహించి సమాధినిష్ఠుఁడవై ప్రాపంచిక జ్ఞానము లేక యుండునట్లులు తన్మయత్వమును వహించి ధైర్యము నొంది వృద్ధి జెందువాఁడే బ్రహ్మభావబద్ధుఁ డగును.

ఆ. మనసునంటి నిలిచి మనసున సుఖియింప
కడకు మోక్షపదవిఁ గనక పోఁడు
చెట్టుఁ బెట్ట ఫలము చేకూరకుండునా, వి....434

ఈశ్వరుని మనసులో నే పాదుకొల్పి నిర్వికారమగు నానందము నొందుచు సుఖించుచుండె నేని ముక్తి నొందకపోఁడు. ఎట్టు లనఁగా చెట్టు మొలవేసిన నెప్పటికైనను ఫలింపక యుండదు గదా! అట్టులే

ఆ. మనసులోన నున్నమర్మ మంత యోజింగి
స్థిరముఁ జేసి యాత్మ తేటపఱచి
ఘటము నిల్పవలయు ఘనత లింకేటికి?, వి....435

మర్మముల నన్నిటిఁ దెలిసికొని మనస్సును స్థిరముగా నిలిపికొని యాత్మను పరిశుద్ధతతో కననట్టివానికి ఇతరవిధము లగు గుణగౌరవములతో నిసుమంతయును ప్రయోజనము లేదు.

ఆ. మర్మమంతఁ గనక మన సైక్యమందక
పరమగూఢ మింత బయలుపడదు
పడినమాత్ర మెన్న బయలుపడినయంతె, వి....

సారమును పూర్తిగా తెలిసికొనకుండునంతవఱకును మన సైన్యక్యమునొందనంతవఱకును రహాస్యము బయలుపడదు. ఒకవేళ నేమాత్రము బయలపడినను బ్రహ్మపదార్థము బగుల బడినయట్టులే యగును.

ఆ మాయఁ బోవువిధము మనుజుండు తలఁచిన
మంచిమార్గ మబ్బు మానవులకు
మాయ దాఁటలేని మనుజుండు వ్యర్థుండు, వి

మాయ యెట్లు నివర్తించునది యనువిషయము తెలిసిం గినా మనుజుఁడు ఇఁక నటుపైని సన్మార్గము నొందఁగలఁడు. అట్లైననే ముక్తుఁ డగును మాయను నిగ్రహింపలేనివాఁడు వ్యర్థుఁడే యగును

తే మాయ మమకారములఁ ద్రుంచి మఱగినంత
కర్మకడగండ్ల చెప్పను కాలుఁ డెఱుఁగు
దీనిఁ గని మెలఁగెడివాఁడె ధీరుఁ డరయ
మాయఁ గనకున్న గతులెల్ల మాయ వేమ. 438

మాయావికారములను నశింపఁజేసినపిమ్మట కర్మములు తమంతట తామే నశించును అటుపైని జీవన్ముక్తుఁడగును ఈ విషయము తెలిసిగినవాఁడే ధీరుఁడగును

క. మాయలసంసారముకై
మాయలనే తిరుగుచుండు మనుజుఁడు లోనై
మాయలఁ దెలిసినయంతట
మాయలనే ముక్తి గలుగు మహిలో వేమా!.

మనుజుఁడు అజ్ఞానియై ఈమాయారూపము లగుసంసారాదులఁ బడి కొట్టుకొనును; కాని దీని నెఱిఁగినేని యట్టి వాని కింక ముక్తికలదు

ఆ. మాయ భయము లేని మనుజుఁడే మనుజుఁడు
మాయలో మునుంగ మనుజుఁ డగునె
కాయ ముడుగునపుడె మాయయు నుడుగును, వి.

మనుజుఁ డనఁగా మాయవలనిభయము లేనివాఁడే యగునుగాని కలవాఁడగునా? కాఁడు శరీరముతోఁటిమాయయును తొలఁగును కావున ధైర్యము వహింపుము

ఆ. మింట నంటియున్న మినుకుఁ జూడఁగఁ బూని
అంట లేక కొంద ఱవధిపడిరి
కంటి నంటుజ్యోతిఁ గానంగ లేరయా, వి.... 441

ఆకాశప్రదేశమునఁ గలజ్యోతిని వీక్షింపఁ బ్రయత్నించి పొందలేక యనేకులు పెక్కుకష్టముల పాలయిరి ఇట్టివా రజ్ఞులై కంటికి కనఁబడువెల్గును సయితము కనఁజాలరు.

క. ముక్కోణశిఖరమున గురి
దక్కఁగఁ బరిపూర్తిఁ జెంది ధైర్యము విడకే
సొక్కియు సోలకయుండిన
నిక్కపుఁగైవల్య మదియె నిజముగ వేమా!.442

నాసాగ్రమున దృష్టిని నిలిపి ధైర్యమును వహించి పరిపూర్ణమగుధైర్యముతో పరమాత్మతత్త్వమును తిలకించుచు మాయకు వశుఁడుగాకయుండుటయే కైవల్యము నాఁ బడును.

౩. ముదిత వలపుఁ జూడ మోహింత్రు వారల
చెంతఁ జేరఁగాన చెడును మనను
వింత భ్రమగుణంబు కొంతఁ జూచినఁ జాలు, వి.

స్త్రీలయందలి ప్రేమకు లొంగిపోయి మోహింతురు. ఆహా వారిని సమీపింపఁగా నే మనస్సు తిరిగిపోవును స్త్రీ, చిత్తభ్రమణమునకు కారణము కాన ధైర్య మూనియుండుము

ఆ. మఱిగి తిఱిగి నరుఁడు మఱులుకొన్నను గాక
యున్నవలన నేమి యాశ గలుగు
అంతరాత్మ నిలుపు నతఁడె పో తానగు, వి....444

మనుజుఁడు విషయాసక్తుఁడు గాక పరతత్త్వమునం దాసక్తుఁ డైననే తప్ప లేకున్న ఒక్కింతయును ప్రయోజనము లేగు కావున అంతరాత్మ నిలుపువాడె ముక్తుఁ డగును

ఆ. మూఁడుగుణములందు ముఖ్యగుణంబును
తెలియలేనివాఁడు వెలయు నెట్లు
భ్రమల బడియెనేని బలువెట్టియగు నిఁక, వి.

సత్త్వరజస్తమోగుణములను మూఁడిటియందును ముఖ్యమగు సత్త్వగుణము నెఱుఁగనివాఁ డెట్లు ముక్తుఁడు కాఁ గలఁడు ? అట్లు ఎఱుఁగకయుండిన వెట్టి యగును కావున ధైర్యమును వహింపుము

ఆ. మూఁడు గుణములంటి మూలంబు గనవలె
వీలుగాను త్రిపుటి వెలయు నొక్క
త్రాడు ద్రొక్క పాముఁ దలచినచందమౌ?, వి....

మూఁడుగుణముల మూలమును గనిపెట్టి త్రిపుటిని శోధించిన యంతర్గతమగు బ్రహ్మతేజము పైకి యుబకగలదు త్రాడు ద్రొక్కిన పాము వెడలునట్టులు

క. మూఢాత్ములైనమనుజులు
గూఢంబును దెలియలేక గుఱి గనలేరా?
గాఢాంధకారదూరుని
రూఢిగఁ జేరంగఁ గలుగు రూఢము వేమా! 447

మూర్ఖులగువారు రహస్యముగా నున్న పరేశునిరూపమును గుర్తింపలేరు నిర్వికల్పరూపుఁడును విమలతేజస్కుఁడు నగునాతని గురుతించుటయే ముక్తి యనఁబడును

ఆ. మూఁడులోకములను మొనసి యొక్కటిఁ జేసి
యారుతావరముల నంటఁ గూర్చి
స్థిరముగానె యుండు శివమూర్తి చిద్రూపి, వి.

మూఁడులోకములను ఏకాకారతఁ జేసి షట్కోణములను ఈశ్వరునిఁ గూర్చి మనస్సులో స్థిరముగా నిల్పిన శివస్వరూపమే చిద్రూపమని యెఱుఁగవలయును

ఆ. మూఁడువేళలందు ముదముతో శివునాత్మ
పూజసేయువాఁడు పుణ్యమూర్తి
పూజలేక మోక్షభోగంబు దొరకునా? వి....

త్రికాలములయందును నత్యధికమగు సంతసముతో శివ్వరునిరూపును హృదయమందు పూజసేయువాఁడే పుణ్యమూర్తి యగును ఎట్టివారికైనను పూజలేక మోక్షభోగము దొరకదు

ఆ. మూల మెన్వ రనుచు ముగ్గురిలోఁగల
మూల మెఱుఁగలేరు మూఢమతులు
మూలము ముగురికి ముఖ్యమై యుండును, వి.

కొందఱు మూర్ఖులు త్రిమూర్తులలో ముఖ్యు లెవ్వరని వ్యర్థముగా పోరుచుందురే గాని ఆముగ్గురుమూర్తులకు మూల మగువానినిమాత్రము కానలేరు

ఆ. మొదట నతఁడు జ్ఞానముద్రాంకితుఁడు గాక
యావిధమును దెలియ నజ్ఞుఁ డగును
నడుమ జ్ఞాన మన్న నగుబాటు గాదయా?, వి.

మొట్టమొదటనే మనుజుఁడు జ్ఞానియై యుండవల యును అట్లు లుండవలయునని తెలిసికొనినను జ్ఞానియే యగును జ్ఞానము ఆదిమొదలుకొని తుదవఱకు నుండవలయునే గాని నడుమ కలిగినయెడల నగుబాటు అగును

తే. మాని నిజకేళిలోపల మమతఁ ద్రొక్కి
సాహసంబున గురుభక్తి సలిపి లోన
జపము చేయుట ముక్తికి యుక్తి యగును
నిబ్బరము పట్టి ఫలమొప్పు నిజము వేమ. 452

వాజ్నియమము గలవాఁడై అంతరంగమునందలి మమ త్వమును తుదముట్టించి తెగువచేసి గురువుల సేవించి వారు అనుగ్రహించినదానిని జపించుటయే ముక్తి కలుగుటకు తగిన యుక్తి యని యెఱుఁగుము.

ఆ. యాత్ర వోయినాతఁ డెన్నాళ్లు దిరిగియు
పాదమైనముక్తిపదవిఁ గనఁడు
మనసు నిల్పునతఁడు మహనీయమూర్తిరా, వి.

తీర్థయాత్రలకని దేశదేశముల నెన్నిరోజులు తిరిగినను కాలు త్రిప్పుటయే గాని కాలువాసియైనను ముక్తిని గనఁజాలఁడు మనస్సు నిల్పువాడే మహనీయుఁడగును

తే. యుక్తమైనది బయులని యూహఁ జేసి
రక్తి తన్మయ మనియెడి ముక్తి నెఱిఁగి
భుక్తిశక్తులు మఱచుట పూర్ణపదవి
సక్తి పరమాత్మయం దుంచి జగము వేమ 454

బయులే యుక్తమని యెంచి సాధకుఁడు మనంబునందుఁ జేర్చి తన్మయుఁడై ముక్తి నిజరూపము నెఱిఁగి ప్రవర్తింపవలయును అట్టులయిన తప్పక పరమాత్మసాక్షాత్కరించును

ఆ. రక్తిలేనిపనులు రమ్యమై యుండునా
రక్తి గలిగె నేని రాజు మెచ్చు
రాజురక్తి సంతు రమణులు మెత్తురు, వి.... 455

ఏపనిని చేసినను అనురాగముతో చేయుచుండవలయును అనురాగములేనిపను లెవియైనను రమ్యముగనుండనేరవు అనురాగముగలిగి చేసినపనులకు రాజును రమణులును మెచ్చుకొనుచుందురు

ఆ. రాముఁ డొకఁడు పుట్టి రవికులం బీడేర్చె
కురుపతియును బుట్టి కులముఁ జెఱిచె
నిలను ధర్మాధర్మములరీతు లిట్టివి, వి.... 456

ధర్మాధర్మముల నిజస్థితులు మిక్కిలియును సూక్ష్మము లయినవి. ఎట్లందురా? రాముఁడును దుర్యోధనుఁడును గొప్ప కులమునఁ బుట్టినవారలేయైనను ధర్మాసక్తిచే రాముఁడు కుల ముద్ధరించెను అధర్మానురక్తిచేతఁ గురుపతి కులమును చెఱిచెను

ఆ. తాయితాయిఁ గూర్చి రాయఁగా రాయఁగా
నున్ననైన యట్టు లన్నిపనులు
పాటుచేసినంత పరిపాటి యగునయా,వి.... 457

నిర్జీవములగు పదార్థములుసయితము ఒకటిగా జేరిన ఘనకార్యము లనేకములు కలుగును కావున పరిశ్రమచేసిన యెడలను ఐకమత్యము గలిగియుండుటచేతను ఎట్టికార్యములును సఫలము లగును

ఆ. రూపు నతికఁ జూడఁ దాపంబు పుట్టిన
భ్రాంతు లంకురించు నంతలోనె
బుద్ధి మఱలకున్న రద్దికి నెక్కురా, వి.... 458

మోహజనకములగుపదార్థములన్నిటిలో యువతు లధికలు వారిరూపమును నడకను చూచిన మనస్సులో ఆశేగ మంకురించి భ్రాంతిగలిగి బుద్ధి యవ్విషయములపై లగ్న మగును. పిమ్మటనెట్లయినను ధైర్యముఁబూని దానిని మఱల్చుకొనిన మంచిది అట్లుగానిచో నప్రతిష్ఠకలుగును

తే. లగ్నచిత్తము లోనైన లఘువుఁ దెలసి
విలయమగు నిచ్చలోపలివిధము నూని

యున్నవాఁడగుముక్తుఁడీయుర్విలోన
పాటుపడ లేమి నెట్లబ్బు ఫలము వేమ. 459

మనస్సును యోగమునందు గూర్చి, చాంచల్యము నడంచి లోపలివిధముల నెఱింగి తన్మయుఁడై యుండెడివాఁ డొక్కరుఁడే యీ ప్రపంచమునందు ముక్తుఁడు నాఁబడును కావున పాటుపడి ముక్తుఁడవు అగుటకై యత్నింపుము పాటు పడనిది ఫలమురాదు గదా!

ఆ. లింగమంగమునను లీల దెలియు వెన్క
మనను లింగమందు మఱలుకొనును
మనను నిల్ప నందె మఱిలింగ ముండురా, వి....

లింగాంగములస్థితిగతులును సంబంధాదులును తెలి సినపిదప మనస్సు లింగమునందు మఱలుకొనును మనస్సును నిల్పినచో నచ్చటనే పరమేశ్వరునిరూపుగూడ ప్రత్యక్షగోచ రము కాఁగలదు

ఆ. వార్తలోని వార్త వైభవ మరయక
మిట్టిపడుదు రిలను మిడుతరీతి
గట్టిజేసి నిలుపు ఘనుఁడెపో శివయోగి, వి....

ఉపదేశములోనియాథార్థ్యము నెఱుఁగలేక జనులు మూర్ఖులై తమ్ము తామె నుతించికొనుచు మిట్టిపడుచుందురు అట్లగుట ఫలసిద్ధికి భంగకరము అట్లుగాక మనస్సు గట్టిగా నిలిపి శివునిరూపును తెలిసికొనువాఁడే ముక్తుఁడగును.

ఆ. వితరణంపుచూడ్కి విశ్వరూపముఁ జూచి
మతిని గడకుఁ ద్రొక్కి మౌన మూని
సతత మెన్నువాఁడు సరసు డీయిలలోన, వి. 462

ధారాళ మగుదృష్టితో ప్రపంచమును పరీక్షించి సారాసారములను గమనించి మనస్సును లోంగద్రొక్కి మౌనమును వహించి యెల్లప్పుడును పరమేశ్వరుని నిజరూపును ధ్యానించువాఁడు సరసుఁడని యనఁదగును

క విదితం బగు ఘట మవిసిన
నుదితంబగునాకసంబు నుప్పర మొకటా
న దెవిధము విదేహంబను
సదమలకైవల్యసరణి సంపద వేమా!. 463

ఘటము (కుండ) లో నాకాశము అంతరించియుండి అయ్యది పగిలినపిదప నాకసములో కలసిపోవునట్టుల నే బ్రహ్మము దేహముచే నావృతమై యుండి ఆదేహము నశించిన వెనుక తనపూర్వ విదేహమను కైవల్యమును చెందును అయ్యది యే ముక్తి

క. వినుమా నిటలముః జేరగ
ఘనమగునొకశక్తి కలదు కడుఁ జిత్రముగా
కనుఁగొన దానికి నవ్వల
గనకం బనుజ్యోతి గలదు కనుమా వేమా! 464

ఆబ్రహ్మ ముండుస్థలమును చేరుటకును ఒకశక్తి కలదు అద్దాని నిజరూపము నటని అటుపైని చేరంచో సువర్ణ

చ్ఛాయతో వెలింగెడివెలుఁగు కనుఁబడును అయ్యదియే బ్రహ్మమని తెలియుము

ఆ. వీరశైవధర్మవిధము లెఱింగియు
 బ్రహ్మవిద్యమీఁదఁ బరఁగె నేని
 చెలఁగి పులికి బంటు సింగపుఁ బిల్లరా, వి. 465

వీరశైవధర్మవిధముల నెఱిఁగినపిమ్మట బ్రహ్మవిద్యపై నాసక్తి గలిగెనేని సులువుగా సిద్ధింపఁగలదు స్వతస్సిద్ధముగా పులియే శౌర్యముగలది అమీఁద సింహపుపిల్లయే బంటు అయ్యెనేని ఇఁక చెప్పవలసినదే లేదు అట్లే శైవధర్మములును అని యెఱుఁగఁదగును

ఆ. వేడుచున్నయట్టె వినయంబుఁ జూపుచు
 గోత దింపు నమ్మకొండెగాఁడు
 చేర్పరాదు వానిఁ జెఱుచును తుది నెట్లొ, వి.

దుర్మార్గుని ఎప్పటికిని దగ్గఱఁ జేర్పకుము అతఁడు మిక్కిలి వినయమును జూపుచు దగ్గఱఁ జేర్చినతరువాత మోసముచేసి ఎట్టులో గోయిలో దింపఁజూచును కావున నిట్టివానిని చెర్పరాదు

తే. వేయుఁ గ్రతువులు పనిలేదు వేడ్క మీఱఁ
 జేయు క్రియలెల్ల గురుభక్తి చిత్తమందు
 పాయకుండుటె ముక్తికి బాట యగును
 న్యాయమగుమార్గ మిద్దియౌ నవని వేమ. 467

వేలకొలఁది యజ్ఞాదిక్రతువుల నొనర్చుచుండినను అవి గురుభక్తితోఁ దుల్యములు కాఁజాలవు. గురుభక్తి చిత్త

ములో బాయక నుండుటయే ముక్తిదొరకుటకు మార్గము. కావున దీనిని వదలకుము

ఆ వేముచెక్కఁ దిన్న విషరోగములు పాయు
దేహకాంతి కలుగు దృఢము కలుగు
తినఁగతినఁగ నదియె తీయగా నుండును, వి....

ఎంత యనిష్టమగుపదార్థమైనను సర్వదా సేవించు చున్న హితము కలుగును అట్లే దుస్సాధ్యమగు బ్రహ్మోపాసనమును సుసాధ్యమగును ఉదాహరణమునకై—చూడుఁడు. వేము మిక్కిలి చెదుపదార్థము అయినను సంతతము భక్షించిన విషములు పోవును దేహమునకు కాంతికలుగును. తినఁగా తినఁగా తీయగాఁ గూడ నుండును

ఆ వ్యాధివచ్చినపుడు వైద్యునిచే మందు
దీసి తినక కాని తీఱ దెందు
మందువంటి మనసు మనుజుండు కనవలె, వి....

రోగము వచ్చినప్పుడు అవ్యాధి యుపశమించుటకై వైద్యునివలన మందు పుచ్చుకొనక తప్పదు అట్లుతే సంసారమనురోగము కలిగినప్పుడును మనస్సు కుదుటపడుటకై మనుజుండు ప్రయత్నింపవలయును

ఆ. శ్వాస లాగి విడిచి సాధింప నేర్చిన
మోసపోక ముక్తి మూటఁగట్టు
దోసకారిగుణము గాసిచెందకపోదు, వి....

శ్వాసమును పట్టనేరిచి ధ్యానధారణాదుల నిరంతర, మును బ్రహ్మము నుపాసించుచు మాయకు లొంగిపోక జాగ్రత్తగా నుండవలయును దోసకారిగుణమువలన గానికలుగును

ఆ. శ్రవణపుటములున్న సార్థక్య మేమిరా ?
వినఁగవలయుఁ బెద్ద లనెడివన్ని
వినఁగవినఁగ నీకె విశదంబులౌ సుమీ, వి....471

శ్రోత్రము లున్నందులకు ఫలముగా పెద్దలవలన నుపదేశరూపములుగా విజ్ఞానవాక్యములను వినవలయును విని నను నాకేమి తెలియఁగలవు అని నిరాస నొందకుము వినగా వినఁగా నీకే యందలియర్థము బోధపడగలదు

ఆ. షోడశాక్షరముల శోధించి మది నెంచి
గూఢభావ మూని కుదియఁ బట్టి
వేడు కలర ముక్తి విలును చూడరా, వి....472

షోడశాక్షరములను చక్కఁగా బరికించి, మనస్సులో ధ్యానించి, తత్త్వమును వదలక ఇంద్రియములను నియమించి, లోఁగొని ముక్తినొందుటకు యత్నింపవలయును

ఆ. సకలజీవములను సమముగా నుండెడి
యతనిక్రమముఁ దెలియు నతఁడె యోగి
అతఁడ వివె యనుట సన్యత గాదయా, వి....

సమస్తజీవములను సమానభావముతో చూచుచుండెడి వానిరీతిని పరికించిన వాతఁడే యుత్తముఁ డగుయోగి యనఁదగును ఆయోగిరూపమే బ్రహ్మస్వరూపమని తెలియుము. అంతకంటెను మించినరూపము బ్రహ్మమునకు లేదు

ఆ. సకలవిద్యలఁ గని సంతోషపడవచ్చు
చేయిసాచి కాసు నీయలేఁడు
చెలఁగి యొరుల కెట్లు చెప్పవచ్చును సుమ్ము, వి.

ఇతరులయొద్దఁ గలవిద్యలనన్నిఁటిని కని సంతోషము నొందును గాని సంతోషపడి ప్రతిఫలముగా నొక్కకాసైనను చెయి సాచి ఈయఁజాలఁడు ఇతరుల కెట్లయినను చెప్పవచ్చును గాని తామాచరించుట యరుగు

ఆ. సకలవిద్యలందు సంపన్నులై యున్న
నట్టివారు పరిచయమునఁ జౌక
పెరటిచెట్టుమందు పరికింప మెచ్చరు, వి.... 475

పదిమారులు పరిచయముగా పోవుటవలన నెన్నివిద్యలు చదివినవారికైనను చులుకఁదనము తప్పక ఘటిల్లును ఎట్లంగురా? పెరటిలో నున్నంతమాత్రాన నౌషధియందు లఘుబుద్ధి కలుగుచుండునట్టులు

ఆ. సక్తిగలుగుపనులు చక్కగా నెఱవేఱు
భక్తిగలుగుపూజ ఫలము నిచ్చు
యుక్తికలుగుమాట యొప్పునురా భువి, వి....

తాత్పర్యము సులభము

ఆ. సంతలోనిసరకు సరసమౌ కొనవచ్చు
వింతలంది పొంద వివర మేది
చింతదీర్చి చూడఁ జిన్మయజ్యోతిరా, వి....477

సంతలోనున్న సరకు సరసముగ కొనవచ్చినట్టులనే గురుననుగ్రహమున చిత్రచిత్రముగా నగుపడు తత్త్వరూపమును చింతదక్క చూచి కైవల్యము నొందుము

క. సంతతసమాధిఁ బ్రజ్ఞను
వింతలు తలపోయకుండ వివరించినచో
నంతరమునఁ బరమాత్ముఁడు
మంతవ్యుఁడు వెలుగుచుండు మదిలో వేమా!

సంతతమును సమాధినిష్ఠుఁడై బుద్ధిబలమున మనోభావములను తలపోయకుండ నిశ్చలుఁడై విచారించునేని ధ్యేయస్వరూపుఁడగు బరమాత్ముఁడు సర్వదా వెలుఁగుచుండును.

తే. సచ్చిదానందమగు జ్ఞప్తి సరవిఁ జేరి
మెచ్చి చిన్మాత్రమౌ శక్తి మేను మఱచి
నిశ్చలతనున్నవాఁడె పో నిత్యయోగి
నిశ్చలాత్ముఁనిశివుఁ డన వచ్చు వేమ 479

సచ్చిదానందరూపమును మఱచిపోక జ్ఞప్తియందుంచి కొని చిచ్ఛక్తివలన శరీరమును మఱచి గాఢమగు సమాధిని పూర్ణవిజ్ఞానరూపునిసన్నిధిని మునిఁగియుండెడివాఁ డెవ్వఁడో యట్టివానిని నిశ్చలాత్ముఁడని శివస్వరూపుఁడని యనవచ్చును

ఆ. సరవితోడఁ గూడు స్వాధిష్ఠచక్రంబు
ప్రాణపవనములను బందుచేసి
వెడలకుండువాఁడె వేదాంతవేత్తయౌ, వి....

ప్రయత్నముతో స్వాధిష్ఠానచక్రమునందు పంచప్రాణములను నిలిపి యెల్లప్పుడును వదలక తన్మయుఁడైయుండెడి

వాఁడే యుపనిషణ్ణత్ప్రతిపాద్యుఁ డగుశివుని పొందఁ గలుగును

ఆ. సవతితల్లిఁ జూడ సాకులు నెఱపును
స్వంతతల్లివలెను సైప దెపుడు
వింత లడఁచి లోని విజ్ఞాన మందరా, వి.... 481

నిజమగు విజానమునకును మాయకును విస్తారమగు భేదము కలదు చవతితల్లి యెప్పుడును తప్పులుపట్టునుగాని స్వంతతల్లి వలె క్షమింపదు ఇట్టులే వింత లడఁచి లోనివిజానమును పొందుము

తే. సాధుసాంగత్య మమరిన శాంత మమరు
శాంతి మమరినఁ జిత్తంబు శక్యపడును
శక్యపడినమనంబె యొసఁగు పరము
పరము గాంచిన శివుఁ డనఁ బరఁగు వేమ 482

సాధుస్నేహమున శాంతమును దాన చిత్తశుద్ధియును అద్దాన పరునిసాన్నిధ్యమును అందుమూలమున కైవల్యమును పొంది పరశివత్వము నొందును

ఆ. సాముఁ జేసి జెట్టి సాహసియై యుండు
సాముఁ జేయకున్న సరణిఁ గనఁడు
సాముఁ జేయువాఁడు చావక యుండునా?,వి....

తాత్పర్యము సులభము

ఆ. సాహసమున నైన సత్యముచే నైన
మోహబుద్ధి విడిచి ముక్తి నెఱిఁగి
చేర్చి మదిని గురుని జెలరేఁగి యుండరా?, వి.

సాహసముచేతఁ గాని సత్యముచేతఁ గాని మోహ బుద్ధిని విడచి ముక్తిరూపమును గుఱుతించి మనస్సులో గురుని యుపదేశమును మఱువక బ్రహ్మము నొందుము

ఆ. సుతులచేతఁ బుణ్యసుఖముఁ బొందుదు నని
మనుజుఁ డుండు కర్మమతముఁ దగిలి
ఏనుఁగు పడియున్న నెత్తునా మశకంబు, వి...

మనుజులు సుతులవలన బుణ్యలోకముల నొందుదు మని కర్మమునం దగిలియుందురు గాని సుతులు వీరి నుద్ధరింపగలుగుదురా? ఏనుఁగుపడియున్నచో దోమ లెత్తలేవుగదా!

ఆ. సుఖములెల్లఁ దెలిసి చూడంగ దుఃఖముల్
పుణ్యములును పాపపూర్వకములె
కొఱత వేయు దొంగ కోరినచందమౌ, వి....

సుఖములును దుఃఖములును పుణ్యములును విచారించిన యెడల పాపజనితములే యగును

ఆ. సేవఁ జేసి గురుని స్థిరభావ మందెడు
త్రోవనంటి జ్ఞప్తిఁ దొలఁగనీక
భావమందె పరముఁ బరికించి చూడరా, వి....

గురుసేవఁజేసి స్థిరభావము నొందవలసిన త్రోవ నంటి జ్ఞాపకమును తొలగఁద్రోయక భావములోనే పరమును పరికించి చూడుము

తే. స్వాత్మతన్మయ మననంబు సంగ్రహించి
నిర్గుణబ్రహ్మపదవికి నెఱయ బుద్ధి

నొక్క నిర్భయ మందుటే నుడువుటండ్రు
వేదవేదాంతసారార్థవిదులు వేమ. 488

ఉపదేశము అందగా స్వాత్మను తన్మయము నొందించి సర్వదా మననము చేయుచు నిర్గుణబ్రహ్మమార్గమునకు బుద్ధిని మరల్చి నియమముగా నుండుటయే బ్రహ్మజ్ఞానము నొందుట యని యుపనిషత్తుల తెలిసిన పెద్ద లందురు

ఆ. స్థిరముగాని క్షుద్రపరకూటములఁ జేరి
ఎచ్చుతగ్గు లొంది హీనమతులు
గాడ్దెపిల్లలగుచుఁ గక్కనఁ జెడుదురు, వి....

అస్థిరములగు పరకూటములఁ జేరి హెచ్చుతగ్గుభావములను పొందుచు కలహించుచుందురు అట్టివారు బుద్ధిహీనులు

ఆ స్త్రీలమాయచేతఁ జిక్కి తాఁ గొన్నాళ్లు
తగులుగొను నట్లు తెగిలిపోవు
దనిసిపోనిసి తుదను దైవంబుచేఁ జెడు,వి ...490

మనుజుఁడు మూర్ఖుఁడై స్త్రీలవలలోఁ జిక్కి కొన్ని దినములును తగులుపాటులను పొంది కొన్నిదినములును నవసి చివర కీకర్తకంతకును ఫలముగా దైవమువలనఁ జెడిపోవును

క. హాయి మదిరి పరువు లిడుగతి
రయమునఁ బారెడిని మనసు ప్రతికూలముగా
నయమో భయమో జూపుచు
బయనము సాగింపనీక పట్టర వేమా!.... 491

గుఱ్ఱమువంటిది మనస్సు గుఱ్ఱము బెదరి పరువు లెత్తును.

అప్పుడు నయమునవో భయమునవో అంకెకు దార్చుకొనునట్లు లనే ఆత్మజ్ఞానమును గోరు నీవును మనస్సును జయింపుము.

ఆ. హాయము గురువుగాదె యఖిలంబు తాఁ గాదె
యనుభవింపరాదె హరుని గూర్చి
యతికినంతలోన నంధకారం బేల, వి .. 492

మనస్సు కేవలమును గురు ప్రాయమై మనజుని నడిపించి తానే సర్వమయమై యొప్పును కావున దానిమూలమున నీశ్వరు కనుఁగొని సేవింపవలయును

ఆ. స్థూల మగును గుడ్డు సూక్ష్మమా కన్పాప
పాపలోనిజ్యోతి పరమపదము
మాపురేపు నాక మహిసంటి చూడరా, వి ...

గుడ్డుపాపలవలె స్థూలసూక్ష్ములు నత్యంతము వివేకమునఁ బరికించిన జ్యోతిరూపమగు పరమపదముకనుపట్టును. దానిని అహర్నిశలయందును సేవించి ముక్తినొందుము

ఆ. హారహారాదులందు నాశను దిగనాడి
శాంతబుద్ధిగూడి సగుణమందు
చింతమాని పిదప చిన్మయ మందరా, వి ...494

బ్రహ్మావిష్ణ్వాదులందు గల ప్రత్యభిజ్ఞను విసర్జించి శమాదిషట్కసంపత్తి గలవాఁడై సగుణోపాసనఁ జేయుచు చిద్రూపమును వీక్షింపవలయును

ఆ. హానిచేతఁ గలుగు సఖిదుఃఖంబులు
హానిచేతఁ దప్పు నరయు సుఖము
హాని దెలియునట్టి యతఁడె పో శివయోగి, వి ....

హాని యను నొక్క వస్తువును సమూలముగా నెఱిఁగినఁ జాలును. దానితోనే సుఖదుఃఖాదులగు నన్నియును బ్రహ్మాండమునందు నిండియున్నవి దీని నెఱిఁగినవాఁడే యుత్తముఁ డనఁబడును

ఆ. హేమకారవిద్య నెఱిఁగినవా రెల్ల
వెతలఁ బడనియట్లు విద్యచేత
తత్వ మెఱుఁగు వెనక తనకు చింతేలరా?, వి.

స్వర్ణమును చేయువిధము నెఱిఁగినవారలు కొంచెమైనను కష్టముల నొందక యాభీష్టము నొందఁగలిగినయట్లులనే తత్త్వము నెఱిఁగినపిమ్మట తాపత్రయాదికష్టములు కలుగవు

ఆ. హేమనగము చేత నెప్పుడు గలవాఁడు
వెండికొండమీఁద వెలయువాఁడు
ఎత్తిరాసె బిచ్చ మేమనవచ్చురా, వి.... 497

బంగరుకొండపైని సర్వదా నివసించువాఁడును రజతాద్రి గలవాఁడునగు నీశ్వరునంతటివాఁడును బిచ్చమెత్తవలసివచ్చెను కావున నాపదలు గల్గువేళ మన మధైర్యము నొందరాదు

ఆ హృదయమందు శివునిఁ జెదరక నిల్పిన
పదిలుఁ డగును భవుఁడు ప్రాపు గాను
కదిసి నొక్కి మదిని గ్రక్కునఁ జూడరా, వి...

హృదయమునందు శివస్వరూపమును నిల్పెదరేని ఈశ్వరుఁడు భద్రుఁడై యుండి ప్రాపు నొసంగును ఆయనను సమీపించి మనంబును నియమించి యెఱుఁగుము

ఆ. క్షమ గలట్టియతఁడు సాధువై శోభించు
ఓర్పుబోలునట్టి దుర్వి గలదె
వన్నెవచ్చు మేలు లెన్నియైనను గూడు, వి....

క్షమగలవాఁ డెచ్చట నున్నను సజ్జనుఁడై శోభిల్లును. కావున యోర్పు నార్జింపుము ఓర్పుతో సమానమగు మంచి వస్తు వీప్రపంచములో నేదియును లేదు మనజునకు వన్నె నిచ్చును శుభముల ననేకముల నొసంగును కావున నోర్పు మంచిది

ఆ. క్షుత్తు దప్పి నిద్ర క్షుభితములై యుండు
రి త్తమాయ లోక రీతి గాదె
సత్త్వపూర్ణసుప్తి సాధింపవలెనయా, వి.... 500

ఆఁకలి దప్పి నిద్ర యెల్లప్పుడును చుట్టుకొనియే యుండును ఇవన్నియును కేవలము మాయానుభావవిలసితములు సత్త్వను పూర్ణసుప్తితో సాధించి చూచి ముక్తుఁడై కైవల్యము నొందుటకు ధీరుఁడవై యత్నింపుము

# మోహపద్ధతి.

---

ఆ. అంగమెల్ల వదలి యటు దంతములు నూడి
తనువు ముదిమిచేతఁ దఱుచువడక
ముప్పుత్రిప్పులఁబడి మోహంబు విడువఁడు, వి.

మనుజుఁడు శరీరము ముదిమిచేత సడలినదై పండ్లూడి యశక్తుఁడై యనేక కష్టములను పొందుచున్నను మోహమును వీడఁడు

ఆ. అగ్నిచక్రమనఁగ నాకర్ణలింగంబు
అగ్నిగుండమందు నమరఁగూర్చి
భవునిధ్యాన మిఁకను బాటింప ముక్తిరా, వి 502

శ్రోత్రవిషయమగు శబ్దమనెడి బ్రహ్మమును ఎల్లప్పుడును ధ్యానించి ముగ్ధుఁడు గాక ముక్తి నొందవలయును*

ఆ. అగ్నికుండమందు నమరంగ ఘటియించి
అవని నీరు బియ్య మందునుంచి
అది పచనము గాఁగ హరుని కర్పించుము, వి ...

మనస్సును ఈశునివైపునకు మఱల్చి సర్వదా తదేకచిత్తుఁడవై యందలివృత్తుల నన్నిటిని పరమేశ్వరున కర్పించి ముక్తి నొందుము

ఆ. అగ్నిశిఖలయందు నమరంగ మమకార
మభవుమీఁద ధ్యాన మమర నిల్పి
యాహుతి యగువెనుక హరునికర్పించుము, వి.

మనమును ఈశ్వరునిపై నిల్పి మమత్వము నీశ్వరుని యందు నిల్పి ధ్యానించుచు రాగాదులను మొదలంట నశింపఁ జేసి బ్రహ్మభావము నొందవలయును

క. అజ్ఞానమనెడియడవిని
సుజ్ఞానపుఖడ్గమునను జూచి నరకరా
అజ్ఞాన మాత్మఁ దెలుపుట
సుజ్ఞానపుదివ్యపదము చూడర వేమా!.... 505

అజ్ఞాన మనునడవిని జ్ఞానఖడ్గముతో నఱికి ఆత్మను జ్ఞానాజ్ఞానములను విమర్శించి జ్ఞానపదము నొందనలయును

క. అంతయు బ్రహ్మమయం బని
మంతనములు మాని మనసుమర్మము గనినన్
వింతలు బయలను సున్నగు
చింతలు విడినట్టివాఁడె సిద్ధుఁడు వేమా'.... 506

లేనిపోనిచింతలను పెట్టికొని యజ్ఞానిగాక ప్రపంచ మంతయును బ్రహ్మపదార్థమే యని ధ్యానింపవలయును ఇట్టి వాడే జీవన్ముక్తుఁడు

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
తలపఁ దలఁప ముక్తి తనకు గలుగు
బాహ్యరంగమందు భాషించుఫల మేమి, వి....

మనుజుఁ డీశ్వరుని మనస్సులో నిల్పి నిరంతరమును ధ్యానించుచుండిన ముక్తికలుగుచుండునే కాని వెలుపల కన్ని విధముల నార్భాటముఁ జేసినను వ్యర్థము

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
నిల్పి చూడ జాడ నిల్చుఁగాక
బాహ్యమందు శివుని భావింప నిలుచునా, వి....

మనమునందు పరమేశ్వరు నిల్పినచో నీశ్వరసిద్ధి యగునే కాని బాహ్యమున నెన్నివిధముల ప్రయత్నించినను మనుజుఁడు సిద్ధిఁ బడయనేఱఁడు

ఆ అదియె యొకటి దెలిసి యాదిని నిల్పుము
ఆది బాయకున్న నభవుఁ డగును
ఆది బాయువాఁడి కంధునిరీతిరా? వి.... 509

తెలియఁదగిన నాబ్రహ్మపదార్థమును తచ్ఛబ్దార్థమును తెలిసికొని విడక నిరంతరము సేవించి ముక్తుఁడు కావలయును. అట్లుగాక విడచువాఁడు గ్రుడ్డివానితో సమానుఁడు

ఆ అధరసుధను జూచి యన్నియు మఱచును
తరుణిరూపుఁ జూచి తన్ను మఱచు
ఉక్కు లాలకించి యోగంబు మఱచురా, వి....

మనుజుఁ డజ్ఞానియై యువతుల మోవితేనె కాంచి తనను ప్రపంచమును ఉత్తమోత్తమమగుయోగమును కూడ విడిచి చెడిపోవును

ఆ అరసి సూక్ష్మమైన యానంద మెఱుఁగక
మతియు లేక చదివి మందు డయ్యె
సలరహాస్య మెల్ల యాతఁ డెల్లెఱుఁగును, వి....

మిక్కిలి సూక్ష్మరూపము గల యాయానందమును

గుర్తింపలేక చదివి చదివి వేసారి యజ్ఞాని యగునేని తత్త్వము నెఱుఁగ సమర్థుఁడు కాఁజాలఁడు

ఆ. అన్నరసమువలన నలబిందురస మయ్యె
బిందురసమువలన బీజ మయ్యె
బిందుబీజములను భేదించి చూడరా, వి....512

అన్నమువలన రేతము దానివలన బీజమును పుట్టుచున్నవి కావున ఆరెండింటిని వేర్వేఱ విభజించి పరికించినచో సత్యము తెల్ల మగును

ఆ. అభవుననుభవమును నార్గు రరులు నీల్గ
సంశయంబులేదు సాధకులకు
చెంత దీప మిడక చీఁకటి పోవునా? వి ... 513

ఈశ్వరసిద్ధి యైనచో నరిషడ్వర్గము నశించును అందువలన సంశయములు వీడిపోవును దాపున దీపము లేనిది చీఁకటులు నశింపనియట్టులు అంతశ్శత్రుజయము లేక ఈశ్వరసిద్ధి కలుగదు

క. అమలాత్మునిమానసమున
విమలాంతర్గతుని గాఁగ వివరింపవలెం
క్రమమైన చాయలందున
మమకారము నెట్టవలెను మహిలో వేమా!....

బుద్ధిమంతుఁడగువాఁడు నిర్మలుఁడగునీశ్వరుని సర్వదా మనస్సులో నిలిపి ధ్యానించుచు క్రమక్రమమున మమత్వమును వీడి ముక్తుఁడు కావలయును

ఆ. అమృతసాధనమున నందఱు బలిసెద

రమృత మెంచి చూడ నందలేరు
అమృతము విషమాయె నదియేమిచిత్రమో,వి.

అమృతమును త్రాగిన పుష్టి నొందెదరుకాని యలదానిని మాత్రము పొందలేరు అహా! అమృతమే విషమయ్యె నెంతచిత్రమో చూడుఁడు

ఆ. అరయ కంటిదృష్టిగుఱిగను ముక్కుపై
రెప్పవడక గుడ్లు త్రిప్పిపట్టి
వివర మెఱుగ శాంభవీముద్రమదియంద్రు,వి....

కనుదృష్టిని నాసాగ్రమున నిల్పి కనులను మూసికొనక ఈశ్వరుని ధ్యానింపవలెను ఇట్టి ముద్రనే శాంభవీముద్ర యని యందురు.

ఆ. అలవిగాని బయలు నిండిన మదిఁ జూడ
గూడి మెలఁగుచుండుఁ గోచరించు
చూడఁ జూడ నెఱుక చోద్యమై యుండురా, వి.

అసాధ్యమగు నాకాశరూపమున మనస్సును చేర్చి నిరంతరము నాచిద్విలాసములను బరికించిన నాత్మ చిత్రముగా సాక్షాత్కరింపఁగలదు

ఆ. అష్టకష్టములకు నాలయమై యుండు
గతులు దుర్గతులను గన్న దదియె
కానకుండఁబోయె గగనస్వరూపమై, వి.... 518

సమస్తసుఖదుఃఖములకు నునికిపట్టై యుండి మంచి

చెడ్డలను పొందిన శరీరము చివఱకు అదృశ్యమై యాకాలమునఁ గలసిపోవుచున్నది

ఆ అక్షయాత్మకంబు నర్థింప గుఱి గని
నిశ్చయంబుగాను నిలిపి మనసు
రక్షగట్టినట్లు రట్టడి మాన్పరా, వి.... 519

అవ్యయమగు నాయీశ్వరునిరూపును గుర్తించి మనస్సులోఁ బాఁదుకొల్పి మనశ్చంచలతను మాన్పి సిద్ధి నొందుము.

ఆ అస్థిరమగుమేని కదరుపాటుల పొంది
పెక్కువిధములందు పెంచిపెంచి
అగ్ని కిచ్చు లేక యడవికుక్కలకిచ్చు, వి.... 520

మనుజులు అజ్ఞానులై శరీరమును అభిమానించెదరు; కాని వ్యర్థమగును చచ్చినప్పుడు దీనిని నక్కలకైనను, నగ్నికైనను సమర్పించుచున్నారు కావున మమత్వమును వదలియుండుము

ఆ. ఆకు కానవచ్చు హరిహరాదులకైన
కొమ్మ కానరాదు కోరి చూడ
కొమ్మ కానరాక కొనియాడకుండునా, వి....521

ఈశ్వరునిమాయ యగమ్యమైనది బ్రహ్మాదులును దాని విలాసములను కనుఁగొనగలరు కాని మూలము నెఱుఁగలేరు

ఆ ఆఁడు దనఁగ రోఁత యది చూడఁగా రోఁత
తలఁచిచూడ తనకు తానె రోఁత
ఎంతవారి కైన నింతియే బల్ ఘాత, వి.... 522

అజ్ఞానులు ఆఁడుదానిఁ గని మోహించెదరు ఆఁడుది

మిక్కిలి రోఁతవస్తువు ప్రతిమనుజునకును కడగండ్లు తెచ్చు నట్టిది యాఁడుదియే యగుచున్నది

ఆ. ఆత్మబుద్ధివలన నఖిలంబు తా నయ్యె
జీవబుద్ధివలన జీవుఁ డయ్యె
మోహబుద్ధివలన ముదితల దర్శించె, వి.... 523

తనమనోరథములవలననే తా నన్నిజన్మముల నైనను నరుఁ డెత్తును అవానివలననే బ్రహ్మయైయ్యును జీవుఁడై పిమ్మట ముగ్ధుఁడై స్త్రీలోలుఁడై చెడుచున్నాఁడు

ఆ ఆత్మలోని జ్యోతి యమరుట లింగంబు
తెలిసి చూడకున్న తేటపడదు
గ్రుడ్డివాఁ డెఱుఁగునె గుఱుతైనరత్నంబు, వి....

హృదయాంతరాళమునందు వెలుఁగుచున్నజ్యోతియే లింగము అయ్యదియు బ్రహ్మము అది విచారింపనిది గ్రుడ్డివానికి రత్నమువలెనే గోచరింపదు.

ఆ. ఆది మూలమేది యాధార మెయ్యది
సోది జెప్పఁదరము సుద్దులరసి
లోటు లేక లోనితుప్పమెుఁ గనుమయా, వి....

ముగ్ధుఁడవు గాక ప్రపంచమునకంతకు నెయ్యది యాధార మెయ్యది వేఱు అని విచారించి నిహృదయమునఁ గల యీశుని సందర్శింపుము

ఆ ఆది నొకటి దెలిసి యాదిని మది నిల్పి
యాది బాయకున్న నభవుఁడగును
ఆది బాయువాఁడి కంధునిరీతిరా, వి.... 526

సమస్తమున కాధిరియైనదానిని విచారించి తెలిసికొని సేవించువాఁడే ముక్తుఁడగును. తదితరుఁడు గుడ్డివానితో సమానుఁ డగును.

ఆ. ఆపగాళివెంట నడవులవెంటను
కొండరాలవెంట గోదవ యేల ?
నుల్లమందు శివు డటుండుట తెలియవే, వి....

నదులవెంటను అడవులవెంట నేల తిరిగి బడలెదవు ? నీహృదయమునఁ గలఈశు నెఱింగి ముక్తుఁడ వగుము

ఆ. ఆరువేషములను నరయంగఁ గడువింత
యాత్మయందు ధ్యాన మమర దెందు
భీకరంబు గాని బిరుదు లేదు విరక్తి, వి.... 528

ఆరింద్రియముల యార్భాటములఁ బరికించుకొలఁదిని వింతయగునే గాని ఆత్మధ్యానము చేకూఱగు కాన నయ్యా రింటిని కట్టి విరక్తినొంది ముక్తుఁడ వగుము

ఆ. ఆలి నమ్మి భువిని నాచారహీనుఁడై
ప్రాలుమాలె నొక్క ప్రతినకొఱకు
ఆది తప్పకుండ కాడుకాఁచినవాఁడు, వి.... 529

హరిశ్చంద్రునంతటివాఁడుగూడ మోహాధిక్యమున ఆలి నమ్మికొని సమస్తకష్టముల ననుభవించెను కావున మోహము జయింపరానిది

ఆ. ఆలు బిడ్డ లనుచు నతిమోహమున నున్న
ధనముమీఁద వాంఛ తగిలియున్న
నట్టినరుల కెల్ల నవని ముక్తియె లేదు, వి....530

పెండ్లము బిడ్డలపై నాశ గలవానికిని ధనాశగలవానికిని లోకమున ముక్తియే లేదు

ఆ. ఆలుబిడ్డలు ధన మరయఁ దల్లియుఁ దండ్రి
కలమనుజుఁడు మిగుల గష్టపడును
తనకు నెనగు లేరు తాను బ్రహ్మంబైన, వి....

ఆలుబిడ్డలు మున్నగు నీప్రపంచవిషయములు బ్రహ్మభావము నుం చెందునంతనఱకే జనుల నంటుకొనునుగాని తర్వాత నొందనేఱవు

ఆ ఆలుసుతులు మాయ యన్నదమ్ములు మాయ
తల్లిదండ్రి మాయ తాను మాయ
తెలియనీదు మాయ దీనిల్లు పాడాయె, వి....

ప్రపంచపుపరిస్థితులను పరికించిన ఆలుసుతులు మున్నగునవి మాయయే యని తోఁచును కావున బుద్ధిమంతుఁడీమాయను జయించి ముక్తుఁడు కావలయును

ఆ ఆవుచన్నుఁ బితికి ఆపాలు గాచినఁ
బేరి పెరుగు చల్ల పేర్లుగలుగు
తవిలి లోనఁ గలదు నవనీత మిట్లురా, వి....533

ఆవుపాలను పితికి గాఁచిన పెరుగు మజ్జిగ, వెన్న, నెయ్యి మున్నగునవి వేఱగునట్టులే శరీరమును విభజించి గుర్తెంగిన యాత్మరూపము తోఁచును

ఆ. ఆవుపాలు శివుని కభిషేకమున కౌను
ఆవుపాలఁ జూడ నౌషధంబు
నావుపాల నున్న యతిశయ మేమయా?, వి....

చూచుట కాకార మొక్కటిగా నున్నను యోగ్యత వేఱుగా నుండును అవుపాలు అన్నిపాలవలెనే యున్నను శివు నభిషేకించుపుణ్యకార్యమున నుపయోగింపఁబడుచున్నవి

ఆ. ఆశలనెడి త్రాళ్ల నఖిలజనంబులు
కట్టువడియు ముక్తిఁ గానలేరు
జ్ఞానఖడ్గమునను ఖండింపలేరొకో, వి.... 535

ప్రపంచములోని జనులందఱు ఆశాబద్ధులై మోక్షమునకు తొలఁగియున్నారే గాని జ్ఞానముచె నాయాశను నఱికివేయువారలు కాన్పింపరు.

ఆ. ఆశలనెడిత్రాళ్ల నసలంట కోయించి
పారవైవఁగాని పరము లేదు
కొక్కుతిండియాసఁ జిక్కిచచ్చినయట్లు, వి....

బ్రహ్మము నొందఁగోరువానికి ఆశను జయించిననే కాని ఫలసిద్ధి గలుగదు

ఆ. ఇచ్చువానికంటె నింద్రియనిగ్రహుం
డఱయ నతనికంటె నధిపుఁ డగును
వాఁడు వానికంటె వీడును పాపముల్, వి....

దాతకంటె నింద్రియముల జయించువాడుత్తముఁడు ఇట్టివాని నేవిధములగుపాపములు నావరింపలేవు

ఆ. ఇట్టికనులబ్రహ్మ మెట్టు చూడఁగవచ్చుఁ
జూచుకనులు వేఱు చూపు వేఱు
చూపులోన నుంచి చూడంగ వలవదా?, వి....

బ్రహ్మ ముండినచోఁ గనుపడదేమి యని యందురు గాని ఈనేత్రములకు బ్రహ్మ మగుపడదు ఏలయనఁగా నీకనులు వేఱు అయ్యావి వేఱు బ్రహ్మముఁ జూచుటకు జ్ఞాన మొక్కటియే సమర్థము

ఆ ఇట్టితనువు గలిగి యీలోకమందునఁ
బుట్టి చచ్చు భ్రమను గట్టిగాను
తెట్టతెరువుఁ జేరి తెలివంటి చూడరా, వి....539

అన్నిటికంటె నుత్తమమగు మానవజన్మము నెత్తి ఈశ్వరుని దర్శింపలేక భ్రమించెదరు కావున నీ వట్లుకాక జ్ఞానివై కనుము

ఆ ఇంటిలోనికోతి యిరవు గానఁగ లేక
తిరుగఁ బోవువారు తీఱకుంద్రు
కోఁతి నొకటి నిల్పి కుదురుండ లేరయా, వి....

మనస్సు కోతివలె చంచలమైనది జనలు తమమనస్సును తాము, అరికట్టివేయలేక భ్రమించుచుందురే కాని వ్యర్థము అగును కావున మనోనిగ్రహముఁ జేయుము

ఆ. ఇంటివెనుక తీఁగ యింగ్లీకి మందంగ,
పారదంబు గలుగ బసిడియేల ?
సత్తు పొత్తుఁ జేసి సాధింపవచ్చురా?, వి.... 541

సోమలతయు నింగిలీకమును పాదరసము నుండఁగా స్వర్ణయోగమున కని వెట్టిప్రజ లల్లాడెదరు కావున సత్తును కలిపి స్వర్ణము నొందుము.

ఆ. ఇంతకాలమునుండి యెఱుకమాలినజీవి
చచ్చి పుట్టుచుండు సహజమనుచు
నెఱుకమానుచోటు నెఱుగునా బ్రహ్మంబు?, వి.

ఎంతకాలమునుండియో యాజీవి జననమరణముల నొందుచుండెనేగాని జ్ఞానమున కాధారమగు బ్రహ్మము నెఱుఁగఁజాలకపోయెను గదా!

ఆ. ఇంతిఁగన్నఁ జన్ను లింతింతలని చూచి
మోహమొందు బుద్ధి మోసపోయి
గరితలేనివాని కానలేదాయెరా, వి ... 543

స్త్రీలను చూచి స్తనాదులను వర్ణించుచు పెద్దలుకూడ తెలివిలేక మొద్దులయ్యెదరు ఏమి యీమోహపుసామర్థ్యము! ప్రపంచమున స్త్రీచింతలేనివాఁ డెచ్చటను లేఁడుగదా!

ఆ. ఇంతిఁ జూచెనేని యింతింత యనరాదు
కాలవహ్ని లక్క కఱగినట్లు
పట్టిమోహ మిట్లు రట్టులఁ జేయురా, వి .... 544

స్త్రీని చూచినవెంటనే చెప్పనలవిగాని మోహమును పొంది జనులు చెడిపోవుచుందురు

తే. ఇంతి యాకృతిపై నాస కెదురుచూచి
చింతలోఁ బడి ప్రాణముల్ చిక్కఁబట్టి
యంతు గనలేక చచ్చెద రవనిలోన
కాముకులగతి యీరీతి గాదె వేమ. 545

జనులు స్త్రీలపై గలకోర్కెలచేత ప్రాణములను బిగ

బట్టి యువిని యంతు పొందలేక చచ్చుచుందురు లోకములో కాముకుల కందఱికి నిదే గతి కదా!

ఆ. ఇంతులఁ గనినంత నెంతవారికి నైన
నగ్గిలక్కఁ గరుగ నైనరీతి
వెలయు మోహ మిట్టి వింతలు గల్పించు, వి....

స్త్రీలను చూచినంతమాత్రమున నెంతటివారైనను లక్కవలె కఱిగిపోయెదరనుటలో వింత లేదు. ఏలయన ఇది యంతయును మోహపుచమత్కారమే కదా!

ఆ. ఇంద్రలోక మనఁగ నింద్రజాల మనఁగ
నింద్రపదవి యనఁగ నన్ని యొకటె
కలియుగమున నరులు కానరు భ్రమచేత, వి.

ఇంద్రచంద్రాదిలోకములని జనులు మోహించెదరే కాని యన్నియు నొక్కటే కావున దురాశ నొందవలదు.

ఆ. ఇంద్రియములచేష్ట లెన్నక భువిలోనఁ
దన్నుఁ దెలిసి మదిని తమక ముడిగి
మింటిమంటినడుమ మిత్తిని మ్రింగుము, వి....

ఇంద్రియములను సరకుగొనక యాత్మరూపమును పరికించి భ్రూమధ్యమున బరమాత్మఁ గని మాయను దిగమ్రింగి మనుము.

ఆ. ఇంద్రియముల భ్రాంతి నీ కేడుజగములు
మందు బెట్టినట్లు మరులు గొనుచుఁ
బొందు సుఖముచేత పుత్రులఁ గాంచిరి, వి....

ఇంద్రియములవలన నగుభ్రాంతిచేతనే యీపదునాల్గు లోకములవారును ప్రేమపాశానుబద్ధులై పుత్రులఁ గను చున్నారు

ఆ. ఇంద్రియముల విడిచి యేకతతో నిల్చి
ఎఱిగి పిదప తన్ను నెఱుఁగుకున్న
యతఁడె మౌని జ్ఞాని యగునని యందురు, వి.

ఇంద్రియముల జయించి ఏకాకియై యాత్మరూపముఁ బరికించువాఁడె మునియును జ్ఞానియు నగునని పెద్దలు పలుకు చుందురు

ఆ. ఇంద్రుఁ డాయె కామి హీనుఁడై పోయెను
మారుఁ డాయె కామి మడిసి పోయె
బ్రహ్మ మయ్యె కామి బయిసిపోనాడెను, వి....

ఇంద్రుఁడు మన్మథుఁడు బ్రహ్మదేవుఁడు మున్నగు వారలును కామముచేతనే పదభ్రష్టులై పోయిరి కావున కామివి గాక మోక్షకామివి అగుము

ఆ. ఇంద్రుఁడైనఁగాని చంద్రుఁడైనను గాని
నంది దుర్గ మెక్కి నాతితోడ
పొందుఁ బడక ముక్తి పోరాడవలెనయా, వి....

ఇంద్రుఁడైనను సరియే చంద్రుఁడైనను సరియే మోక్షము ఎలయునని కోరదరేని కామమును వదలనిది ఫలము నొందలేరు.

ఆ. ఇన్నినాళ్లనుండి మొనసినమోహంబు

చెలిమిఁ జుట్టఱికము చెల్లె లక్క
తల్లి దండ్రి బిడ్డ దాయాదు లనెదరు, వి....553

చిరకాలమునుండి వచ్చుచున్న యీమోహము తల్లి దండ్రి మున్నగువారిరూపమున పరిణమించి జనుల బద్ధులను చేయుచున్నది

క ఇల్లనుమిా సంసారమె
యిల్లనుమిా యాయుధంబు నిఁక చాలంగా
దల్లినుమిా పంచాక్షరి
కల్లనుమిా సతులవలపు గనుఁగొన వేమా! 554

సంసారము మొదలగునవి యన్నియును అసత్యములు; కేవల మొక పంచాక్షరిమాత్రము సత్యము కావున నిరంతరమును సేవించి ముక్తుఁడ వగుము

ఆ. ఇష్టసిద్ధికొఱకె యీయూరుబీజముల్
కష్టములను బడుచు కానలేరు
ఇష్టమందు నిష్ఠ నిజమని కనుమయా, వి....555

మనోరథములు సిద్ధింపవలయునని జనులు అష్టకష్టముల నొందెదరు, కాని సిద్ధిమాత్రము బడయలేరు కావున చిత్తము నిష్కామముగా నుండుటయే మంచిది అదియే ముక్తికి మార్గ మగును.

ఆ ఇహమునందు సుఖము లీడేరఁగాలేదు
పరము నమ్మెనేని బ్రదుక నగునె
మొదట లేనిసుఖము తుది నెట్లు కల్గును?, వి....

ఈజన్మమున సుఖ మనుభవింపలేదు గాని పరజన్మము నందు మాత్రము కలదని ఎట్లు నమ్మవచ్చును? ఏమనియెదరా? మొదట లేనిసుఖము తర్వాత రా నేరదు గదా!

ఆ. ఈతరానివాఁడి కెగరోజి యెగరోజి
యేరుదాఁటఁగలఁడె యీఁదఁబోయి
పరుఁడు గానివాఁడు పరలోక మందునా?, వి....

బ్రహ్మము నుపాసించుటకు సాధనచతుష్టయముగలవా రర్హులుగాని యజ్ఞానులు కారు. ఏరు యీదుటకు యీతవచ్చిన వారే యర్హులు గాని తక్కినవా రర్హులా?.

క. ఈమాయ జగము జూడఁగఁ
బ్రేమాస్పదదృష్టిలోనఁ బెం పగుచుండున్
కామాంధకారమునఁ బడి
దీమసమునఁ దెలియలేరు దేవుని వేమా!....558

ప్రపంచమంతయును మాయాస్వరూపమే కావున నిట్టి మోహప్రపంచమునఁ బడి జనులు కామ మనుచీఁకటి చేత నావరింపఁబడి తెలివి నొందలేరు

క. ఈలోక చిహ్నాలన్నియు
మేలుగ గురుశక్తి గూడి మిన్నందినచోఁ
గాలుఁ దెదుర్కొనఁ జాలఁడు
చాలును జన్మంబు లనుచుఁ జారట వేమా!. 559

ఇహలోకపుకష్టము లన్నియును గురుమహిమమువలన మాయములు కాఁగలవు. కావున గురువు నుపాసించి ముక్తి నొందుము.

ఆ ఈశున కియ్యది యినుమంత యగుసొద్దు
బ్రహ్మకే నొసఁగితి పాదుసొద్దు
విష్ణుదేవున కిది విపరీతముగ సొద్దు, వి.... 560

మోహమనునది త్రిమూర్తులకును గలదు ఇది వారిము వ్వురకును దోష మగుచున్నది కాఁబట్టి మోహము నొందకుము.

ఆ. ఈశుమీఁద భక్తి యినుమంతయును లేక
పాశమందుఁ జిక్కి ఫలముఁ గనక
కాశియాత్రఁ బోవఁ గాలుఁ డెఱుంగడా? వి....

ఈశ్వరునిపై భక్తి లేక కర్మబద్ధులై కాశికి పోయినను మోహబద్ధులకు మోక్షమునకు బదులుగా యమయాతనలె కలుగును

ఆ. ఈషణత్రయంబు నెడపంగ నేఱక
మోహరాశిలోన మునిఁగియుండు
జనుల కెట్లు మోక్షసౌఖ్యంబు కల్గును, వి....562

పుత్రదారధనేషణలను వదలఁజాలక మోహమునఁ బడి మునిఁగెడిమనుజులకు మోక్షము చేకూఱదు

ఆ. ఉచ్చచెలమ గోరి యున్నది జగమెల్ల
పిచ్చిపట్టి తిరిగి పెనగుచుండ్రుఁ
తుచ్ఛసుఖము దీని ద్రుంపఁగ లేరయా, వి....563

ప్రపంచమంతయును విషయాసక్త మయ్యే యున్నది. గాని నీచమని విరాగము నొంద లేదు

క. ఉచ్చను పుట్టిన తనువట
హెచ్చేమియుఁ గొంచె మేమి యేర్పడ తెలియన్

మచ్చరము మాని సత్యం
బుచ్చము నిల్పినను బ్రహ్మ మతఁడే వేమా!.564

మలమూత్రములవలనఁ బుట్టినఈశరీరములలో ఉత్తమా ధమము లేవి యని విచారించి సత్యమును మనస్సును నిల్పిన వాఁడు బ్రహ్మముఁ గాంచును.

ఆ. ఉచ్చలోనె పుట్టి యుచ్చలోనె పెఱిగి
యుచ్చ కాసపడుట యుచిత మగునె
యుచ్చరోయువాఁడె యుత్తమయోగిరా?,వి....

మూత్రములో పుట్టి యందునవే పెఱిగి మఱల యందు లకే యాశపడుట మంచిదికాదు కావున విషయముల వద లువాఁడుత్తముఁ డగును.

ఆ. ఉయ్యేలందుఁ జేర్చి యూహించి నిద్రింప
నెయ్య మమర మదిని నిలిపినపుడె
దయ్యమంత బ్రహ్మ తన్మయమందును, వి....566

మనస్సును ధారణలో నిలిపి యాత్మ నుపాసించిన బ్రహ్మము తప్పక సాక్షాత్కరింపఁగలదు. కావున నట్లొనర్పుము.

ఆ. ఉరిదిగాను గాలి యున్నతి గను మింట
దురితముగను వచ్చి తొలఁగుచుండు
బురముపైన నిల్పి పూనికఁ జూడరా, వి....567

ఊపిరిఁ బిగఁబట్టి మనస్సును కనుబొమలపైని నిల్పఁబో వునప్పుడు మాయ యడ్డుచుండును. కాన దాని తొలఁగించి సిద్ధినొందుము.

ఆ. ఉఱుము మెఱుమురీతి నొప్పెడి మదియందు
మరులు సేరి దాని మహిమ సెరువ
నరులు మఱులఁ దగిలి నఱక మందెదరయా, వి.

ఎల్లప్పుడును శబ్దించుచున్న బ్రహ్మము నుపాసించుచు మోహము నొందనిజనులు ముక్తు లయ్యెదరు

ఆ ఊరు కొండవీడు నునికి పశ్చిమవీథి
మూఁగచింత లెల్ల మొదటియిల్లు
ఎడ్డెరెడ్డికుల మదేమని తెల్పుదు, వి.... 569

సంసార మంధకారావృతము గదా ! ఇంతటి విశాల ప్రదేశ ముండినను కొండవీటిలో మారుమూలఁ గలకొంపలోఁ బడి చింతలచే కాలముఁ బుచ్చితిని అహో! మాయా ప్రభావము.

ఆ. ఊసరిల్లి పిచ్చి యుపమున రసమును
జేర్చి నూరి సతులు చెలువముగను
వశ్యమనుచు మగనివాతకుఁ గొడుదురు, వి....

కొందఱు స్త్రీలు మోహావేశమున పిచ్చి ఆకును నూటి వశ్యపుమందని మగనికి బెట్టి తిప్పలు పెట్టుచుందురు అహో ! మోహము ఎంతటిచిక్కులఁ బెట్టునో చూడుఁడు?

ఆ. ఋషులటడవినుండి రుచులఁ గోరుట రోత
నరులు కలిగి తినమి యరయ రోత
భార్య లనుచు వారి భరియింపమియు రోత, వి.

ఋషుల మనుకొని రుచికోరుటయును పెండ్లియాడి పెండ్లములను పోషింపమియును శుద్ధములగు అకృత్యములు. మోహమే ఇట్టిపనులకు మూలకందము.

ఆ. బుడ మన్నత మెఱుంగ నెవ్వరితర మగు
స్థితియు గతియుఁ దెలియ తేటపడును
విన్నమాత్రముననె వివరింపగా రాదు, వి....

సత్యాసత్యములను చక్కఁగా బరికించి చెప్పవలయునే గాని వినినంతమాత్రాన విప్పిచెప్పఁజనదు ఏలయనఁగా సత్యాసత్యములను విన్నంతనే తెలియుట కేరితరమును గాదు

ఆ. ఎంగి లెంతవట్టు హితవుగా నెంచక
యొగ్గియుందు రంత నుర్విజనులు
కన్నయెంగి లెంత కనునెంగి లధికమా, వి....

ఎంగిలి మంచిది గాదని మోహమున తొలఁగియుందురు. గాని కంటి కగుపడునెంగిలికంటె కడుపునం బుట్టునెంగిలియే యెక్కుడది యగును

ఆ. ఎగ్గుసిగ్గులేని దేకమై తోఁపఁగా
మొగ్గి చూచు టెల్ల మూలవిద్య
తగ్గి యొగ్గ కెపుడు తాఁకుట పరమురా, వి....

లజ్జాదిగుణములఁ బరిత్యజించి సాహసించి బ్రహ్మము ధ్యానించుటయే విద్య యగును అట్టివిద్యయందు సర్వదా లీనుఁడగుటయే పరమగును

ఆ. ఎచ్చుకులము నొంది యెన్నాళ్లు బ్రదికినఁ
జచ్చి పుట్టు జన్మశతము లగును
మెచ్చునట్టి పూజ మెప్పుగాఁ బూనరా, వి....

ఎంతటియుత్తమవంశమున జన్మించినను జననమరణ

ములు తప్పవు కావున నిశ్చలచిత్తుఁడవై మోహమును వీడి ఈశ్వరుని సేవింపుము

ఆ ఎట్టియోగికైన నిల మన్మథావస్థ
 తెలియవచ్చునేని తేటయగున ?
 యోగ మెల్ల నుండి జోగియై పాడగు, వి....

ఎంతటియోగియైనను విషయములు ప్రత్యక్షములైన యోగమును వీడి విషయములయం దాసక్తుఁ డగును

ఆ. ఎట్టివాఁడొ తా నదెఱుఁగఁడు తొలిపుట్టు
 నీచజీవనమున నీమమేల
 ఎఱుఁగుఁడయ్య లోక మీశ్వరమయ మని, వి.

తాను పూర్వమున నెట్టివాఁడో తెలియలేక ఇప్పుడు మాత్రము నియమములను పెట్టికొని నిల్చును కావున ప్రపంచము నంతయు నీశ్వరరూపముగా నెఱిఁగి వర్తింపుము.

ఆ. ఎంతకష్టమైన నంత పాపపుఁ జింత
 చింతచేత మిగులఁ జివుకు మనుసు
 చింత లేకయున్నఁ జెడనిసంపదఁ గాంచు, వి....

కష్టము లెక్కువయగుకొలఁది పాపమును,అద్దాన చింతలును కలుగును. చింతలను విడనాడినచో సుఖింపఁ గల్గుదురు.

ఆ. ఎంతకాల మున్న నెఱుక లేకయె జీవి
 చచ్చి పుట్టుచుండు సహజముగను
 ఎఱుక మఱపు గలుగ నెఱుగునా బ్రహ్మము, వి.

ఎన్నేండ్లు బ్రదికినను చచ్చి పుట్టుచుండునే గాని మోహముఁ ద్యజించి బ్రహ్మము నెఱుఁగలేఁడు.

ఆ. ఎంతనాటినుండి యెనసిన మోహమో
చెలిమిచేతఁ దల్లి చెల్లెలక్క
యన్నబంధు లనెడి యాభ్రాంతి నావదు, వి....

ఎంతకాలమునుండి యీమోహము పొడుకొనినదో గాని చావు దాపించినను సంసారమునందే కొట్టుకొనును గాని ముక్తుఁడు కాఁడు గదా!

ఆ. ఎంతనేర్పుతోడ నేమేమి చదివినఁ
జింతలేనివిద్య చిక్కఁబోదు
వంతగించి మదిని బరికించి చూడరా?, వి....

ఎంతకష్టపడి మేధ నొంది చదివినను దుఃఖము నడంచుట నెఱుఁగరు కావున ప్రయత్నించి హృదయకుహరమును వెదకి యీశ్వరునిఁ గాంచుఁడు

ఆ. ఎన్ని వేషములకు నెఱుకయే మూలంబు
యముని గెలువవలెను సమయ మెఱిఁగి
దొంగ వసతి గాక దొఱకునా సౌఖ్యము, వి....

ఎన్ని వేషములను వేయుటకైనను జ్ఞానము వలయును. అది యున్నగాని యమునిబారినుండి తప్పించుకొనలేరు

ఆ. ఎఱిగి మఱిగి తిరిగి యేకాంతమును గోరి
పరుగులిడక యోగపథము పట్టి
పరము మించఁగోరఁ బరిపూర్తి నెందురా, వి.

బ్రహ్మమును ధ్యానించుకాలమున మాయాధర్మములకు మోసపోక యోగమార్గానుసారివై బ్రహ్మము నొంది పూర్ణుఁడవై మెలఁగుము.

ఆ. ఏకచక్రధరుఁడె యెల్లలోకంబులఁ
బాక మెఱిఁగి యేలు ప్రభుఁడు గాఁడు
రాకపోక లడచి రాజిల్లు మదిలోన, వి.... 584

ప్రపంచమునం దంతయును ఒకేరీతిగా వ్యాపించి యాత్మ యొక్కటియే మెలఁగుచుండును కావున చంచలతఁ బోఁగొట్టి మనంబునందు రమింపఁజేయుము

ఆ. ఏకసమమునందు ఎఱుక గల్గినయోగి
పరుల నెఱిఁగి చూడ భావమందు
ఆశలేక మించ నన్నిటఁ దానగు, వి.... 585

ఏ కాకారమున సర్వజగములను కనుఁగొనుచుండిన వాఁడు సర్వేశ్వరునిరూపము నొందఁగలఁడు

ఆ. ఏడు నైదు నారు నెనిమిది తొమ్మిది
యేమి కట్టునుండి యెట్లు తిరుగు
వాడి వాడి నంత వాడద దేమొకో, వి.... 586

బ్రహ్మము సప్తావరణములను మున్నగువానిని వ్యాపించి అవిరతముగా సంచరించుచున్నను అలతలేక యుండును

తే. ఏదికోరిన నీకోర్కి యెఱుక యగును
ఏది కోరిక నిండెనో యిరవు నగును
సాధువిద్యకు ధరలోన సమము లేదు
కోవిదుల కిది దెలిసిన గుఱుతు వేమ. 587

నీమనస్సుకు సంతుష్టి నిచ్చునదియును కోర్కుల పూరించునదియు నగు శాంతరూప మగుజ్ఞానమే బ్రహ్మస్వరూప మని యెఱుఁగుము.

ఆ. ఒడలిమెఱుఁగుఁ జూచి నడసొబగును జూచి
వంకకొప్పుఁ జూచి వనితఁ జూచి
విటులు కడుపులోన వెత నొందుచుందురు, వి.
స్త్రీలను జూచి మోహావశమున నజ్ఞులు పరితపింతురు.

ఆ. కడుపులోన నున్న ఘనమైనపిండంబు
ముందు కష్టమెల్ల మొదలరోసె,
ఇంక నైనబుద్ధి యేర్పడ పుట్టదా, వి.... 589
కష్టములను పొందుచున్నను మనుజునకు తెలివిరాదు కదా! ఇది యంతయు మోహపుబలము

ఆ. కల్మషంబు పోక కనుపింప దెందును
రూప మెవ్వరికిని రూఢితోఁపఁ
దామసం బుడిగినఁ దగ గల్గు జ్ఞానంబు, వి....
మనస్సులోని కలుషములు నశింపనిది బ్రహ్మ మెట్టివారికిని ప్రత్యక్షము గానేఱదు

ఆ. కాంత కుంక యైనఁ గానికులంబైన
పాయలేక విటుఁడు భ్రమసియుండు
మఱిగి గ్రుడ్డికుక్క మాంసంబు గొన్నట్లు, వి....
మనుజుఁడు మోహావశంబున కుక్క మాంసమును గోరి తిరుగునట్లు మంచిచెడ్డలను గమనింపక తిరుగుచుండును.

ఆ. కాంతసిందురంబు కడుఁబిత్తరోగికి
నొనర మధువుతోడ నొసగినంతఁ
దనరు దేహబలిమి ధన్యుఁడై గట్టెక్కు, వి....

అయఃకాంతమును సిందూరమును తేనెతో కలిపి యిచ్చిన పైత్య మణగునట్టులు ప్రపంచమునందలి మోహములకు విషయసంపదలను పోగొట్టిన ముక్తి కలుగును

ఆ. కామచింతఁ జిక్కి కనుగాన నేరవు
నీమనిష్ఠఁ దగిలి నియతి మీఱి
తామసంబు నడఁచి తన్మయ మందరా, వి....

కామముపై కోర్కెతో కన్నుగానక తిరుగకుము లోని యజ్ఞానమును పోఁగొట్టికొని బ్రహ్మమును ధ్యానించి తన్మయుఁడ వగుము.

ఆ. కాయమును గనకయఁ గనియు నావల నున్న
కాయమును విడచినఁ గాఁడు యోగి
కాయమందు ముక్తిగతి కేఁగవలయురా, వి....

ఈజన్మము నెట్లు గడపినను ఉత్తరజన్మమును తప్పించుకొనఁగలిగినగాని యోగి కాఁజాలఁడు కావున శరీర మున్నప్పుడే ముక్తికై యత్నింపవలయును.

ఆ. కాయ మున్నయప్డె కామాదులను కోసి
జ్ఞానమార్గమునకుఁ గడగవలయు
జాగు చేయఁ గాయ మేఁగిన నేమగు, వి....595

శరీరము ఖిలమై పోవకముందె జ్ఞానము నొంద ప్రయత్నింపుము అట్లు కాకున్న శరీరము నశించి ఆశాభంగము కాఁగలదు.

ఆ. కాలుచేయి వంచి గాలి నిండఁగఁ జేర్చి

నేలఁ బ్రాలి కొన్ని నిలిచి కొన్ని
యాసనముఖవిద్య లభ్యాసవిద్యలు, వి.... 596

కరచరణాదుల వంచుటలు మున్నగువానిచేఁ జేయు నాసనాదు లన్నియును విద్యలే కాని ఇయ్యవి బ్రహ్మము నొందింపఁజాలినవిమాత్రము కావు

ఆ. కావుకావుమనుచు కాల్గుండి పలికెడి
కాకికరణి బల్కు కానరాదు
బాపలైనవారు బ్రహ్మము నెఱుఁగరు, వి....597

నోటితో వేదము నుచ్చరించుచున్నను వేదస్వరూపము నెఱిఁగి ముక్తులు గారేని బ్రాహ్మణులును అజ్ఞానులనఁబడుదురు.

ఆ. కులము హెచ్చుతగ్గు గొడవలు పనిలేదు
సానుజాత మయ్యె సకలకులము
హెచ్చుతగ్గుమాట లెల్లఱుంగగ వచ్చు, వి....

జాతియొక్క హెచ్చుతగ్గుల నెంచ నవసరమేమి? సమస్తమును ఒక్కటియే యెనప్పుడు అట్లెంచినను హెచ్చుతగ్గుల నెట్లు తెలిసికొనవచ్చును

ఆ. కూడు గుడిచి లెస్సఁ గూర్చున్నవాఁడైన
నాఁడుదాని గన్న నట్టె తగులు
నన్నసార మొడలి కతిమదం బిడునురా, వి....599

కులభము

ఆ. కూడు బెట్టుకున్న కుక్షిలో జఠరాగ్ని
భక్షణంబు సేయు కుక్షిమలము
కూడువిడిచి మలము గుడుచురా యుపవాసి, వి.

ఆహారము లేకున్నచో జఠరాగ్ని మలభక్షణముఁ జేయు చుండును కావున మోహముచేత నుపవాసము లొనర్పకుము.

ఆ. కొమ్మ భ్రిమ్మరైన నమ్మఁగాఁ జూచును
సరస విటుల నేల సమ్మతించు
పేడఁ దిన్నపురుగు బెల్లమే మెఱుఁగును, వి....

సులభము

ఆ. కొండెగాఁడు చావఁ గొంత దనుకఁ బోవు
నంతు కింతెగాని నగవు లేదు
కొంకినక్క చావ గొఱ్ఱె యేమిటి కేడ్చు, వి....

దుష్టుఁడు మరణించిన యూరివారు దుఃఖింపరు. వానితో నేఁగఁ బ్రయత్నింపరు ఎట్టులనఁగా నక్కజచ్చిన చో గొఱ్ఱెలు దుఃఖము నొందవుగదా!

ఆ. ఖచరవరులు భూమి గనఁబడ రందురు
కానవచ్చినంత గౌరవింత్రొ?
తల్లిదండ్రిగురులు తత్సముల్ గారొకో? వి....

దేవతలు గనుపడరని అజ్ఞులందురు గాని కనుపించి గౌరవింతురా? అట్లైనచో తలిదండ్రులు దేవులు గారా?

ఆ. ఖనులఁ బుట్టు లోహగణమునం దెల్లెడఁ
బనికివచ్చునొక్కయినుమె చాలు
నైనఁ జులుకపఱతు రది యెచ్చుగా నింట, వి....

సులభము.

ఆ. గట్టుమీఁది మన్ను చట్టుపైఁ దగురాయి

పుట్టలోనివాని బుడుగు తోడుగు
గట్టిగాను మూటఁ గనకంబు పుట్టును వి...605

మూర్ఖులు అజ్ఞానముచే కనకమున కాసపడి క్లేశము నొందెదరు గాని కొండమన్ను పుట్టుపట్ట మున్నగువానిని మారిన కాదా?

ఆ. గద్దెగణము నిద్ర కలలు కోరికలును
ముద మొసంగు శకునములును దెలఁగు
ప్రశ్నలు పదివేలు పరికించి చూడఁగా, వి....606

గద్ద గణము మెలుగుట మున్నగునవి యన్నియును మోహవిలసితములే యగును

ఆ. గాసిఁజెంద నేల జగతికామమును మించి
వాసిగాను భక్తి వరుసదెలిసి
మోసపోక యెఱుక ముగియుట కానరా? వి....

వృథాగా కష్టపడుట యెందులకు? నిష్కామన కలుగు భక్తితో సేవించి ఐక్యము నొందుము

ఆ. గుటికి రావు జగతి కోమటినిష్ఠలు
లోభితనముచేత లుప్తములగు
పులిని దాసరి కిడు పొలుపని యెఱుఁగుము,వి....

పైకి దంభముల నెఱపుచు లోభియై యున్నంతవఱకును కార్యసిద్ధి గానేఱదు.

ఆ. గొప్పపిరుదు గన్న కుచకుంభములు గన్న

చెప్పరానిచోట చెలువు గన్న
ముప్పిరిగొనునయ్య మొనసిన మోహము, వి....

పిఱ్ఱలు స్తనములు మున్నగువానిని చూడఁగనే పాడు మోహ మెచ్చట నుండునో గాని వచ్చి చుట్టుకొనును.

ఆ. గోచిపాతఁ బెట్టి కోరి తా ముని నంచు
మనసులోనియాశ మాన లేఁడు
ఆశ్రుతెన్న నేతి కాశ యన్నఁగ వేఱు, వి....

మనసులోనియాశను త్యజింపక కట్టుబట్టలను వదలిన మాత్రాన ముక్తి రాదు

ఆ. గోచి విడుచు యోగి గోఁతిగా నాడించి
వెఱ్ఱివానిఁ జేసి వెతల జిక్కఁ
జేయునయ్య లేమి చేసెదరో చూడు, వి....611

అజ్ఞులు సర్వసంగపరిత్యాగియై దిగంబరియగునతనిని ఆటల నాడింప నారంభించెదరు

ఆ. గృహము దేహ ముండె కేవలగుణముండె
దాని నిలిపికొనియు దీని దీర్ప
గానరాదె నీకు నానందసుఖములు, వి.... 612

దేహమే గృహము వస్తుపరిజ్ఞానము గలగుణమునందు కలదు గాన దానిఁ బరికించినచో నానందము లబ్ధమగును.

ఆ. ఘటము గాన్గఁ జేసి ఘనగుణ మెద్దుగా
దవిలి కర్మములను నువులఁ జేసి
తెలిసిగానుగాఁడు దివ్యామృతము పుట్టు, వి....

శరీరమనుగానుగకు గుణమను నెద్దును గట్టి కర్మములను నశింపఁజేయుము.

ఆ. చిత్తము గలయోగి శివునివలెనే యుండు
మిథ్యయోగి యుండు మిడుతవలెను
నిత్యుఁడైనయోగి నీవలె నుండును, వి.... 614

చిత్తశుద్ధి గలయోగి నిస్సంగుఁడై శివునివలెనే యుండును. టక్కరియోగి జట్టిమిడుతవలె యెగిరిపడి నశించును.

ఆ. చింతఁ జెంతనుండు చేమంతిపూబంతి
కాంతఁ జూడఁ దలఁచు గౌఁగలింప
నంతమంతనమున కానంద మగునయా, వి....

దుఃఖముల కాకరమగుకాంతను జూడఁగనే అజ్ఞానికిఁ గౌఁగిలింప బుద్ధిపొడమును అందు నేమియానందమున్నది ?

ఆ. చీకటింటఁ జేరఁ జేదివ్వె లేకయే
రూక గానరాదు రూఢిగాను
రాకపోక లడఁచి రవములో విని సౌఖ్య, వి....

చీఁకటింటిలో దీపము లేనిది వస్తువు కనఁబడనట్టులు గురూపదేశము లేక పరమాత్మ కన్పింపదు.

ఆ. చెలిమి మీఱ మదిని చింతలు విడనాడఁ
బిన్నపెద్దలకును పెరిఁగివచ్చు
మంటిమింటినడుమ మదినిల్పి చూడుము, వి....

ఆశల తెగఁద్రోసి యోగమున నిశ్చలచిత్తుఁడవై దేవుని ధ్యానింపుము.

ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ జా వెంచి వగచెదు
దీన నరుల వెఱ్ఱి దెలుపరాదు
ప్రాణమునకు మృత్యుబంధము లుండునా, వి....

అజ్ఞులై చచ్చుచున్నారని ఏడ్చెదరే కాని ప్రాణము
లకు చావుపుట్టుకలు లేవు

ఆ. చమురు రాచికొన్నఁ జర్మంబు మెఱుగెక్కు
సాము చేయ మేను సత్తులెక్కు
జ్ఞానమార్గ మెఱుఁగ కడతేరు జన్మంబు, వి....

చమురుచేత చర్మము మెఱుగు తేలినట్టులనే జ్ఞానము కలి
గిన ముక్తి గలుగును

ఆ. చాడికాదు మాట సవ్వడిలో నిక్కు
వేఁట బోవునకము వెలయు నిక్కు
వెలఁదిఁ జూడ నిల్లు విటుఁడును నిక్కును, వి.

మోహమున తమగతులను చూచికొనక కొండెగాఁడు
మున్నగువారలు గర్వింతురు

ఆ. చాలు చాలు నిలను జననమరణంబులు
మేలుగావు మాయ మెలకు వెఱిగి
ప్రాలుమాల కిలను భక్తిచేఁ బూనుము, వి....

ఎప్పుడును చావుపుట్టుకలే చాలును కనుక మఱల
జన్మించుతలంపు గొనక భగవద్భక్తిని స్వీకరింపుము.

ఆ. ఛిద్ర మెన్నువాఁడు శిష్యుఁడు తా నౌను
ఛిద్ర మెఱుఁగువాఁడు శిష్యుఁ డరయ
ఛిద్ర మెఱిఁగి విడువ భద్రంబు చేకుఱు, వి....

ఒరుల తప్పుపట్టువాఁడు శిష్యుఁడు కాఁడు గాని తన తప్పు నెఱిఁగి దిద్దికొనువాఁడే నిజముగు శిష్యుఁడగును

ఆ ఛేద్యమైనఁదానిఁ జేపట్టినాఁ డని
మూలవస్తు వెట్టు కేలఁ జిక్కు
దాని నూనఁ గలుగు దార్ఢ్యము తప్పక, వి....

ఛేద్యమును చేతఁ బట్టుకొన్నమాత్రాననే మూలవస్తువు లభ్యపడదు. కావున నభ్యాస మవసరము

క. జగ మరయ నింద్రజాలము
జగ మనఁగా మాయ సుమ్ము జన్మాదులకున్
భగవంతుం డగుబ్రహ్మము
నిగమాగమనిర్వికారనిపుణుఁడు వేమా! 624

ప్రపంచమంతయును మాయాపూర్ణమే యగును ఒక్క బ్రహ్మమాత్రము నిర్వికారుఁడు

ఆ. జంతురాసులందు జనియించి జనియించి
దిమ్మపట్టినట్టు తిరిగి తిరిగి
తనువు నిత్య మంచు తలపంగ నవ్వరో, వి....

జంతురాసియందూఱక జన్మమెత్తియెత్తి శరీరము నిత్యమని తలంచెనేని నవ్వులచేటుగదా!

ఆ. జనన మెట్టు కలిగె జాతి యెయ్యది యయ్యె
జననమరణములకు జాడ లెఱుఁగ
వినఁగ వినఁగ దీని వివరించికానరో, వి.... 626

అనేకయోనులందు జన్మించుటయే స్వభావము గల జంతువునకు జననమరణాదులు లేవు

ఆ. జాతిభేద మెంచి జన్మము దెలియక
ముక్తి గానలేరు ముగ్ధు లెపుడు
జాతు లెంచనేల జన్మంబు తెలియుము, వి....627

మోహము కలవారు జాతిభేదము నెంచెదరు కాని జాతుల నెంచఁ బనిలేదు పుట్టుకయే ప్రధానము

ఆ. జాతిసూతకములు సత్యమైయుండంగ
నంటినంత నెట్లు లంటుకలుగు?
వితము గానలేరు వెలయంగ జీవులు, వి....628

జననమరణములు నిత్యము లగుటచేత జీవుఁడు నిత్యము సూతకముతోనే యుండును దీనిని దెలిసికొనఁజాలక చిక్కు వడియెదరు

ఆ జాతిలోన నెట్టి జాతిముఖ్యం బంచు
నెఱుఁగలేక తిరుగ నేమి కలదు?
యెఱు కెఱిగినవాని కేజాతి కానేమి?, వి....629

వర్ణములలో నేవర్ణము మంచిదని తిరుగుటచేతఁ గొంచె మైనను ప్రయోజనము లేదు ఏజాతియైన నొక్కటే యగును

ఆ జీవ ముండుచోటు స్థిరముగాఁ దెలియక
తిరుగు నస్థిరమగు దేహమందుఁ
దిరుగనేల ననుచు దెలియలేఁ డజ్ఞాని వి.... 630

అజ్ఞాని జీవ మున్నచోటునుగూడ నెఱుఁగక తిరిగి తిరిగి యలయుచుండును.

క. జీవంబగు జీవేశుఁడు
జీవుని కొకయిల్లు చూపఁ జింతల దొంతై

కావరమున గర్వించుచు
భావములో శివుని మఱచి భ్రమగొను వేమా!

జీవమే జీవేశుఁడై ఘటాదులలో నుండి సంగతముగాక ప్రకాశించుచుండును అట్టివానిఁ గానలేక యజ్ఞాని గర్వించుచుండును

ఆ జీవ మేడనుండు భావ మెక్కడనుండు
కాపురంబు లేద గదిసియుండుఁ
దనరుచున్న రెంటిస్థల మేల తెలియదు?, వి....632

జీవ మెక్కడ నున్నదో భావ మెక్కడనున్నదో ఆ రెండిఁటికి అధార మేది? యని విచారింపరు అజ్ఞులు

క. జీవాత్మఁ డెప్పు డుండెడి
తావును దాఁ దెలియలేక తగ నస్థిరము
న్భావమున నమ్మి తిరిగెడి
జీవికి ధర ముక్తి గలుఁగఁ జెల్లునె వేమా! 633

జీవాత్మఁ డున్నస్థలమును తెలిసికొనఁజాలక ప్రపంచమునంతయును దిరుగువానికి ముక్తి లేదు

ఆ. జీవి జీవి జంప శివుని చంపుటె యగు
జీవుఁ డరసి తెలియ శివుఁడె కాదె
భావమందు వేగ భావించి చూడుము, వి ,...634

ఒకజీవి వేఱొకజీవిని జంపినచో దేవుని చంపినట్లే యగును ఏలయనఁగా దేవుఁడు సర్వాంతర్యామియై యుండును గదా!

ఆ. జీవుఁ డిలను నిండి సృష్టిలో నుండంగ
శివుని వెదుకఁబోవు జీవుఁ డహహ!
జీవుఁడు శివుఁడను చిహ్నంబుఁ దెలియక, వి....
ప్రాణిమాత్రుఁడు తనహృదయములో దేవుఁడు జీవ రూపముతో నుండుటను గుర్తింపలేకపోవును

ఆ. జల్లిమాటలనుచు జగమునఁ దిరిగెడు
కల్లగురుఁడు కట్టు కర్మమెల్ల
పల్లుపురుగు సేరి పలవింపఁ జేయదా, వి....
నోటికివచ్చిన జల్లిమాటల ననుచు లోకులను మోసము చేయుటకై నిష్కారణముగా పుప్పిపురుగు పంటినివలె లోకమును నాశనము చేయుదురు

ఆ. జాణలైన యట్టి చపలాయతాక్షుల
తలపు లరసి చూచి భ్రమయ నేల ?
బయటిరూపు లెల్ల పరికింపఁగా నేల?, వి....637
స్త్రీలను చూచినంతనే ఏల మోహము నొందవలయును ? ఏమి కల దిచ్చట యని అంతరపరీక్షఁ జేసినచో ఎన్నటికిని మోహము నొందరు

ఆ. జ్ఞానభావపరముఁ గనుఁగొనకున్నను
మానరాఁడు మనను మమతఁ దగిలి
పూని జన్మములను పొందు దా పుడమిని, వి....
మనుజుఁడు జ్ఞానమార్గమును కనుఁగొని దాని నవలంబింపనంతవఱకును కర్మబద్ధుఁడై పుట్టుచుఁ దెఱుగుచునుండును.

ఆ. తనదు నాత్మయందు దైవంబు గలుగఁగ
తీర్థయాత్రల కిల తిరుగు నరుఁడు
గంధపుతునకల గాడ్దె మోసినయట్లు, వి....639

తనయాత్మలోనే దైవ ముండఁగా తీర్థయాత్రకుఁ బోవుట బరువుచేటే కాని వేఱు కాదు.

ఆ తనదులోని జీవతత్త్వము తెలియక
వేఱటంచుఁ దలఁచి వెదకు రెల్ల
భానునరయ దివ్వె పట్టినరీతిరా, వి....640

తనలోని తత్త్వమును గమనింపనేఱక ప్రపంచములో వెదకుట సూర్యునివెదకుటకు దివిటీ పట్టుటవంటిది

ఆ. తనువు నడవిఁ జేసి తనలోన కూర్చుండి
తపము చేయలేని తపసులెల్ల
నడవియందుఁ జేరి యలజడి పడెదరు, వి....641

తపస్సుచేయుట కచ్చటికో పోక శరీరమునే యడవిని జేసి తపముఁ జేసిన దైవ మగుపడును

ఆ. తన్ను దెలియకున్నఁ దగు వేదములు వెట్టి
సర్వసంపదల ముసాబువెట్టి
ఆరుశాస్త్రములు నిశాపురాణములును
జబ్బు లనుచు జగతిఁ జాటు వేమ. 042

ఆత్మజ్ఞానము లేనిచో వేదములు సంపదలు సకలమైన శాస్త్రములును చదువుకొనియున్నను నిరర్థకములు

ఆ. తన్నుఁ దెలియునట్టి దైవజ్ఞు లెన్నరిగ

నిన్ను దెలియలేని నిలువ రైరి
మాయఁ దెలియుకున్న మంటిపాలైరయా, వి....

ఆత్మను గుర్తింపనేలక దైవజ్ఞలమని దంభముచేసి మరణము పాలై రేకాని జన్మసాఫల్యము నొందరైరి

ఆ. తమకు నాటియుంచు దైవజ్ఞు లగునరుల్
పరగ గూఢభావ మెఱుఁగ లేక
ఇట్లు మాయఁబడిన నెటు తెలియును మాయ,వి.

దైవజ్ఞులు తమకు దైవము బెట్టినరహస్యము నెఱుఁగ లేక మాయలఁ బడి కొట్టుకొనుచుందురు

క. తమమునఁ జచ్చిన మనుజుఁడు
మమతను దాఁ బుట్టుచుండు మరణముకొఱకై
శ్రమ దీర్పు గురుని వేఁడిన
భ్రమమూల మిదంజగత్తు బయలగు వేమా!.

అజ్ఞానమునఁ జచ్చినచో మఱల జన్మము కలుగును గాన గురువు నుపాసించి పునర్జన్మలేని బ్రహ్మము నొందుము

ఆ తరుణి సొగసుకాని తనయునిఁ గన్నను
మరునికళల మించి మనసు పాఱుఁ
దలఁపఁ దలఁపఁ బుట్టు తనువునఁ దత్వంబు,వి....

ఆఁడుదానికి తనకుమారుడైనను చక్కనివానిఁ బొడఁ గనినచో మోహము పుట్టును ఇట్లు విషయవివేచనఁ జేసి పరిత్యజించిన పరతత్వము లభించును

ఆ. తలను వ్రేలవేసి తాలి మించుక లేక

యోఁగి తెలియుఁ గన్ను మూఁగ యగుచు
జ్ఞాన మది యెఱుఁను గష్టపు దేహమా, వి....

తలను వ్రేలాడవై చికొని దంభమునకు యోగియైనచో కష్టముల కాకరమగునే కాని జ్ఞానమునకు కాదు

ఆ. తలఁపుచేతఁ గల్గు తారకబ్రహ్మంబు
తలఁచి చూడఁ దానె తత్త్వమగును
తలఁపులోనితలఁపు తానె త న్నెఱిఁగిన,వి....648

మనోరథముచేతనే తారకబ్రహ్మంబు సిద్ధించును నిరంతరము మననము చేయుటచేత దానె తద్దైక్యము నొందఁ గలుగును

ఆ. తలపఁదలపఁ గూలి తగనేయ కీయఁడు
వలపు దీఱ నీయగలుగురూక
ముక్తినీనిగురుఁడు ముచ్చులకొడుకయా, వి....

పనిచేయనిది కూలియీయనట్టులనే మననముఁ జేయనిచో గురు వనుగ్రహింపఁడు మననముఁ జేసినను ముక్తిఁ దెలుపని గురుఁడు దొంగయే యగును

ఆ. తలపునందు శివునిఁ దలపోయఁగా లేక
తలఁప దెల్ల బయటి తలపుఁ జేసి
తలపు తాన యైనఁ దత్త్వజ్ఞుఁ డగునుమీ,వి....

ఈశుని మనమున నిలిపి ధ్యానము సేయలేక వ్యర్థముగా స్థూలరూపమును విచారింపఁబూనును మనస్సు ఆత్మరూపమైనచో తప్పక కైవల్యము నొందును.

ఆ తలఁపులోనితలఁపుఁ దలపోసి తెలియరా
తలఁపు లెల్ల విడిచి తగినభంగి
తలఁపులోనితలఁపె తత్త్వంబు నాత్మరా? వి....

తలంపులోనితలంపును నిరంతరధ్యానముచేఁ దెలిసి కొనినచో నయ్యదియె యాత్మతత్త్వ మగును

ఆ. తల్లిగర్భమందుఁ దాఁబుట్టినప్పుడు
మొదలఁ బట్టలేదు తుదకు లేదు
నడుమఁ బట్ట గట్ట నగుబాటుగాదొకో, వి.... 652

మొదలను తుదను లేనిమోహమును (అజ్ఞానావస్థను) నడుమఁ దెచ్చిపెట్టుకొన్న నవ్వులచే టగును

ఆ. తల్లిదండ్రి గలరు తగజన్మజన్మలఁ
దనకుఁ దెల్పువానిఁ గనగ లేరు
నాదమే పరమని నమ్మినవానికి
నిహమునందుఁ బరము నెసఁగు వేమ. 653

పూర్వజన్మములను జన్మహేతువులగు తల్లిదండ్రులు నున్నారు శబ్దమే బ్రహ్మమని నమ్మెడివానికి ఇహపరసాధనము కలుగును

ఆ. తల్లిదండ్రి చావఁ దా నాలితోఁ గూడి
యిల్లు గట్టుకొన్న యింపులెల్లఁ
గొఱతమీఱి దొంగ కూ డడిగినయట్లు, వి....

తనను కనినవారు చచ్చుచుండఁగా తాను కన్నులార చూచియును మఱలఁ దాను నట్లే సంసారమునఁ బ్రవేశించుట తెలివిలేనితనము.

ఆ. తల్లిగర్భమందు దాఁ జనియించియుఁ
దనదుభోగసతికి తాన పుట్టఁ
దల్లు లిరువురైరి తను వొక్కటయ్యెరా? వి.... 655

వ్యాఖ్య:— మనుజుఁడు తల్లిగర్భమున తొలుత పుట్టి మఱల భార్య గర్భమునఁ బుత్రరూపమున జన్మించును, కావున నతని కిరువురుతల్లులు నొక్కశరీర మనఁదగును

ఆ. తల్లిదండ్రి గలరు తగ జన్మజన్మలఁ
దనకుఁ దెల్పువానిఁ గనఁగ లేరు
నాదమే పరమని నమ్మినవానికి, వి.... 656

జన్మజన్మమునందును తల్లిదండ్రాదు లున్నారని తెల్పినవానిని గనలేక మూర్ఖులై చెడుదురు

ఆ. తల్లిదండ్రిఁ బాసి తనయాలితోఁ గూడి
యిల్లుపట్టియున్న యింపదెల్లఁ
గొత్తికాడి దొంగ కోరినచందంబు, వి.... 657

తల్లిదండ్రులను బాసి యాలితో కాపురము చేయఁ గోరుట గొత్తిని దొంగిలి వ్యవసాయకష్టమును తెచ్చుకొన్న దొంగవలె కష్టకరము

ఆ. తల్లిదండ్రు లనెడితత్త్వంబు నెఱుఁగరు
యోనిలింగములన యుద్భవించు
విష్ణువరయ తల్లి వెలయ రుద్రుఁడు తండ్రి, వి....

తల్లిదండ్రు లనఁగా నేమి యనువిషయము నజ్ఞులై తెలియలేరు, కాని తల్లిదండ్రులు విష్ణురుద్రస్వరూపులు అని తెలియవలయును.

ఆ. తల్లితండ్రు లెవరొ తనకు జన్మము లెన్నొ
తిరిగి యెఱుఁగనట్టి దిక్కు లెన్నొ
స్థిరము నస్థిరమును తెలియలే డజ్ఞాని, వి....659

తా నెవరో తల్లిదండ్రు లెవరో మున్నగువానిని తెలియలేక యజ్ఞాని కష్టపడుచుండును

ఆ తల్లి యేడ్పు వినక తనయాలు వగచిన
జాలిపడెడివాఁడు జడుఁడు సుమ్మి
తారతమ్య మెఱుఁగ నేరనిపశువులు, వి.... 660

కన్నతల్లిపై నిసుమంతయును దయ దలపక భార్యపై దయపడెడు వాఁడు పశుతుల్యుఁడు

ఆ తా నసంగ నెవఁడొ తనవార లెవ్వరో
తెలిసి తెలియ లేఁడు తిక్కనరుఁడు
అరిదిపిసిని కాయపురుగుపద్ధతిలాగు, వి.... 661

అజ్ఞానుఁడు పిసినికాయలోని పురుగువలె తా నెవరో ఏమియో తెలియలేక భ్రమించుచుండును

ఆ. తాను తా న యనెడితత్త్వంబులోఁ గల
యన్వయంబుఁ దెలియఁ డబ్బెత్తోడు
తాను తా నె యైన తల్లడం బేలరా?, వి....662

తాను తానను చుండును గాని అందుఁ గలయర్థమును తెలిసికొనఁజాలక తల్లడపడుచుండును

ఆ. తాను తనువటంచు ద్వయమును బలికిన
మోహవార్ధిలోన మునుఁగునరుఁడు
కాన లేఁడు మోక్షగతి యెట్లు సిద్ధించు, వి....663

తాను తనశరీరము అని మోహములో మునిఁగినవానికి మోక్షము కలుగనేఱదు.

ఆ. తానువెలయుభూమి తనరంగఁ దిరిగెడు
జనుల గాంచి పొంచి సరగఁ గఱచు
కుక్కబుద్ధి యంట గుణ మేల మానును?, వి....
సులభము

ఆ. తాన తత్త్వమనుచు దలపోయఁగా లేక
మాయఁ దత్త్వమనుచు మఱుగుచుండు
ధర్మకర్మములను దా రోయ తత్త్వమా, వి....

తానే యాబ్రహ్మ మని తెలియలేక అజ్ఞులు తత్త్వమును నిందించెదరు కాని ధర్మమును కర్మమును గుర్తించిన తత్త్వమగును

క. తామరపాకున నీళ్లుగ
వేమఱు జలియించు బుద్ధి వెదుకరు శివుని
న్నీమహి నమ్మగరాదని
ధీలో తెలియంగలేరు దేవుని వేమా! 666

తామరపాకులో నీటిబిందువువలె సంసారమునంటియు నంటకుండు నీశుని అజ్ఞులు తెలియలేరు

ఆ. తాము కన్నవారుఁ దము గన్నవారును
జచ్చుటెల్ల తమకు సాక్ష్యమొకద!
బ్రదుకు టెల్లఁ దెలియ బ్రహ్మకల్పంబులా? వి....

తల్లిదండ్రులు,సుతులు మున్నగువారు చచ్చుట శరీరము అనిత్యమనుటకు ప్రబలనిదర్శనమగుచున్నది.

ఆ. తిట్టనేని కొట్టు కొట్టినఁ గొట్టును
కొట్టనేని యముఁడు కొద్దిపఱచుఁ
గోపమెంచఁ జేర్చుఁ బాపునరహత్య, వి....

పరుల నేవిధమునను నేమియు ననరాదు. అట్లు కానిచో యముఁడు కుపితుఁడై నరకబాధల నొందించును

ఆ. తిఱుగవలయు మనసు తెఱిగినపఱకును
దిరుగునట్టి మనసు విఱుగవలయుఁ
దిఱిగి విఱిగనేని దేవుఁడు తానగు, వి.... 669

మనోరథము ఈడేరునంతవఱకును కామముల ననుభవించి మనసు తిరిగినవెంటనే విరక్తి నొందవలయును ఇట్లు చేసినవాఁడు సాక్షాత్తు దేవుఁడగును

ఆ. తీర్థయాత్ర కనుచుఁ దిరుగఁబోయినవాఁడు
పామరుండు గాక భక్తుఁ డగునె ?
తీర్థయాత్ర చేత దివ్యుండు గాఁడయా, వి....670

తీర్థయాత్రలకు పోయినపామరుండు భక్తుఁ డగునే కాని ముక్తుఁడు గానేరఁడు

ఆ. తుంటవింటివాని తూపుల ఘాతకు
మింటిమంటి నడుమ మిడుక దరమె ?
యింటియాలి విడిచి యెట్లుండనేర్చును?, వి....

మన్మథబాధ లతివిషహ్యములు గనుక స్త్రీలఁ ద్యజించియుంట కష్టము.

ఆ. తులసికారములును దూముపై వీరము

పఱచి దాన దుష్టపాలువోసి
కఱగి రాగిపైని క్రమముగా నుంచరా, వి....

తులసీ మున్నగువానిరసమును రాగిపైని పోసిన స్వర్ణ మగునని యజ్ఞులు మోసము చేయుదురు

ఆ. తెఱలమఱుగునఁ గల తేజమంతయుఁ జూచి
మఱియు బ్రహ్మమందు మనసు నిలిపి
గరిమ నున్నయట్టిఘను లెందుఁ గలరయా?, వి.

మాయచే నావరింపఁబడిన యాత్మరూపమును తెలిసి మనస్సునందు నిలిపినఘను లెచ్చటనో కాని లేరు

ఆ. తెలియ భాగవతులె తెలివి గలారింక
నంద ఱెట్టు లగుదు రకట భువిని?
నయినవారిని గను నతఁడె పో శివయోగి, వి....

భగవద్భక్తిగలవారె మేధావంతులు అనవచ్చును వారిని దర్శించువాఁడైనను ముక్తుఁ డగును

ఆ. తెలియఁ దనదుభార్య తెగబారు సంకెల
చిన్నశిశువులెల్ల జీవు లరయ
నరసి చూడఁ దనువె యుల చెఱసాలరా, వి....

మనుజుఁడు అజ్ఞానియై భార్య, పుత్రు లనుకొనును గాని వారు కాళ్లకు బంధములును చెఱసాలయు నగుదురు.

ఆ. తెలివి నిలిపి చూడు దీపించు నాకళల్
కళ లుడుగక చూడు కలుగుబయలు
బయలు నంటి చూడ బ్రహ్మంబు గాంచెదు, వి.

చిత్తమును నిలిపి నీలో నీవు పరికించినచో నాశకము నంటి భ్రష్ట మావిర్భవించును

ఆ. తెలుపుమా యటంచు దేవర యంచును
వెంటఁ బడెడివాండ్ర వెతలు దీర్ప
నెవ్వ డైన జెప్ప నేర్చైన నొక్కటి, వి.... 677

మోహులై ఎవనిఁ బట్టిన వానిని చెప్పుఁడు చెప్పుఁడనిన నేదో చెప్పునే కాని, అయ్యది సఫలము కానేరదు

ఆ తొడలమెఱుపు మోవి తోరంపుగుచములు
నోరకొప్పు గలుగు నువిదఁ జూచి
విటుఁడు నిలువగలఁడె విరహాగ్ని జొరకయే?, వి.

స్త్రీలను చూచి ముగ్ధుఁడై నిలువలేక పోవును

ఆ. తొత్తుతోడిపొందు తొట్టె పెసలమూట
లంజతోడ పొందు లజ్జచెడును
జాండ్రతోడ పొందు చావునకే యగు, వి ....

దాసీసంగమము నింద్యము తొట్టిగల పెసలమూటవలె బహిరంగమగును భోగముదానితోఁ బోయిన సిగ్గుపోవును. ఇఁక జాండ్రదానితో సంగమము చావునకే గాన వీనిని వదలుకొనవలయును.

ఆ. తోలుఘటములోనఁ దోలఁగక యున్నప్పు
డాలుమగలు బ్రీతి నలరుచుండ్రు
జీవి ఘటము విడువ చిక్కూడిపోవురా, వి....

శరీరములో నుసురు లున్నంతవఱకే యీయాలుబిడ్డల పోరాటము కాని, అవి తొలఁగిన చిక్కులు తొలఁగిపోవును.

ఆ. దశమి యేకాదశి యని వ్రతములఁ బూని
మెదుకు దినని యంత మది యడఁగునె?
పుట్టపైని గొట్ట గిట్టునా యురగము?, వి....681
ఏకాదశి మున్నగు పేరులఁ బెట్టుకొని భోజనము చేయ
నంతనే ముక్తుఁడు కానేఱఁడు

ఆ. దృశ్యమైనదానిఁ దెలసి నమ్మెద రట్లు
కాని దాని నమ్మఁ బూనుకొనరు
కాని దృశ్యమగుట కానరే యది యేల?, వి....
కంటికి కనుపించిననే నమ్ముదురు. లేనిచో నమ్మరు.
కాని అదృశ్యభూత మగుపరమాత్మ నేల నమ్మరు?.

ఆ. దేవళములలోను తీర్థంబులందును
మూల మెఱుఁగకున్న ముక్తి లేదు
ఆత్మమూల మెఱుఁగఁ డది యెట్లు తెలియును,వి.
దేవాలయములు మున్నగువాని కెందులకు పోవలయునో
యామూలమును గనలేనివాఁడు ఆత్మమూలమును కూడ తెలియఁ
జాలఁడు

క. దేహాభిమాన ముడుగక
మోహాదులు విడుచు నెట్లు మునులకునైన
న్సోహమసమున నది విడుచునె
సోహమ్మని యెఱుఁగవచ్చు నుర్విని వేమా!684
దేహాభిమానమును వదలుకొనునంతవఱకును ముక్తి
దుర్లభము కావున నభిమానమును త్యజించి సోహమ్మని తెలి
యవలయును.

ఆ. నమ్మినట్టి యుండి నొకభూత మనఁగఁ
జూపఁ బోరల వేసి చక్కబోవు
నీతఁగాఁ డయిన నటేల పోనిచ్చునే?, వి.... 685

ఉన్నట్టియుండి యొకఁడు బోరగిలఁబడి జనులను ముంచును కాని అందున్నవాఁడు విజ్ఞుఁడైన నట్లు కానీయఁడు

క. నరజన్మముఁ దా నెత్తియు
బరమాత్మ నెఱుంగలేక పాపాత్ముండై
కొఱగానిపను లొనర్చిన
తిరిగి యధోగతికి నేఁగు దిరముగ వేమా! 686

మనుజజన్మము నెత్తియును బరమాత్ము నెఱుఁగఁజాలక కానిపనులఁ జేసినచో నరకము నిశ్చయముగా గల్గును.

ఆ. నరుఁడట పరమాత్మ గురుని జేరినయప్డు
హస్తమందు మోక్ష మమరుచుండు
విఱివిసంపదలను విఱ్ఱవీఁగును జీవి, వి.... 687

మనుజుఁడు గురువనుగ్రహమున మోక్షము నొందగలుగును కాని తఱచుగా గర్వమున విఱ్ఱవీఁగును

ఆ. నాది నీదటంచు ననువుగా బల్కిన
కాదు కాదటంచు కాల ద్రొక్కి
పాదుకొనెడియుక్తిఁ బడయు మెల్లప్పుడు, వి....

వాదములు మాని నిరంతరధ్యానముచేత నీశ్వరుని భజింపుము

ఆ. నిద్రలోని నిద్ర నిర్ద్వరవిదితంబు
తామసంపునిద్ర తొలఁగిపోవు
సతత మదియె పూన సర్వదా యోగియా, వి.
కనులుమూసికొని సమాధి నవలంబించి సర్వదా ధ్యానించుచుండినచో యోగి యగును

ఆ. నిబిడమైనతమము నిక్కి దాఁటగలేక
గుబురు బట్టబయలు కూడుబెట్లు
ప్రబలుచున్న మదిని పాలించుచుండును, ని....
అజ్ఞానము నశింపనంతవఱకును బ్రహ్మసాక్షాత్కారము కలుగనేరదు

తే. నిర్మలజ్ఞానపరిపూర్ణనిష్ఠయందుఁ
కర్మసన్యాసయోగియై కసిమసంగి
మర్మ మెఱుఁగుచు నుండులే మానమయ్య
ధర్మ మింతయె బోధించు ధరణి వేమ 691
నిర్మలమగు జ్ఞానము నొంది కర్మలఁ దృజించి ప్రపంచములోనిమర్మము నెఱుంగుచున్న, ముక్తి కలుగును

క. సీమము పెట్టుకద్రవ్యము
కామంబున కగుచు భువిని కల్లరికూతల్
సేమముగ బలుకుచుండిన
కోమటు లొకకొంద రుంద్రు కుంభిని వేమా. .
కావలయునవి అబద్ధముల నాడుచు స్వప్రయోజనపరులై కోమటులవలె మోహాలు కొంద ఉందురు.

ఈశ్వరుని గుర్తించి మనస్సును మాటిమాటికి నందు చేర్చి ధ్యానింపవలయును

ఆ. ఏకమైనదాని నెక్కడఁ జూతురు
పాక మెఱిఁగి చెప్పఁ బరుఁ డెవండు
లోకమాయఁ జూడ లో వెలి నిండెరా, వి. 759

ప్రపంచమున నంతటను నిండి యేకాకారముతో వెలుఁగు నీశుని కనుఁగొనుము.

క. ఏచూడ్కి నిలిచి యుండునొ
యాచూడ్కిని బట్టి మదిని నాఁగా దనకే
రేచకపూరకకుంభక
సూచన పర మనెడుబయలు చూడుము వేమా!.

ఏవిధముగా దృష్టి నిలిచిన నావిధముగనే ఈశుని గుర్తించి సేవింపుము

ఆ. ఏరుదాఁటి మెట్ట కేఁగినపురుషుండు
పుట్టి సరకు గొనక పోయినట్లు
యోగపురుషుఁ డేల నొడలిఁ బాటించురా, వి.

ఏరుదాఁటినవాడు పుట్టిని లెక్క చేయనట్టులు యోగపురుషుఁడు శరీరమును సరకుసేయఁడు.

ఆ. అయిదు చక్రములను నాదిని బడవైచి
యైదుచక్రములకు నవల వెలసి
యైదుచక్రములను నగుబయ లచ్చట, వి.,

పంచభూతవివేచనఁ జేసి ఆపంచభూతావృతమగుదాని కంటె నవ్వల నున్న యీశునిరూపమును గుర్తింపవలయును.

ఆ. కడుపులోనివాని గానఁగా లేరయా
కష్టపడుదు రింతె కాని జనులు
హీన మెఱుఁగనాతఁ డిదియేల యెఱుఁగును, వి.

కష్టపడుగురే కాని జనులు కడుపులో నున్న ఈశ్వరుని తెలిసికొనఁ జాలకుందురు

ఆ. కదలనీయకుండ గట్టిగా లింగంబు
గట్టివేయ నేమి ఘనత గల్గు
భావమందు శివుని భావించి కానరా, వి....764

గట్టిగా కచ్చ కట్టినమాత్రాన కొంచెమైనను ఫలము లేదు కావున ఈశ్వరుని భావములో ధ్యానింపుము

ఆ. కదియఁ బట్టి హంస కళ లెల్ల గమకించి
సదయహృదయమందు సంతరించి
విదితమైనబయుల వెన్నంటి చూడరా, వి....765

హంసను మనస్సునందు గదియించి చిద్రూపమును చూడుము

ఆ. కనుల చూపు నిలిపి కాంతిని గమకించి
కాంచవలెను చిత్రకళలుదాఁటి
కోటకొమ్మఁ జేరి కోర్కెల తలఁపుము, వి....

దృష్టిని నిలిపి మనశ్చాంచల్యములను సరకుసేయక ఈశ్వరునిరూపును సేవింపవలయును.

ఆ. కనులు రెంటినడుమ కాసంత నిలిపిన
బొమలమీఁటి చూడ్కిఁ బొందఁ జేయు
క్రమ మెఱింగి లోనికాంతిని పట్టుము, వి....
కనుబొమల నడుమ గుఱియుంచి తత్త్వమును కనుము.

ఆ. కన్ను మిన్ను చేసి కాంతిని గమకించి
తన్ను నిలిపి చూచి తలఁపు వదలి
యున్నవాఁడు పరము గన్నవాఁడే యగు, వి....
కన్ను నూర్ధ్వముగా బఱపి చిత్స్వరూపమును గుర్తించి
ధ్యానించిన కేవలుఁడై తన్మయుఁ డగును

ఆ. కన్నెపడుచు గాంచి కదలనీకుండిన
యాస బట్టి యొక్కమూసఁ బట్టి
కఱగఁబెట్టి దాని కడముట్టఁ జేయరా? వి....
స్త్రీలపై నాసగలిగించిన మనస్సును బంధింపుము.

ఆ. కపటవేషమూని కడగండ్లు పడనేల
విపినభూమి తిరిగి విసుగనేల
యుపముతోనె ముక్తి యున్నది కనవలె, వి....
కల్లవేషములను వేయక యుక్తితో ముక్తి గనుము.

ఆ. కఱగ కఱగఁ బుట్టు కనకంబునకు వన్నె
పెనఁగ పెనఁగ బుట్టు ప్రేమ సతికి
ముదియముదియఁబుట్టు మోహంబులోభంబు,వి
కఱుఁగఁగా కనకమునకు వన్నె పుట్టునట్టులే సర్వదా
ప్రేమాదులవలన మోహాదులు జనించును.

ఆ. కరతలంబు నెత్తి కాలి నదిమిపట్టి
యూర్ధ్వదృష్టిచేత నొనర నిల్పి
సర్వమైన తనరుటఁ జాలనాయువు కల్గు, వి....

ఊర్ధ్వదృష్టిఁ గనుబొమల నిలిపి సర్వమయుఁడైనచో చిరాయు వగును

ఆ. కల్పమనఁగ నగును కారణబీజంబు
కల్పమనఁగ శివుని కల్పితంబు
అల్పుఁడేమి యెఱుఁగు నానందభోగము వి....

కల్పమే శివునిరూపము దీని నల్పుఁ డెఱుఁగఁ జాలఁడు.

ఆ. కలిగియు దినలేక కష్టించురోగికి
నాఁడువారిమీఁద నాస గలదె
అన్నమదముతోడ నడగుమదంబులు, వి....774

ఉండియును తినలేనివానికి స్త్రీలపై నాస లేనట్టులనే అన్నమదముతో నన్నిమదములు నశించును

ఆ. కలిగినట్టి యుండు కలుగక యుండును
మఱియు లేకపోవు తిఱుగఁ గలుగు
గలిమి నెచటఁ జూడ గారడి యనవచ్చు, వి....

మాయావిలాసము గారడి వంటిది

ఆ. కలిమిగలయతనికి గన్యక నిచ్చుచు
మఱియుచుంద్రు గాదె మూఢజనులు
పూజఫలమె కాని పూనికల్నిల్చునా? వి....776

కలిమి గలవానికి కన్నె నిచ్చి యుబ్బిపోరుదరు. కాని ఎంతపూజ చేసిన నంతఫలమే యగును

ఆ. కలుగుచింతలన్ని కడకతోఁ దాఁటగ
వెలుగుచంద్రకాంతి వేడుకలర
నివ్వటిల్లఁ గోరు నిర్గుణయోగులు, వి.... 777

సంకల్పములకును త్యజించి సంతతమగు భావనతో నీశు కలియుటయే యుత్తమ మగుయోగము

ఆ. కలుగుసుఖము లెల్ల గల్లగా రోయుచు
మెలగుచుండవలయు మిహిరుపగిది
తిరుగు నేర్పు చూడ ధీరుడే యగునయా, వి....

సుఖాదుల నశ్వరములుగా తలఁచియుండువాఁడు ధీరుఁ డనఁదగును

ఆ కలుపు దీసి నరులు కాపాడి పయిరులఁ
బెంచు ప్రేమవలెను బెనిచి మదిని
త్రుంచి దృశ్యములను తెంపుగా నుండుము, వి.

కలుపు దీసి పైరుఁ బెంచినట్టులనే మదిని బెంచి దృశ్యములను దీయవలయును

ఆ. కలుష మెల్లఁ దెలియ తలవంపులకు మూల
మరయ దత్వ మెల్ల నాత్మ బుట్టుఁ
దెలిసినందునకును ధీరుఁడు గావలె, వి.... 780

పాపపుకోర్కులను వదలి ధీరుఁడై మెలఁగవలయును.

ఆ. కలుష మొక్కయింత కాన్పింప దెందును
జూడ నెవరికైన సొంపు మీఱఁ
దామసం బడంగఁ దా వెల్గు జ్ఞానంబు, వి....

పాపము లేక సర్వదా జ్ఞానము తమస్సును పోగొట్టి వెలుఁగును

ఆ. కస్తురివలపేల గజరాజమున కెన్న
తనదు మదపుధార తావి గాక
యోగి కేల రంభయోగహర్షం బుండ, వి....

ఏనుగకు కస్తురి యక్కఱలేనట్లులనే నిశ్చలుఁ డగు యోగికి రంభాదులు నిష్ప్రయోజనములు

ఆ. కాచకాచఁబుట్టు గనకంబునకు మేల్మి
కదియఁ గదియ బ్రీతి కలికి కగును
ముదియముదియమీఱు మోహంబునరులకు, వి.

సర్వదా అనుభవించుచుండినచో కాంతాకనకములపై మోహము కలుగును కావున త్యజింపవలయును

ఆ. కానరానిబయలు గనుటయే మోక్షంబు
మేను మఱచి నిద్ర మెలఁగినట్లు
తానుతాను గాను దలపు మఱపు దాఁటు, వి

చిత్స్వరూపమును గనుటే మోక్షము

ఆ. కానవచ్చువాని కనుపించువానితో
కావు చేయ పలుక కరుణతోడ
కానరానివాని కరుణేమికందురో, వి.... 785

సులభము.

ఆ. కామి గాని ఘనుఁడు ఘనుఁడు గాఁడాయెనే
కామిగాఁడె కృష్ణసామిముందు
కామి గాని ఘనుఁడు గణపతిగాఁడొకో, వి....

కామిరైయె కోర్కెల నన్నిటి ననుభవింపక మోక్షము నొందజాలఁడు.

ఆ. కాయము దగ గూడి కడగి యోగిగ నున్న
కాయ మిలను బడిన ఘనుఁడు గాఁడు
కాయమునను ముక్తి కడతేఱవలె నయా, వి.

శరీరమును త్యజించినంతనే యుత్తముఁడు కావున శరీరముతోనే యోగమును అర్జింపవలయును

ఆ. కాలుఁ చేయి లేదు కంచుకంబు గలదు
కొమ్ము లేక యురికి చిమ్ము వేగ
గరిడి లేక చంపు కడుచోద్యమగునయా, వి....

కరచరణాద్యవయవశూన్యమై యాత్మరూపము వెల్గుచుండును

ఆ. కోటకోట తిరుగు కొమ్ము లేనుఁగు గాదు
త్రాటిపట్టసందు తగిలియుండు
పోటుబంటునైన బొర్లింపక విడఁడు, వి.... 789

సులభము.

ఆ. గగనచిత్తదృష్టి గద్దియపైఁ జేర్చి
యనువరైనయాత డచల మంటి
యుజ్వలాళ మందు నూహించు దత్త్వము, వి...

చిత్తమును చిత్తునందు జేర్చి తత్త్వమును గనవలయును.

ఆ. గట్టుమీఁద నున్న గాన్పించు సర్వము
తెలిసి తేటపడినఁ దెలియునెల్ల
గట్టిగానుమాట గనకముపుట్టురా, వి.... 791
సులభము

ఆ. గట్టిరాళ్ల దెచ్చి కాళ్లచేతుల ద్రొక్కి
కాచియులులచేతఁ గాసిఁ జేయు
మొఱకురాళ్లకెఱగు మెప్పెల నేమందు, వి.
రాళ్లకు రూపాదుల నిర్మించి మ్రొక్కినఫలము లేదు.

ఆ. గర్వ యింద్రియముల గట్టివేయఁగలేక
చావువచ్చునపుడె సన్న్యసించు
నాత్మజయము లేది కంటునా మోక్షము, వి....
గర్వము సర్వాపదలకుమూలము మోక్షకామి గర్వ
మును పరిత్యజింపవలయును

ఆ. గాలి గాలి గలిసె గగనంబు గగనంబు
మన్ను మన్ను గలిసె మంటమంట
నీరు నీట గలిసె నిర్మలంబై యుండె, వి.... 794
పంచభూతములు ఆసన్నకాలమునందుతమతమరాసిలో
నైక్యమొంద నొక ఆత్మయే మిగులును

ఆ. గాలి ఫణికిఁ జేసె కసవు పసులకుఁ జేసె
మంటి నెఱకుఁ జేసె మఱవ కిలను
పుడమిని జనులకు చువ్వెట్లు చేసెరా, వి....795

జనులకు ఆహారవిహారాదులు ప్రకృతిసిద్ధములు.

ఆ. గాలియందె పుట్టి గాలియందె పెరిఁగి
గాలి దెలియ లేరు గాదె నరులు
గాలియందె యాత్మ కల దదే తత్వంబు, వి....

సర్వమున వాయుమయమై యున్నది కావున బ్రహ్మము వాయుమయమై యున్నది

ఆ గుణవిహీనజనుని గుణమెంచఁగా నేల
బుద్ధి లేని వాని పూజ యేల?
మనసు లేనివాని మంత్రంబు లేమయా, వి....797

చిత్తశుద్ధి లేనివాని జపాదులు వ్యర్థములు

ఆ. గురువుసేవఁ జేసి గురితోడ భుజియింప
వలెనటంచు నరులు వాంఛ దీఱ
బలుకుచుండ్రుగాని భావంబు గానరు, వి....798

గురువు గురు వందురే కాని యందలి గూఢార్థము నెఱుంగఁజాలరు

ఆ. గుహాలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిదారి యదియె ముందుగా జూపురా, వి.

గుహాలలో గురువు లుందురని మూర్ఖులు తలంతురుగాని అచ్చట క్రూరమృగము తారసిల్లెనా పెద్దగురువగును

తే. గెంటి యొఱుకను జిత్తనుమంటఁ గలిపి
కంటి కింపగు దీక్తి మింటఁ జేర్చి

జంట బాసిన ఘనుఁడె పో జాణుఁ డరయ
బంటుతన మది పరమందుఁ బనికి వేమ. 800

మనస్సును చిత్తునందు లయింపఁజేసి గురూపదిష్టుఁడై ద్వైతబుద్ధి లేనివాఁ డుత్తముఁ డగుయోగి యగును

ఆ. గొఱ్ఱెలు పదివేలు కూడియుండినచోట
తల్లి నెఱిఁగి వచ్చు దానికొదమ
పరమయోగి నెఱిఁగి భక్తుండు వచ్చురా, వి....

పదివేలగొఱ్ఱెలలో తనతల్లి నెఱిఁగి పిల్లవచ్చునట్టులనే భక్తుఁడును పరమయోగిని గుర్తించి వచ్చును

ఆ. ఘటపుజలములందు గగనము గాన్పించు
ఘటము జలము లేమి గగన మేది
ఘటములోన జ్యోతి క్రమమున జూడరా, వి....

కుండనీటిలో నాకసము కొన్పించి ఉత్తకుండలో లేని రీతిని గమనించి యాత్మ నరయుము

ఆ. చంద్రసూర్యగతులఁ జర్చించి వేగమే
రంధ్రమునను జొచ్చి రంగుమీఱఁ
జంద్రశాలఁ జేరి చైతన్య మందరా, వి.... 803

చంద్రసూర్యనాడుల గుర్తించి భ్రూమధ్యమున దృష్టి నిలిపి ఈశుని భజింపుము.

ఆ. చపలచిత్తవృత్తి జయమొందఁ గమకించి
నిపుణుఁడయ్యు యోగనియతి మీఱి
తపముఁ జేయువాఁడు తత్త్వాధికుండురా, వి....

చపలమగు చిత్తవృత్తిని జయించి యోగరీతిని తపము చేయువాఁడు త్తముఁడు

ఆ. చర్మ మెపుడు జీవసౌఖ్యంబు గోరును
జీవికర్మములను జేరుఁగాక
చర్మకర్మము లిట్లు జగతిని నరులకు, వి.... 805

దేహము సౌఖ్యమును గోరును సౌఖ్యము కర్మమున కధీనము కావున నివి రెండు నన్యోన్యాశ్రితములు

ఆ. చిక్కి దక్కఁబోదు చిగిరించు మదిలోన
నిక్కఁ బట్టి గురుతు నెఱయఁ జూచి
సొక్కియున్న ఘనులు నూర్యాత్ము లగుదురు,వి.

ఆత్మతత్త్వము సాక్షాత్కరించి వెంటనే మాయ మగును గాన నిశ్చలబుద్ధితో నుపాసించెదరేని తన్మయు లగుదురు

ఆ. చిత్తమందు శివుని జింతించి చూచిన
హాత్తుకొనును బదవి హాని లేక
పొత్తు మఱవగాన పొందున సుఖములు, వి....

చిత్తమునందే శివుని నిల్పి ధ్యానించిన యనశ్వరములగు సుఖముల నందఁగలుగును

ఆ. చిత్తవాజి నెక్కి శిక్షింప నేరక
తత్తఱపడినంతఁ దఱగునొక్క
వారణాసి తనకు వైయాసియగు నొక్కో, వి....

మనస్సనుగుఱ్ఱమును పట్టలేక కాసి కేఁగదకే కాని కాసీ యేమి వైయాసి యగునా? కాదు.

ఆ. చింత పాఱఁదోలి చెవి యొగ్గి వినఁగన
కొన్నిహితవు లమరి కొఱఁత దీఱు
గాంతఁ జేరి మఱిగి గమనించిచూడరా, వి....

కోర్కులను త్యజించి గురూపదేశమును వినినయట్లు నడిచినచో మోక్షము నొందఁ గలుగును

ఆ చీకటింటఁ బుట్టి చీకటఁ బెఱిగిన
చీకటి మఱుఁగున నె చిక్కు నేల
చీఁకటి దెలిసిన సృష్టి కాన్పించవరా, వి.... 810

చీఁకటిఁటింట బుట్టి చీఁకటిఁ దెలియలేక దానిని కనుఁగొనిన నీఁక సృష్టిలో నేమియును మర్మము లేదు

ఆ. చెట్టునందుఁబుట్టి చెలరేగు కాయలు
దనరు కాంతితోడ దగిలిపండు
పండ్లు వానిదింద్రు పర మిఁక తెలియము, వి....

చెట్టునఁ గాయలు గాచి ఫలించి యనుభవయోగ్యము లైనట్లులుగనె ఉపాసనక్రమముగా ఫలవంత మగును

ఆ. చెవులలోను బుట్టు నదియె యాకాశంబు
కన్నుల గనునదియె గదర జ్వాలఁ
ముక్కులోనిగాలి ముక్తికి త్రోవరా, వి.... 812

శ్రోత్రవివరమే యాకాశము కంటివెలుగె జ్వాల. ముక్కులోనిదే గాలి. ఈమూఁడు నీశ్వరుఁ జేరుటకు త్రోవ లగును.

ఆ. చెవుల విన్నయట్టి రవమును వివరించి
మన సదెఱిఁగినపుడు మఱలుకొనును

చెవులు శబ్దమునను జెదరోయ ముక్తిరా, వి....

ఉపదేశమున విన్నదానిని వివరించిన మనస్సు విషయ ములనుండి నివృత్తమై ముక్తికి హేతు వగును

ఆ చదివి చదివి చదివి జావంగ నేటికి
చావు లేని చదువు చదువవలయు
చదువు లేక కోటిజనులు సచ్చిరి గదా, వి....

ఎక్కువగాఁ జదివి పిచ్చిపట్టి పోవుటకంటె యనశ్వర మగుదాని నుపాసించుట మంచిది

ఆ చనఁగ చనఁగ దాఁకు జనులకు కాశిక
వినఁగ వినఁగ ప్రణవ విభవరవళి
కనఁగ కనఁగఁ బుట్టు కారణ మదియెరా, వి....

పోఁగాపోఁగా కాశిక వచ్చినట్టులే సంతతాభ్యాసమున ప్రణవము సాక్షాత్కరించును

ఆ చలముపట్టి మదిని జనియించుగుణముల
తతిని ద్రుంచి వేగఁ దమక ముడిగి
సతముగాను బుద్ధి సవరింప నదె ముక్తి, వి....

పట్టుఁ బట్టి కోర్కెలను త్యజించి అజ్ఞానమును పాఱఁ ద్రోలుటయే ముక్తి నాఁ బడును

ఆ. చావు దెలియువాఁడు సన్యసించున దెట్లు
కడుపలందు ఘనత గదురు నెట్లు
పాప మొకటె మీఁద ఫలమేమి లేదురా, వి....

చావుఁ దెలియనివాఁడు సన్యసింపనట్టులనే కడుపులో లేనిది మమత గలుగదు.

ఆ. చూపులోనిచూపుఁ జూడంగఁ జూడంగ
తెలివిలోని తెలివి తేజరిలును
నిద్రలోనినిద్ర నిజగుని తెలియరా, వి.... 818

కంటిలోని సూక్ష్మజ్యోతిని పరికించినచో బ్రహ్మ సాక్షాత్కార మగును

ఆ. చూపులోనిచూపు సూక్ష్మమై తెలియంగ
చూపులోని చూపు శుభ్రమగును
చూపులోనిచూపు సురచర గమ్యంబు, వి....

సులభము

ఆ. చొక్కమైనపరము చుఱుకరివై చూడ్కి
ముక్కుతుదనుఁగూర్చి ముదముతోడఁ
దక్కఁ జూచినంత దగ్గఱై యుండురా, వి ...

దృష్టిని నాసాగ్రమునందు నిలిపి తదేకచిత్తుఁడవై యుపాసించిన బ్రహ్మము సాక్షాత్కరించును

ఆ. ఛురికతోడ గోయ జొచ్చెదవే కాని
దానిపిడిని గోయుతరమె నీకు
తెలివి లేనిమేని బలమేమిఁ జేయును, వి.... 821

కత్తితో నితరమును కోయఁగలవే గాని అకత్తిని కోయఁ జాలవు అట్లులే కావున తెలివి లేనట్టి శరీరబలము వ్యర్థము.

ఆ. జననమరణము లిల జంగమములు సుమ్మి
జననిజనకు లిలను జలధిరీతి
వినుతిఁ జేసి గురుని వెన్నంటి చూడరా, వి....

జననమరణములును జననిజనకులును చక్రభ్రమణపు రీతిని గలుగుచుండును గావున సూక్ష్మరూపి యగుగురుఁ గాంచి కృతకృత్యుఁడవు కమ్ము

ఆ. జపముఁ బాహ్యపూజఁ జాలగా చేసియు
కపటము విడ లేక కష్టనరులు
ముక్తి గొంద లేక మునిఁగిరి తమమున, వి....

జపము తపము మున్నగువాని నెన్నిఁ జేసినను పాపాత్ములకు ముక్తి కలుగదు

ఆ. జాగ్రతంగి నేమి జన్మ మనఁగ నేమి
జన్మమునకు నరయ జాగ్రతాయె
జన్మజాగ్రతలను చెలఁగునురా ముక్తి, వి....824

జాగ్రత జన్మము వీనిని బరికించిన ముక్తి దాపుననే యుండును

ఆ. జాతి భేదము లేక జన్మక్రమంబున
నమ్మదిని నభవుని నిలిపె నేని
నఖిలజనులలోన నతఁడు ఘనుండయా, వి....

జాతిభేదముఁ బాటింపక యీశ్వరుని సేవించువాఁడే ధన్యుఁ డగును

ఆ. జాతులందు నెట్టిజాతిముఖ్యం బని
యెఱుక లేక దిరుగ నేమిఫలము
యెఱుక గల్గ మనుజుఁ డేజాతియైనను, వి.... 826
జాతులలో నేది ముఖ్య మని తెలివితక్కువచేత దిరుగుట వ్యర్థము ఏజాతియైనను తుల్యఫలమే యగును

ఆ జారపురుషువిూఁద సద్భక్తి నిలుపుచు
పతికి నిచ్చకముఁగ పఱగుభంగి
పరముకొఱకు యోగి పాటించు భవమును, వి
కార్యసిద్ధికై జారిణి పతిని సేవించునట్టులు పరముకొఱకై యోగులు జన్మమును ఒప్పుకొందురు

ఆ. జీవలింగపూజ జేసినవారికి
శిలలరూపమందు జింత యేల
చెలఁగి మధువు గ్రోల చేఁదు రుచించునా, వి
జీవుఁ డను లింగమున్ను అరసి పూజ చేసినవానికి ఇతర శివలింగములపూజ చేయ నవసరము లేదు

ఆ జీవి జంపు టెల్ల శివభక్తి తప్పుటే
జీవు నరసి కనుఁడు శివుఁడె యగును
జీవుఁడు శివుఁడనుట సిద్ధంబు దెలియురా, వి....
జీవహత్య చేసిన శివుని హత్య జేసినట్లు. కావున జీవుల జంపరాదు

ఆ. జ్యోతియందె పుట్టె సొంపైన నాదము
బిందువమరె నాదమందుఁ దెలియఁ

బిందు వందు బుట్టెఁ బృథివి యాకాశముల్, వి.

జ్యోతియందు నాదము, నందు బిందువును, అందు బృథి
వ్యాది పంచభూతములు నని యెఱుంగుము.

ఆ. టక్కుయోగి యెంత టాటోటు చేసిన
వివర మరసినంత వెగటు గలుగు
పరము నున్న నరకబాధయు సిద్ధంబు, విశ్వ ....

టక్కరియోగి ఎన్నిటక్కులఁ జేసినను పరము కలుగక
పోవుటయే గాక పైని నరకబాధయును కలుగును

ఆ టక్కుమాట లాడి చిక్కులఁ బెట్టిన
నిక్క మెఱుఁగు నతఁడు నిర్వహించు
జక్కనైన జ్ఞానసారంబు తెలియురా, వి....832

టక్కులాడుటకంటె జ్ఞానపునిజరూపము నెఱింగి
కడతేరుట యుత్తమము

ఆ తీవి మిగులఁ గలుగ డెక్కెమ్ము లెత్తించి
యూరు నేల ముక్తి యుత్తదియగు
మంచిత్రోవఁ బోటకు మహిని యత్నింపరా, వి....

ధ్వజపతాకాదులతో ధంభము నూరు నేలుటకంటె
మంచిమార్గమున మెలఁగుట మంచిది

ఆ. లేవలేక యున్న వేసికిరాఁబోఁడు
నిక్కమైన జ్ఞాని నిలుకడగను
ఎంతలాపదలుని కెన్నఁడు నెన్నఁడు, వి.... 834

నిక్కముగా జ్ఞానియైనచో కలిమి లేములను సంపదాపదలను సరకుసేయఁడు.

ఆ దాఁగుపడిన పందు బాగు లేదందురు
అట్టిదాగు తమది యరయ లేరు
తమ్ము నెంచువారు తమదాగు కానరు, వి.... 835
ఇతరుల తప్పులెంచువారు తమతప్పును తెలిసికొనలేరు.

ఆ తంత్రవాదు లెన్నఁ దఱుచుగ నున్నారు
మంత్రవాదు లరయ మహిని వేరు
జంత్రగాని బొమ్మ చందము చూచిన, వి.... 836
జంత్రగాని బొమ్మలవలె తంత్రవాదులు పలువురు గలరు

ఆ. తనకు భాగ్యమున్న దక్కువ లేకుండ
గలుగుభాగ్యమెల్ల గల్లయనుచు
నమ్మకముగజూచు నరులెరా యోగులు, వి,...
భాగ్యములను కల్లయని చూచువాఁడే యుత్తమయోగి.

ఆ. తనుభరించు నతని దనయాయుధమ్ములు
అగ్నినింక బరుని యాలినెన్నఁ
సరసమునకు గొనఁగఁ జావె సిద్ధించును, వి....
తనను పోషించువాని నెదుర్చుట నాశహేతువు.

ఆ. తఱుచుఁ జదువ జదువ దర్కవాదమె కాని
దివ్యమైన తెలివి తేటపడదు
పసిరికాయపురుగు పగిదిని జెడిపోవు, వి.... 839

ఎంతజదివినను శుష్కవాదమే కాని ఫలము లేదు

ఆ. తరుణియంగ మెల్ల పురుషుఁ డెఱుంగును
పురుషు నంగ మెల్ల పొలఁతి యెఱుఁగు
చీరగట్టుకున్న సిగ్గగు నెట్టులు, వి.... 840

స్త్రీపురుషులు పరస్పరము నంగముల నెఱుఁగుదురు. గావున నిఁక సిగ్గువలదు

ఆ తల్లిగన్న తల్లి తనతల్లి పినతల్లి
తండ్రి గన్న తల్లి తాతతల్లి
యెల్ల శూద్రులైరి యేటి బ్రాహ్మణుఁ డిఁక,వి....

తల్లిదండ్రాదు లెల్లరును శూద్రులై యుండ తా నొక్కరుఁడు బ్రాహ్మణుఁడు కాఁజాలఁడు

ఆ. తల్లిదండ్రు లెంద ఱల్లజన్మము లెన్ని
తిరిగి యెఱుఁగనట్టి దిక్కులెన్ని
స్థిరము నస్థిరమును తెలియలే దజ్ఞాని, వి.... 842

అజ్ఞాని తల్లితండ్రి, జననమరణములు మున్నగువాని నిజ స్థితి నెఱుఁగలేఁడు

ఆ. తాను నింద్రియములు దనర జయించినఁ
దత్త్వ మరసి చూడ దాన యగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచు నుండు, వి....

ఇంద్రియముల జయించిన తత్త్వమే తా నగును. ఇట్లుండుట రాజయోగి లక్షణము.

ఆ. తాన తత్వ మయ్యుఁ దన్నెఱుంగఁగ లేక
మాయ దత్వ మనుచు మఱుగుచుండు
ధర్మకర్మములను తా గోయ తత్త్వము, వి....
తానే బ్రహ్మ మయ్యును అజ్ఞాని తెలియలేక తిఱిగి వేసారుచుండును

క. తిన్నగ త్రిపుటిని గురి గని
యున్నను నాదంబు వినఁగ నూహింపుము లో
మిన్ను కని నిన్ను మఱతువు
వెన్నెలలో బయలు సేరి వెలయుము వేమా!
త్రిపుటిని గుఱిచూంచి మించిన తత్త్వము సాక్షాత్కరించును.

ఆ. తిరిగి తిరిగి తిరిగి ద్రిమ్మరిగా నేల
తీర్థయాత్ర లనుచు తెలివిమాలి
తెలివిలోనిగురుని దెరపిగా జూడరా, వి....846
వ్యర్థముగా తీర్థయాత్రలను తిరిగి యలయక బుద్ధిలోని ఈశ్వరు నెఱింగి సేవింపుము

ఆ. తెలుప మాయఁ జేసి దిట్టతనంబున
దెలుపు భస్మముగను తేటపఱచు
విధము కన్న బరుసవేదియు లేదురా, వి.... 847
తెలివికంటెను మించినది మఱొకటి లేదు

ఆ. తొట్టిమానులోని తోఱటజీవుల నెల్ల
మెల్లలేక చంపుమొకము వలెను

నగ్ని లేనిమంట నదియేమి చెప్పుము, వి....848

దేహములోని కామాదులను జ్ఞానాగ్నిచేత కాల్చి వేయుము.

ఆ. తొలుతి త్రిలోనఁ దొలుతఁ బుట్టిన తాను
వెనుకఁ దెలియవలయు వివర మెఱిసి
వెనుక తెలియు లేమి వెఱ్ఱియై చెడిపోవు, వి ...

జన్మమెత్తినపిమ్మట నశ్వరానశ్వరములను విచారింపనిచో చెడిపోవును

క. త్రిపుటికిఁ జూడ్కిని బైనిడి
యుపజిహ్వకు సూటి చేసియు న్మదిలోనే
తప మొనరించెడు భక్తుఁడు
నిపుణుండై వెలుగులోనె నేర్పన వేమా!....

త్రిపుటికి పైఁగా నుపజిహ్వకు సూటిగా మది నిలిపి ధ్యానింప కేవలుఁడగును

ఆ. తనియు పిండమునను దగిలినమనుజుండు
పుట్ట లేడు వాఁడు పుడమిలోన
నట్టిపుట్టుక గన నవనిలో లేదయా, వి.... 851

పిండముఁ గనినవానికి మఱల పుట్టువు లేదు

ఆ. దాతయైనవాఁడు తానె మున్నిచ్చెడు
కానివాఁ డొసఁగునె కానియైన
జలము దప్పి తీర్చ మలమెట్లు తీర్చును, వి....852

దాతయైనచో నిచ్చునట్టులనే జ్ఞానియైననే అజ్ఞాలను కడతేర్చఁగలుగును

ఆ. దార బందిగంబు తనయులు సంకెలల్
బంధువర్గ మెల్ల బ్రహరిగోడ
మోహ మెఱుఁగలేఁడు మొక్కలి కాఁడయా, వి.

దారసుతాదులు సంకెలలు మొదలగువానివలె బంధన హేతువులు

ఆ. దేవభూములందు దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి సేవఁ జేసి
తెలియ తానె యగును దేవాదిదేవుఁడు, వి....

దేవక్షేత్రములను సేవించి యాత్మతత్త్వమును గమనించిన మోక్షము గలుగును.

ఆ. దొడ్డవాఁడు పెద్దతోడేలునైనను
మట్టుఁ జూచి దాని మర్మ మెఱిఁగి
గొడ్డు గొఱ్ఱె నైనఁ గొని చననీయఁడు, వి....

ఘనుఁడగువాఁడు తోడేలంతటిదానినైనను కదుల నీయక కట్టివేయఁగలఁడు

ఆ. దొమ్మరాటవాని దోర్బల మెల్లను
పొట్టకూటికొఱకె పట్టిన దగు
నదియె యోగికమర నానంద మందఁడా, వి.

దొమ్మరివాని యాటరీతులు యోగికి కలిగినచో చిదానందము ననుభవించును.

ఆ. దోసముల్లువంటి తుర్యమందాత్మను
జూచి యాసల నటు ద్రుక్కఁ జేసి
వాసనఁ దెలిసినవాఁడెపో బ్రహ్మము, వి.... 857

సూక్ష్మరూపమును గుర్తించి మించినవాఁడే బ్రహ్మమగును.

ఆ ద్వారములకు నిలను తలుపులుగడియలు
వలెను కోటికొప్పు గల నియతులు
ధర్మ మెఱిఁగి పలుక ధన్యుఁడే భువిలోన, వి....

వాఙ్నియమముతో ధర్మ మరసి పలుకుచు మెలఁగిన ధన్యుఁ డగును

ఆ. నచ్చు సేయరాదు నమ్మి నైక్యమునకు
మ్రుచ్చురుకనుమ్రింగి ముదము గాను
చొచ్చి బయలుదేరి సొమ్మసిల్లును యోగి, వి....

ఆలసింపక మాయను బోనాడి బయలు చేసి యాత్మరూపము నరయవలయును

ఆ. నయనదృష్టి మీఱ నడవడి గుర్తించి
భయము లేక నొక్క బయలువడక
స్వయము జ్యోతి నంటి సౌభాగ్యమందును, వి.

కనుదృష్టిని నిల్పి భయము సెందక జ్యోతిఁ గాంచిన సౌభాగ్యము నొందును.

క నాటును గురువరమంత్రము
దీటుగ మదియందుఁ జేర్చి ధీరుఁడ వగుచు
న్నాటుము నిను గనుచోటికి
కోటికిఁ బడగెత్త నేమి కుదురుర వేమా!....861

గురూపదేశము ననుష్ఠించిన కృతకృత్యుఁ డగును

ఆ. నాడెమైనలంజె నగవు మేలు నెఱుంగు
విటుని గుస్తరించువిధ మెఱుంగు
బానిసయినదాని ప్రాతిగోరగరాదు, వి... 862

నీచులతోడి పొత్తు పనికిరాగ

ఆ. నయముగాను దృక్కు నాళంబులో నుంచి
భయము మాని పట్టి భ్రమల ద్రొక్కి
స్వయముగాను బుద్ధి సాధించి చూడుము, వి....

దృక్కును నిల్పి భ్రాంతిని పోనాడి బుద్ధిబలమున తేజ
మును సాధింపవలయును.

ఆ. నరుఁడైనను లేక నారాయుడైనను
తత్వబద్ధుఁడైన ధరణి నఱియ
మరణ మున్నదనుచు మదినినమ్మగవలె, వి....864

నరనారాయణులంతటివారైనను మరణము తప్పక గల
దని నమ్మవలయును

క. నాటుము గురువరమంత్రము
దీటుగ మదియందుఁ జేర్చి ధీరుఁడ వగుచున్

దాటుము నిను గనుచోటికి
గోటికి పడగ్త్తనేమి కాదుర వేమా! 865

గురూపదిష్టమును మఱువక మననముఁ జేసి మోక్షము నందుము

క. నాడీచక్రము చూడఁగ
నాఁడులు పదిముఖ్యమ్ము నాడులలోనన్
కూడలి నాసికకుడియెడ
మూఁడును నిళపింగళాఖ్యములఁ దగ వేమా! 866

నాడీచక్రములోని పదినాడులలోను కుడియెడమవి యగు ఇడపింగళలు ముఖ్యములు

ఆ. నాదబిందుకళల నయమొంది యాత్మలో
నంటి చపలచిత్త మణఁర నిల్పి
బ్రహ్మరంధ్రమునను బ్రబలిన యోగియౌ, వి....

ఓంకారరూపమును నిల్పి యోగమున బ్రహ్మరంధ్రము నంటిన ముక్తుఁ డగును

క. నాదము బిందువు బిందువు
నాదముగాఁ జేసి కళను నారును బిందు
న్నాదుగఁ జేసియు నీయొక
నాదంబునఁ జూచుయోగి నాథుఁడు వేమా!

నాదబిందువులను పరస్పరైక్యత నొందించువాఁడు ఉత్తమయోగి నాఁబడును.

ఆ. నాద మలరఁ జేసి నాదముఁ బొంగించి
భేద మింతలేక పెనగినపుడు
పాఱుకాల్వవలెను బ్రబలు నీనాదము, వి....869

ప్రణవమును నిల్పి జీవాత్మల కభేదము ననుసంధానము చేసినచో ముక్తుఁ డగును

ఆ. నాసికందు దృష్టి నయనించు యోగికి
వాసి వన్నె లేల వసుధలోన?
గాశినాథుఁ డతఁడ గణుతింప నిజమయా, వి....

నాసికాగ్రమున దృష్టి నిలిపి ధ్యానించువాఁడు సాక్షాత్తు నీశుఁ డగును

ఆ. నాసికాగ్రమందు నయముగా గురినిల్పి
వాసిగాను జూడ వశ్య మగును
కాశికంచును కడగండ్లను బడనేల?, వి.... 871

స్పష్టము.

ఆ. నాసికాగ్రమందు నయమునఁ జేర్పక
మూసి మూయక కనుమూలలందు
చూచి చూడ నతఁడె శుకయోగి యగును రా, వి.

స్పష్టము

ఆ. నివురు గప్పినట్లు నిశ్చలభక్తితో
దగిలియుండ ముక్తిఁ దానె వచ్చు
జగతి నొప్పఁ జెప్ప జాణఁడు లేఁడయా, వి....

నివురు గప్పినట్లు నిశ్చలచిత్తముతో యోగముచేసిన ముక్తి తానే వచ్చును

క. నిజగురులక్ష్యం బుంచక
యజపాదిక్రియల మీఱి యలమటపడకే
నిజవిమలాంతస్స్యందిను
సుజనుని నెన్నంగ దరమె సూటిగ వేమా! 874

అజపాదికార్యముల నీశుని బరికించువానిని బొగడ తరముకాదు

తే. నిటల దుర్గములో నున్న నిజ మెఱింగి
పటుతరంబుగ మది నిల్పి ప్రబలుయోగి
అంటిమట్టును నిర్గుణం బట్టె మదిని, వి.... 875

కనుబొమలనడుమ నున్న తేజమును మనస్సులో నిల్పి ధ్యానించిన బ్రహ్మము సాక్షాత్కరించును

ఆ. నిటలదుర్గ మెక్కి నిక్కి చూడంగనె
కుటిలరూపకళలఁ గూర్చి నెఱుక
పటుతరంబుగాను పట్టి సాధింపుఁడు, వి.... 876

కనుబొమలనడుమ దృష్టి నిల్పి ఈశుని గనిపెట్టుఁడు.

ఆ. నిద్రలోని నిద్ర నిజముగా దెలిసిన
భద్ర మగును మిగులు బ్రహ్మవిద్య
నిద్ర తెలియువాఁడు నిర్మలయోగిరా, వి....877

స్పష్టము.

ఆ. నిద్రలోన మనసు నిలుపుచు లోకముల్
భద్రముగను జూపి భ్రమయఁజేసి
పొత్తు విడువకుండు పొలతొక ర్తుక సదా, వి....
నిద్దురలో మనస్సును నిలిపి చిత్తును బరికింపవలయును

ఆ నెనరు గలుగు గురుఁడు నిటలదుర్గముఁ జూపు
కనులఁ జూడ్కి మఱుగు గనయఁజూపుఁ
జెనకి యాత్మ గూవు చేజేతఁ జూపురా, వి....879
గురు ానుగ్రహముకలిగినా నిటలగర్గమును చూపును

ఆ పంచ తత్వఫలముఁ భావించి కడమించి
కొంచె మైన మదిని గోలుపోక
యెంచి మించువాఁడ యేర్పడ్డయోగిరా, వి....
పంచభూతములను వివేచన జేసి తెలివిని గోలుపోక ఈశుని సేవింపవలయును

ఆ. పచ్చజూచువారు పచ్చ మెచ్చెడువారు
పచ్చమీఁద వాంఛపడినవారు
పచ్చ విడుచువాని ప్రభునిగాఁ జూతురు, వి....
స్పష్టము

ఆ పంచభూతములను నెంచుచు మదిలోన
మించి యుండవలెను మిత్తిగొంగ
నంచు దెలియువాఁడె యఖిలజ్ఞుఁ డగుయోగి, వి.
పంచభూతములను వివేచన సేయుచు మనస్సు నీశునిపై బంధించువాఁడు సర్వజ్ఞుఁడగును.

ఆ. పట్టువిడక లోని గుట్టును గమనించి
ముట్టు టదియె యెఱుకమూల మగును
బట్టబయలునందు పాటింప నెఱుకేది, వి....883
పట్టువీడక పరరూపమును గాంచవలయును

ఆ. పండువలనఁ బుట్టె నెఱిగి ప్రపంచము
పండువలనఁ బుట్టె పరము నిహము
పండు మేలెఱింగె బ్రహ్మోదుఁ డిలలోన, వి....884
స్పష్టము

ఆ పతగ మితరజంతువితతి కంతకు మేటి
యగును రెక్కలుండి యెగిరినంత
వట్టియోగి యుట్టి వైఖరి వాఁడయా, వి.... 885
రెక్కలు గల్గినమాత్రాన పక్షి శ్రేష్ఠము కానియట్టు
లనే వట్టియోగియును వ్యర్థుఁ డగును

ఆ. పతనమందునట్టి పక్వఫలంబును
పట్టి తినగలాఁడు పచ్చికాయ
కాసపడనిరీతి నైహికముండును, వి.... 886
పండిన పండుగలవాఁడు పచ్చికాయను కోరనట్టుల
యోగి సౌఖ్యముల కాసింపఁడు

ఆ. పతిని విడువరాదు పదివేలకైనను
పెట్టి చెప్పరాదు పెద్దకైన
పతిని దిట్టరాదు సతి యాపనతి యైన, వి.... 887
స్పష్టము.

ఆ. పరమ పదవి గోరు భక్తుండు నిత్యము
రాజు గోరుచుండు రణజయంబు
మూర్ఖుఁ డెపుడు గోరు ముదితలతో పొందు, వి.

రాజులు రణజయమును గోరునట్టులనే సహజముగా భక్తుఁడు పరమపదవిని కోరును

ఆ. పవలు రేయుఁ జూడ భావంబులోపల
తాను నేనట నెడితలఁపు మఱచి
యున్నయట్టియతఁడె యుత్తమయోగిరా, వి....

రాత్రిందినముల నిజమును బరికించినవాఁడే యుత్తమ యోగి యగును

ఆ. పాదపాయువులను బఱఁగ దేహము మోయు
దేహిజీవములను తెలియు మోయు
ధరణి వీని రెంటి దా నేల మోయునో, వి....

దేహి సహజముగ కరచరణాదుల ధరించి పుట్టుచుండును

ఆ. పిత్రుపతికిని జిక్కి పెనుత్రోవ గానక
వెతలఁ జిక్కువాఁడు వెఱ్ఱివాఁడు
సతులవలలఁ జిక్కి సంతాపపడ నేల?, వి....391

యమునిచేతిలో చిక్కి వెతలుపడరాదు గనుక స్త్రీలపై నాసను పరిత్యజింపవలయును

ఆ. పిల్లి యెలుకఁ బట్టు ప్రియమున నుండఁగ
నదియె కోడిఁబట్ట ననుగమించు

మమత విడువకున్న మానునా మోహము?, వి.

మోహమును మమతను విడువనిది ముక్తుఁడు గా నేరడు.

ఆ పుట్టినజను లెల్ల భూమిని మనియున్న
పట్టునే జగములు పట్ట వెపుడు
యమునిలెక్కరీతి నరిగి తగ్గుచు నుండు, వి ...

జంతువులకు జననమరణములు సహజములు కావున చచ్చినవారికై ఏకవక మోహము వీడి యుండవలయును.

ఆ. పుట్టినది మొదలుగ పురుషుఁ డేకాలంబు
బాల్యమెట్టిఁగ శుద్ధపశువు గాక
ముదిసి యోగికరణే ముద మొప్పఁగానలె, వి....

జన్మము మొదలుకొని మనుజుఁడు పాపము చేయని దివసమే లేదు కావున గురుననుగ్రహమున జ్ఞానియై యోగియై కడ తేరవలయును

ఆ పుట్టు దుఃఖమునను బోరలు దుఃఖమునను
గిట్టు దుఃఖమునను గ్రిందుపడును
మనుజదుఃఖమునలె మఱి లేదు దుఃఖము, వి....

వృద్ధిక్షయభయాదులవలన మనుజుఁడు దుఃఖించుచుండును ఆహా! దుఃఖ మెంతటిది? దానితో సమమగు నితర వస్తువు లేదు

ఆ. పుట్టుబ్రహ్మ లె దు పుణమిలి నడుపఁగా
చిత్త మెల్లయెడల శ్రేష్ఠమగును
ఏల విగ్రహములు ఎత్తుకోదినుటకా?, వి....896

పంచభూతమయమై ప్రపంచమంతయును ఈశ్వరుని రూపమున భాసిలునపుడు విగ్రహములఁ బూజించుట వ్యర్థమే యగును.

ఆ. పుడమి యుప్పరంబు బురికొని జగముల
రక్షసేయఁ గల్గు రాజు లెవఁగు ?
మహిపతి యనుపేరు మనుజున కేడదో?, వి.... 897

రాజులు తాము జగతీరక్షకుల మని విఱ్ఱవీగెదరు కాని లయమునఁ దామును నశించెదరు అట్టిచో వారిని మహీపతి యనుట యెట్లు?

ఆ పువ్వుచన్ను గలుగ భూమెల్ల వెలసేయు
గోదమచన్నులు గన గోటిసేయుఁ
దడక చన్నులు గన దయ్యాలు నొల్లవు, వి....

స్త్రీలచన్నులను యౌవనమునఁ జూచి మురిసెదరే కాని వయోతిరేకమున వాని నెవ్వరు నపేక్షింపరు

ఆ. పెట్టినంత ఫలము పెక్కుండ్రకుపకారిఁ
జేయకున్నఁ దాను జెరుపకున్న
బెండ్లి సేయునట్టి పెద్దఫలంబురా, వి.... 899

ఇతరుల కపకారము చేయకున్నచో తా నుపకారము చేసినంతఫల మని పెద్ద లందురు

ఆ. ప్రాణులందు శివుని భావింపనేఱక
యోగ మందు రేల నోగులనుచు ?
యోగిజనులఁ గాంచి యుబ్బుచు నిందింత్రు, వి.

ప్రాణులలో నున్న శివుని ధ్యానింపఁగాఁజాలక జోగులై యోగ మందురే కాని నిష్ఫల మని యెఱుంగరు.

ఆ. పృథివిఁ బుట్టె మొలక పృథివిలోఁ గలసెను
మఱల నదియె పుట్టు మగఁడె సుతుఁడు
ధరణిజనుల కెల్ల దల్లియౌ పెండ్లము, వి.... 901

భూమియంశమున (మృత్పిండరూపమున) బుట్టి యీ శరీరము అలనద్దానిలో కలియుచున్నది కావున నంద ఱును పార్థివరూపులే గనుక దల్లియె పెండ్ల మగును

ఆ బహుగు నెఱుఁగ లేని ప్రాభవం బదియేల
యోగి నెఱుఁగ లేని యోగ మేల
వ్యాధి దెలియ లేని వైద్యుఁడు నేలయా?, వి....

మంచిచెడ్డలఁ దెలియఁజాలని ప్రభుత్వమును, యోగి నెఱుగ లేని యోగమును, వ్యాధిదెలియని వైద్యమును వ్యర్థములు.

ఆ. బాల్యమందు శివుని బరికింపఁగా లేరు
యౌవనంబునందు నరయ లేరు
ముదిమియందు గూడ మోసమే గందురు, వి.

మనుజు లలనులై బాల్యయౌవనవార్ధకములందు సయి తము ఈశుని భజింపక మోసపోయెదరు

ఆ. బిగియు దృష్టి నెపుడు బింబమం దుంచిన
మననమందు నెఱుక మగ్న మగును
లగ్నచిత్తమమర రక్షించుచుందురా, వి.... 904

దృష్టిని చిక్కబట్టి మననము చేసినచో జ్ఞానము సాక్షాత్కరించును ఇట్లు జ్ఞానలగ్నమైనచో చిత్తము రక్షించుచుండును

ఆ బిందునాదు జేసి ప్రియ మొప్పఁగా నల్ల
నాదుబిందు జేసి నయముగాను
బిందునాదుసందు భేదించి చూడుము, వి....905

ఓంకారము (ప్రణవమును) నుచ్చరించుచు తద్గతచేతస్కుఁడవై నాదబిందువులమధ్యను పరీక్షింపుము

ఆ బుద్ధియుతున కేల బొసఁగనిసఖ్యము
కార్యవాది కేల కడుజలంబు
కుత్సితునకు నేల గౌరవసంపద?, వి.... 906

బుద్ధిమంతునకు కలియనిమైత్రియును, కార్యపరతంత్రునకు కపటమును, కుత్సితునకు గౌరవసంపదయు నుండవు.

ఆ. బూటకంబుచేత పుడమిలో నొకకొన్ని
నాటకంబు లాడి నయముఁ జూచి
దీటులేక తాము తిరుగుచున్నుందురు, వి.... 907

మూర్ఖులు కపటనాటకంబుల నాడుచు లోకులను వంచించుచు తమ కేదురు లే దని తిరుగుచుందురు గాన వారిఁ గలయకుము

ఆ. బూదిపూఁత లెన్న బుజముల పొంకాలు
వ్రాలు లింగములును వరుసమతము
లిక్కడఁ దగుగాక నక్కడఁ దగు నెట్లు, వి....

భస్మలేపనములు బుజపుముద్రలు లింగములు మున్నగు
నవి ఇహలోకమున ఎంచింప నుపయోగించునే కాని పరమునఁ
బనికిరావు

ఆ. చేసికంటివాని చెంపార మదిఁ జేర్చి
పూజ చేయవలెను బుద్ధి నిలిపి
ఆత్మపూజకంటె నధికంబు లేదయా, వి....909

త్రినేత్రుని పర్వదా మనస్సునందు నిలిపి పూజచేయ
వలయును ఇట్టి యాత్మపూజకంటె లోకమునం దిఁక నేదియు
నధికము లేదు

ఆ. బొంది యెవరిసొమ్ము పోషింప బలుమాఱు
ప్రాణ మెవరిసొమ్ము భక్తి సేయ
ధన మదెవరిసొమ్ము ధర్మమే తనసొమ్ము, వి....

శరీరమును రక్షించుటకుగాని ప్రాణముల నర్పించు
టకుగాని ధనమును దానము సేయుటకుఁగాని తనవలన
గాదు కాని తాను చేసినధర్మమును తనసొమ్ముగా నుపయోగించి
కొనఁగలుగును

ఆ. బొమ్మలాటవాఁడు బొమ్మల నాడించు
భువిని జనులు సూచుబోల్కిఁ దనరి
తాను మఱగియుండి దైవము నాడించు, వి....

బొమ్మలాటవాఁడు తాను గిన్పడక బొమ్మల నాడించు
విధముననే దైవము తాను లీనమై యుండి జగముల నాడిం
చును.

ఆ. బొమలనడుమ గుర్తుఁ బొందింపఁ జాలక
విమలదృష్టి మదిని వెలుగఁబోదు
తమము దీరినంత తత్త్వంబు తా నగు, వి.... 912

కనుబొమల నడుమ దృష్టి నిలుపనిది యోగదృష్టి కుదురదు అట్లైనగాని తమ మడఁగదు తమ మడఁగునేని తత్త్వంబు తాన యగును

ఆ. బొంది నమ్మి మిగుల బోషించి పలుమారు
ప్రాణి విడుచు టెల్లఁ బాతకంబె
తనదులోన భక్తిఁ దనరుటే మోక్షము, వి....

శరీరమును నమ్మి పోషించి నశించుటకంటె హృద్గతుఁడగు నీశునియందు భక్తి కలుగుటే మోక్షము

ఆ. బోడితలలు జడల బూడిదె పూతల
భాషణాసనముల వేషములను
యోగు లైరె? లోన బాగుగా నుండిన?,వి....

అంతఃకరణము నిర్మలమగునంతవఱకును తలబోడులు మున్నగువానిఁ జేసినను యోగులు కాఁజాలరు

ఆ. బ్రదుకు నిత్య మనుచు పదరుచు వగనొంది
విఱ్ఱవీగువాఁడు వెఱ్ఱివాఁడు
ప్రాణులెల్ల యమునిబారికి గొఱ్ఱెలు, వి.... 915

బ్రదుకు స్థిర మనుకొని విచ్చలవిడిగ మెలఁగువాఁడు వెఱ్ఱివాఁడు. ప్రపంచములోని ప్రాణు లెల్లను యముని పాలిటికి గొఱ్ఱెలవంటివే

ఆ. బ్రహ్మమనఁగ నెటనొ బరదేశమున లేదు
బ్రహ్మ మనఁగఁ దానె బట్టబయలు
తన్ను దా నెఱిఁగిన తానె పో బ్రహ్మంబు, వి....

బ్రహ్మము బ్రహ్మమనఁగా నెచ్చటనో లేదు తనను తా నెఱుఁగుటయే బ్రహ్మము నాఁబడును

ఆ. బ్రహ్మ మేఁడ నన్రుచు పలుమారు నాడేరు
వెఱ్ఱిమూర్ఖజనులు విధుని జూడ
బ్రహ్మ మన్నిటఁ దగుఁ బరిపూర్ణమై యుండ, వి.

బ్రహ్మ మేది? లేదేయని వెఱ్ఱులై హేళన చేయుదురే గాని బ్రహ్మముసమస్తమునందును నిండియుండుట నెఱుంగరు

ఆ బ్రహ్మ ఘటము మేను ప్రాణంబు దగ గాలి
మిత్రచంద్రశిఖులు నేత్రచయము
తనమనంబు తెలియఁ దాన పో బ్రహ్మము, వి

బ్రహ్మము, శరీరము, ప్రాణము మున్నగునవి నెయ్యది యని తనలో దాను విచారణ చేయుటచేత తానే బ్రహ్మమగును

ఆ. యోగి ననుచు గొంత యోగము గూర్చుక
జగము నెల్ల బట్టి జంపి తినిన
యోగిగాఁడు కాని యోగగు నిక్కము, వి....

యోగిని యోగి నని పేరు పెట్టుకొని లోకములను పీకికొని తినెడివాఁడు యోగి కాఁడు; గాని యోగు (పనికిమాలిన వాఁడు) మాత్రము అగును

---

# బ్రహ్మస్వరూపపద్ధతి.

---

క. అఖిలాకారుఁ డనంతుఁడు
సకలాత్మలయందు సర్వసాక్షియు దానై
నిఖిలముల నిర్వికారుఁడు
నిరతము బ్రహ్మమ్మనంగ నెఱుఁగుము వేమా!

సమస్తస్వరూపుఁడై సర్వమునకును సాక్షియునై నిర్వికారుఁడై మెలఁగువానిని బ్రహ్మముగా నెఱుఁగుము

ఆ. అగ్రమందుఁ జేరి యగ్రేశుఁడై యుండు
నిగ్రహించి యొఱుక నియతి మీఱ
మోహగుణము లన్ని ముక్కోని దాఁటరా, వి.

బ్రహ్మము అగ్రభాగమున నుండును గావున నింద్రియముల నిగ్రహించి మోహగుణములను పోఁద్రోలి తన్నయుఁడ వగుము

ఆ. అచలతత్త్వ మనఁగ ననుభవగమ్యంబు
చూపి చెప్పరాదు నూత్న మదియె
మదికి దోఁచుగాని మర్మ మెన్నఁగ రాదు, వి....

అచలతత్త్వము (అనఁగా బ్రహ్మము) అనుభవవేద్యమే కాని చూపుటకుఁగాని చెప్పుటకుఁ గాని వీలు కలుగునది కాదు.

క. అచలతపోన్వితయుక్తిని-
ప్రచురించెడియాత్మకాంతి ప్రతిబింబములో
ప్రతిలేని మోక్ష మిదె యగు
సుచరిత్రము బట్టబయలు చూడర వేమా!

నిశ్చలసమాధియుతుఁడవై ప్రతిబింబితమగు నాత్మను సాక్షాత్కరించుటయే మోక్షము

ఆ. అచలయోగతపము నందంగ గమకించి
ప్రచురమైనకాంతి బడయుచుండి
రుచిరముగను దాఁట రూపింపఁ బరమాత్మ, వి.

నిశ్చలసమాధి నొందఁ బ్రయత్నించి దివ్యతేజమును దర్శించి మాయాతీతుఁడవై నిరూపించిన పరమాత్మ యగును.

క. అతిసూక్ష్మదృష్టిలోనను
మది కింపుగ శివుని గూర్చి మతియొకటైనన్
ప్రతిలేనిమోక్ష మదె యగు
సతతపు నిర్వాణపదవి సాఖ్యము వేమా!

మిక్కిలి సూక్ష్మదృష్టితో శివుని నిరంతరము ధ్యానించుటయే నిరుపమానమగు మోక్షపదము అగును

ఆ. అందరానిసంద దడవి వెన్నెలనుందు
నుండఁ జూడ దొడ్డనుండుగాను
పండుపడినఁ జెట్టు పట్టంగ లేరయా, వి.... 926

బ్రహ్మము అనఁగా అలభ్యమగు ఫలమువంటిది.

అయ్యది చిదాకాశము వంటియుండును అట్టి బ్రహ్మము సాక్షా
త్కరించి సంసారవృక్షము ఛేదకమగును

క. అది యిది యని మది దోఁచెడు
సదనము గుర్తించి లోన సాధించినచో
కుదురును బ్రహ్మానందము
గదిసిన మదిఁ జేర నొక్కి కనవలె వేమా! 927

"ఇది బ్రహ్మ మది బ్రహ్మము" అని చంచలతను కలుగ
నీయక గుర్తించి ధ్యానించి బ్రహ్మమును కలియవలయును

ఆ. అందు నిందు ననక నన్నిటియందును
విష్ణు వమరియుండు వెలయ భువిని
వెనుకఁ జక్రి తిరుగు విష్ణుచక్రంబుతో, వి ...928

ఇచ్చట నచ్చట ననక సర్వవస్తువులందును విష్ణువు
వ్యాపించియే యుండును అతఁడే పరతత్త్వ మని యెఱుఁ
గుము

ఆ. అన ననాహతమున నది లెస్సగా చూచి
ఇఁకను దాన వాయు వీహఁ జేసి
కడమవాయు వందు కదలక యుండుము, వి....

అనాహతమున లెస్సగా ధ్యానించి వ్యానముఁ జిక్కఁ
బట్టి ప్రాణమునందుఁ జేర్చిన నిశ్చలమై యుండును

ఆ. అన్నదానమునను నధికసంపద గల్గి
యమరలోకపూజ్యుఁ డగును మీఱు
అన్న మగును బ్రహ్మ మది గనలేరయా, వి....

అన్నదానమువలన సంపద లధికముగా గల్గును సుర లోకనుతుఁ డగును అన్నమే బ్రహ్మము దీనిని జను లెఱుంగక తిరుగుచుందురు

ఆ. అన్నము నమృతము నంటు నంటనుచును
పరిహరింత్రు తెలియఁబడక జనులు
అన్న మమృతము మరియు హరిహరబ్రహ్మలు, వి....

అన్నము అమృతస్వరూపము అట్టిదానిని అంటు అంటని పరిహరించెదరు అట్లు చేయరాదు హరిహరాదులును అమృతరూపులే కదా!

ఆ. అమల మవ్యయుచింతిన మసిపదంబు కోరి
జీవేశ్వరైక్యంబు గూర్చినంత
అవిరతంబగు పరిపూర్ణ మమరు నయ్య, వి....932

విమలమును నాశరహితము నగుతత్త్వమస్యాదిపద ఘటితం బగుజీవేశ్వరైక్యంబును గూర్చి పరిపూర్ణుఁడ వగుము.

ఆ. అయిదువర్ణములనె యఖిలంబు తెలిసిన
నయిదునందు ముక్తి యమరియుండు
నయిదులోన నున్నయతఁడె పో యఖిలము, వి.

పంచవర్ణములలోనే సర్వము నిమిడియున్నది కావున నట్టిపంచస్వరూపము నెఱింగినచో తానే బ్రహ్మ మగును.

ఆ. అర్ధయంకణమున కాధార మైనట్టి
యొంటిమేడగుంజ నొనర నిల్పి
ఇంటి కొకడె మగఁడు యిల్లాండ్రు యేడ్గురు, వి.

దేహము ఒంటిస్తంభపు యిల్లు వంటిది దీనికి యజమానుఁడొక్కఁడే కాని యిల్లాండ్రు (సప్తప్రకృతులు) ఏడ్గురు

ఆ అష్టదళములకును నాధార మైనట్టి
యాదిదేవుఁ డొకఁడె యఖిలజగము
దాని దాఁటువాఁడు తానె పో బ్రహ్మంబు, వి

అష్టదళములకు నాధారమై యుండెడి దేవుఁడొక్కఁడే ప్రపంచాతీతుఁడు అతఁడే బ్రహ్మము అగును

క. ఆఁకలిఁ జంపిన రాదది
యాకుల దిని యడవులందె యలసిన నైనన్
చీకటికోనం జిక్కదు
ఏకాకృతి మదిని నిల్పి యెఱుఁగుము వేమా!

బ్రహ్మ సాక్షాత్కారము ఆఁకలిని జంపినంత నేరాదు చీఁకటిగుహల గూర్చున్న చిక్కదు కావున నిరంతరధ్యానమున సంపాదింపుము

క. ఆకాశంబున వాయువు
మ్రాకున దావాగ్ని యటుల మానసమందా
యేకాకారుఁడు జగమున
జొక్కై తను దాన వెల్గు తప్పదు వేమా! 937

ఆకాశమునందు గాలియును మ్రానులో నగ్నియును నెట్లు లీనమై యుండునో అట్లే ఏకాకారుఁ డగు దైవము నిండి యుండును

ఆ. ఆకుపక్క సున్న మవి మూఁడు వన్నెలు
నేక మైనచోటఁ దాఁకు నెఱుపు
పోకి త్రిగుణ మట్లు శోభించు పరమాత్మ, వి

ఆకు పక్క సున్నమును కలిసిన నెట్టులు రక్తిమ యుదయించునో అట్లే త్రిగుణసంపర్కమున పరమాత్మయు శోభిల్లును

ఆ ఆకులేనికొమ్మ యభ్ర మెల్లను నిండె
మ్రాకు మొదలుఁ దుదయు మహిని. లేదు
ఏకమైనపంకు నింపొందుచుండును, వి.... 939

మాయ మహావృక్షము దీనికి ఆకులు కొమ్మలు మున్నగునవి లేకున్నను ప్రపంచము నంతయును పెనవైచికొనినది దీని తరువాతనే బ్రహ్మము కలదు

ఆ. ఆకృతి నరయుఁగ నిరాకృతి యనఁదగు
నాకృతి నొగి దగునిరాకృతిట్టు
లవియు రెండు లేక యపురూపమై యుండు, వి.

బ్రహ్మ మేయాకారమున నుండునని విచారించుకొలది నిరాకారతఁ గాంచును ఇట్టులే నిరాకారమును ఆకారతఁ బరిణమించును కావున నీరెండును లేనిది బ్రహ్మము అని యెఱుఁగుము

ఆ. ఆది చూచుచుండ నన్నిట దా నుండు
నాది చూడ నొకరి కలవి కాదు
ఆదిముక్తి తెలుప దాత్మనే యుండును, వి....

మూల మిద్దానికి నేది యని చూచిన నన్నిటను కన్పించి యసాధ్యమగును ఆమూలమే ముక్తికి తెలివు అయ్యాది తన యాత్మనే యుండును

ఆ. ఆది నెవరు పుట్టి యనవనికి దోడైరి
వారె బ్రహ్మ విష్ణు హరశివు లన
గనఁగ మాయశక్తి ఘనతేజ మందెవరు, వి....

ప్రపంచసృష్టికి కర్తలైన త్రిమూర్తులు సైతము మాయకు లోఁబడియుందురు

ఆ. ఆరుదూలములకు నాధార మైనట్టి
యొంటికంబ మింటి కొనర నిల్పి
యింటి కొకఁడు కర్త యేపారుచుండును, వి.

షట్తత్త్వములకు నాధారమైన యీహృదయకుహరము నందు సర్వదా స్థితుఁడై కర్తృత్వాదిధర్మములు గలిగి బ్రహ్మ మొప్పుచుండును

ఆ. ఉనికి మేరు శిఖర మున్నత్తతను జూచి
కనియు గానరాదు వదల దదియు
వినియు వినదు దానివిమలాంతరంగము, వి....

మేరుశిఖరమునందు నిలిచియున్నను కనిపించియు కనిపింపనట్టిదియై వినియు విననట్టిదై యుండునదియే బ్రహ్మము. ఇచ్చట మేరుశబ్దము యోగపారిభాషికము

ఆ. ఉపము దోఁపనట్టియుపవాసముల లేదు
తపముచేయనైన తగిలిరాదు
జపములోన గుఱిని జవదాటకుండరా, వి....

తెన్ను తెలియనియుపవాసాదులలో బ్రహ్మము లేదు. కావున నిరంతరము జపపరాయణుఁడవై మెలఁగుము.

ఆ. ఉప్పు చేరునట్టు లూహించి చూచిన
కప్పురంబు జ్యోతి గలసినట్టు
ఉప్పఁల్లు మదిని నొప్పుగా శివుఁ డుండు, వి....

నీటిలో నుప్పు కలయునట్టులను, మంటలో కప్పురంబు లీనమగుట్టలను ఈశ్వరుఁడును మనస్సున లీనుఁడై యుండును

ఆ ఉబ్బి గుర్తు చూచి యూహను రెట్టించి
నిబ్బరపడువాఁడు నిర్మలుండు
అబ్బరాని బయలునందును పొందును, వి...

నిశ్వాసమును బిగియించి గుర్తును చూచి మనస్సును చిక్కఁబట్టి తాల్మి గలవాఁడు దుస్సాధ్యమగు బ్రహ్మము నొందఁ గలుగును

ఆ ఉర్వీజనులు పరమయోగీశ్వరుని జూచి
తెగడువారె కాని తెలియలేరు
అమృతపురుచులను హాస్త మెట్లెఱుఁగును?, వి.

అమృతముయొక్క రుచిని హస్తమెఱుఁగనివిధమున ప్రపంచములోనివారు పరమయోగిని జూచి పరిహసింతురే గాని తెలిసికొనఁజాలరు

క. ఊకొనఁ జెప్పిన విన దది
ప్రాకటముగ లోకములను పాలించెడినా

పాకము మదిలో బయలని
యేకాకృతి నవిరతముగ నెన్నుము వేమా! 949

చూచుటకును వినుటకును మాటలాడుటకును శక్యము కాక సర్వలోకములయందును నిండియుండిన బయలే బ్రహ్మ మని యెఱుఁగుము

ఆ. ఎక్కువెట్టి గుఱుతి కేకమైనంతట
సొక్కి సోలి యుండు సూత్రముగను
ముక్కుసెవులు లేనిమూలమే పరమాత్మ, వి.

సమాధి నొంది లక్ష్యమును చిత్పదార్థముతో నైక్యము చేసికొన్నపిమ్మట గలిగెడి యపరిచింత్యమగుమూలమే పరమాత్మ యనఁబడును

తే. ఎఱుక దోఁడ్కొని తత్వంబు నెఱుఁగు బెట్టు
లెఱుక తొలఁగిన తత్వము నెంచరాదు
ఎఱుక మఱపుల కందనియిరవు గనుము
ఎఱఁగుచుండుము దానినే యిలను వేమ. 951

జాగ్రదవస్థ నున్నతత్త్వము ననుసంధింప వీలులేదు. ఇట్లులే బొత్తిగా జ్ఞానశూన్యమైనను వీలు కలుగదు కావున జాగ్రత్సుషుప్తులకు రెంటికి నందనిస్థలము గనుము అదియే బ్రహ్మము.

క. ఎఱుఁగక బుట్టును తనువులు
ముఱికిని దా ముఱుగుచుండు మోయుట గాదా

యెఱుక గలతనువు నొందిన
మఱియును జన్మించు టెట్లు మహిలో వేమా!

శరీరములు అజ్ఞానజన్యములై మఱికిలో మునిఁగి తేలుచుండును. కావున జ్ఞానయుతమగు శరీరము నొందినచో మరి జన్మము కలుగదు.

ఆ. ఎఱుక నెంచి చూడ నెఱిఁగించుచుండును
బరము దాఁకి చూడ బయలుపడును
గుఱికి బయలుఁ జేర గుణరహితంబురా, వి....

జ్ఞానముఁ బరికించినచో వస్తువు నెఱింగించుచు బరేశుని సాన్నిధ్యముఁ జేర్చును.

తే. ఎఱుక మఱపులు గానిది యెఱుఁగ లేరు
పరమపరిపూర్ణసుఖమూని పట్టలేరు
ఉరము బెదరగని గురిగని యుండలేరు, వి....

జాగ్రత్స్వప్నాద్యవస్థలు లేనిదియును పరిపూర్ణసుఖస్వరూపము కలదియు నగుబ్రహ్మము నెఱుగఁజాలరు.

ఆ. ఎఱుకమాలు జీవి యెంతకాలంబున్న
చచ్చిపుట్టుచుండు సహజముగను
ఎఱుక మఱచు చోటి నెఱుఁగుట బ్రహ్మము, వి.

జ్ఞానశూన్యుఁ డెన్నిమాఱులైనను జననమరణాదుల నొందుచునేయుండును. కావున జ్ఞానము సార్జించి బ్రహ్మముగనుట మంచిది

ఆ. ఎఱుక మఱపులందు నేమేమి తోఁచిన
సరికి గుఱియె గాదు సత్యమునకు
పరమనిర్గుణంబుఁ బాటించి కనవలె, వి.... 956

జాగ్రత్స్వప్నసుషుప్త్యాదులతో నేసేరీతులు పొడఁగట్టినను నన్నింటి నిర్గుణస్వరూపమును ప్రయత్నించి కనవలయును

ఆ. ఎఱుకయుండువాని కెఱుకయే యుండును
ఎఱుక లేనివాని కెఱుక లేదు
ఎఱుక లేనియెఱుక నెఱుఁగుట తత్వము, వి....

సులభము

ఆ. ఎల్లలోకమందు నేవస్తు వున్నదో
తల్లిపిల్లలందు తగులునదియె
నిస్తరంగవార్ధి నియతిలోఁ జూడరా, వి.... 958

సమస్తలోకములందును ఏవస్తువు నిండి నిబిడీకృతమై యున్నదో అద్యాదియే తల్లిపిల్లలందు నుండును

ఆ. ఎవరి కెవరుగారి కెవ్వరుఁ గాఁబోరు
గవయఁ గోరు హంస గదియ నొక్క
శివునిరూప మూని సేవింప దొరకొను, వి....959

ఈప్రపంచమున వృథా మఱులుకొందురే కాని ఒకరి కొకరు కాఁజాలరు కావున మోహముఁ బోఁద్రోచి శివుని సేవింపఁ బూనుట యుత్తమము

తే. ఎవ్వఁ డజ్ఞానతిమిరంబు నేపు మాపి
జ్ఞానమను వెన్నెలం దొప్పఁ బూను నేని

చంద్రుఁబోలిన గురునండ సాధకముగఁ
గూడినను గాని తీరదు కోర్కి వేమ. 960

అజ్ఞానాంధకారమును బోఁద్రోలి జ్ఞానతేజమును వెలయించు సామర్థ్యము గల గురుని సాయ మున్నఁ గాని బ్రహ్మము నొంద జాలవు

ఆ. ఎవ్వఁ డేమెఱుంగు నింపైనవస్తువు
దేహమే మెఱుఁగు దివ్యబోధ
విధము దెలియఁగోరి వేదాంత మెఱుఁగుఁడీ, వి.

దేహమేదియో ప్రియమేదియో యప్రియమేదియో నెఱుఁగఁజాలరు కావున దివ్యబోధరీతి నెఱుఁగఁ గోరిన నప రమాత్మస్వరూపము నెఱుఁగవలయును

ఆ. ఐదు నైదు నాఱు నెనిమిది నొక్కటి
యోగిలోన నుండి యోరసిల్లు
ఒకఁ డెక్కుతిరుగు నొడయఁడే తత్త్వంబు, వి....

పంచవింశతి (25) తత్త్వములతో గూడిన యీశరీరమున కధిష్ఠాతయై యుండెడివాఁడే పరమాత్మ యని తెలియుము.

ఆ. ఏడుమార్గములను నేకాంతమునఁ జేరి
యాడిపాడి ముక్తి నాడి వేసి
జాడలోని వరులు సాధించి కనవలె, వి....963

సప్తస్రోతస్సులను కరియఁ జేర్చి మనస్సుంగు తన యత్త్యము నొందించి ధ్యానించి బ్రహ్మమును సాక్షాత్కరించు కొనవలయును

ఆ. ఏడె యక్షరముల నీయందమొందిన
నందు నిందు ముక్తి యలరుచుండు
నందు నిందు తెలియ నదియెపో బ్రహ్మము, వి.

సప్తాక్షర ప్రకృతియందె ఈశ్వరురూపముండుగావున నదియె బ్రహ్మమని యెఱుంగుఁడు

ఆ ఏపుమీఱ మదిని నెంచి మించుచు గుప్త
రూపపు భ్రమ లడఁచి రూఢిపడక
కాపురంబుఁ జేరి కడగంట్లు మానుము, వి....

మనస్సును నియమించుచు లక్ష్యభ్రమణము లేకుండఁ జేసి స్థిరుఁడవై చంచలతను వీడి బ్రహ్మముఁ గనుము

క. ఏరూప మెచటఁ జూచిన
నీరూపమె గానిపించు నిలిపి తెలివియో
నీరూపమె తా నెఱిఁగిన
ధారుణిలో నీశ్వరుండు తా నగు వేమా!. 966

ఎచ్చట నేరూపముఁ బరికించినను అచ్చట నీరూపమే కాన్పించుచుండును అయ్యదియే బ్రహ్మమని యెఱుఁగుము

క. ఏరూపున నారూపము
లోరూపునఁ జూచుచుండు లోకారాధ్యం
డేరూపుఁ జూచువారికి
నారూపై కానిపించు నభవుఁడు వేమా'. 967

సర్వేశ్వరుఁడు తన్నెవ రెట్లు సేవించిన వారి కారీతిఁ బ్రత్యక్ష మగును.

ఆ. ఒకట రెంట మూట యోగీంద్రులను గూడి
యుదయపర్వతంబు మొదలి గిరుల
క్రమ మెక్కిఁ గాంచు ఘను నొక్కవీరుని, వి.

జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడవస్థలయందునుయోగీశ్వరసాన్నిధ్యముఁ జేయుచు క్రమముగా నుపాసన జేయువాఁడు కేవలుఁడగు నీశ్వరుని గాంచఁగలుగును

క ఏరూపు మదిని గోరిన
నారూపే తోఁచు భ్రమల నౌఁ గాదనమిం
ధారాళముగను బ్రహ్మము
కోరికలను మించి చూడ గుదురును వేమా!

మనస్సు నిష్టము వచ్చినట్టులు పోనిచ్చుచుండిన విభ్రమములపాలు సేయును గాన కోరికల నడంచి మెలఁగవలయును

ఆ ఒక్కఘటములోనఁ బెక్కురూపులు నిల్చి
నెన్ని యెన్ని రూపు లెసఁగుచుండు
నవియు దొలఁగెనేని యన్నియుఁ బైకొను, వి

ఒక్కశరీరమునం దెన్నెన్నియో వికారములు పుట్టుచుండును కావున నావికారము లడంగిన బ్రహ్మము ప్రత్యక్షమగును

ఆ. ఒంటికంబమందు నొనరఁ జూచెడు జ్ఞప్తి
గూడి యాడి పాడి కోర్కె దీఱు
మేడదాఁటి చూడ మితి మీరుచుండును, వి....
సులభము

ఆ. కడకు నింద్రియముల గట్టివేయఁగ లేక
చావు వచ్చునపుడు సన్యసించు
నాత్మజితము గామి నందునా మోక్షము?, వి....
సులభము

ఆ. కడుపులోనిమలము కష్టమై యుండఁగా
నన్న మేమి కీడొ యనుచు తలఁచి
ఉప మెఱుఁగక మనుజు లుపవాసముందురు, వి.

శరీరములో నున్నమలము అసహ్యముగా నున్నను సహించి యన్నము నేమి పాపమో కాని తినక జను లుపవసింతురు

ఆ. అక్షరపుట మిట్టియురసంబులో గూర్చి
అమర నొక్కరవము ననుభవించు
నతనికొఱకు ముక్తి యక్షయమై యుండు, వి.

అవినాశియగు నాదస్వరూపమును సర్వదా మననము చేయుచుండువానికి ముక్తి యక్షయమై యుండును

ఆ. ఆత్మతేజ మూని యనుభవించుట ముక్తి
ఆత్మతత్త్వ మెఱుఁగునతఁడె యోగి
యెఱిఁగి మఱిగినంత నేకమై తోఁచుగా, వి....

ఆత్మరూపము నొంది తత్సౌఖ్య మనుభవించుటయే ముక్తి. అట్టిది కలవాఁడే యోగి అట్టివానికి సర్వము నేకవిధమున భాసించుచుండును

ఆ. ఆత్మయందె దృష్టి ననువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
అతఁడు నీవె సుమ్మి యనుమాన మేలరా, వి....

ఆత్మయందు మనస్సును నిల్పి ధ్యానించినచో తప్పక తన్మయత్వము నొందెదవు

ఆ. ఆత్మలోనిశివుని ననువుగా శోధించి
నిశ్చలముగ భక్తి నిలిపెనేని
సర్వముక్తుఁ డగును సర్వంబు దా నగు, వి....

హృదయకుహరాంతరాళమున నున్న ఈశ్వరునియందు నిశ్చలభక్తి గలిగియుండు నేని తానే సర్వముక్తుఁ డగును

క. ఆత్మానాత్మవివేకము
స్వాత్మను గని యంతమీఁద స్వచ్ఛందగతిన్
ఆత్మకు లో వెలి నెగడు ను
హాత్మని బొగడంగ వశమె హరునకు వేమా!

ఆత్మానాత్మలవివేచనము చేసి అటుపైని స్వచ్ఛందగతిని ఆత్మాంలసుఁడై వెలుఁగుచున్నమహాత్ముని శివునంతటివాని కైనఁ బొగడ నశక్యము

ఆ. ఆదిమూలవిద్య నానందభరితుఁడై
వేదతుల్య మనుచు విడక పూని
పాదుకొనినవాఁడు పడయును మోక్షంబు, వి.

ఆదిమూలమగు విద్య నొంది యానందపరిపూర్ణుఁడై అద్దానిని విధివిహితముని నమ్మి పట్టు విడక ధ్యానించుచుండెడి వాఁడు మోక్షమును బడయఁగలుగును

ఆ. ఆదిశక్తి దొడరి యలముటఁ జెందక
ప్రాణపంచకంబు పట్టు నెఱిఁగి
అంతరిక్షమందు నభినుతించుట ముక్తి, వి....980

ఆలసత్వమును వహింపక సర్వదా పంచప్రాణములను నియమించి ఆకాశతత్త్వస్వరూపుఁ డగునీశుని నుతించుటయే ముక్తి నాఁబడును

ఆ. ఆశ విడక కాని పాశముక్తుఁడు కాఁడు
కాఁడు ముక్తుఁడైన గాని మృతుఁడు
మృతిని బడయకున్న మునుగదు మోహము, వి.

ఆశవిడచినఁ గాని ముక్తుఁడు కాఁజాలఁడు ఆట్లైనఁ గాని విషయములనుండి విరతుఁడు కాలేఁడు విరతుఁడు అర్థాత్తును మృతుఁడైనఁ గాని మోహము నశింపదు

ఆ ఉత్తమాంశ బూనియు న్మహిలోఁ జేరి
మత్తు మించినట్లు మఱగి రాక
సత్తమంబుమీటి సాధింప ముక్తిరా, వి....982

ఉత్తమాంశసంజనితులయ్యును మత్తతతో నుందురు అట్లుగాక సత్తును ఒనఁగూర్చినచో ముక్తియగును.

క. ఉదకములోపలి తత్త్వము
వెదకియుఁ దా నగుట దెలిసి వేగమె మదిలో
నుదకమువలెఁ దాఁ దత్త్వము
మదిఁ దెలిసినవాఁడె తత్త్వమయుఁడౌ వేమా!.

ఉదకతత్త్వమును పరిశీలించి తన్మయుఁడైన తత్త్వమయుఁడగును

తే. ఉన్ననిర్వాణనిజచర్య గన్నవాఁడు
తన్ను తనలోనఁ జూచెడితత్త్వ మెఱిఁగి
సన్నుతించును బరమాత్మ సమ్మతమని, వి....

కలరూపు నెఱిఁగి ఆత్మరూపమును హృదయాంతరాళమున గని ధ్యానించుటయే పరమాత్మసమ్మత మగు మార్గము

ఆ. ఎచటఁ జూడ్కి నిలిపి యెంతగఁ జూచిన
నచటఁ దోఁచు కళల నందరాదు
అచలమైనవ్యక్తి నందుట మోక్షంబు, వి....

ఎచ్చో ధ్యానముంచిన నచ్చటఁ దోఁచును గాని ఇంద్రియములకు పట్టరానిదై యుండును అట్టిదాని నొంది యచలమై యుండుటయే మోక్షము

ఆ. ఎన్నితనువు లైన మృతికి నష్టము గావు
మృతిని గెలువ వాని కెఱుక లేక
దొంగరీతి కెట్లు దొరకురా మోక్షంబు, వి....

ఎన్ని శరీరములయినను మరణము నాపఁజాలవు జ్ఞానమనునది యలవడునంతకు మృతిఁ గెలుచుట యసాధ్యము

ఆ. ఎచటఁ జూడ్కి నిలిపి యెంతగఁ జూచిన
నచట దోఁచుకళల నందరాదు
అచలమైన వ్యక్తి నందుట మోక్షము, వి....

ఎచ్చటెచ్చట దృశ్యమును నిల్పి పరీక్షించినను వ్యక్త మగుచుండును గాని కళల నంటుట కసాధ్యము అచలమైన యట్టివ్యక్తి నందుటయే మోక్షము.

క. ఏకబ్రహ్మము నిత్యము
వైకృతము లనంగ దగినవస్తువులెల్లన్
ఏకత్వం బని యెఱిఁగిన
జోకమునం గలుగు ముక్తి సుశుభము వేమా!

బ్రహ్మము ఏకమును నిత్యమును నై యున్నయది వికృతి స్వభావము లగు వస్తువు లెల్లను బ్రహ్మమయములని యెఱింగి నచో ముక్తి సులభముగా నగును

ఆ. ఏకమునను జూడ నెఱుక యేకంబౌను
భువిని సతిని గూడుపురుషుమాడ్కి-
లోక కాంతునట్టు లోపల వెలుఁగును, వి ..989

ఐక్యబుద్ధిని బరికించినచో లోకమునందలి దాంపత్యము వలె బ్రహ్మము ప్రపంచముతో నైక్యము వహించి యున్న ట్టులు స్పష్టమగును

ఆ. యేమి చదివి యేమి యెఱుక లేకుండిన
చదువులందు బరమసౌఖ్య మేది?
మానసైక్యమున నె మఱి ముక్తి కలుగురా, వి.

ఎన్ని చదువులు చదివి ను బరమసౌఖ్యప్రదమగు జ్ఞాన మలవడదేని వ్యర్థము కావున మానసమును బ్రహ్మముతో నైక్యము నొందింపఁ బ్రయత్నింపుము

ఆ. ఒకటిలోనఁ గొట్టి నొకటిలోనను పెట్టి
యొకటిలోను చూడు మొకటె చూపు
ఒకటియుండె చూడ నొనరంగ ముక్తిగా, వి.

మాయను నశింపఁజేసి ప్రకృతికి అనుకూలముగా మది నుంచి నిశ్చలుఁడై యేకత్వమునకు ప్రయత్నించిన ముక్తి కలుగును

ఆ కలుష మెన్నికొనఁగ గౌరవహానియే
యరయఁ దత్వమెన్న నాత్మ ఘుటిక
తెలిసి తాను పిదప స్థిరుఁడు కావలెనయా, వి.

పాపముల నెన్నిన గౌరహానియే కాని ఫలము లేదు. కావున తత్త్వము నెన్ని తాను శాశ్వతుఁ డగుటకు ప్రయత్నింపవలయును

ఆ. కష్టమైన మనసు గాంక్షించు యోగికి
జ్ఞానదీపశిఖయు దా నటింపఁ
గానవచ్చు నాత్మ క్రమమైన జ్ఞప్తితో, వి....993

కష్టమైనను మనస్సును వీడక యభిలషించు నేని జ్ఞాన కలికయును ఆత్మసహజమగు జ్ఞప్తిలో వెలయును

ఆ కష్టమైనమలము కడుపులో నుండఁగ
నంతకంటె జెడెడి నన్నరసము
ఉపము లేనిజనము లుపవాస ముందురు, వి....

పాపభూయిష్ఠమగు మలము తమకడుపులోనే యుండినను అజ్ఞులై జను లుపవాసములఁ జేయుదురు అద్దాన కొంచెమైనను ఫలము లేదు

ఆ. కష్టలోభివాని కలిమికి నాసించి
బడుగువాఁడు దిరిగి పరిణమించుఁ
దగరువెంట నక్క దగిలినచందము, వి.... 995

పాపాత్ముఁడగు లోభివానిసంపద కాసించి తగరు వెంట నక్క దిఱిగినట్టులు ధనాశాపిశాచావిష్టుఁడై తిరుగు చుండును

ఆ. కాయగాయ గాల్చి కనకముఁ జూపెరా
కాయ మనఁగ బ్రహ్మకాయమండ్రు
కాయఁ దెలియునతఁడె కౌస్తుభధరుఁడగు, వి....

సంసారమను విషవృక్షఫలమును నశింపఁ జేసి దివ్య తేజమును చూడవలయును ఇట్లు బ్రహ్మరూపమును దర్శించిన వాఁడు సాక్షాత్తు విష్ణువనియే యెన్నఁ దగును

ఆ. కాయమును గడఁగియు గనక చూవలనున్న
కాయమును విడిచినఁ గాఁడు యోగి
కాయమందు ముక్తి గతి కేఁగవలయురా, వి.

శరీరమును శోధించి యాత్మస్థితమగు జీవేశ్వరుని శరీరమును చూడక విడిచిపెట్టినవాఁడు యోగి కాఁజాలఁడు కావున శరీరమునందే ముక్తిగతిని కనిపెట్టవలయును

ఆ. కాలధర్మ మెఱిఁగి కపటవృత్తులు మాని
యాలుపిల్లలందు నాశ వదలి
మేలుగాను శివుని మేల్కని చూడరా, వి....998

కాలపుస్వభావమును కనిపెట్టి కపటమును మోహమును వీడి ఈశుని సర్వదా ధ్యానించుచుండుము

ఆ. కాశియాత్ర కేఁగి గంగస్నానముఁ జేసి
కష్టపడిరి ముక్తిగాన లేక
యెనుము దిరుగుచుండు నెనుబోతు వెంబడి, వి.

అజ్ఞులు కొందఱు అంతస్థితుఁడగు నీశ్వరుని దర్శింపఁగా లేక కాశియాత్ర కని పోయి పెక్కు కష్టముల నొందిరి

ఆ కాశియాత్రఁ జేసి గాసిపడుటె గాని
మోస మగును దాన ముక్తిలేదు
పాశ ముడుగఁ బూనుఫలమె యా కాశిరా, వి.

కాశీయాత్ర యని కష్టపడుటే కాని దానివలన మోస ముదప్ప ముక్తి లేదు కనుక కర్మబంధము వీడుటయే కాశి యనఁగాని యందులకై ప్రయత్నింపవలయును

ఆ. కులుకు లొలుకఁ జూపి కొబ్బున మరగించి
చేతికాసులెల్ల జేటుఁ దేసి
యులతిఁ జేసికొందు రిల వారకాంతలు, వి. 1001

సులభము

ఆ కూడిపరవశంపుకోర్కెలు లేకుండ
నాటవలెను బుద్ధి నయముగాను
చోటు గనని వెలుగుఁ జొచ్చుటే మోక్షము, వి.

అస్వాధీనములగు కోరికలు లేకుండ బుద్ధిని ఈశ్వరుని పాదుకొలిపి యవేద్యమగు తత్కైవల్యము నొందుటయే మోక్షము

క. కోటులు సంపాదించినఁ
గూటికె సరిపోయె బ్రదుకు గుంపులు కూడెన్

ఏటికి నీసంసార మి
చోటున నిను గన్ననాఁడె సుదినము వేమా!.

కోట్లకొలఁది సంపాదించినను కాటికి సరిపోవును కనుక నిఁక నీసంసారమునందు బ్రహ్మరూపము నెఱుంగుట కన్న ప్రయోజనము మఱిలేదు

ఆ. కోపమునను నరకకూపముఁ జెందును
కోపమునను గుణము కొఱతపడును
కోపమునను బ్రదుకు కొంచెమై పోవును, వి....

కోపము ఆపదలమూలము, పాపములకు హేతువు గుణము దాన నశించును కాన కోపము పనికి రాదు

తే. గంగాయమునల నడుమను
బంగారపుబొమ్మవోలె బాలిక యుండున్
సంగతిగఁ జెలిమిఁ జేసిన
భంగము లేకుండ ముక్తిపరమగు వేమా!....

గంగాయమునల నడుమ అనఁగా అర్థాత్మన త్రిగుణములనడుమ ప్రకృతి స్వర్ణవిగ్రహమువలె నలరారుచుండును. అద్దానితో చెలిమి జేసినచో ముక్తి వశమగును

క. గంగాధరుండె దైవము
సంగీతమె చెవుల కింపు సర్వజ్ఞులకున్
బంగారమె యుపభోగం
బంగజుఁడే మృత్యుహేతు వరయఁగ వేమా!.

సర్వజ్ఞులగు వారలకు శివుఁడే దైవమును, సంగీతమే వీను

లకు ఇంపుజనింపునదియును ధనమే యుపభోగముగను మన్న థుఁడే మృత్యువునకు హేతువుగను తోచును

తే. గమ్యముగుజ్ఞానమందుట గగనవిద్య
జ్ఞాన ముదయించి మించఁ బ్రజ్ఞాన మమరుఁ
బరఁగు ప్రజ్ఞానమందుటే బ్రహ్మపదవి
పరశివుం డగు నిది యంద ధరను వేమ! 1007

లక్ష్యముగుజ్ఞానము నందుటయే యుత్తమవిద్య అట్లైనఁ బ్రజ్ఞానమును దానబ్రహ్మమును బడయఁగలుగును ఇదియే తుదకు కైవల్యమునకు సాధకము నగును.

ఆ గీము విడిచిపెట్టి గిక్కురు మనకుండ
జీవ ముడుగువేళ శివుని దలఁచు
మనసు గొల్పకయును మాయచే బోరలెడు, వి.

బ్రదికినకాలమునందు తన యిచ్చవచ్చినట్లు ప్రవర్తించి చావుకాలము వచ్చినప్పుడైనను ఈశుని తలంచుటకు ఒప్పుకొనక అజ్ఞుఁడు మాయచే భ్రాంతుఁడగుచుండును.

ఆ. చిత్రదీపమువలె చింతను దిగద్రొక్కి
మిత్రముగను మనసు మెలకు వెఱిఁగి
శత్రుగుణము లెల్ల సాధించుటయె ముక్తి, వి.

దీపమువలె నుపరుద్ధములగు విషయముల నడంచి కార్యమునం దనుకూలమగు రీతి నెఱింగి మనస్సును సాధించుటయే ముక్తి యనఁబడును

ఆ. చక్కగాను మదిని చర్చించి కనవలె

ముక్కు తుదిని మించి మురిపెముగను
దృక్కు బ్రహ్మమనుచు మ్రొక్కనంతెనె ముక్తి,వి.

చక్కగా మనస్సునందు చర్చించి నాసాగ్రమందు దృష్టిని నిల్పి దానినే బ్రహ్మమని ధ్యానించుచు మ్రొక్కినచో ముక్తి చేకురును

ఆ. చందమామ నీడఁ జక్కఁగా దనలోన
నుండఁ జూచి కేల నూదిపట్టి
వెన్నెలబయలను వెదకినంతనె ముక్తి, వి....1011

చంద్ర ప్రతిబింబమును హృదయఫలకమునందు ప్రతిబింబితమగునట్టులు చూచి వెదకినంతనే ముక్తి కరతలగతమగును

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు
వేదములను లేదు వాదములను
బయలనుండు ముక్తి పాటించి చూడరా, వి.

చదువులందును శాస్త్రాదులయందును గానరాక ఏతదతీతమై బ్రహ్మమందును అద్దానిఁ బాటించి కనినచో ముక్తి కలుగును

ఆ. జీవమునను నాత్మ స్థిరతను గానక
తిరుగు నస్థిరమును గుఱిగ నమ్మి
స్థిరము నస్థిరమును దెలియు జీవికి ముక్తి,వి....

ప్రాణములున్నచోటుల నాత్మ స్థైర్యమును వహింపఁజాలక తిరుగుచుండును ఈ స్థిరాస్థిరముల రహస్యము నెఱుంగుటయే ముక్తి నాఁ బడును.

క. జీవాధారుఁడు రుద్రుఁడు
సేవార్చనపరుఁడు నగుచు స్థిరమతి వెలుగున్
భావాతీతపరంబుగ
గావించును మనసు బయలు ఘనముగ వేమా!

సమస్తజీవములకు నాధారుఁ డగునీశ్వరుఁడు స్థిరమతిని సర్వదా వెలుఁగుచునే యుండును అట్టివాని సేవించి ముక్తుఁడ వగుము.

క. జీవిని దెలియక వేఱుగ
దేవుని భ్రమ దిరుగునరుఁడు దేవుని నెఱుగం
జీవుం డని వివరించిన
భావింపఁగ జీవి బట్టబయలగు వేమా! 1015

జీవుఁడు జీవి యను భేదమును తెలిసికొనలేక తిరుగుచుండును. అట్టివాఁడు దేవుని జీవుఁడని భావించినచో జీవి వెలువడును

ఆ. జీవిలోన నుండు స్థిరముచు గానక
తిరుగు నస్థిరమును వరుస నమ్మి
స్థిరము నస్థిరమునుఁ దెలియ జీవికి ముక్తి, వి....

జీవము హృదయమునందే యుండి స్థిరాస్థిరతల నొందఁజాలక తిరుగుచుండును కావున వీని నెఱుంగుటయే ముక్తి యనఁబడును

ఆ జీవులెల్ల ముందు జీవాత్మ పరమాత్మ
జత లెఱుంగ పాపజలధిఁ బడరు

నావనడుపువాఁడు నట్టేటఁబడునొకో?, వి....1017

సమస్తప్రాణులును జీవాత్మపరమాత్మ భేదమును మున్నందుగనే యెఱింగెదరేని వారి కిక పాపము లుండవు. ఎట్లంగురా? నావనడుపువాఁ డేటిలోఁ బడునా?

క జెండా నేయఁగ నొప్పను
కొండలు పెకలింపవచ్చు కుదిరినమదిలో
నిండాఁగ పరిపూర్ణము
జెండాడెఁగ ముక్తిత్రోఁ జొగునువేమా! 1018

సులభము

తే జాడ గలగురుమేకలో జోడుగూడి
వీడి యష్టాక్షరములందు విధ మెఱింగి
కూడియాడెడువాఁడె పో కోవిదుండు, వి....1019

హృదయమునందు నీశుని ధ్యానించి యష్టాక్షరములను పారాయణ సేయుచు సర్వదా యానందనిమగ్నుఁ డగువాఁడే కోవిదుఁడు నాఁ దగువాఁడు

క. జ్ఞానికి కర్మం బేటికి
జ్ఞానికి గర్మంబు గలుగఁజాలదు చూడన్
జ్ఞానమె కర్మంబైనను
మానవులకుఁ గర్మముక్తి మహిలో వేమా!

జ్ఞానికిని కర్మములకును సంబంధము లేదు (తక్కినది సులభము)

తే. తనదు దేహమందు తనకున్నపరివార
మందఱిని బిగించి హర్ష మెసఁగ

నెల్లచావు లెఱిఁగి యుందందు యోజించి
నడవ మేటివ రత్నమురా వేమ. 1021

శరీరమును తదంతరస్థమగు నింద్రియములను బిగియఁబడి ధ్యానించి వెదకుటయే యుత్తమవ రత్నమును బ్రహ్మప్రాప్తికి సాధనమును నగును

క. తను దానై బయ లందుచు
ననుమానము లేక తాను యచలుండగుచున్
వినయవిధేయత లొందిన
మనమే యానందరూప మయమగు వేమా!.

తను దానై యుండుచు సందేహములన్ని పరిత్యజించి గర్వింపక మనస్సును ఆనందరూపము నొందింపఁదగును

ఆ. తలఁచు దమము బాసి తనువును మఱచియు
పరమునందు మనసు బయలుపఱచి
కదియ నున్నయట్టి ఘను లెందఱున్నారొ,వి....

అజ్ఞానమును పోగొట్టి శరీరముపై వాస్థను త్యజించి పరమునందు ధ్యానము నుంచుటయే ముక్తిసాధనము ఇట్లు చేయువారు మిక్కిలి యరుదు స్వల్పసంఖ్యాకులు

క. తలఁచిన తత్వంబగునే
తలఁపక తా నూరకున్న దత్త్వం బగునే
తలఁచుట తలఁపమి రెండును
తలఁపక తా నుండు నేని దత్వము వేమా! 1024

చింతించినంతమాత్రానను చింతింపనంతను తత్త్వము

కాబోదు. కావున మననామననసాధారణమే తత్వ మని యెఱుంగుము.

క. తా ననఁగ నెన్నఁడయ్యెనొ
యేనన నెవ్వండు గలఁడొ యెఱుకగుదానిన్
దానని మనమున నెఱుఁగక
పూనెదు జీవుండు జడుఁడు బొంకరి వేమా!.

సులభము

ఆ. తాను సకల మౌటఁ దనలోనిసకలంబు
తనదులోనివెలుగుఁ దానె యెఱిఁగి
యున్నమానవునకు నొనరును ముక్తిరా, వి....

సమస్తస్వరూపుఁడును తానే యనియును, సమస్త వస్తువులలో వెలుఁగును తానే యనియును తెలిసికొనువానికి ముక్తిహస్తగతమై యుండును

తే. తాను సంకల్పరూపుఁడై తమకమందు
దాను సంకల్పరహితుఁడై తగులు ముక్తి
ముక్తి యన చిత్తశూన్యంబు మోక్ష మదియు
దీని నిక్కంబు గనువాఁడె మౌని వేమ. 1027

సంకల్పరహితుఁడై ధ్యానమగ్నుఁడైనచో ముక్తి యలవడును అనఁగా చిత్తము విషయశూన్య మగుటయే ముక్తి

క. ధ్వని పుట్టిన నాలించును
ధ్వనిమధ్యమునందు జేరి ధ్వని తానై తా

గనుపించునంతఁ దనహృ
ద్వనజంబునఁ జూడ ముక్తి వశమగు వేమా'.

శబ్దస్వరూపమగు బ్రహ్మపదార్థమును, జ్ఞేయజ్ఞాతృస్వరూపము గలదానిని హృదయముననే చూడవలయును అయ్యదియే ముక్తి నాఁ జనును

ఆ. నాకు నవరు దిక్కు నడినాళములలోను
వేగుచుక్కనంటి వెలుగుదిక్కు
వెలుగుకంటె దిక్కు వెదుకంగ లేదయా, వి....

శరీరగతి (గమ్యస్థానము) నాళమధ్యగతమగు జ్యోతిస్సే. అట్టిదానిని నిరంతరధ్యానమున వెదకి గనవలయును

ఆ. నాదు నాదు చూడ నాతులయందుండు
నాదు లేనియట్టి నరులె లేరు
భేద ముడిగి దీని బ్రియపడి కనుఁడయ్య, వి....

(ప్రణవముయొక్క) ధ్వనిని విభేదబుద్ధిని పరికించినచో నయ్యది బ్రహ్మరూపముం భాసించును

ఆ నిజము కళలమీఱి నిత్యుండు కావలె
పలుకులోనిపలుకు పదిలపఱచి
వేడుకలర ముక్తి వెన్నంటుచుండురా, వి....

సత్యస్వరూపమును చక్కఁగా యోచించి ధ్యానముఁ జేయుచు హృదయాంతరాళమున నద్దానిఁ బదిలపఱచినచో ముక్తి యగును

క. నేననఁగ మేను గాదని
మానసమున నెఱుగకున్న మనుజుల కెల్లన్

స్వానుభవసిద్ధి దొరకదు
తానగు పరమాత్మ నెఱుఁగఁ దరమా వేమా!

నేను నేను అను అహంశబ్దవాచ్యము శరీరముగాదు; శరీరియే యని తెలియనిమనుజులకు స్వానుభవసిద్ధి దొరకఁజాలదు.

ఆ. నే ననువచనంబు నీవనఁగా వచ్చు
నీవు నే ననఁబడు నిష్ఠ దెలియఁ
నేను నీవె నీవె నే ననవచ్చురా, వి.... 1033

'అహం బ్రహ్మాస్మి' యని యందఱు ననవచ్చునే కాని అద్దానియందలి పరమార్థము నెఱిఁగి యనుట కష్టము

ఆ నేను నీవనియెడి నెత్తంపుమాటలు
మాని యుండువాఁడె మానవిదుఁడు
తాను నేననియెడి తమకంబు మానరా, వి....

నేను నీవు అనియెడిభేదబుద్ధిని పరిత్యజించి యుండెడివాఁడే ముక్తుఁ డగును కావున నాభేదబుద్ధి త్యజింపుము

క. పంచగుణక్షయబిందువు
పంచాక్షరినాద మంత్రు పరమమునీంద్రుల్
ప్రాంచితముగ నది తెలిసిన
మంచిగనఁ మ్రొక్కు నతఁడు మహిలో వేమా!

అక్షయ మగుత్రిగుణబిందువు నే పంచాక్షరినాద మని పెద్దలు చెప్పుదురు దానిని తెలియువాఁడు విజ్ఞుఁ డగును.

ఆ పంచతత్త్వములకు బ్రహ్మాల కొకసొడ్డు
వారితండ్రి నెత్తి వైతు సొడ్డు

నంతరంగ మెల్ల నాదిశక్తి యెఱుంగు,వి....1036

పంచతత్త్వములకును బ్రహ్మములకును తజ్జననకారకులకును సాష్టాంగ దండములు చేయుచున్నాను.

క. పంచమహాభూతములై
పంచశరీరములు గలిగి బ్రహ్మాండంబై
పంచావస్థలు దాఁటి న
టించుట పరిపూర్తిఁ జెందు డెంకిర వేమా! 1037

పంచమహారూపస్వరూపములఁ జెంది శరీరాకారేణ పరిణతులై బ్రహ్మాండభాండమునంగు పంచావస్థలను దాటి నటించువాఁడే పరిపూర్ణుఁడగును వాఁడే ముక్తుఁడగును.

ఆ. పంచశత్రువులను పంచబాణుని గెల్చి
పంచవర్ణములను బరనఁ జేసి
పంచముఖంబులఁ బ్రతిఫలించెడువాని
పంచఁ జేరువాఁడె పరుఁడు వేమ. 1038

పంచేంద్రియములు మన్మథుఁడు మున్నగువానిని గెల్చి పంచాక్షరిని జపించి శివు నొందువాఁడే పరుఁ డనఁదగును

క. పంచాక్షరిజపమందిన
సంచితకర్మములు వాయు సాకల్యముగా
మించును బరమజ్ఞానము
ద్రుంచును దుష్కృతముల మదిని రూఢిగ వేమా!.

పంచాక్షరిని జపించినచో కర్మలు తొలఁగును జ్ఞానము సాకల్యముగా సాక్షాత్కరించును అజ్ఞానమును దుష్కృతులును నశించును.

క. పడిపడి మ్రొక్కఁగ నేఁటికి
గుడిలోఁ గలకరినశిలల గుణములు చెడునా
గుడి దేహ మాత్మ దేవుఁడు
చెడురాళ్లకు వట్టిపూజ సేయకు వేమా!. 1040

సులభము

ఆ పదునుగల్లు మ్రాను పచ్చనై యుండును

.... .... ....

తలపు గలుఁగ హరియు దనయద్దనే యుండు
విశ్వ.... 1041

శ్రద్ధగలుగువారలకు సమస్తమును హస్తగతమై యుండును.

తే పరమనిర్గుణవిద్యలో భావ ముంచి
మానసజ్ఞానపరిపూర్ణమననమందు
నేకరూపము మది నెంచి నిచ్చ గనుము
శాశ్వతానందసంసిద్ధి జరగు వేమ 1042

భావమును నిర్గుణపరముగా ననుసంధించి మననముఁ జేసి యైక్యత నొందించినచో, శాశ్వతమగు నానందము చేకుఱును

ఆ. పరము గోరినట్టి పామరజనులకు
స్థిరము గాదు బుద్ధి చిక్కఁబోదు
తరముగానిపరముఁ దలపోయ నగురోత, వి....

పరము నపేక్షించి పామరులకు బుద్ధి స్థిరత నొందదు.

కావున నట్టివారు తమ కశక్యమగు దానికొఱకై ప్రయత్నింప కుండుటయే మంచిది

క. పరమాత్ముని వివరింపఁగ
నగు నా యణు రేణువందు నతిసూక్ష్మగతిన్
బరికింప నన్నిరూపుల
గురుఁడై తా వెలుగుచుండు గుఱుతుగ వేమా!
సులభము

ఆ. పరము పరమటంచుఁ బలుకుదు రందరు
పరము నందు నేమి ప్రబలముండు?
పరమునందు నిండు పరిపూర్ణమే కదా!, వి....
సులభము

క. పాదమున నడచు నరుఁడట
లేదనఁగా భూమి దిరుగు లెస్సగ దనకే
యేదైన హాని వచ్చిన
సాధనమగు పదము నడవ జరుగదు వేమా!
సులభము

ఆ. గగన మమరఁ జూడ్కి కనుబొట నిక్కించి
నిలిపి చూడఁ జూడ నిలుచు సుఖము
సుఖములోని వరుస సూత్రింప బ్రహ్మము, వి....

చూడ్కిని కనుబొమలనడుమ నిల్పి ధ్యానించినచో సుఖము చేకుఱును. ఆసుఖక్రమమును పరికించినచో నదియే బ్రహ్మ మగును.

క. ఘంటారవమును మదిలో
వింటి న్నే గంటఁ గంటి విమలపుకాంతిన్
వెంటాడక బ్రహ్మంబును
గంటిని వగ కాదు నన్ను గనుఁగొన వేమా!.

ప్రణవధ్వని నాలించి కంటితో తద్గమ్యమగు చిత్స్వరూపము గని బ్రహ్మమునుగా ధ్యానింపవలయును

క. ఘనసార మగ్ని దొరకొన
ఘనసారం బగును కాదె కారణవిద్యా
ఘనసారము విద్యాగ్నికి
ఘనసారమె కంటకంబు గలుగుర వేమా!. 1049

ఘనసారము (అనఁగా కప్పురము) అగ్నిసంయోగము మాత్రాన ఘనసారము (గప్పుమనునది) యైనట్టులనే కారణవిద్యాఘనసారము అవిద్యాగ్నికి ఘనసారము అగును

తే. చంద్రసూర్యాగ్ను లేర్పడ్డ చంద్రశాలఁ
జేరి పరశివు నాత్మలో చింతఁ జేసి
చిన్మయానందమునఁ జేర దన్మయంబు
ముక్తిమూలం బిదే జనమ్ములకు వేమ 1050

చంద్రసూర్యసంచారము గల నభస్తత్వమును మనస్సును చేర్చి పరశివుని ధ్యానించి తన్మయుఁ డగుటయే ముక్తి నాఁబడును.

ఆ. చంద్రు నీడ నునిచి చక్కఁగా రవిమీఁద
నుండఁ జూచి కొఱత నుడఁ జేసి

వెన్నెలఁ గదియుటే వెలయఁగ ముక్తిరా, వి....

సులభము

క. చిత్తరువు ప్రతిమ కై వడి
చిత్తమ్మును కల్ప మడచి చిరతరబుద్ధిన్
జిత్తునఁ దెలిసినవాడే
యుత్తమసుజ్ఞానియందు రిహామున వేమా!. 1052

చిత్తరువులోని బొమ్మవలె నిశ్చలసమాధినుండి చిత్స్వరూపముఁ దెలిసినవాఁడే సుజ్ఞాని యగును

క చిత్తము మనమును బుద్ధియు
హాత్తు నహంకారగుణము నాత్మకు లోఁగా
మొత్తముఁ జేయఁగ నేరని
మత్తులకును ముక్తి లేదు మహిలో వేమా!.

మనోబుద్ధ్యహంకారములను స్వాధీనముఁ జేసికొని ఆత్మాయత్తముగా మెలఁగనివారలకు ముక్తి లేదు

తే. చోరులకు చిక్కిపోయినతీరె యగును
నోట గుణియించు మంత్రంబు నీట గలియు
మాటలందును పరమాత్మ మఱగి రాఁడు
చిత్తమున స్వస్థతయు లేమిఁ జెడుగు వేమ.

సులభము

క. చన్నగనరీతి సంపద
కొన్నాళ్లకు ప్రేగుఁజూపి గొబ్బున వ్రాలుఁగా

వెన్నెల చీఁకటి సరియగు
నన్నా శివలింగమాయ లన్నియు వేమా! 1055

సులభము

తే. చూపు చెదరని వృత్తిలో చూడ్కినంటి
యేపుమీఱిన మదినందు గూపుమాపి
తన్ను దా గాంచుచుండును తత్వవేత్త
నిర్వికారుండు నా భువి నెగడు వేమ 1056

నిశ్చలవృత్తితో ధ్యానించి హృదయమున నీశుని పొదు
కొలిపి తత్త్వవేత్త యగువాఁడు తత్త్వమును అనఁగా తన
స్వరూపమును పరికించుచుండును

ఆ. చావు వచ్చినపుడు సన్న్యసించున దెల్ల
కడకు మొదటికుంము చెడుట కాదె
పాప మొప్పు వేఱె ఫలముండఁబోదయా, వి.

సులభము

ఆ. చూపులోనిచూపుఁ జూడ నేర్చినవాఁడు
మనసులోనిమనసు మాయఁ దవులు
ఎఱుకలోనియెఱుక నెఱుగుమురా మూర్ఖ, వి.

సులభము

ఆ. చూపులోనిచూపు సుజ్ఞానదాయిని
చూపులోననుండి చూచువాఁడు
చూడచూడఁ దన్ను జూచును నిక్కము, వి....

చూపులోనిచూపు (అనఁగా అంతరంగదృక్కును)

కలిగియుండెడివాఁడే నిక్కముగా నీశ్వరుని చూచెడివాఁడగును

ఆ. జంగమాఖ్యభక్తి జగతి వేఱుగ లేదు
సగుణభావ మిదియ శాస్త్రవిధియు
నిర్గుణంబు వీడు నరవేది యోగము, వి....1060

జంగమ మనునదియే భక్తిమార్గము ఇంతకంటె నన్యము ఇఁక లేదు దీనినే సగుణభావ మందురు వీని నవలంబింపుము.

తే. జన్మమరణాద్యవస్థలజాడ మీఱితి
మన్మయం బగుపరిపూర్తి మఱుగుఁ జేరి
తన్మయాకృతి నొందుటే తత్పదంబు
నిర్వికారుని కిది గల్గు నుర్వి వేమ 1061

జననమరణాదులు లేనిదియును చిత్స్వరూపమున నిండియుండునదియు నగునాకృతితో తన్మయత్వము నొందుటయే ముక్తి నాఁబడును

క. జపములు చేసినఁ జిక్కదు
విపినములందున్నఁగాని విడు మనె భ్రమలా
జపమంత్రమూలసిద్ధికి
నెప మెన్నని మోక్షపదవి నిలుచుర వేమా 1062

జపములను చేసినను అడవులఁ గూర్చున్నను కేవలము భ్రమయేకాని మోక్షపదవి చిక్కదు కావున నట్టిమూల మంత్రసిద్ధుల కన్నిటికిని కారణము గాని మోక్షమార్గము నొందుము

ఆ. జయము భయము దాఁటి చలపట్టి యుండును
దయకుపాత్రుఁ డగును ధర్మపరుఁడు
నయముగాను గురుని నమ్మి నెమ్మది వేఁడు, వి.

ధర్మపరుఁడు జయమును భయమును వీడి పట్టుఁబట్టి గురని అనుగ్రహమున కృతకృత్యుఁ డగుటకుఁ బ్రయత్నించును నీవును నట్లులనే చేయుము

ఆ. జిహ్వ రసము వల్ల జీవంబు పోషించు
బ్రహ్మ మన్నరసముఁ బడయ లేరు
రసము ద్రాగనట్టిరాజులు చావరే?, వి.... 1064

అన్నరసము అఖిలలోకములకును ఆధారము ఆరసము ద్రావనిచో రాజులైనను చచ్చిపోదురు

ఆ జీవగుణము గలుగుజీవంబు బ్రహ్మంబు
సాటివచ్చునెట్లు సరవిఁ దెలియ
నూరికుక్క సింగ మొక్కటి యగునొక్కొ, వి.

జీవగుణంబులు కలిగియున్నంతవఱకును జీవము బ్రహ్మమునంటి రాఁజాలదు ఎట్లనఁగా నూరికుక్క సింహమగునా?.

ఆ. జీవనము దెలసినఁ జెలఁగి మదిఁ జలించు
దైవ మగపడినను దగులు బుద్ధి
దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా?, వి....

బ్రదుకుకాలము ముందుగఁ దెలిసినచో మనస్సు చలించును. దైవ మగుపడిన బుద్ధి యాతనియందు నిలుచును.

క. జీవము శాశ్వతరూపము
భావముననను నిలిచి లోనె పరుఁడై యుండుం

కేవలనిర్గుణ మదె యగుఁ
గావరమును కడకుఁ ద్రోసి కనవలె వేమా.!1067

జీవముయొక్క శాశ్వతమగు (అచంచలము నపరిణామి యనఁగు) రూపమును మనస్సులో నిల్పి ధ్యానించినచో నయ్యదియే నిర్గుణరూప మగును

ఆ జీవి జంపుటెల్ల శివభక్తి తప్పుట
జీవు నరయ నిజము నీవెఱుఁగవొ
జీవుఁడు శివుఁ డగుట సిద్ధంబు సిద్ధంబు, వి....

ప్రాణిహింసచేయుట పాపము చేయుటయే ప్రాణి యనఁగా నీవే సుమా! కావున జీవుఁడే శివుఁడు అని తెలిసి కొని మానుము

ఆ జీవుఁ డనఁగ మీరు చిక్కులు పడనేల
వాయు వాకసంబు వహ్నిఁ గూడి
దేహి యనఁగ నొప్పె దేహంబులం దొప్పి, వి.

జీవుఁ డనఁగ పంచభూతసముదాయ విశిష్టుఁడైయే యున్నాఁడు కాన నతనికై దుర్భ్రమలు నొందవలదు.

ఆ. జీవుఁడె యగసాలి క్షితిలోనఁ దెలియంగ
భావ మైన తానె పరమశివుఁడు
వాయు వనెడియతఁడె వసుధ బ్రహ్మముకాదె, వి.

అగసాలి సమస్తస్వర్గమునకు నాకృతి నేర్పఱచునట్లు లనే జీవుఁడును పరమశివుఁడు గనుక ప్రపంచమునందలి జీవరాసుల కాకృతుల గల్పించుచుండును

ఆ. జ్యోతియందుఁ బుట్టి సొంపైననాదము
బిందు వమరె నాదమందు దెలియ
బిందువందుఁ బుట్టె బృథివ్యాకాశముల్, వి.
జ్యోతి (వెలుగు) యందు నాదమును దానియందు
బిందువును అద్దానియందు పృథివ్యాదిభూతములును పుట్టినవి

ఆ జ్ఞానముద్రచేతఁ గనఁగ వచ్చెడితత్త్వ
కదియె మదికి శ్రేష్ఠమనుచు మునులు
పలికి రదియె తెలియ బరమార్థ మగునయా, వి.
జ్ఞానసంయమనమువలన గనవచ్చెడి తత్త్వమే శ్రేష్ఠ మని
పెద్దలు చెప్పిరి

తే జ్ఞానముజ్ఞానగతు లొప్ప జాడ లెఱుఁగ
నగును దైవజ్ఞులగు వార లరసి రేనిఁ
బాలు నీరును భేదింపఁ బరఁగు హంస
లట్టిసామర్థ్య మొప్పువా రవని వేమ. 1073
సులభము

ఆ. టెక్కె మెత్తి చెప్పు మొక్కఁడే దేవుఁడు
నిక్కముగను లోన నిలచియుండు
జక్కఁ జూచునతని సంతోషమున ముంచు, వి.
సులభము

తే. తత్పదము నెన్న ప్రత్యగాత్మమ్ము సుమ్మి
త్వంపదం బన బ్రహ్మరూపమ్మె కదర

అసిపదమ్మున లక్ష్యమ్ము నైక్యము గన
సోహమేర్పడఁ దెలియంగ జూడు వేమ. 1075

'సోహమస్మి' యనుమహావాక్యములోని తత్పదము ప్రత్యగాత్మయనియు అసిపదమున నాబ్రహ్మమే నేను అని యైక్యతను పొందవలయును

ఆ తథ్యమైనపూర్ణతత్త్వము నీలోన
మిథ్య నరయుగాను మిత్రమగును
సత్యనిత్యకర్మసాక్షి బ్రహ్మంబురా, వి... 1076

సులభము

ఆ తనదురూప మెల్ల తనలోనఁ జూచియు
మనసు దీపమునను మమత విడచి
యనుదినమును గాంచు నతఁడె పో బ్రహ్మము,వి

ఆత్మస్వరూపమును తన ఆత్మలో వీక్షించి సమస్తము నాత్మానుకృతిని జూచువాఁడు బ్రహ్మమున నైక్యము నొందును.

క. తనగుణము తనకు నుండఁగ
నెనయంగా నొరుని గుణము నెంచుచు మదిలో
దనగుణము తాను దెలియక
వసరి వసరి మనెడివాఁడు వ్యర్థుఁడు వేమా' 1078

తనగుణము తనకుండఁగా నితరులగుణముల నెంచెడి వాఁడు కేవలము వ్యర్థుఁడే యగును

ఆ తనదురూప మెల్లఁ దనలోనఁ జూచియు
మనసుదీపముగను మనుత విడచి
యనుదినమును గాంచునతఁడె పో బ్రహ్మంబు, వి.

మనోదృష్టి నాత్మరూపమును సనుదినమును లోపల అనఁగా అంతర్హృదయమునఁ గాంచువాఁడే బ్రహ్మస్వరూపుఁడు అగును

ఆ. తన్నుఁ దాఁ దెలిసిన దానె పో బ్రహ్మంబు
తనువులోనిముక్తిఁ దగిలియుండు
తన్నెఱుఁగనివాఁడు తానెట్టిబ్రహ్మంబు?, వి....
తనను తాఁ దెలిసికొనుటయే బ్రహ్మమగును ఇట్టిది తెలియనివాఁడు బ్రహ్మము కాఁజాలఁడు

ఆ. తన్ను వెదకి చూడఁ దానె యా జీవుండు
తత్త్వ మరయ నగును దానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయయు లేదయా, వి
ఆత్మరూపమును వెదకినచో తానే (అనఁగా జీవుఁడే) ఆబ్రహ్మస్వరూపమును చెంది కాన్పించునే కాని తదితరము ఆవంతయును లేదు

ఆ. తపము లేల యరయ ధాత్రిజనుల కెల్ల
నొనర శివుని జూడ నుపము గలదు
మనసు చెదరనీక మహిలోనఁ జూడరా, వి....
మనస్సును చలింపనీక కుదురుపఱచి ఈశ్వరుని గాంచెడి యుక్తి జనుల కెల్లరకు నుండఁగా నిఁక తపములు వ్యర్థములు.

తే. తపము మించినధ్యానంబు తత్పదమగు
విమలసుజ్ఞాన మనుప్రజ్ఞ విడిది గనుచు
నిర్ణయంబును గనుచుండు నేర్పుతోడ, వి. 1083

తమోగుణమును వీడి ధ్యానించుచు తత్పదవాచ్యుఁడై ప్రజ్ఞారూపమును గుర్తెఱుంగుచు నుండిన కైవల్యము గలుగును.

ఆ. తలఁచు తనువుఁ బాసి తలఁపులోఁ దను మఱచి
తాను నే ననఁ దగు తలఁపు మఱచి
యుండునాతఁడు గద యుత్తమయోగియా, వి.

ప్రాయశః శరీరముపై గలమమతను విడచి భేదదృష్టిని త్యజించి యుండెడివాఁడే గదా యుత్తమయోగి యౌఁదగును.

తే. తలపుమఱపులు లేనందు దాఁకినపుడె
తాను బ్రహ్మంబులోఁ జేరి తలఁగకుండు
తత్పదంబును మఱ గిన తానె బ్రహ్మ, వి....

స్మృతివిస్మృతులు లేనిబ్రహ్మములోఁ జేరి తత్పదమును మఱిగినచో తానే బ్రహ్మము అగును

ఆ తల్లి యొకతె భువిని దండ్రియు నొక్కఁడు
నెల్లలోకములను నెంచిచూడఁ
గల్లగాదు గౌరి కఱకంఠులే సుమీ, వి....1086

లోకమున కంతకును పార్వతీపరమేశ్వరులే జననీజనకులు వారికంటె నితరము మఱియేదియును లేదు

ఆ. తాను జన్మమెత్తి దానధర్మము లీయఁ
గర్మగతిని యముఁడు కష్టపఱచు
కర్మధర్మములను కడతోయ బ్రహ్మము, వి....

సులభము

క. తా నగుట యెఱిఁగి సర్వము
దా నగుటయుఁ దెలిసి యేకతత్త్వము తాఁ గాఁ
దా నెఱిఁగి పరిణమించిన
మానవునకు ముక్తి గలుగు మహిలో వేమా!

సులభము

క తా ననెడియహంకారము
మానక తను దానె చెఱుచు మైమఱపించుఁ
నేనని పలికెడివారికి
మానునె దుష్కర్మఫలము మహిలో వేమా!.

అహమస్మియనుగర్వభావమును త్యజింపనివారి కెచ్చటకు పోయినను దుష్కర్మఫలములు మానునా? మానవు

క. తా నవుట దెలిసి మది నొక
తానును లేకుండు టెల్ల దను దానె యనం
దా నెఱిఁగి పరిణమించిన
మానవులకు ముక్తి గలదు మహిలో వేమా!.

ఆత్మభావము నెఱింగి సమస్తము నాత్మరూప మగుట నెఱింగి ప్రవర్తించుమానవులకు ముక్తి తప్పక గలుగును

ఆ. తాను జన్మమెత్తి దానధర్మము లీయఁ
గర్మగతిని యముఁడు కష్టపఱచుఁ
గర్మధర్మములను గడఁద్రోయ బ్రహ్మంబు, వి.

సులభము

ఆ. తాను నింద్రియములఁ దనర జయించిన
దత్వ మరసి చూడ దాన యగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచు నుండు, వి....

తా నింద్రియజయము నొనర్చినచో తత్త్వమే తా నగున రాజయోగి యీభావము నెఱింగి ప్రకాశించుచుండును

క. తానును నేనని వేఱుగ
మానసమునఁ దలచునట్టి మానవుఁ డెటులుం
గానఁగ నేరఁడు తత్వము
మానులతోఁ దిరిగి యైన మహిలో వేమా!

విభేదబుద్ధి గలమనుజుఁ డెన్నినాళ్లు మానులలో కలసి తిరిగినను తత్వము నొందఁజాలఁడు

క. తానును నేర్పరియైనను
దానకములఁ దన్ను దాను తప్పించికొనం
దా నెన్నివిధములను మఱి
తానే పరమాత్మ యనుచు తలపర వేమా!

సులభము

ఆ. తాను పుట్టుచోట దాఁ జూచి పలికినఁ
దాను దిరుగుబుద్ధి ధరణిలోనఁ
దాను బుట్టుచోట తత్త్వంబు తలపోయ, వి.

తనపుట్టుకకు అగుమూలకారణములను విచారించిన (అనఁగా పంచభూతవివేచనఁ జేసినచో) మనస్సును విఱిగిపో వును. అట్టిదియే తత్వము అని యెఱుంగుము

తే. తామసంబంటు బుద్ధిని దగులఁ బెట్టి
నీమనిష్ఠలు మదియందు నిగుడఁ జేసి
కామవర్గము జయమంద గలుగు ముక్తి, వి....
సులభము

ఆ. దారకంబుఁ జూచు దారి వేఱుగఁ గద్దు
సమముగాను జూడఁ జక్కఁబడును
వెఱ్ఱిగాను జూడ వెలుగెల్లఁ బారురా, వి....1097
సర్వసమత్వముతో చరించిన నన్నియును చక్కఁ
బడును

ఆ. తావులేనిచోట తావు తానై యుండుఁ
దావు గలుగుచోటఁ దాను లేఁడు
తావు తాన యైన తత్వంబు తెలియురా, వి.
సులభము.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు మఱులుకొనుటె గాక
యందువలవ నేమి యాస గలుగు?
అంతరాత్మ నిలుపునతఁడె పో బ్రహ్మంబు, వి....
సులభము

ఆ. తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
యూరకున్నఁ జూడ నుర్విమీఁద
వాఁడగుపరమాత్మ వర్ణింప శక్యమా?, వి....
ప్రజలు చేయుదూషణభూషణలకు మాఱువల్కక
యూఱకున్నవాఁడు పరాత్ముఁడే యన వచ్చును అట్టివానిని
వర్ణింప శక్యము గాదు.

ఆ. తిరిగి తిరిగి నరుఁడు భ్రిమ్మరి కాఁగాను
యందువల్ల నేమి యధికమొప్పు
నంతరంగ మెఱిఁగినప్పుడే శివుఁడౌను, వి....1101

అంతరంగము నెఱింగిన శివుఁ డగునే కాని తీర్థాదుల వలన దిమ్మతిరుగుటచేత నిసుమంతయుఁ బ్రయోజనము లేదు

ఆ. తెలుపు ముక్కు చాయఁ దేఁగలిగినమీఁద
నందు గనఁబడునదె యరయ లేరె
అరసిచూడ బయలె యల్లదె ముక్తిరా, వి....

నాసామార్గమున ధ్యానస్తిమితలోచనుఁడవై యుండు నప్పుడు కన్పట్టెడిబయలే ముక్తి యని భావింపుము

ఆ. తెలుపువాఁడెవండు తెలియువాఁడెవ్వఁడు
గుట్టెఱుంగునంత బట్టబయలు
సారధి భాండమందు సూర్యునిచందంబు, వి....

ఘటములో సూర్యుఁడు ప్రతిఫలించినరీతిగా జ్ఞాతజ్ఞేయస్వరూపుఁడై ఈశ్వరు డుండును

ఆ. తేకువమర బుద్ధి తెల్లముగా నిల్పి
తాక నది ప్రణవపుధ్యానమగును
సోకి మించువాఁడె సురలోకమును బొందు, వి.

బుద్ధిని దృఢముగా నిల్పి ప్రణవమున ధ్యానించుచు చిత్కళ నంటినచో సురలోకము నవశ్యము నొందును. అనఁగా దేవత్వము నొందు ననుట

ఆ. దాన మమరఁ జేయు దరిఁ జేర్చు నయ్యది
మనమె నమ్మె నేని మాయముంచు

జ్ఞానకలిక నమ్మఁ జంపురా వైరుల, వి.... 1105

ఊహ్యము

క. దృక్కునకు దృశ్యమునకును
మక్కువతోఁ భేద మెంచ మఱిలేదునువిూ
దృక్కునకు దృక్కు బ్రహ్మము
నిక్కము నీయందు నిండి నెగడును వేమా!

దృగ్దృశ్యములకు భేదము నెంచలేదు దృక్కును దృశ్యమును రెండును బ్రహ్మస్వరూపమున నీయందే నిండి యున్నవి

ఆ దూలములను బోలుదురవస్థలవి యెల్ల
రోసి యాస లన్ని కోసివైచి
వాసనఁ దెలిసిన వాఁడెపో బ్రహ్మంబు, వి....

స్థూలాకారములగు వాసలను నశింపఁజేసి పూర్వకర్మ వాసనను తెలిసికొన్నవాఁడు సాక్షాత్తు నీశుఁడగును.

క. దేహియు జ్ఞానానలమున
దాహంబై దేహ మెల్ల తల్లడపడఁగా
దేహములోఁ బొర్లాడుచు
మోహము విడ శివుని జూడు ముక్తుఁడు వేమా!

దేహము జ్ఞానాగ్నిచేత దగ్ధమై తల్లడపడునప్పుడైనను మోహమును వీడి శివుని జూడుము అదియే ముక్తి యనుకొనుము

ఆ. దైవఘటన లేక దైవసుజ్ఞానం బ
దేల వచ్చు రెంటి కెఱుకపడక

యెఱుక నెఱుఁగువాని కెఱుకలోఁ గనిపించు, వి.

ఈశ్వరుని ప్రేరణ లేక జ్ఞానము కలుగనేరదు. అట్లు గాక ఈశ్వరుని ప్రేరణయే యున్నచో వానికి జ్ఞానముననే కనిపించును

ఆ. దొడ్డవాండ్ర మనుచు త్రోవ డొంకలు గొట్టి
యడ్డ మైనజనుల నంటగట్టి
దోఁచుకొన్న నట్టి దోష మెక్కడఁ బోవు?, వి.

సులభము

ఆ. ద్విజుల ఖేదపెట్టి తిట్టఁ దొడగువాఁడు
మృతిని బొంది తాను వెతలఁబడక
కాలుదరిని జేరు గడతేఱలేఁడయా, వి....

సులభము

క. ధూమాదుల నావృతమై
వ్యోమంబున కెగసి కలియు నుపమను దనలో
శ్రీమించు శివుని జేరును
కామాదుల గలియఁ డతఁడు ఘనముగ వేమా!

వాయుతత్వము ధూమాదుల నావృతమై ఆకసమున కెగసి నభస్తత్వములోఁ గలసి శివునిఁ జేరును ఇట్టియోగము గలవాఁడు మఱల విషయలోలుఁడు కాఁడు

ఆ ధరను దేవళముల తగులువీడిన వాఁడు
తనువు గుడిగఁ జేసి తన్ను నిలిపి
లోకబుద్ధి విడిచి లోచూపుఁ జూడరా, వి....

విగ్రహారాధనబుద్ధి నశించినచో శరీరమునే ఆలయము గాఁజేసి యందు తనయాత్మనే నిలిపి లోకసాధారణదృష్టి వీక్షించినను ముక్తి కలుగును

క. నాదము బ్రహ్మం బనుచును
వేదములను జదువవచ్చు విని కనినంతన్
నాదంబు లేనిబయలున
నాదాంతమె పూర్ణపదవి నయముగ వేమా!

నాదమె (శబ్దమె) బ్రహ్మంబని వేదములందు చదివి తెలిసికొనవచ్చును ఇట్లు సర్వదా మననము చేయుచున్నచో నాదాంతమగు పూర్ణపదవియే బ్రహ్మమని సాక్షాత్కరించును.

క. నాదము ముక్తికి తెఱువగు
బాధను తెలియంగ నగును పరిపక్వముతో
భేదంబు మాని మదిలో
వేదికపై జేరి వినుము వినువక వేమా! 1115

విభేదబుద్ధిని పరిత్యజించి శబ్దమునను కారణభూతమై నదాని నుపాసించవలయును

క. నిండినమతమున వెదకిన
నుండెడి నేవస్తువైన నుపము దలిర్పన్
దండిగ నిండినపిస్తుట
ఖండించిన వెల్తిగాదు గదరా వేమా! 1116

పూర్ణమగుమతమునందు ఏవస్తువైనను దొరకును

ఆ. నిన్నుఁ జూచె నేని తన్ను దా మఱచును
దన్నుఁ జూచె నేని నిన్ను మఱచు
నేవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును దన్ను, వి.

నిన్నుఁ జూచినచో తనను దా మఱచును (ఇచ్చట నిన్ను తన్ను శబ్దములు ఆత్మ దేహముల కన్వయించును) తన్నుఁ జూచినచో నిన్ను మఱచును ఇట్టి స్థితిలో నుభయము నెఱుఁగఁగల్గుట కష్టతరము

తే నిముషమైనను మది నిల్పి నిర్మలముగ
లింగజీవేశులను గాంచి భంగపడక
పూజ మదియందుఁ జేరుట పూర్ణపదవి, వి....

ఒకనిమేషమైనను మనస్సును నిల్పి నిర్మలదృష్టితో జీవేశుని పూజించినచో పరిపూర్ణత్వము నొందును

ఆ నియతిం౦ప్రవృత్తి మీఱి నిటల దృగ్గముఁ జేఱి
భయము లేకయుండు బ్రహ్మవేత్త
జయము గల్గ ముక్తిఁ జవిచూచుచుండురా, వి.

నియమముతో నిర్భీకుఁడై బ్రహ్మము నుపాసించువాఁడు జయమును ముక్తిని పొందఁగలుగును

క. నిరతం బెడ తెగకుండఁగ
పరిపూర్ణబ్రహ్మ మాత్మపదమున నుండఁగ
నిరవద్యమైననడవిని
జరియించుము జగమెఱుంగ సత్యము వేమా!

సర్వదా పరిపూర్ణమగు బ్రహ్మము నాత్మపదమున నెల కొల్పి నిర్దుష్టుఁడవై సంచరింపుము

ఆ. నిహాతిపుట్టువులకు నెల మిహా మందురు
కుహారలోకమందు గుతుక మేది?
దహారమందుఁ జూడఁ దగులును దత్త్వంబు, వి.

జననమరణములకు ఇహమే కారణమందురు గాని పరమ లోకమందు గుతుకము కానరాదు. దహరమునందుఁ జూచి నచో తత్త్వంబు తగులును.

ఆ. నిర్గుణాంశము మది నెన్ని నేర్పు మీఱ
స్వర్గ మని యెంచుచుండిన శాశ్వతంబు
భర్గుఁడై తాను బాముల పాపునయ్య, వి ...
నిర్గుణమగు నంశమును కనిపించి నేర్పుతో తా ననా రతము తద్ధ్యానస్తిమితుఁడైనచో భర్గత్వము నొంది పాపములఁ బాపఁగలుగును

తే. నిష్ఠయందును దృఢమైననిష్ఠఁ బూని
కష్టయోగంబులను మించి కాంక్షదీఱ
వృష్టిపరిపూర్ణ మందుట నదలకున్న
స్పష్టమపుడాను సంతోషసరణి వేమ. 1128
సులభము

క. సీమము పెట్టుక ద్రవ్యము
కామంబునఁ గొనుచు భువిని కల్లరికూశల్
సేమముగ బల్కుచుండిన
గోమటు లోకకొంధఱుంద్రు, కుంభిని వేమా!
ద్రవ్యమే ప్రధానముగాఁ గైకొని లోకులను వంచిం చుటకు అసత్యము లాడువారీలోకములో గొందఱు కలరు.

క. నీరనుఁ బుట్టిన దుప్పగు
క్షారము నీరాయె నీరు క్షారము నొకచే

యీరీతి శివుని జీవుని
వారక మది నెఱుఁగ నగును వసుధను వేమా!

నీటివలనఁ బుట్టినది క్షారము క్షారము నీటిస్వరూపము
ఇదేవిధమున జన్యజనకతాదాత్మ్యము నూహింపవలయును

క. నీవాడిన నేనాఁడుదు
నీ వుండిన నేను నుందు నిర్విణ్ణుఁడనై
నీవు దలంచిన దలఁపుదు
నీవు నగిన నేను నగుదు నిజముగ వేమా! 1126

పరమాత్మ సాక్షిరూపుఁడు నీవెట్లు సంచరించుచుం
డిన అయ్యదియు నట్లట్లున్నరీతిని దోఁచుచుండును

తే. నీవు నెఱిగను లోకంబు నీకుఁ దోఁచు
నీవు మఱిగినతోడ్తోడ నెందుఁ బోయె
ననెడియెఱుకను విడనాడు నయ్యయోగి
దానఁ బరమార్థ మెఱుగంగ నౌను వేమ 1127

నీకు సర్వదా సహచరమై యుండి సమస్తవిషయము
లను నీకెఱింగించుయెఱుక నీవు మృతినొందినపిదప ఏమగునో
తెలిసికొన్ననేని యందే పరతత్త్వము గలుగు

క. నేఁ జచ్చినతోడనె మఱి
దాఁ జచ్చును నపుడె పంచతత్త్వము లోకప్రా
రాజత్స్వరూపమందును
రాజితుఁడై నిలచియుండు తథ్యము వేమా!

సులభము

ఆ. పంచభూతములను బరగియుండినవాఁడు
పంచలింగములను బ్రబలియుండు
పంచభూతములును భావింపఁ దానయా, వి....

పంచభూతములును పంచేంద్రియములును పంచలింగములును పరేశ్వరుని రూపులు

ఆ. పంచభూతములను బరఁగ నింద్రియముల
సంచరించినపుడు జగము కలుగు
సంచరింపకున్న జగమెట్లు కలుగునా?,వి....1130

పంచభూతములతోడి సంయోగమున నింద్రియములు చరించెనేని జగము లుత్పత్తియగును

ఆ పటిమమీఱ మనసుఁ బాటించి చూడక
కిటుకుఁ దెలియరాదు కెరలుటకును
జటిలవేష మేల జైత్రుఁడై సాధింప, వి ...1131

మనస్సును పటిమతో నిల్పక యందలికిటుకును తెలిసికొనఁజాలక జటిలవేషమును వేయఁ బ్రయోజనము లేదు

ఆ పటుతరంబుగ తనయాత్మభావ మంది
నిటిలదుర్గముపై నున్న నియతిమీఱ
ఘటము మఱచినవాఁడె పో ఘనుఁడు సుమ్ము, వి.

తాను ఆత్మభావము నొంది నాసాగ్రగామియగు నీశుని గుర్తించి శరీరము మఱచినవాఁడే ఘనుఁడు

క. పంతము విడకయె నెమ్మది
చింతనమున గుర్తు దెలసి చిన్మయమందన్

వింత లడంగును మానస
మింతింతని చెప్పరాని దెఱుఁగుము వేమా!

పట్టినపట్టు వదలక ధ్యానించుచుండిన చిత్స్వరూపము నొందఁగలఁడు

ఆ పనితొడవులు వేఱు బంగార మొక్కటి
పలుఘటములు వేఱు ప్రాణ మొకటి
యరయ దిండ్లు వేఱ టాకలి యొక్కటి, వి ...

వస్తువు ఒక్కటియైయును చెక్కడములు వేఱునగుటచేత వస్తువులే భిన్నములుగా గాన్పించునట్లు ప్రాణులు కాన్పించును

ఆ పరగ బొందులు పది ప్రాణంబ దొక్కటి
పుష్పజాతులు పది పూజ యొకటి
పసులవన్నెలు పది పాలన్ని యొక్కటి, వి....

సులభము

ఆ. పరధనంబునకును బారుగాఁ జేచాచి
సత్య మింత లేనిచట్టుద్విజులు
ద్విజుల మనుచు నెంత్రు తేజ మింతయు లేక, వి.

సులభము

ఆ పరగ బొమ్మగుడ్లు పరికించి చూచిన
గులములెన్ని యుండె కూడి పుట్టె
నంద యొకటఁ గలియు నన్నదిమ్ములె కదా! వి....

జీవము ఆకృతి అందము మున్నగువానిని బరికించి చూచినచో సర్వము నేక మనియే తోఁచును

క. పరులను నీవని తలఁచెడి
పరబుద్ధిని మీఱ కీవు పదరక యున్నన్
స్థిరవేత్తృ తందు దోఁచెడు
పరిపూర్ణమె బట్టబయలు బాగుగ వేమా! 1138

ఇతరులను మీరు అనెడిభేదబుద్ధిని వదలి సమత్వము నవలంబించెదవేని బ్రహ్మస్వరూపము పరిపూర్ణముగా బట్టబయలగును

ఆ. పరులు చదువఁ జూచి నిరసనబుద్ధితోఁ
బట్టిమాటలాడు వట్టివాఁడు
అట్టివానిబ్రదుకు టది యేల మంటికా?, వి...

ఇతరులు చదువుకొనుచుండుటను జూచి హేళనచేయు వాఁడు వ్యర్థుఁడు

ఆ. పలుక మన్న నేల పలుకక యున్నావు?
పలుకు నన్ను జూచి ప్రబలముగను
పలుకుము మ్య నీదుపలుకు నే నెఱఁగద, వి....

బ్రహ్మమా! నాకు నీవే తోడు, పలుక మనినను ఏల పలుకకున్నాఁడవు? పలుకుము నీపలుకును నే నెఱింగెదను.

ఆ. పలుగురాళ్లఁ దెచ్చి పరగ గుడులు గట్టి
చెలఁగి శిలలసేవఁ జేయు నేల?
శిలలసేవఁ జేయ ఫలమేమి గల్గురా?, వి ...1141

రాళ్లతో గుళ్లుగోపురములు గట్టి యర్చన చేసినంత మాత్రానఁ గొంచెమైనను ఫలము గలుగఁజాలదు

క. పాలు ద్రాగినపుడు ప్రాణంబు రక్షించుఁ
బాలు ద్రాగకున్న బడలి కొను
పాలవలన ముక్తి ఫలమందఁగా లేక
చాల రోగపడును జగతి వేమ 1142

పాలు సమస్తమునకు మూలాధారము

ఆ. పాలు పెరుఁగు వెన్న పంచగ నన్నము దిని
స్త్రీల గననివాఁడు శీలవంతుఁ
డొకఁడె నవాఁడె యుత్తముఁడగుఁ దయా, వి ...

సులభము

ఆ. పిండ మండమందు బెరుగుచున్నట్టి
తండ్రి బిందునాదు గనరఁ గూడి
యండమే నిలిచినయపుడు గర్భ మటంద్రు, వి ...

పిండము గర్భకోశముఁ జేరి బిందునాదుల నొంది యండరూపము నలిచె నేని గర్భ మని పలుకుదురు

ఆ. పిండ మండము నడిబిందు వాత్మజ్యోతి
యుగ్మజ్యోతి సరసిజాండమందు
నాదబిందువులకు నడుమ సద్భాగజ్యోతి, వి....

పిండాండములనడుమబిందువున సరసిజాండమందు సూర్యనిజ్యోతియును నాదబిందువులనడుమ పరమాత్మయును వెలుఁగుచుండును

ఆ. పిడుగుపడిన తావు దహపడగా నుండు
పిడుగుపడినఁ గొంప నడికి గూలు
పిడుగుపడినవాని ప్రేత మేమనవచ్చు, వి ...

సులభము

ఆ. పిన్నవాండ్ర స్వేచ్ఛ యున్ననఁ జెఱచును
ఆఁడువాండ్ర స్వేచ్ఛ గోడొనర్చు
పురుషవరుని స్వేచ్ఛ భూమిని గూర్చుగా, వి....

పిన్నవాండ్రకు స్వేచ్ఛ యిచ్చినచో లక్ష్యము తొలఁగి పోవును స్త్రీలకు స్వేచ్ఛ యిచ్చినచోఁ గీడు తెచ్చును. పురుషునికి స్వేచ్ఛ యిచ్చిన [illegible] గూర్చును

క. పిరిగొనుహంసను మదిలోఁ
బిఱబిఱ గుంభించి పట్టి బి[illegible]రవోకఁ
స్థిరభావసిద్ధి గైకొని
పరిపూర్ణసమాగమమును బడయుము వేమా!

హంసస్వరూపమును మనస్సులో కుదుటపఱచి భయముఁ జెందక స్థిరత్వమును గైకొని పరిపూర్ణసమాగము నొందుము

క. పిండము పృథివిని బడఁగా
నండని తగుమంత్రసాని యది దెల్పును దా
మెండుగ మగవాఁడను గద
దండిగ నీజనము లెఱుఁగ నరలో వేమా! 1149

సులభము

ఆ. పిఱుగును నరచేత బిగబట్టి యందులో
గల్మషంబు లెల్లఁ గడక్కు తీసి
కడమకరముచేత గలిజనములఁ బ్రోచు,వి....1150

దైవము అమేయమహిమోపేతుఁడు పిడుగునైనను అరచేతఁ బట్టుకొని పాపములఁ బోఁద్రోలి యాప్తుల నాశ్రితులను రక్షించును

క. పిలిచిన పలుకును దేవుఁడు
పలుకున నే నిండియుండి ప్రభువై యుండున్
వెలుఁగున వెలుగై మించెడు
వెలుగే పరమాత్మ బయలువిషకరి వేమా'

సులభము

ఆ. పిసినివాని యింట పీనుఁగు వెడలినఁ
గట్టెకోలలకును గాసు లిచ్చి
వెచ్చమాయె నంచు వెక్కి వెక్కి యేడ్చు, వి.

లోభి తనయింటిలో పీనుగు వెడలినను ఖర్చు అగునే యనియే దుఃఖపడుచుండును

ఆ పుట్టినపతివానిఁ బూజింప దోషంబు
యురమునుదతివాని యూహ లెన్న
నత్తియువిదవాని బత్తియే వరమిచ్చు, వి....

బ్రహ్మ ఈశ్వరుఁడు వీరద్దఱిలో విశ్వరుని సేవించుటయే యుత్తమము

ఆ పుట్టలోను తేనె పుట్టినరీతిని
గట్టుమీఁద మణియుఁ బుట్టుచుండు
కట్టెలోన నగ్ని పుట్టినవిధమునఁ
బుట్టి మెట్టవలెను భువిని వేమ. 1154

పుట్టలో తేనె పుట్టి ట్టులును కట్టెలో నగ్నిబుట్టిన విధమునను జ్ఞానము పుట్టవలయును

ఆ. పుట్టి చచ్చు నరుఁడు పూర్వమే మెఱుఁగక
బట్టబయలనుండి భ్రమసి యైనఁ
దెలివి విడిచి భూమి దిఱుగంగ నేటికి?, వి.... 1155

సులభము

ఆ పుట్టినదియు మొదలు పురుషుఁ డేర్పడు దాఁక
మంత్రసానిగూడు మఱిగి యంత
పోయిరావె యనుచు పుత్తురు సెలవిచ్చి, వి....

జన్మించి పురుషుఁ డేర్పడునంతకును మంత్రసాని నుంచి పిమ్మట పంపివేతురు అనఁగా కార్య ముండినంతవఱకును లోకులు ఆదరింతురు

ఆ. పుట్టినపుడె బొడ్డు పట్టి కోయుచు నుండ
నప్పుడు గురుముద్ర లానతిపడె
ముద్ర లేనివారు ముజ్జగంబుల లేరు, వి.... 1157

పుట్టినపుడే బొడ్డు కోయుచునుండి నప్పుడు గురు ముద్రలు పడినవి కావున నిలోకమునందు ముద్రలు లేనివారలే లేరు

తే పుట్టినప్పుడు తెచ్చెనే పుడమి విడచి
గిట్టునప్పుడు గొనుపోనో యట్టిధనము
నడుమ నీయాజ్ఞ వచ్చెఁ ద్రినేత్ర యనుచు, వి.

సులభము.

ఆ. పుట్టుటకును మునుపు గిట్టుటకును వెత
యెంత రెఱిఁగినట్టిదైన విద్దె
చచ్చువాఁడె పుట్టఁ జప్పున నేడ్వరే?,వి... 1159

సులభము

ఆ. పుట్టువార లెవరు పుట్టకుండు రెవరు
పుట్టి పుట్టనట్టిపురుషు లెవరు
పుట్టి పుట్టనట్టు బోధించి చూడఁగా,వి... 1160

సులభము

ఆ. పుట్టుశక్తు లైదు పుడమి నటింపంగ
విప్రులెల్ల వేదవేత్త లందు
శక్తిపుత్త్రకులము జగతి నెఱుంగరో, వి....1161

శక్తిపంచకము పుడమి నుండఁగా విప్రులందఱును వేదవేత్త లగుచుందురే కాని శక్తిపుత్త్రనికులము నెఱుంగరు.

క. పుడమిని గలనడజీవులు
బడబాగ్నియు దీవుకును భానుని యెడలన్
జడమును గూడినయప్పుడె
వెడలని ప్రళయంబులకును విధమిది వేమా!

ఊహ్యము.

ఆ. పుడమిలోన నరులు పుత్త్రులఁ గనఁగోరి
యడలుచుందు రనుపమాశచేతఁ
గొడుకు కలిగినంతఁ గుల ముద్ధరించునా?,వి....

ప్రపంచమునందు మనుజులు పుత్త్రులఁ బడయఁగోరి

బడలుచుందురే కాని కొడుకు పుట్టినమాత్రాన కులము నుద్ధరించునా? ఉద్ధరింపఁడు

ఆ. పుత్రసంతు లేక పుత్త్రుండు జగతిలోఁ
బుణ్యలోక మెట్లు పొందఁగలఁడు?
పుత్రహీనునకును బుణ్యంబు గల దెట్లు?, వి....

పుత్రసంతతి లేక పుణ్యలోకములు గల్గవు

ఆ. పురుషచిహ్నఁ జూడ బుట్టె స్త్రీలకు భ్రమ
పురుషుఁ డేహ్యమనుచుఁ బుట్టరాదె
శివుఁడు పురుషుఁ డైన స్త్రీలకు జిక్కునా?, వి....

పురుషచిహ్నముఁ జూచినతోడనే స్త్రీలకు మోహము కలిగెను గాని ఏహ్యత ఏల కలుగలేదో కదా!

క. పురములు నాఱిఁటిపై నొక
పురమందున మూలశక్తి పూనిక గనుమా
యురమున గురి గనినంతట
పరిపూర్ణపుబ్రహ్మరూపు బయలగు వేమా! 1166

ఆరుపురములపై నుండు నొకపురమున నున్నమూలశక్తిని గుఱితో గనినచో బ్రహ్మస్వరూపము బయలగును

ఆ. పురహరునకు నేతపురువు తా నేసిన
స్థిరము కలుగు జ్ఞానజీవమయ్యె
నేతి కేమి వచ్చె నిజభక్తహేతువు?, వి....1167

ఈశ్వరునకు వస్త్రము నేయుటచేత పుర్వునకుఁ గూడ చక్కనిజ్ఞానము కలిగెను. వస్త్రమున కేమి గాని భువిలో భక్తియే ప్రధానము

ఆ. పునుగుబిల్లి యేల పుట్టించు వాసన
ల్దానినుహీను లేమి ధరణిలోన
బ్రహ్మచేతలెల్ల పాడైనచేతలు, వి.... 1168

సులభము

ఆ. పురుషుభాగ్యముననె పుణ్యవతిదొరకుఁ
బుణ్యవతికినట్టె పుట్టు సుఖము
నిరువు రనుభవింప నెసఁగును సంతతి, వి....

సులభము

ఆ పూజ సేయుఁ జేయుఁ బూజారి తానాయె
పూజ్యవస్తు వెన్న భువిని దానె
ఏడఁ బూజసేయు నెల్లదిక్కులు తానె, వి....

పూజసేయు గా సేయు గా తాను పూజారియును పూజ్యవస్తువునయ్యెను సమస్తమును వ్యాపించియుండుటఁజేసి పూజసేయ నిఁక తావు లేదు

తే పూని సుఖదుఃఖముల విరాటి లోనఁ జేరి
తాను తానగుతత్వంబుఁ దాకి తాకి
పోరి పరిపూర్తి నొందుట పుణ్య మయ్య, వి....

సుఖదుఃఖములను లక్ష్యము సేయక తాను తానగుతత్వమును గమనించి ధ్యానించి పూర్ణస్వరూపము నొందుటయే మేటిపుణ్య మగును

క. పూర్ణమగుము క్తి యోగికిఁ
బూర్ణము సాధనము సపరిపూర్ణము సంసా

రార్ణవతారకగోచర
పూర్ణము పరిపూర్తిఁ జెందఁ బూనుము వేమా

సులభము

ఆ. పెక్కుచదువు లేలఁ బెక్కువాదము లేల?
నొక్కమనసుతోడ నూరకున్న
సర్వసిద్ధుఁ డగును సర్వంబుఁ దానగు, వి....

పెక్కువాదములకంటెను ఒక్కమానసుతోడ వివేచన చేసినేని సర్వమయస్వరూపుఁడగు దైవమే తానగును

ఆ. పెట్టువార లెవరు పెట్టకుం డ్రెవ్వరు
పెట్టి పెట్టనట్టి దిట్ట లెవరు
పట్టుఁ దప్పకుండ భావించి చూడరా, వి....

సులభము

ఆ పెట్టిపోయువాఁడు కట్టడిగలదాత
తిట్టిపోయువాఁడు తుట్టెపురువు
రట్టు సేయువాఁడు రాణింపునకు రాఁడు, వి....

సులభము

ఆ పెరటఁ జెట్టు వెట్టి పరికింపకుండిన
వెలుఁగుదాటి తీఁగ వెడలబాఱు
నాఁడుదాని గుణము నటువలె నుండురా, వి....

పెఱడులో చెట్టువైచి మఱల దానిపై లక్ష్య ముంచకున్న నెట్లు కుమార్గమునఁ బడునో ఆఁడుదాని గుణములు గూడ నట్టులనే యుండును

ఆ. పొట్టివాఁడు కీడు పొడలపురుగు కీడు
వట్టిమాట కీడు వరడు కీడు
పొట్టిచేయికాలు పొసఁగుట కీడురా, వి....1177

పొట్టివాఁడు పొడలపురుగు మున్నగునవి యన్నియును కీడును దెచ్చును

క. పొందుము హృది గురిదగు నా
నందము సదసద్వివేకనాదము పైగా
నిందించు భ్రమల నెల్లను
సందీయనబయలు చేరు సాక్షిగ వేమా!

భ్రమరహితుఁడై ఈశుని హృదయమునందే పొడుకొలిపి తత్త్వపల్యము నొందుము

ఆ. ప్రణవమంత్రమహిమ భావింప లింగంబె
మూఁడుమూర్తులందు మొనసి యుండు
మాన్యులెఱిఁగి కొలువ మనుజుల శక్యమా, వి.

ఓంకారమహిమమే పరికించిచో త్రిమూర్త్యాత్మకమై తేజరిల్లును కావున నట్టిదానిని సేవింపుము

క. ప్రత్యక్షము రవిచంద్రులు
ప్రత్యక్షము వాయు వగ్ని పానీయంబుల్
ప్రత్యక్షము భూదేవత
ప్రత్యక్షము విశ్వ మెల్లఁ బరఁగెడి వేమా! 1180

ప్రపంచములో నున్న రవిచంద్రాదిభగవదంశము లెల్లను ప్రత్యక్షమే గనుక ఈశుఁడును ప్రత్యక్షుఁడే యని భావింపుము

ఆ. ప్రణవ మెఱుఁగ నతఁడు భక్తుండు తాఁగాఁడు
జ్యోతి జూడ నతఁడు జోగిగాఁడు
నిత్య మెఱుఁగ నతఁడు నిర్వాణి కాఁడయా, వి

ఓంకారము నెఱుఁగనివాఁడు భక్తుఁడు గానట్టులే జ్యోతినెఱుంగనివాఁడును, నిత్యమును గుర్తింపనేరనివాఁడును యోగియును నిర్వాణియును కాఁజాలఁడు

క ప్రత్యక్ష మగుము శివ యని
నిత్యము మదిలోనఁ దలఁచి నిలచినయపుడే
సత్యముగ జ్యోతి కనఁబడు
నిత్యములో తృప్తిఁ జెంది నెరయుము వేమా!.

సాక్షాత్కరింపుము శివా యని ప్రతిదినమును మనస్సున ధ్యానించుచుండినచో నిజముగా జ్యోతి (ఆత్మరూపము) ప్రత్యక్ష మగును తద్దర్శనము నొంది సంతుష్టుఁడవగుము

క ప్రథమమున మాతృదేవత
పదపడి జనకుం డటగును బిదికింపనిక
గుదిరినపదములగురుఁడే
తుదిదైవము పెరలు వేరు తోరము వేమా!

తొలుత తల్లిదండ్రులును పిమ్మట గురువును దైవరూపులగుదురు ఇంతకంటెను వేఱు లోకమందు లేరు

ఆ ప్రభుల కిచ్చునట్లు పండితులకు నీరు
వనిత కిచ్చునట్లు నరుల కీరు

సురకు నిచ్చునట్లు సుధకును నీయరే, వి....

సులభము

ఆ ప్రవరయున్న పేరు పరిఢవిల్లిన నేమి?
దానియందు నేవు తగిలె మీకు
నిజము దెలియ మీకు నిత్యము పూజ్యులు, వి.

ప్రవరయున్నను పేరున్నను ఏమి కూను ప్రయోజనము లేదు

ఆ ప్రాకటముగ నింత లోకమందున గంటి
పల్లెము లెం డెన్న పరమగుణుఁడు
అన్నదానమునను హరిపూజ చేతను, వి....1186

లోకములోని యితరులా భిక్షులకన్నను సత్వగుణప్రధానుఁడై యన్నదానము హరిపూజను చేయు గంటిపల్లె ముత్తిఁడు శ్రేష్ఠుఁడు

ఆ ప్రాణబంధములను పంటకాపెఱుఁగునా
యెఱుకగలుగు జ్ఞానియెఱుఁగు గాక
ముద్రలందు లేదు మూలమందే కాక, వి....

ప్రాణబంధములను పంటకాపు ఎఱుంగఁ జాలఁడు. గాని యోగి యెఱుఁగఁగలఁడు

ఆ. ప్రాణముగును గాలి బ్రహ్మాండ మగు మేను
మిత్ర చంద్ర శిఖులు నేత్రచయము
మఱియు దేవుఁ డిఁకనుమహి మీఁద నెవరయా, వి.

పంచభూతస్వరూపుఁడే దేవుఁడు. గాని తదితర మేదియును లేదు.

ఆ. ప్రాణ మిలను లేక పరమంద(గా రాదు
ప్రాణముండ(గానె పరము కలదు
ప్రాణి పరము గనుట భావింప నేరదు, వి....1189

ప్రాణమున్ననే పరము నందవచ్చును లేకపోయినచో పొంద జాలరు కావున ప్రాణి పరము గనుటను భావింపవల యును

ఆ. ప్రాణరక్షణ కిల పరమశివునిమీ(ద
ధ్యాన మమర లేమి దగిలి నరుడు
పుట్టు చచ్చుచుండు పుడమిని పుణ్యు(డై, వి....

ప్రాణసంరక్షణభారమును ఈశ్వరునిపై( బెట్టనికత మున మనుజుడు పెక్కుమారులు పుట్టి చచ్చుచుండును

ఆ. ప్రాణిచేరునా(డు పర(గ దేహమునకు
హాని లేక యుండు నరకు నటు
ప్రాణి పోయినపుడు పనికిరా దీదేహ
మనుచు( బలుకుదు రిల జనులు వేమ 1191

ప్రాణిచేరిన శరీరము పనికివచ్చుననియును లేనిచో పనికిరాదనియును లోకులు పలుకుచుందురు

ఆ పృథివివారి కెల్ల( బెట్టును నొకగిన్నె
పొత్తు గుడిచి కులము పొలియ( జేయు
తలను చేయి వెట్టి తన నమ్మ( జెప్పును, వి....

ఎల్లవారికని సర్వసమత్వమును జూపి ఒక్కచోటున సమావేశము( గుదిర్చి నీతి( జెప్పును

ఆ. ప్రొద్దుపొడుచుచోటఁ బ్రొద్దు నిలుచుచోట
ప్రొద్దుగ్రుంకుచోటు బొసగఁ జూచి
ప్రొద్దెఱిఁగినవాఁడు పొలుపైనయోగిరా, వి...

ఉదయాస్తమయములందలి యాథార్థ్యము నెఱింగి ప్రవర్తించువాఁడు ఉత్తముఁడగుయోగి

ఆ ప్రియము లేనివిందు పిండివంటల చేటు
భక్తిలేని పూజ పత్రిచేటు
పాత్ర మెఱుఁగని యీవి బంగరుచేటుగా, వి....

సులభము

ఆ ప్రొద్దుపొడుచు టెఱిఁగి ప్రొద్దునడ యెఱింగి
ప్రొద్దుగ్రుంకునట్టిపోలి కెఱిఁగి
ప్రొద్దు దెలియునతఁడె పొలుపొంద బ్రహ్మంబు,వి.

కాలపుపరివర్తనములను పరికించినవాఁడే బ్రహ్మస్వరూపుఁడగును

ఆ ఫణితి దెలిసి మాఱు పల్కుటే యుక్తము
గణన కెక్కునట్టి ఘనుఁడె యెపుడు
గుణము లేకయున్న గుదురునే యూహాలు, వి.

రీతిని గుర్తించి ప్రత్యుత్తరమును చెప్పుటయే యుత్తమము ఇట్టిగుణము లేనిచో నూహలు కుదురఁజాలవు

ఆ ఫలక మొకముచేత బట్టి ఖడ్గం బూన
బంటుతనము రాదు ప్రతిభ లేమి
వీథిలోను దిరుగ వెలఁది పురుషుఁ డౌనె, వి....

డాలు డవాలును బూనినమాత్రాన బంటుతనము రాదు.
ప్రతిభ లేక వీధిలో దిరిగినంతమాత్రాన పురుషుఁడగునా?

ఆ. ఫలము లేని కార్యములు సేయ నొల్లరు
కలజనంబు లెల్ల నిల నిజంబు
ఫలము మంచిదైన బరఁగుందు ముదమందు, వి.

ఎవరైనను నిష్ప్రయోజనముగా నేపని నైనను గావి
నమ్మి తలపెట్టరు ఆఫలము మంచిదైనచో సంతసింతురు.

ఆ. ఫాలనేత్రుఁడైన భావింపలేఁడయా
ఆలి మీఱఁ బెట్టి యాదిమదన
గోలయనుచు నమ్మఁగూడఁగ వెఱ్ఱియై, వి....1199

ఈశ్వరునంతటివాఁడైనను స్త్రీకిస్వాతంత్ర్యము నిచ్చి
నచో తద్వర్తనమును గుఱుతింపలేఁడు

ఆ. బంగి త్రాగి తిరిగి బకము చాడ్పున నుండ
సంగ్రహింపరాదు చంద్రకళలు
బ్రుంగు మనని లోఁది మిన్నంది యుండరా, వి.

బంగి త్రాగి కొంగవలె దొంగజపము చేసినను చంద్ర
కళలు లభ్యములు కావు

ఆ. బట్టత్రాళ్లతోను బంధించి గట్టిగా
లింగ మొనరిపొమ్ము దొంగిలింప
నాత్మలోనలింగ మటుపలెనే యుండు, వి....

సులభము.

ఆ. బంగి త్రాగువాఁడు భావము నందఁడు
నింగి కెగయు కైపు నిల్వనీదు
లింగమమర బంగి లీలను చెందురా, వి.... 1202

సులభము

క బట్టబయలందు శ్వాసము
ముట్టుచు నెగరోజి పట్టి మూలమునందే
నెట్టుచు విడుచుచు నుండిన
గుట్టుపరబ్రహ్మమంచు గూడుము వేమా! 1203

ఆకాశతత్త్వము నంటునట్టులు ప్రాణముఁ బిగియఁబట్టి విడుచుచుండిన బ్రహ్మము సాక్షాత్కరించును

తే బట్టబయలైన తత్త్వమే బ్రహ్మమనఁగ
నిట్టనిలువున మది జేర్చి నెగడవలెను
దట్టిగట్టిన జయమున్న జెట్టివలెను
గుట్టలో గుట్టుపరబ్రహ్మము గూడ వేమ. 1204

బట్టబయలగు తత్త్వమే బ్రహ్మమని మది నెంచి చలింపక ధ్యానించినచో పరతత్త్వము నొందును

క. బట్టబయలైన బ్రహ్మము
గుట్టును మది నెంచి లోన గుణము వడినచో
దిట్టముగ జగము గిట్టును
దిట్టరివై యెఱుక మఱచి తిరుగుము వేమా!.

ప్రస్ఫుటమై బ్రహ్మమును మాయను పరికించినచో జగత్తు అంతయును మిధ్య యని తెలియును.

ఆ. పటువుగాను బుద్ధి పరికించి నొక్కుచు
కుటిలగుణములన్ని కూల ద్రొక్కి
పటుతరంబుగాను బలపడఁ జూడరా, వి....1206

బుద్ధిని ప్రస్ఫుటముగా నొక్కుచు కుటిలగుణములను పోనడంచి బ్రహ్మముఁ గనఁ బ్రయత్నము సేయుము

ఆ. బంటుతనము కాదు బలముతో గట్టిగా
వెంటనుండి మనసు వెతలఁబఱచు
నింట గెల్చి రచ్చ నిల గెల్వవలెనయా, వి....

మనసును నిగ్రహించుట యసాధ్యము అయ్యది త్రాళ్లకుఁ గట్టుపడదు కావున తొలుత మనస్సును గెల్చి పిదప తక్కినవాని గెల్వవలయును

ఆ బండదానికేల బంగరు మొలత్రాడు
విధవరాలికేల వెండిగొలుసు
ముచ్చుముండకేల ముంజేతకడియాలు, వి....

సులభము

తే. బంధముక్తులరెంటిని పదిలముగను
కోరరాకయు మదియందుఁ గోర్కె లడఁచి
చేయుపనులెల్ల బయటను జెనకి మించు, వి....

బంధమునుగాని ముక్తినిగాని అభిలషింపకయే నిష్కామనయా కార్యములను చేయుచున్నచో బ్రహ్మత నొందును

ఆ. బంధుకోఁటి బాసి బయలును తెలియక
సింధుపుత్రిమాయఁ జిక్కెకాదె

శార్ఙ్గియంతవాఁడె జనులకు శక్యమా?, వి....

శార్ఙ్గియంతటివాఁడే మాయకులోఁబడుచుండినవాఁడు! ఇఁక మనమనఁగా నెంతవారము కావున జాగ్రత్తతో మెలఁగవలయును

ఆ. బన్నపడగ గుఱిని పట్టులో పట్టుగా
చిన్నబలముఁ జేర్చి చింతవిడిచి
యున్నవాఁడె ముక్తిగన్నవాఁడగు సుమ్మి, వి....

భంగమునొందక పట్టిఁపట్టువిడక సూక్ష్మశరీరిని గుఱితించి నిశ్చింతతో నుండినవాఁడే ముక్తుఁ డనఁదగును.

క. బయలందె పుట్టు సర్వము
బయలందే లీనమగును బ్రహ్మాండంబుల్
బయలని మదిలోఁ దెలసిన
బయలందే ముక్తి బట్టబయలగు వేమా!. 1212

సమస్తము నాకాశరూపమే యని యెఱుంగుము.

క. బయలున పుట్టినబంధము
బయలందే లీనమగును బరమాత్మునకున్
బయలున పుట్టెడిసంపద
బయలుగ కలుపంగ ముక్తిబయలగు వేమా!.

సులభము

ఆ. బయలు బయలుగాను పరికింపఁ జాలక
బయలులోనివారు బయటపడిరి
బయలులోనిచాలు పరికింప తత్త్వమా, వి....

బయలును బయలని పరికింపలేక పెక్కు భంగపాటుల నొందిరి కావున బయలులోని నిజమును పరికించుము అదియే బ్రహ్మము

ఆ. బయల నిల్లు గట్టి పరికింప నేరక
బ్రమసి తిరుగువాఁడె పామరుండు
బయలుపడిన తానె బ్రహ్మమై పోవును, వి....

సులభము

క. బయలనుచు బయలుపోకగ
బయలునఁ దనమనసు నిలిచి బాగుగఁ దనరున్
బయలని తెలిసెడి భ్రాంతియొ
బయలై తనుదానె కాంచు బ్రహ్మము వేమా!.

బయలు అను బయలు గనిన మనసు స్థిరముగా నిలుచును" అట్టిదే బ్రహ్మ మని నమ్ముము

క. బయలన బంధము పుట్టును
బయలున పరమాత్మునకు బంధము కలుగున్
బయలున బంధము సుదిపెను
బయలున బయలయ్యె డిదియె పరమగు వేమా'.

సులభము

ఆ. బయలుబయలుగాను బలపడినప్పుడే
నయముతోడ నైక్యమగును మదిని
జ్ఞప్తియుండు నెఱుక గనుటయే లేదయా, వి....

బయలు బయలుగా బలపడియప్పుడే బ్రహ్మైక్యము కలుగును. అప్పుడు జ్ఞప్తి యుండఁజాలదు

ఆ బయలు బ్రహ్మ మనుచుఁ బరికించుచుందురు
బయ లదేల దాను బ్రహ్మ మగును
బ్రహ్మమైనబయలు ఎరికింప తత్త్వమె, వి....

బయలు బ్రహ్మ మనెదరు; కాని తానే బ్రహ్మమై యున్నప్పుడు ఆబయలుతో నేమి ప్రయోజనము?

ఆ బయలు బ్రహ్మ మనుచు భాషించుచుందురు
బయ లేమిటికిని బ్రహ్మ మగును
బ్రహ్మమైనబయలు భావమం దుంచుమి, వి....

బయలు బ్రహ్మమందురు కాని బయ లేల బ్రహ్మ మగును? మఱి బ్రహ్మ మెయ్యది యంటివా? వినుము బ్రహ్మమైన బయలే

ఆ బయలురూపు తనకు బయలుగాఁ జేసి యా
బయలురూపు నంటి భ్రమయకుండి
బయలులోనిబయలు భావింప ఎరమాత్మ, వి.

ఆకాశతత్త్వమును ఆత్మాధారముగా నిలిపి తద్ద్వారా చూపును బ్రహ్మమునంటగాఁజేసి భ్రాంతి నొందక భావించి చో పరమాత్మ యగును

ఆ. బయలురూపురూపు బయలుగా చేసియు
కంటిరూపుబయట నేర్చుఁబఱచి
బయలుకానిబయలు ఎరికింప తత్త్వము, వి....

సులభము

ఆ. బయలు రూపు లేనిభావంబులో నెంచి
బయలురూపుబట్టి బయలుచేసి

బ్రహ్మముబయ లనుచు భావింప తత్వము, వి....
బయలును భావములోఁ దలపోసి స్పష్టముగా బయలే బ్రహ్మ మని భావింప తత్త్వము నొందును.

ఆ. బయలులోన పెనిగి బయలులో మునిఁగియు
బయలు దెలియలేఁడె బంధకుండు
బయలు బ్రహ్మ మనుచు భావించి చూడరా, వి.
బయలులో పెనఁగియు మునిఁగియును బయు లనఁగా బ్రహ్మమని బంధకుఁడు (అనఁగా. సంసారి) తెలియలేఁడు.

ఆ. బయలులోని బయలు పరికించి చూడక
బయలు రూపుఁ జూచి వలఁచు నొర
ముఱికిదేహమందు మోహంబు విడఁడయా, వి.
లోని తత్త్వము నెఱుఁగఁజాలక పైరంగులకు భ్రమసి మోహముచే నశించును

క బయలే చూడఁగ సర్వము
బయలున లీనములు చూడ బ్రహ్మాండంబుల్
బయలని తోఁచెడి మదిలో
బయలందిన ముక్తి బట్టబయలగు వేమా! 1226
సమస్తప్రపంచమునకును బయలే ఆధారము దాననే సమస్త బ్రహ్మాండములు అన్నియు నిముడియున్నవి అద్దాని గనిన సమస్తమును బట్టబయలగును

క. బయ లయినది యెంతెంతయొ
బయలున బ్రహ్మాండమునకు పట్టది యెంతో

రయమున రవి తా నెంతో
భయపడుదురు దానిఁజూడ బయలని వేమా!.

బయలన నెంతో అందుఁగల బ్రహ్మాండ మెంతో యని యిట్లు తారతమ్యపరీక్షఁ జేసినచో బ్రహ్మము వ్యక్తమగును

ఆ. బఱ్ఱె లట్టు లరవ ఫలమేమి కలదురా?
అందు సార్థకంబు నొందకున్న
విన్నవారు వారి వెఱ్ఱులుగా నెంత్రు, వి....

గేదెలవలె ఊరక యఱచిన ఫలము లేదు, దానియందలి (అనఁగా వేదమునందలి) అర్థమును గని తత్ప్రకారము కృతకృత్యులు కావలయును

ఆ. బలముకొనఁగ గాలి బట్టి రేచించుచు
కలియఁ జూడ కంబుకడలుకొనఁగ
విలయకుంభకంపువిధ మంది చూడరా, వి....

బలిష్ఠ మగుశ్వాసమును నిరోధించుచు నెగయించుచు పూరించుచున్న నదియే కుంభక మని పెద్ద లందురు

ఆ. బలము చూపుకోటల బలవంతముగ రాదు
కులము జూచి మెచ్చ గుదురఁ బోదు
తలముఁ ద్రొక్కి యట్లు తలకొని విడరాదు, వి.

బలము చూపినను కులముఁ జూపినను ఆత్మజ్ఞానము కలుగఁబోదు వెంట నంటి పట్టువీడకయు ప్రయత్నింప వలయును

క. బహువిధవస్తువులందును
మహిఁ గలిగెడి యెల్లజాతి మనుజులయందున్

రహించు బ్రహ్మమని మది
గ్రహియింపుము బాహ్యశబ్దకథితము వేమా'.

సమస్తవస్తువులందును జాతులందును మనుజులయందును మించి యుండెడునదియే బ్రహ్మమని గ్రహింపుము

ఆ. బాగుగాను ముక్తిఁ బడయంగ ముందుగా
యోగిగాక గురుని కేఁగి మ్రొక్కి
వేగ బుద్ధి నొక్కి విలయమొందుట తగు, వి....

ముందుగా గురువుల సేవించి వారియుపదేశము నొంది ముక్తిఁ బడయవలెను పిమ్మట యత్నింపవలయును

ఆ. బాట తెలియకున్న బహుదూరమై తోఁచు
చోటు తెలియకున్న చూపొందదు
కోటకొమ్మమీఁద గుమ్మగఁ జూడరా, వి....

మార్గము తెలియకున్నచో గమ్యస్థానము చాలదూరముగాఁ దోఁచు ట్లే మార్గము తెలియనిచో బ్రహ్మోపాసన కష్టముగా తోఁచును

ఆ. జ్యోతియందు పుట్టె సొంపైన నాదము
బిందు వమరె నాదమందుఁ దెలియ
బిందువందు పుట్టె బృథివియాకాశముల్, వి.

జ్యోతియందు సొంపగు నాదమును అందు బిందువును దానఁ బృథివ్యాదులును పుట్టినవి

ఆ. బాతెఁ జేసి జడలు భస్మాంగ లేపనల్
మదనము దనుఁగోడ మాలుమలయు
కోక లుడిగి యంగకేకులు బలిసెరా, వి.... 1235

ఆ బిందునాదు నాదుబిందువుగాఁ జేసి
నాది బిందులాది నాదుఁ జేసి
బిందులోనినాదు భేదించి చూడరా, వి....1240

బిందునాదులను నాదుబిందులనుగా తాదాత్మ్యము నొందించి బిందులోనినాదును భేదించి చూడుము

ఆ బిందురక్తములను బెరసిన దేహము
చంద మెఱుఁగక ద్విజశబ్ద మిడుచు
నడచి విడుచు నానరకంబు మృత్యువు, వి....

బిందురక్తములు బెఱసినదేహపుచందము నెఱుంగక ద్విజుఁ డనుకొనినచో మృత్యువే కాని వేఱుఫలము కలుగఁ బోదు

ఆ బిందువనఁగ మాయబీజంబు శివుఁడయా
అందు కనక మయ్యె నప్పులయ్యె
సంధి వెలయు జగము సర్వంబు తా నాయె, వి.

బిందుబీజములును, మాయయును, ఈశ్వరుఁడును వారి వలననే యీపరిదృశ్యమానమగు సమస్తప్రపంచమును సృజింపఁబడినది

ఆ బిందువందుఁ బుట్టి పెంపైననాదము
నాదమందు పుట్టె నాదిశివుఁడు
శివునిమధ్యమందుఁ జెలగును సూక్ష్మంబు, వి....

బిందువునందు నాదము పుట్టగా నందు పరశివుఁడు సూక్ష్మరూపియై ప్రకాశించుచుండును

ఆ. బిందుసేవకుండు బీజమై యుండును
నాధుసేవకుండు సర్వహితుఁడు
తీర్థసేవకుండు తిరుగుచుండెడి గదా', వి....1244

స్పష్టము

ఆ. బొంది వేఱు కాని భువి ప్రాణ మొక్కటి
అన్నము లిల వేఱు ఆఁక లొక్కటి
పుష్పము లిటు వేఱు పూజ యొక్కటి సుమ్ము,వి.

శరీరములు వేఱువేఱుగను ప్రాణము ఒక్కటిగ నుండును ఎట్లనఁగా అన్నములు వేరైనను ఆఁకలి యొక్కటియైనట్టులనే పువ్వులు వేరైనను పూజ యొక్కటి యైనట్టులనే యని యెఱుంగుము

ఆ బ్రహ్మ గుఱ్ఱమయ్యె భవుఁడు పల్లంబయ్యె
నాదివిష్ణు వెన్న నంకి లాయె
నందు మీఁద నుండు నాఁడుదో మగవాఁడో,వి.

బ్రహ్మవిష్ణ్వాగులచె వహింపఁబడి సర్వాతీతస్వరూపమున వెలుఁగునది ఆఁడుదియో మగవాఁడో యేర్పఱుప నశక్యము

ఆ. బ్రహ్మ జంపి విష్ణుభాగంబునను గలిపి
విష్ణుఁ జంపి శివుని వీటఁ గలిపి
శివుని జంపి తాను శివయోగి కావలె, వి....

రజోగుణమును తమోగుణమును నశింపఁజేసి తాను త్రిగుణాతీతుఁడైన శివయోగి కావలయును

క. బ్రహ్మ తన్మయచింతన భవహారంబు
బ్రహ్మ మాత్మావలోకన ప్రముదితంబు
బ్రహ్మమం దైక్య మగునాత్మ పరవశంబు
విమలమతి నెంచినపు డిదె విధము వేమా!

బ్రహ్మ తన్మయచింతే పాపహారము బ్రహ్మము ఆత్మావలోకనప్రముదితము కావున నెల్లప్పుడును బ్రహ్మము ననుసంధింపుము.

ఆ. బ్రహ్మ బ్రహ్మ యున్న బ్రహ్మం బదెట్టిదో
వలసి తెలిసి చూడ వద్దనుండు
ముద్రలోన నుండు ముద్రిక గానరు, వి....1249
స్పష్టము

ఆ. బ్రహ్మ మనఁగ నున్న ప్రళయకాలంబైన
నదియుఁ బ్రహ్మచేత నందవచ్చు
బ్రహ్మ మనుగు జ్ఞప్తి పట్టులో కట్టురా, వి ...
స్పష్టము

ఆ. బ్రహ్మ మున్నచోటు పరగంగ తెలియక
ఎందొ వెదుక బ్రహ్మ మేల గలుగు
నంజనంబు లేక యాసొమ్ము దొరకదు, వి ...

అంజనము లేక సొమ్ము దొరకనియట్టులనే బ్రహ్మమున్న చోటు తెలియక తక్కిన తావుల వెదకినను దొరకదు

ఆ. బ్రహ్మమును తెలియు భావముం దుంచిన
తనువు గుడిగఁ జేసి తన్ను నిలిపి

లోకబుద్ధి విడచి లోఁ జూపు చూడరా, వి....

భావమును గుదురుపఱచి అందు ఆత్మభావము నుంచి విభేదదృష్టిని మానించో బ్రహ్మమును పొందగలుగుదువు

తే. బ్రహ్మ మెఱుఁగనివా రెల్లు పారు లైరో
జిహ్వకుచుంకు దోఁపదో జీవులార
గహ్వరంబైనమదియందు కనుడి మీరు, వి....

బ్రహ్మమును తెలియనివారు కేవిధమున బ్రాహ్మణులు కాఁగలిగిరి? బ్రహ్మము జిహ్వావేద్యము గాక మనోవేద్యమని యెఱుంగుఁడు

ఆ. బ్రహ్మ మెఱుఁగు జ్ఞప్తి పదిలంబుగా నుంచి
తనవు లఱచి వేగఁ దన్నుఁ దంచి
లోకబుద్ధి మఱచి లోఁజూపు చూడగా, వి....

బ్రహ్మము నెఱుఁగఁదగినయెఱుకను పదిలపఱచి నిష్ప్ర హృదయై లోకమను బుద్ధిని బోతిగా మఱచి హృదయాంతరమునందు వెదకినచో ముక్తి కలుగును

ఆ. బ్రహ్మ మెడ ననుచు పలుమాటలాడేర
వెఱ్ఱిమూర్ఖజనులవిధము చూడ
బ్రహ్మ మన్నిటఁ దగుఁ బరిపూర్ణమై యుప్పు, వి.

మూర్ఖులు ఎచ్చటి బ్రహ్మమని పరిహాసింతురే గాని సర్వవ్యాపియై పూర్ణమై యుండెడి యారూపము గాంచఁజాలరు.

ఆ. బ్రహ్మ మెవనికొడుకు పరికింపఁగా భువి
విష్ణు వెవనికొడుకు వెలయఁ జూడ

శివుఁ డెవరికి కొడుకు చిత్తమందుంచరు, వి....
స్పష్టము

ఆ. బ్రహ్మవంశభవులు ప్రబలులై యుండఁగా
నితరజాతులకును గతులు గలవె
వనములోని క్రోతి వసుమతి నడపునా, వి ...1257

బ్రహ్మవంశ్యులు ప్రబలులై యున్నంతవఱకు నితరులకు గతులు లేవు కలిగినను వా రసమర్థులయ్యే యుందురు

ఆ. బ్రహ్మవాదు లెల్ల బ్రహ్మం బనంగను
వలసి తెలసిమూఁక వద్దనుండు
ముందునున్న యట్టి ముద్రికఁ గానరు, వి....

బ్రహ్మవాదులు బ్రహ్మమని చెప్పెడిదానిని పరికించి చూచినచో నీయొద్దనే యుండును

ఆ. బ్రహ్మవిష్ణుశివుల భాగంబులను నిల్పి
పరమయోగియైన బ్రహ్మ మగును
బ్రహ్మమైనవాని భావింప శక్యమా, వి.... 1259

త్రిమూర్తులయంశముల నిల్పి యోగియైనచో బ్రహ్మస్వరూపము నొందును అట్టివానిని భావింప శక్యము అగునా? కాదు

ఆ. బ్రహ్మవేత్తల మని పౌరుష మాడేరు
బ్రహ్మ మేమి దానిభావ మేమి
తెలుపా నలుపా యెఱుపా తెలిసిన పలుకుఁడీ, వి

బ్రహ్మవేత్తల మని ప్రజ్ఞలు పల్కుదురు; కాని బ్రహ్మ మెటువంటిదియున్నచో నలుపా తెలుపా చెప్పఁడు ?

ఆ. బ్రహ్మసంతతి యన భక్తులై వెలసిరి
ఋషులజాతులెన్నొ రీతు లయ్యె
ఆరసి కొక్క వారి రోయక పిలుతురా, వి.... 1261

స్పష్టము

తే. బ్రహ్మసుఖతత్త్వవిజ్ఞానపరముఁ గోరి
గురుకళాజాలనియతమార్గంబు మిగిలి
యోగనిష్ఠత్వరూపుఁడై యున్నయెడల
పరమశివుఁడని భాసిల్లు ధరణి వేమ 1262

బ్రహ్మసుఖమును గోరి గురుమార్గక్రమమున యోగనిరతుఁడై యున్నయెడల ముక్తుఁడై పరమశివుఁడై భాసిల్లఁగల్గును

ఆ. బ్రహ్మవిష్ణువులకు పరఁగఁగ రుద్రుఁడు
సిగయు యగుట నెఱిఁగి సృష్టిజనుల
రుద్రనిందఁ జేసి రూఢి తప్పుదురయా, వి....

త్రిమూర్తులకును శివుఁడు తలకట్టగుటచేత శివనిందను చేయరాదు

ఆ. బ్రహ్మపగువుచెమునె బ్రాహ్మణులోద్దాడ్డ
బ్రహ్మనలనఁ బుట్టి పరఁగి రనఁగ
బ్రహ్మవేత్తయైన బ్రాహ్మణుఁడే యగు, వి....

స్పష్టము

ఆ. అంగమందు లింగ మమరంగ మర్దించి
జంగమందుబెట్టి యంగుపఱచి

రంగుగాను వసుధ గ్రుంగఁగ జూడరా, వి....

స్పష్టము

ఆ. అగ్నిచక్ర మనఁగ నాకర్ణలింగంబు
అగ్నిగుండమందు నంటఁగూర్చి
భవుని ధ్యాన మిఁకను పాటింప ముక్తిరా, వి..

అగ్నిచక్రమునందు అంటఁ జేర్చి మనస్సును నిలిపి ఈశుని నిరంతరమును ధ్యానించుటయే ముక్తి యనఁబడును.

ఆ. అగ్నిశిఖలుమందు నమరంగ మనసార
మభవుమీఁద ధ్యాన మమర నునిచి
ఆహుతి యగు వెనుక హరుని కర్పించుము, వి.

మనస్సను నగ్నిశిఖలను ఈశ్వరునిపై ధ్యానమునుంచి మనస్సు ఆహుతిచేసి ఈశ్వరున కర్పించుము అయ్యదియే ముక్తియగును

క. అంచ ఘనాక్షరబిందువు
పంచాక్షరినాదగుంభ పరమమునీంద్రుల్
ప్రాంచితము నదని తెలిసిన
మంచానన మెక్కువాఁడు మహిలో వేమా!.

ఓంకారస్వరూపమే హంసము అదియే నాదము. దానిని చక్కఁగా తెలిసినవాఁడే యోగ్యుఁ డగును.

ఆ. అంచచరసమూహ మంగము లింగము
సరణి దెలిసినట్టి శైవమేలు
అష్టతనువు లమర హరుఁడౌట నెఱుఁగరా, వి....

సులభము.

క. అంతయు బ్రహ్మమయం బని
మంతనములు మాని మనసు మర్మము గనినన్
వింతలు బయటను నున్నగు
చింతలువిడి నట్టివాఁడె సిద్ధుడు వేమా! 1270

సమస్తమును బ్రహ్మస్వరూపమని యెంచి వాదములను మాని మనస్సును నిల్పి చింతలు వీడినవాఁడే సిద్ధుఁ డగును

ఆ. అంతరంగమందు నభవు నుద్దేశించి
నిల్చిచూడ జాడ నిలుచుఁగాక
బాహ్యమందు చూడ భావింప నిలుచునా?, వి.

అంతరంగమునం దీశ్వరుని నుద్దేశించి నిల్చి చూచిన జాడ నిలుచునే కాని బాహ్యమందు భావింపఁగా నిల్చునా నిల్వదు

ఆ అంతరంగమందు ననువుగా శోధించి
తలఁప తలఁప ముక్తి తగులుఁగాక
బాహ్యరంగమందు భాషింపఁ దెలియునా,వి....

హృదయమునందు చక్కఁగా శోధించి పరికించినచో ముక్తిపథము దొరకునే కాని పైకి భాషించిన దొరకదు.

ఆ. అందలమును మోసి యందరపై నుండి
పొంది వేడ్క మీఱు పూర్ణుఁ డతఁడు
అతనిపూజ ఫలము నందగఁ జేయును, వి....

కర్తయును భర్తయును తానై సమస్తమునందును నిండి యుండిన ఈశ్వరుని పూజించినచో ఫలము నందునట్లు చేయును

క. అనుచితపురుషుం డోక్కఁడు
వినుని త్యానిత్య మనెడి విధమెట్టిదనం
దనసంకల్పమె బంధము
తనసంకల్పంబె క్షయము దనరఁగ వేమా! 1274

ఈ మోక్షమార్గమునకు అనుచితుఁ డెప్పుడు నర్హుఁడు గాఁడు నిత్యా నిత్యసంబంధము కర్మానుసారి యైనట్టిది

క. అనుభవ కేళికి లోనగు
తనువులు మూఁడుడిగి లోనితథ్యముగని యా
జనసాంతర మనురంగను
కనునదె బ్రహ్మంబు మదిని గట్టిగ వేమా! 1275

అనుభవకేళికై వాసనాత్రయమును వీడి తత్త్వము నరసియుండవలయును అదియే బ్రహ్మము

ఆ. అనువు గానిచోట నధికుల మనరాదు
కొంచె ముండు టెల్ల కొదువగాదు
కొండ యద్దమందు కొంచెమై యుండదా, వి.

పర్వతము మహదాకృతి గలదైనను అద్దమందు అణఁగి యున్నట్టులనే బుద్ధిమంతుఁడు తగనిచోటుల నణగియుండ వలెను

ఆ. అనువుమీఱి మదిని నానంద మందెడి
నరుఁడు పరుఁడు గాఁడె నయముగాను
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

హృదయమునందు పరికించినచో నానందము ననుభ

వించెడి పురుషుఁడే పరాత్మయనియును దానిపై మనసు నిల్పుటయే ముక్తియనియు నెఱుఁగఁదగును

తే. అన్యులుండనిస్థలమందు నాత్మవిద్య
చిత్తతిమిరమ్ము నణగించి చెంగలించి
పండువెన్నెలకాంతిలో బ్రాకిచూడు
మప్పు డానందమును బొంద నగును వేమ. 1278

ఇతరు లెవ్వరును లేని యేకాంతస్థలమునందు యోగము నభ్యసించి ఈశుని గాంచనలయును

ఆ. అమల మవ్యయంబు నంతరాత్మకు లోన
విమలదృష్టిఁ జూచి విషక మించి
తెమలకున్నవాఁడు తెరబయు ల్సేరును, వి....

నిర్మలమును నాశనరహితము నగు ఆత్మ తేజస్సునే ఈశ్వరుఁడని నమ్మి పొందవలయును

క. అభవుని మదిలో గాంచెడు
శుభకరమగుమూడ్కి నంది సొంపలరంగా
నభిముఖదృష్టిని జూడుము
రభసము లేనట్టియెఱుక రాజిలు వేమా. 1280

ఈశు దర్శింత మనునుత్సాహమున దృష్టిని భ్రూమధ్యమునం జేర్చి ధ్యానించి రాజిలుము

ఆ. అయిదునైదునైదు నైదింటఁ జేకూడు
మూఁడు మూటఁ జేరి మురియు నొకటి
మురిసిన సకలంబు మోహించి యుండురా, వి.

పంచవింశతితత్త్వస్వరూపుఁడు ఈశ్వరుఁడని కనుఁగొనుము

ఆ. అయిదువర్గములను నానంద మెఱిఁగిన
నందె చూడ ముక్తి యలరుచుండు
అయిదులోనఁ దెలియు టదియెపో బ్రహ్మంబు,వి.

ఇరువదియైదుతత్త్వములందును ఆనందము వెలుగుచుండును అదియే ముక్తియును బ్రహ్మము అనియుఁ జెప్పఁబడును

ఆ. అల్పసుఖము లెల్ల నాశించి మనుజుఁడు
బహుళదుఃఖములను బాధపడును
పరసుఖంబు నొంది బ్రదుకఁగ నేరఁడు, వి....

అల్పసుఖముల కాశించిన పెక్కుదుఃఖములపాలగును కావున నట్లు చేయవలదు

ఆ. అక్షయమనుటంక మండంబుతో గూర్చి
అమరగుణవికార మనుభవించి
అక్షయంబునంట నక్షయంబై యుండు, వి ...

అనశ్వరమగు కైవల్యమున మనస్సునుఁజేర్చి గుణవికారరహితుఁడై యక్షయత్వము నొంది బ్రహ్మము నొందవలయును.

క. అక్షరపదవికి పదివే
లక్షరముల నఱవ నేల నల శివ యనురెం
డక్షరము లణఁచు దురితము
తక్షణమే పదవి గలుగు తథ్యము వేమా!.1285

అక్షరరూపము (బ్రహ్మత్వము) నొందుటకు పదివేల మాటలను పలుకుటకంటెను శివ యనునొకమాటఁ బలికిన చాలును

క. అక్షరపుటడవిఁ జొరకయె
యక్షరమగుమహిమ గాన నవనిం దొలుతొ
నక్షరమును జపియించిన
నక్షయముగ నదియె చాలు నరయుము వేమా!

అక్షరములను నేర్వకయే యక్షరత్వము నొందఁ జాలవు కావున తొలియక్షర మగునోంకారము నుపాసించి ముక్తుఁడ వగుము

ఆ ఆకసంబు శూన్య మందు శబ్దము పుట్టె
శబ్ద మధ్యమునను సరగఁ జూడ
శబ్దరహిత మగుచు చెలఁగును బ్రహ్మంబు, వి....

ఆకాశము శూన్యము అంగు శబ్దము పుట్టెను అశబ్దము నందే బ్రహ్మము స్ఫోటరూపమున వెలుగుచున్నది

ఆ ఆత్మ తేజ మూని యనువుగా శోధించి
తేజ మాత్ర యందు తేటపఱచి
మింటిమంటి నడుమ మిన్నంది చూడరా, వి....

స్వబుద్ధిని నిత్యానిత్యవివేచనఁ జేసి హృదయమునందలి తేజముతో లయింపఁ బ్రయత్నింపుము

ఆ. ఆది నంటిచూడ నలవి గా దేరికి
సోది చెప్పఁదరమె సుఖమొటింగి
వాద మేల బయలు వర్ణించి చూడరా, వి....

అన్నిటికి నాదియగు దానిని కనగొన నెవ్వరికిని సాధ్యము కాదు కావున కేవల చిత్స్వరూపమును ధ్యానింపుము

ఆ. ఆలుమగఁడు సుతుఁడు నందఱిలో నాత్మ
మేలుగానెయుండి మెఱయుచుండు
వేఱువేఱుగాన వెలసె రూపంబులై, వి.... 1290

దారపుత్త్రాదులందును సమస్తమునందును ఏకరూపముగా నాత్మ ప్రకాశించుచున్నను ఘటభేదమున వేఱ్వేరుగా ప్రకాశింపుచున్నది.

ఆ ఆశపాశము బట్టింతు రాలుసుతులు
గాసిపడెదవు కూటికే గడపరాదు
శోకమందిన కాలుఁడు తాకి విడఁడు
పాకమెఱిఁగిన బ్రహ్మంబు పరఁగు వేమ. 1291

దారపుత్త్రాదులు ఆశాపాశములపాలు సేయుదురు. కావున సంసారముఁ ద్యజించి బ్రహ్మమును సేవింపఁ బ్రయత్నింపుము

ఆ ఇట్టియౌవనమున నీశ్వరధ్యానంబు
కలిగి చేయవలయుఁ గడకతోడఁ
జేయకున్నయెడల క్షితి సౌఖ్య మేదయా, వి....

యౌవన మున్నప్పుడే యీశ్వరుని ధ్యానింపలేనిచో నిఁక నీప్రపంచమున నెప్పటికిని సౌఖ్యమే లేదు

ఆ. ఇట్టిలింగమందు నీరేడుజగములు
పుట్టి బ్రదుక నరులు భువిని వెలసి
గట్టిగా యమునికి కానుకలై యుంద్రు, వి....

సులభము

ఆ. ఇతరచింతలన్ని వెతలని మదినెంచి
జతుకమంటిరీతి జగము మఱచి
సతత మాత్మయందె సయ్యాటలాడరా, వి....

తక్కిన యైహికచింత లన్నియును బాధల గల్గించును. కాన వాటిని విడనాడి నిరీహుఁడవై యాత్మ ధ్యానము సేయుము

క. ఇదియది గానిది మదిలో
చెదరనిగుఱితోడఁ జూచి చేపట్టికనన్
గదలక మెదలక తోఁచెడు
విదితంబేదందు బెనఁగి వెలయుము వేమా!.

నామరూపములేని యాత్మబింబమునుగుర్తించి భ్రాంతి పడక పట్టు వీడక ధ్యానించి కృతకృత్యుఁడ వగుము

క. ఇది రాజమార్గభావము
సుధయై జగములకు నెల్ల సూక్ష్మాకృతియై
సదమలమతియై తోఁచెడు
నదియే పరమయినబయ లనం దగు వేమా. 1296

ఇయ్యది రాజమార్గపురీతి లోకులు తరించుట కమృత ప్రాయము కావున దీని నవలంబింపుము

క. ఇది లేక జరుగ దనుచును
మదిలో నేవస్తువైన మమతఁదగు మతిం
గదిసి విడిచి పోఁజాలని
దదెపో సంసారబీజ మనఁబడు వేమా!. 1297

ఏవస్తువుపైనినైనను అత్యంత మాస్థ గొనుటయే సంసారమునకు మూలబీజ మనుకొనుము

క. ఇంద్రియపరవశుఁ డధముం
డింద్రియపరవశుఁడై భక్తియెడ మధ్యముఁడౌ
నింద్రియజయుఁ డుత్తముఁడు జి
తేంద్రియసమధికుఁడు విన మహేశుఁడు వేమా!

ఇంద్రియములోలుఁ డధముఁడని జెప్పఁబడును కావున నింద్రియలోలతను పోఁగొట్టుకొనుము

క ఇరుమూఁడక్షరసాధన
పరుఁడగు నిర్వాతదీపపద్ధతి మదిలో
గుఱిమీఱి బయలు సేరిన
నిరుపమసానందమూర్తి నిత్యుఁడు వేమా! 1299

పంచాక్షరీసాధనపరుఁడగువాఁడు నిర్వాతదీపమును బోలి నిశ్చలుఁడై ఈశునిరూపము నొందఁగలఁడు

ఆ. ఈజగమున ముక్తి కిరుమూటి కవ్వల
రాజమార్గ మమరు రంగుగాను
తేజ మూని నొక్కి తెంపుగాఁ జూడగా, వి....

పంచతత్వములను విమర్శించినచో తదనంతరమునం దప్యవహితముగ నే ముక్తి ఏలదు దానిని సేవింపుము

ఆ. ఈడుగానిదాని తోడికి బాల్పడి
జోడుగూడరాదు నూటిగాను
కూడి తప్పె నేని గుణములు కొంచెమౌ, వి....

సులభము.

క. ఉత్తమమగుజ్ఞప్తికై
సత్తమ నిజరూపభావసాదృశ్యములోఁ
బొత్తున పారంగతుఁడై
హత్తెడునధ్యాత్మవిద్య ననువుగ వేమా! 1302

ఉత్తమజ్ఞానముతో తాదాత్మ్యసిద్ధికై యత్నించుటయే యధ్యాత్మవిద్య యనఁబడును దాని నార్జింప యత్నింపుము

క. ఉదయాదికప్రైనుండెడు
సదయుని మది నిల్పి చూడ శక్యము గాఁగాఁ
గుదుగుపఱ్జప్తి నిలిచిన
నదియే పరిపూర్ణసౌఖ్య మందెడు వేమా! 1303

సూర్యమండలమును అంతర్హృదయమునందు నిల్పు కొనశక్తి కలిగినచో ఆత్మపరిపూర్ణతయును క్రమముగా నల వడును

క. ఊకొనఁ జెప్పిన వినదది
ప్రాకటముగ లోకములను బాలించెడు నా
పాకము మదిలో బఱులని
యేకాకృతి నవిరతముగ నెన్నుము వేమా!.

చెప్పినను వినినను సాధ్యము కానట్టిది బ్రహ్మస్వరూపము, అద్దానిని యేకాకారమున ధ్యానించిననే లభ్యము అగును

క. ఊకొని వినఁగావచ్చును
బ్రాకటముగ కథల నెల్ల బలుదెఱఁగులుగా

నేకీభావమునందును
సోకుట దుర్లభము మదికి సుడివడు వేమా !.

ఎన్నిమాటలైనను చెప్పవచ్చును వినవచ్చును; గాని బ్రహ్మైకత నొందుట యలవిగానిపని యని యెఱుంగుము.

క. ఊపిరి లోనికి లాగుచుఁ
బ్రాపుగ లోనిలువఁ జూచి పనుపుగ విడుచున్
జూపోర్వనిబయలందుచు
దాపుగ నీలోన నిన్ను గనవలె వేమా ! 1306

శ్వాసమును బిగియఁబట్టుచు విడుచుచు మనస్సును నిశ్చలత్వము నొందించి బయలున నున్నయాత్మరూపమును సందర్శింపుము

తే. ఊపి రున్నంతవఱకును కాపురంబు
చేసి కడ తేఱ లేకయే చిక్కునడరె
పాపలో చూపుమించులే పావనంబు
దాని మార్గంబె తెలియగాఁ దగును వేమ.

సులభము

ఆ. ఎక్కువెట్టి పరము నేకాంతమును గోరి
ముక్కుకొనను చూడ్కి మొనయు నిలిపి
సొక్కియుండు టదియె సోహంస్వరూపము, వి.

మనస్సును ఎక్కువెట్టి నిశ్చలత నలవఱచికొని దృష్టి నిలిపి తత్పరుఁడై యుండుటయే సోహంస్వరూపము.

ఆ. ఎక్కువెట్టి మనసు నేకాంతమునఁ జేర్చి

మ్రొక్కువాఁడె పరము దక్కువాఁడు
నిక్కిచూచునపుడె నిర్భ్రాంతి మబ్బురా, వి....

మనసు నెక్కువెట్టి ఏకాంతమున నాత్మతాదాత్మ్యము
నొందించినచో కైవల్య మలవడును

ఆ. ఎక్కువెట్టి మనుజుఁ డేకాంత మమరఁగా
దక్కఁగోరుచుండు ధన్యుఁ డరయ
బ్రక్కనుండు నెఱుక పరిపూర్ణమందురా, వి....

సులభము.

తే. ఎచ్చుగచ్చులు నుడివిన నేమి ఫలము
మ్రుచ్చు వేషంబు పూనిన మూల మేది
అచ్చుపడ తన్నెఱింగినయతఁడె యోగి
సచ్చిదానందపూర్ణుఁడౌ జగతి వేమ 1311

హెచ్చుతగ్గుమాటలఁ బల్కి దొంగవేషములు వేసెడి
వానికంటె ఆత్మానుసంధానము చేసినవాఁ డుత్తముఁడు

తే. ఎండమావులచాడ్పున నుండు జగము
లుండుపరమాత్మయందును దండిగాను
నిండుమదిలోన శోధించి నెగడవలెను
మిథ్యయనునమ్మకము నీవు మీఱి వేమ. 1312

ఎండమావుల వలె భ్రాంతియుక్తములైన యీలోకము
లందలి స్థిరత నూహించి ఈశ్వరుని ధ్యానింపుము

ఆ. ఎంత కడుగ నోటి యెంగిలిపోవునే
యెల్లకాలమందు నెంగిలితగు

ననుదినంబు చూడ ననృతమాడెడు నోరు, వి.

ఎంతగా పరిశుద్ధిచేసినను నోటిలో ఎంగిలి పోనే రదు. అసత్యమాడుటయే గొప్పయెంగిలి

తే ఎదుట గాన్పించుదానిని ఎంచరాదు
మదిని గుఱుతొంది యుండుట మానికంబు
సదయహృదయత సాక్షిగా సంతరించు
హృదయరంజక ముఘడెగు నెన్న వేమ 1314

కన్నులయెదుట కనుపట్టుచున్నను ఎంచుట కలవిగాని యట్టిది అట్టి బ్రహ్మరూపమును సార్వకాలీనమగు చిత్తసాక్షిత్వము నొందుము

క. ఎందును తలంపగ లేకట
పొందుగ పరమాత్మ నిఁకను బొందుట యెల్లా
ముందుగఁ దను దా దెలిసిన
నందే పరమాత్మ తెలియు ననుచిని వేమా!.

సులభము

తే ఎదుట నిల్పినచూపులో నేక మనర
నెఱిఁగి మఱిగిన వాడనే యెంచరాదు
మదికి లోవెలి యయాగు మఱుఁగుఁజేసు
స్థిరత చిత్తంబునకుఁ గూర్పు దివుర వేమ 1316

ఎదుటివస్తువుపైని దృష్టి నిలిపి దానియందు మనస్సు లగ్నమైనపిమ్మట యూరకుండక యా చిత్స్వరూపము నొందు నట్టుల యత్నింపుము

ఆ. ఎనిమిదక్షరముల నేర్పడ నెఱిఁగియు
వినియు కనఁగరాక వెలయువాని
తనువు మఱచి తెలియఁ దత్వాత్ముఁ డగును రా, వి

అష్టాక్షరములం దిమిడి యున్న యాభగవత్స్వరూపము
నెఱుఁగఁగల్గిన తత్త్వరూపుఁడు కాఁగలఁడు

క. ఎనిమిఁదిక్కులు బయలై
యెనిమిదిటికి కొను కెన్న నెక్కుడు బయలై
వినరాని బయలునడచినఁ
గనరా యచ్చోట నన్ను గలసియు వేమా!.

అష్టదిక్కులును ఆకాశరూపమున ననంతత్వము నొంది
యున్నవి అట్టి యనిర్వాచ్యము తత్త్వము గనుము

ఆ. ఎన్నితనువులైన సృష్టికి నష్టము గావు
సృతిని గెలువలేని యెఱుక లేక
దొంగరీతి గాక దొరకునా మోక్షము, వి....

సులభము

తే. ఎన్నిదినములు బ్రదికిన నేమి ఫలము
పిన్న పెద్దలు చెలరేగి పేరు లేక
యన్నదమ్ములు నాప్తులు నందె చనిరి, వి....

సులభము

తే. ఎన్నివిద్యలు నేర్చిన నెఱుఁగరాదు
తన్ను నిర్గుణమను జ్ఞప్తి తాఁకవలెను
నిర్లయో నాస్తి యన్నది నిండియుండు

గురునిబోధకు నన్యమే కొలఁది వేమ. 1321

ఎన్నిచదువులు చదివినప్పటికిని ఆత్మనిర్గుణమనుభావము చెందనంతవఱకును ముక్తి దుర్లభమనుకొనుము

క. ఎనుబది నాలుగు లక్షల
టనఁబరఁగిన జీవరాసులందును మునుదాఁ
జనియించువిధము దెలిసిన
మనుజుఁడెపో దారి గాచు మహిలో వేమా!.

ఎనభైనాలుగులక్షల ప్రాణికోటిలో తన జన్మవిధము నెఱింగినవాఁడె ముక్తుఁడగును

ఆ. ఎల్లి నేఁడు నిన్న నేలాగుననుగాని
మనసు నిలుపువాఁడు మంచివాఁడు
శివుఁడు భర్త కర్త చింతించ నేలరా, వి....1323

ఏప్పటికైనను మనస్సు నిలుపువాఁడు మంచివాఁడు. కనుక ఈశ్వరునియందు మనస్సు నిల్పి ఆయనయే సమస్తమునకు నాధారమని ధ్యానింపుము

తే. ఎవ్వ రెవ రన నేనను నేను మెఱిఁగి
తా నెవం డైన నెఱుఁగని మానవుండు
అడిగినపుడైన లక్ష్యంబు నమరఁజేయు
గొంత తెలిసెడిఁగాదె యింతింత వేమ 1324

ఎవ్వరు నీవు అని యడిగినప్పుడు తాను అను భావమును తెలిసికొని లక్ష్యమున సమన్వయముఁ జేసికొనుటయే ముక్తికి మార్గము

తే. ఎవ్వరెఱుగనితత్వంబు నెఱుఁగు టెట్లు
లోను చూడంగ చూడంగ లోక మగును
తలపు మఱపులు దాటులే తన్మయంబు
నిత్యపూర్ణత నానందనిరతి వేమ. 1325

ఎవ్వరికి నెఱుగరానితత్త్వమును తా నెఱుఁగుట దుర్లభము కావున సర్వాంతర్యామియగు పరాత్పరుని ధ్యానించి తన్మయత్వము నొందుట మంచిది

క. ఏకాంత మిరవు గన్గొని
లోకాంతముఁ జేరఁబోయి లోబయలగునా
పాకంబు బూని మించిన
నీకింపగుచిహ్నంబు నెలవగు వేమా! 1326

ఏకాంతప్రదేశమునఁ గూరుచుండి నిత్యానిత్యవివేచనను జేయుచు మించిచో చిహ్నను పొందఁగలవు

క. ఏకాంత మిరవు కన్గొను
శ్రీకాంతుని బ్రహ్మమయుని జిన్మయు పరుని
న్నాకారరూపు సాక్షి ని
జాకారమె పరమపదవి యారయ వేమా! 1327

సులభము

క. ఏకం బ్రహ్మ మనంగా
వైకల్పితమై జగంబు వారల కెల్లన్
సాకారత్వము లుడిగిన
శోకము మోహంబు లేదు శుభమగు వేమా!.

బ్రహ్మ మొకటియేయని నిశ్చయించి సాకారనిరాకారత లుడిగియున్న వాఁడు తప్పక ముక్తుఁడగును

క. ఏచినపంచేంద్రియసుఖ
నీచవ్యాపారముడిగి నిజముగఁ దానై
లోచూపుఁ జూడ నొల్లక
వాచాబ్రహ్మంబు వదలవలదుర వేమా!. 1329

పంచేంద్రియముల సుఖవ్యాపారమును విడిచి నిక్కముగా బాహ్యాంతరముల తన్మయత్వము నొందుట మంచిది

ఆ. ఏకసమమునందు నెఱుక గల్గిన యోగి
పరుల నెఱిఁగి చూడ భావమందు
ఆశ లేక మించి యున్నిట దా నగు, వి....1330

సులభము

క. ఏజనుఁడు గుణకదంబము
నీజగమునఁ బట్టనేర్చు నిమిషీకపడఁగా
నాజనుఁడే ముక్తికర్తుఁడు
రాజితపరిపూర్ణహృదయరంజక వేమా! 1331

గుణచయము నడంచి నిర్గుణత్వము నొందగలవాఁడే ముక్తి కర్తృఁడును కేవలుఁడునగును

క. ఏతత్త్వ మమర గోరెదొ
ఆతత్త్వము సరిగ నడపు మారసి స్వరముల్
ఖ్యాతిగ వర్ణము లెన్నక
యాతురత న్నిలుపు మదిని ననువుగ వేమా!.

నీవు పొందవలసిన తత్త్వమునందె మనస్సును నిల్పి సార్వకాలీనమగు ధ్యానముచేత నాతత్త్వము నొందుము

తే. ఏది తినకయు బ్రదికిన నేమి గలదు?
వాదునకు జిక్కఁదక్కనివరుస గనుము
భేదబుద్ధిని జూచిన బెనఁగఁబోదు
సమత గలవాఁడె యోగ్యుఁడీ జగతి వేమ. 1333

నిరాహారుఁడై మనుటలోగాని వాదించుటలోగాని భేదబుద్ధితో మెలఁగుటలో బ్రయోజనము లేదు

ఆ. ఏది ఏదని మదిలోని పాదు దెలిసి
కాదు కాదని పరికించి కనులు దెఱచి
ఆదిమూలము గనుచుండు నాశ్ర నేత్ర
దాననే పరమానందమూను వే 1334

నిరంతరము తదాసక్తచిత్తుఁడవై మనోభ్రమలపాలు గాక మఱపు లేనివాఁడవై పరమహంసస్వరూపమును కనుఁగొనుము

ఆ ఏమి కానిదాని నెఱుఁగుట లక్ష్యంబు
సాము చేసినట్లు సాధ్యపఱచి
నీమనిషి వదలి నిర్ణయమందరా, వి ... 1335

ఏవిధమైన వికారములు లేనిదానినే లక్ష్యముగా నుంచికొని స్వాధీనముఁజేసికొని తన్మయత్వము నొందుటకు యత్నింపుము

తే ఏమిసాధనముల నంద నేమిఫలము
తామసాన్విత మగును క్తిఁ దగులఁబెట్టి

నీమనిష్ఠలు మదియందు నెఱపవలెను
మనసునిలుకడ గనునట్లు మనఁగ వేమ. 1336

ఎన్ని సాధనములున్నను ప్రకృతి తామసాన్వితమే యగును. గాని యిసుమంతయైన ప్రయోజనముండదు గాన మనస్సు నిలుకడ గనునట్టులు ప్రయత్నింపుము

క. ఏరికిఁ దక్కనిచిన్మయు
దారికి తోడ్పడుట నెఱుక తనలో దానై
పోరుచు బైకొనుచుండును
సారెకు సమయింపఁ జూడు సరసశ వేమా!.

ఎట్టివారికిని సాధ్యుఁడుగాని చిత్స్వరూపుని జ్ఞానసాహాయ్యమున హృదయమునందే గని తన్మయత నొందుట శ్రేష్ఠము

క. ఏవంక మనసు కలిగిన
నావంకను నింద్రియంబు లన్నియు నేగు
న్నీవంక మనసు కలిగిన
నేవంకకు నింద్రియంబు లేగవు వేమా! 1338

ఏదిక్కునకు మనస్సుపోయిన నాదిక్కునకే ఇంద్రియములను పోవును గనుక మనస్సును సర్వదా దేవుని దిక్కుననే నిలుపుము

క. ఒకటని రెండని యెన్నుచుఁ
బ్రకటితముగ లెక్కఁబెట్ట బైకొనుచుండున్

నికరముగ నెఱుకదాఁటిన
సకలేశుని గాంచుటదియె సరసము వేమా! 1339

ఒకటి రెండు అని గుణించుచు క్రమముగా నీశ్వర ధ్యానసంలగ్నచిత్తుఁడైనచో శ్రేష్ఠము

క. ఒంటరిగా నున్నప్పుడు
గంటికి మింటికిని నడుమ గాపురముగ నీ
యింటను గన్గొని పిమ్మట
జంటించు జితాత్మయయుని జపమున వేమా!.

ఏకాంతమున నున్నప్పుడే ధ్యానమునందు మనస్సును చేర్చి ఈశ్వరసిద్ధిని బడయుము

ఆ. ఒంటికంబమందు నొనర సంకెల వేసి
ఆరుసంకెలముల నమర నిల్పి
ఆవల నిఁక చూడ నమరును తత్వము, వి....

ఈశరీరము ఒంటి స్తంభపుమేడవంటిది ఇందు అరిం ద్రియములు నారంకెలములు, వీటిని స్తంభింపఁజేసి అటుపైని యున్న బ్రహ్మమును సందర్శింపుము.

ఆ. ఒంటిమేడలోన నొనరంగఁ జూచిన
మంటిమింటినడుమ మహిమముగను
కంటిజ్యోతిమిగిలి కలియ నెక్కుము హంస, వి.

ఒంటి స్తంభముమేడలో నిశ్చలమగు ధ్యానమున జూచి నచో గొప్పవెలుగు కానవచ్చును దానిని పొందుటకై యత్నిం పుము. అదియే హంసమునాఁబడును.

ఆ. కడకతోన నరుఁడు కామంబు గట్టినఁ
జిత్తమునను చికిలి చిత్రరూపు
కై పడి నిలనుండు ఘనుఁ డాతఁడేసుమీ, వి....

కామమును జయించి మనస్సును వశపఱచుకొని చిత్తరువులోని బొమ్మవలె విషయములకు లోఁగకయుండెడువాఁడె ముక్తుఁడని తెలిసికొనుము

క. కడలేని యనాదికాలం
బెడఁబడకుండఁగను జ్ఞాన మెడఁబడకున్నన్
విడువఁడు జడమతులను మఱి
నడవుడి ఘనులెల్ల ముక్తి నట్టుగ వేమా!. 1344

సులభము

ఆ. కడవ నిండ సుధను క్రమముతో ద్రావిన
పాలమీఁద నేలఁ బొఱలునునను
తత్త్వ మెఱుఁగు వెనక తత్త్వంబు లేటికి, వి ...

తృప్తిగా నమృతము ద్రావినవానికి పాలక్కఱలేనట్లుగానే పరతత్త్వము నెఱిఁగినవానికి ఇతరతత్త్వము లనావశ్యకము లగును

తే. కదలకుండఁగ మది నిల్పి కదిసి పట్టి
నిదురలో నిద్రచూఁచుచు నేర్పు మిగిలి
పదరకుండెడివాఁడె పో బ్రహ్మనిభుఁడు
నిదియె సంతోషముల కెల్ల నిజము వేమ. 1346

మనస్సును నిశ్చలముగా నుంచి సమాధిస్థుఁడై

జాగ్రతను వహించితివని బ్రహ్మము నొందఁ గలవు ఆ బ్రహ్మమే సంతోషముల కెల్ల నిధి యనఁబడును

క. కదలని జీవములందును
తుది మొదలుగ నారు రుచులు తొలఁగక యుండున్
గదలెడి జీవములందును
వదలవు కష్టంబు సుఖము వసుధను వేమా!

స్థావరములు మొదలుకొని జంగమములవఱకు నేజంతువునకును కష్టసుఖములు తప్పవు

క. కనుచాటు తప్ప కాగుటి
మననంబున జేరి నొక్కి మార్గానినంతన్
వినుచుండుఁ బ్రణవరవళిని
కని దాఁటున నిర్గుణంబుగతి యగు వేమా!

దృశ్యమును తొలఁగక మనస్సును ధ్యానమునందుంచి యోంకారరూపుఁడగు నీశుని భజింపుము

తే. కనులచూడ్కిని జెదరక గట్టి నొక్కి
తనువుపై నాస విడిచిన తావు బట్టి
యున్నమనుజుఁడె శివుఁడయా యుర్విలోన
నతనికేటికి సుఖదుఃఖవిగతి వేమ 1349

దృష్టిని నొక్కిపట్టి శరీరమును మఱచి ఈశ్వరుని యందు మనస్సును లగ్నము చేసినవానికి ఏవిధములైన సుఖ దుఃఖములును లేవు.

ఆ. కనులఁజూడఁబడని కలుషవిదూరుని

మనమునందు జేర్చి మరలకొనక
తనకు ముక్తి లేదు తలఁపులు మెండైన, వి....
అపరిదృశ్యమానుఁడగు నీశ్వరుని మనస్సునందుఁ జేర్చి నిష్కాముకుఁడై ప్రవర్తింపవలయును

క కప్పయు పామును బోరం
గప్పను సర్పంబు మ్రింగు కైవడి మెఱయం
గప్పను వెడలం ద్రోసెడి
యొప్పున నాచొప్పు దెలిసి యుండర వేమా!
మండూకమును సర్పమును బోరునెడ సర్పము మండూకమును మ్రింగివైచును సమర్థుఁడైనచో ఆపామునుండి మండూకమును విడిపించును ఆట్లే మాయయును జీవుఁడు నుండునప్పుడు విజ్ఞుఁడై మాయను విడిపించును

ఆ. కపటమైన పనులు కడఁబెట్టి చూడక
తత్వమెల్లు తనకు తగులువడును
దగులువడినఁ గాని ధన్యత నొందఁడు, వి....
సులభము

ఆ కంబమునను జొచ్చి కడ తేరిపోయెడి
తెఱువెఱుఁగకయుండెఁ దిరిగివచ్చి
తెరువుదెలిసి దాఁట దేవుఁ డందురు కదా, వి....
శరీరములో ప్రవేశించి వెడలుచుండెడి ఈయవస్థలను తెలిసికొని ఏతదతీతుఁ డగుటయే ఈశ్వరత్వము నొందుట యని యందురు.

క కర్మజ్ఞానేంద్రియములు
నిర్మలహృదయమున జేర్చి నిర్గుణమతితో
ధర్మంబని వివరించుట
మర్మం బధ్యాత్మయోగమహిమము వేమా!.

కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములను నిర్గుణమతితో
వివేచన సేయుటయే అధ్యాత్మ మని చెప్పఁబడును

ఆ. కల్ల నిజము తెలిసి గాలిభూతము రోసి
యింటిమీఁద నాస యేల విడవొ
నీటిమీఁద బుగ్గ నిలుకడ కాదయా, వి.... 1355

సత్యాసత్యములను స్థిరాస్థిరములను నిర్ణయించి యస
త్యాస్థిరములను రోసి యుండుటయే ముక్తికి సాధనము

తే. కలుషములనెల్ల ఖండించు గతి నెఱింగి
చిన్మయానందపట్టాభిషిక్తుఁడైన
వాని నెన్నంగతరమె యీవసుధయందు
బరశివుండని వర్ణింపఁబడును వేమ. 1356

పాపహారమగుచిన్మయత్వము నొందినవానిని పరశివుఁ
డనియే చెప్పవలయును

ఆ కాంతపై నిప్రేమ స్వాంతము రంజించు
జింతదీఱు దరుణి చిక్కనపుడె
వింతయుమరఁ బోదు విశ్వసాక్షిని గూడ, వి....

స్త్రీవిషయికమగు చింతను విడచిననే ముక్తిని గనఁ
గలఁడు.

క. కించిన్మాత్రమును మదికిఁ
జంచలమును బుట్టనీక జాగ్రతతో నా
నంచితమగు గురుభక్తిని
మించినపరిపూర్ణమూని మెలఁగుము వేమా!.

ఇసుమంతైనను మనస్సును చలింపనీయక గురూక్త మార్గమున నాత్మధ్యానము చేయుటయే ముక్తి కనువగు మార్గము

ఆ. కీలుదెలిసి మదిని గేవలాత్మను గూడి
భావమందు సాక్షి బయలుదాఁకి
చేరియుంట ముక్తిఁ జెందంగఁ బూనరా, వి....

రహస్యము నెఱింగి యాత్మసంలగ్నచిత్తుఁడై చిత్స్వరూపము నొందియుండుటయే ముక్తి నాఁబడును

క. కుండలియోగము దెలిసిన
బండాలము యోగి కేల బాలికబొందం
దండిగ నాతనువొందను
మెండుగ నొకముక్తికాంత మెఱుగుర వేమా!.

నిక్కమగుయోగికి స్త్రీవిషయికమగు వాంఛయే యుండదు. ఉండినను అది ముక్తికాంతావిషయికమగు వాంఛయే గాని ఇతరము కాదు

ఆ. కేవలాత్మ జీవుఁడే నిజమని పట్టి
వాదులాడునట్టివారి ద్రోక్కి
పట్టి వారి నాల్క తుదిఁగోయ పాపమా?, వి.

జీవుఁడే ఆత్మ యని వాదించువారి కేమి చేసినను పాపము లేదు

ఆ. కొండమీఁద జ్యోతి కొమరుగదీపింపఁగా
నిండి పూర్ణముండు నిబిడముగను
అండఁజేరకున్న నంటగరాదయా, వి.... 1362

వెలుగు శిఖరము పర్యంతము నిండి నిబిడీకృతమై కన్పట్టుచుండును అట్టిదాని నాని ముక్తుఁడ వగుము

క కోటులు సంపాదించినఁ
గూటికె సరిపోయె బ్రదుకు గుంపులు కూలె
న్నేటికి నీసంసారము
చోటున నిను గన్ననాఁడె సుదినము వేమా!.

కోట్లకొలఁది సంపాదించినను సంసారము రచ్చను మూ·మేగాని ఇతరము కాదు కావున విరాగివై త్యజింపుము

ఆ. కోరి మదిని గురుని కొలువు జేయుట మేలు
గారవమున దెలుపు గహనవిద్య
దూరదృష్టి నిలిపి తొడరుట మోక్షంబు, వి....

గురువులను ప్రార్థన చేసి కోరికొనినచో నాదరించి రహస్యమగు నధ్యాత్మ విద్య నిత్తురు దాన ముక్తి కలుగును.

ఆ. క్రమమున దేహత్రయములు
విమలజ్ఞానంబుచేత వివరించినచో
నమలం బగునస్తోకము
కొమరొప్పగ జాగ్రతందు గూడును వేమా!.

దేహత్రయములను నిర్మలమగు జ్ఞానదృష్టిని విచారించి చూచినచో నందు అమలమగు జ్యోతిస్సు అపరాత్మరూపము కనుపట్టును

తే. ఖండపరశువుఁ బూజింప దండిదాని
భూతి నిచ్చును గావున నీతి గలిగి
శివుని బ్రార్థించుశరి ననుభవమునందఁ
జేయు నైశ్వర్య మిచ్చుటచేత వేమ 1366

శివుని పూజించి సంపదల నొసఁగు గావునఁ బూజించి అణిమాద్యైశ్వర్యములను పడయుము

తే గట్టురాచూలిపతియైన గంగధరుని
గుట్టు మదిలోనఁ దెలిసినఁ బట్టువిడక
చట్టువలె మనసుండుట శాశ్వతంబు
దిట్టయగునట్టి యాతఁడె తెలియు వేమ. 1367

ఈశ్వరుని హృదయమున నెలకొలిపి నిరంతరధ్యానమునఁ దన్మయత్వము నొందినవాడే ముక్తుఁడని తెలిసికొనుము

తే. గగనగోచరనిర్గుణగమ్య మూని
తమము మీరినధ్యానంపుతత్పరమున
దెమల కందుట మోక్షంబు తెరువు గాదె
విమల సుజ్ఞాన మబ్బిన వెలయు వేమ. 1368

చిద్గమ్యమగు తత్త్వము నొంది యజ్ఞానమును రూపుమాపి నిరంతరధ్యానముతో నుండుటయే మోక్షము నొందుటకు తగినమార్గము.

తే. గమనగమ్యనిరాలయగతిని మనసు
సమరసత్వంబుగా నెంచి సాక్షి యగుచు
భ్రమ లడంచిన బ్రహ్మంబు బట్టబయలు
క్రమ మెఱుంగమి లోనెల్లఁ దమమె వేమ 1369

మనసు సమరసభావమున నడపించుచు భ్రాంతిరహితముగాఁజేసి ఈశుఁ జేర్చినచో బ్రహ్మము ప్రకట మగును

తే. గగనగోచ్యనిరాలయ ఘట్టమందు
విమలనిర్మలనిష్కళవేదిఁ జేరి
తన్మ్న గని చింత చేయుటే తత్పదంబు
గురుకటాక్షము లభియింప గుదురు వేమ 1370

చిద్గోచ్యమును నిర్మలమును నిష్కళమును అగునా పరేశుని చింత జేయుటయే తత్పదము. అయ్యది గురువుల కటాక్షమున లభ్యమగును.

ఆ. గుడులు దేవతలని గుఱ్ఱలు గావింత్రు
ముష్టి బాపలనుచు మూర్ఖనేల
మొప్పెంకును దారి యిరి ఋగఁ జూపిరి, వి....

గుడులు దేవతలు నని బ్రాహ్మణులు తమ జీవికకై ఏర్పఱచిరని మూర్ఖులు ఏడ్చుచుందురే కాని బ్రహ్మప్రాప్తికి దారి జూపిరని తలంపరు

ఆ. గుణికి జ్ఞానమహిమ గోరంతఁ జెప్పిన
కొండ యగును వాని గుణముచేత
గుణవిహీనున కెట్లు గుదురు నారీతిగ, వి....

గుణవంతునకు జ్ఞానమహిమ నలుసంత చెప్పినను కొండంత యగును; కాని గుణహీనునకు మాత్రము అట్లు కాదు.

ఆ. గురువు లేక విద్య గుఱుతుగా దొరకదు
నృపతి లేక భూమి తృప్తి గాదు
గురువు విద్య లేక గురుతరద్విజుఁ డౌనె, వి....

రాజు లేక లోకములు జరుగనట్లులే గురువు లేని విద్యయును పేరు వహింపదు

తే. ఘనచిదాకాశమైనట్టిగతి నెఱింగి
యనిలరేచకపూరకం బనువుగాను
పనుపడఁగ లాగి కుంభించి పాటుపడర
మానెడు సుజ్ఞాన మబ్బర నేమరక వేమ 1374

చిదాకాశమును లక్ష్యముగా నుంచికొని రేచకపూరకములను పూరించి ధ్యానముఁ జేసినచో సుజ్ఞానము లభించును

ఆ చింతమానుకొనను జేరిన నలకాంత
వింతఁ జూపి చనును విడువరాదు
పంతగించి దాని పట్టినవే మేలు, వి ... 1375

మనస్సును విశ్వసించినఁ దప్పు త్రోవల నీడ్చుకొని పోవును గాన నట్టులు పోనీయక పట్టియుండుటయే మేలు

తే చిన్మయానందపురి నడిసీమఁ జేరి
తన్మయుండైన పరశివతత్త్వవేత్త
మన్మయుంబగు రాజ్యంబు మఱిగి యుండు
జన్మరాహిత్యమందు నిజమ్ము వేమ. 1376

చిన్మయానందము నొంది పరశివతత్త్వవేత్త యగువాఁడు మనోరాజ్యమును పాలించుచు జన్మరహితుఁడై యుండఁగలఁడు

క. చెప్పియుఁ జూపఁగరానిది
మెప్పుగ మదిలోనఁ జూచి మెలకువతోడన్
త్రిప్పులు వడకయె చూచిన
నొప్పుగ జగ మెల్ల నిండి యుండిన వేమా!.

నోటితో చెప్పుటకును కంటికి చూపుటకును వీలుకానట్టిది పరబ్రహ్మస్వరూపము కావున భ్రాంతిరహితమగు దృష్టితో చూచిన లోకముల నిండి కాన్పించును

తే. చెప్పవచ్చును దా నెంతొ చేసినట్లు
ముప్పు తిప్పలు దలఁగను మూఁగమేది
చెప్పుమాటలు తనమది సేఁతలగున, వి....1378

ఎంతె తో పనులను చేసినట్లు చెప్పవచ్చును గాని చేసి చూపుటమాత్రము కష్టము

ఆ చెలిమిఁ గూడ ముందు చింతించి గగనంబు
బలిమిఁ గూడ బ్రాకి భావ మూని
ఫలవిహీనమైన భావ చిన్మయముందు, వి....

సులభము

ఆ చక్కగాను మనని చర్చించి కనవలె
ముక్కుతుదిని మించి ముఱిపముగను
దృక్కు బ్రహ్మమనుచు మ్రొక్కినంత నె ముక్తి,వి.

త్వరగొందక చక్కగా మనస్సులో చర్చించి నాసాగ్రమున దృష్టినిలిపి అప్పుడు దృశ్యమగు తేజమునే బ్రహ్మమని నమస్కరింపవలయును

ఆ చక్కగాను మదిని సాధించి కనవలె
నిక్క చూచు నెఱుక నేర్పుమీఱ
ముక్కుతుదిని చూపు ముదమందఁ జూడరా, వి

నాసాగ్రమందు దృష్టి నిలుపు తెఱఁగును చక్కగా నభ్యసించి పిదప నారీతిని చేసి బ్రహ్మమును సంతసముతో దర్శింపుము

తే. చేరి యష్టాక్షరము నెంచి దారి మిగిలి
కోరికలు లేనిమోక్షాధికారి యగుచుఁ
బోరి చిత్పదమందినఁ బొంచి మించు, వి....

అష్టాక్షరిని జపించుచు నిష్కాముఁడవై పట్టినపట్టును వీడక చిత్పదమునందుటకు ప్రయత్నింపుము

ఆ. చక్కఁజేసి మదిని సాధింప నేరమి
ముక్కుమీఁద దృష్టి మొనయు టరుదు
నిక్కమైనజ్యోతి నిన్నంటియుండురా, వి....1383

మనస్సును చక్కఁజేసికొనకుండునంతవఱకు నాసాగ్రమున దృష్టి నిలుచుట కష్టము దృష్టి నిలిచెనా పరబ్రహ్మము సర్వము దానిలో నివసించియుండును

క. చక్కనివూనికతోడను
ముక్కుతుద న్నిలిపి మనసు మూలముగనమి

నర్క్కుడు నిత్యవినోదము
దృక్కుగునాబయలు సేర దృఢమగు వేమా!.

నిశ్చలముగు ప్రయత్నముతో నాసాగ్రమునందు దృష్టిని నిలిపి మనోమూలముఁ బటుతరముగా నందుఁ జేర్చి నచో బ్రహ్మస్వరూపము బయలుపడును.

ఆ. చందమామను వెలుగుఁ జక్కఁగాఁ బరికింపు
వెన్నెలం దలరెడి వెలయు బయల
దానిరూపుఁ దెలియఁగానె ముక్తి ఘటిల్లు, వి....

చంద్రబింబమువలె నుజ్జ్వలముగు నాబ్రహ్మమును సందర్శించినతత్క్షణమే సంసారమునుండి విముక్తి దొరకును.

ఆ. చదువులందు లేదు శాస్త్రంబులను లేదు
వాదములను దైవభేదములను
బయల నున్నముక్తిఁ బాటించి చూడరా, వి....

చదువులలోను శాస్త్రములలోను వెదకినఁ గానరాక తదతీతమైన రూపముతో బయలనున్న ముక్తిని కనుఁగొనుము.

ఆ. చదువులన్ని చదివి చాలవివేకియై
మగిడి తన్నెఱుఁగక మందజనుఁడు
విసుగుచదువటంచు వెఱ్ఱియై చెడిపోవు, వి....

సమస్తవిద్యలను చదివియును ఆత్మజ్ఞానము లేక విసుగు పుట్టి వెఱ్ఱియై మందుఁడు చెడిపోవుచుండును.

ఆ. చాయలోనిచాయఁ జక్కఁగా గుర్తించి

రోయవలెను భ్రమలఁ గొంకులేక
మాయ మాయ మాను మహిం తత్త్వమందురా, వి

చక్కగా దృష్టిని బఱపి భ్రాంతులను దిగఁ ద్రొక్కి మాయలను పో నడంచి తత్త్వము నొందవలయును.

తే చూపురూపుల రెంటిని జూచి దాని
నిగుకు తెలియంగ మదినుంచ నేర్పు గనుచు
గాపురంబగు కైవల్యకర్జమాను
నిర్మలజ్ఞాని పని బూని నిజము వేమ. 1389

చూపును రూపును ఐక్యముఁ జేసి మనస్సును తదాయత్తముఁ జేసి యందలిరహస్యములఁ గనిపెట్టుచు కైవల్యము నొందుటకై యత్నము సేయవలయును

తే. చూపులో చూపు వెలిచూపు చూడ నేల
నాది కుంభము లేకున్న దచ్చ మగును
వేగుచు మూర్తి యిడి యుంచు వాయుగను, వి

అంతరంగికమగు లక్ష్యమును చూచి యచలమగు తత్త్వమును మనస్సునందుఁ జేర్చి ధ్యానించుట ముక్తికి సాధనము

తే. చూపురూపుల రెంటిని జూచి దాని
నన్నియును గాక తన్ను దా గన్నదాని
నిర్మలంబుగ మది నెంచు నిర్మలుండు
నిర్గుణబ్రహ్మ మరచేత నిలుపు వేమ. 1391

సులభము.

ఆ జగమునందు లేదు జలములందును లేదు
నిగమవేద్యమైన నిజపదంబు
సగుణనిర్గుణముల సాధించి చూడరా, వి....
సులభము

ఆ జతుక మంటురీతి జాబిల్లి వెలుగంది
ప్రతిఫలింపగుతిని బరిణమించి
వెదుకవలెను మదిని వేదాంతమర్మము, వి....

అగ్ని సంయోగమున లక్క కరగినట్టులు ఆత్మ ప్రత్యక్షము మనస్సు కరగి యందు లయమై యుండవలయును.

ఆ. జననమరణవేళ స్వాతంత్ర్యమూ లేదు
తేను లేదు మున్ను పోను లేదు
నడుమఁ గర్తననుట నగుఁబాటు గాదఁటే,వి....

జననమరణాదులలో లేనిస్వాతంత్ర్యము నడుమ తెచ్చుకొనిన నవ్వులచేటు

ఆ జాతికులములందు జనులెల్ల బద్ధులై
భావపరమునందు ప్రాలుమాలి
చచ్చి పుట్టుచుంద్రు జడమతులై భువి, వి....

జాతి యని కులమని ఎల్లజనులు బద్ధులై జననమరణములను జడత్వమువలన పొందుచుందురు

ఆ జాతిమతము విడిచి చని యోగిగా మేలు
జాతితోనె యున్న నీతినలదె
మతము బట్టి జాతి మానుకుంట కొలంత, వి....

జాత్యాదులను విడిచి యోగిగా నుండుటయే మేలు. అట్లుగాక జాతితో నుండినచో నీతి లేకుంట యన్యాయ్యము.

ఆ. జాతి వేఱు లేక జన్మక్రమంబున
నెమ్మది నభవుని నిల్పె నేని
అఖిలజనులలోన నతఁడె పో ఘనుఁడయా, వి....

జాత్యాదిభేదములు లేక హృదయమున నీశ్వరుని నిల్పువాఁడే యందఱిలో నుత్తముఁడు.

ఆ. జీవభావ మెఱుఁగఁ జెడ దెన్నటికి మతి
దైవమును నెఱుంగ దనరు బుద్ధి
తేజ ముదయమంద దిమిరంబు నిల్వదు, వి....

జీవధర్మమును తెలిసికొని యున్నచో తేజము గలిగిన తిమిరములు నిలువనట్లులనే విఘ్నములు లేక బ్రహ్మత్వము నొందఁగల్గుదురు

ఆ. జీవవశమురీతి జన్మాత్రతను మించి
భావమమతనమరు పట్టుఁ బట్టి
కలియుహంస మదిని గర్మసన్న్యాసియై, వి....

జీవవశతను చిదాకారత నొంది మమత్వమును వీడి కర్మసన్న్యాసియై మెలంగవలయును

క. జవదాఁట నేల గుఱిగా
భవహరమగు భక్తి బూని పరిపక్వముగా
ధృవమైన బయలు జేరఁగ
శివ మన్మయచిన్మయంబు చేకురు వేమా!. 1400

ఈశ్వరునియందు భక్తి గలిగియున్నచో కర్మము పరిపక్వమై చిత్స్వరూపము నొందఁగలఁడు

ఆ. జాలి నొందరాదు జపదాఁటి కనరాదు
ఆదిమూల మైనయాత్మ మఱుగు
పోరిచేరి పొంది పూర్ణము నందురా, వి....

సులభము

ఆ జ్ఞాననిష్ఠఁ బూని మేను మఱచువాఁడు
కామిగాఁడు మోక్షకామిగాని
నీమనిష్ఠ లుడిపి నిర్గుణ మందురా, వి.... 1402

జ్ఞాననిష్ఠ కలిగి నిస్పృహుఁడై యుండువాఁడు మోక్షకామి యగుగాని కాముకుఁడు కాఁజాలఁడు. కావున నియమవిరహితముగు నిర్గుణత నొందును

ఆ. జ్ఞానమెన్న గురువు జ్ఞానహైన్యము బుద్ధి
రెంటిసందుఁజిమ్మ జేచునపుడు
రిమ్మ తెలిసెనేని రెండొక్కరూపురా, వి....

జ్ఞానాజ్ఞానముల తారతమ్యమును కనిపెట్టి సమయమును గుర్తెఱింగి జ్ఞానయుతుఁడై మెలఁగవలయును

క. తక్రముతో నుద్భవమై
తక్రమ్మున దేలు వెన్న తరబడి సంసా
రక్రమమున బుట్టియు ఘన
చక్రము గుర్తింప నగును జతురత వేమా

తక్రము (మజ్జిగ)లో బుట్టి దానినుండి వేఱుపాటు నొంది పరిదృశ్యమానమగు వెన్నవలె సంసారమునఁ బుట్టియు నద్దానినుండి వేఱ్పడవలయును

క. తననిజరూపము జూడం
గను దగుమార్గంబు తెలియఁ గావలె నన్నన్
ఘనగురునియొండ జేరక
యొనఁగూడదు నె సాముఁ జేయ నుర్విని వేమా!.

ఆత్మరూపముఁ అయవలయునని కోరికగలిగియున్నచో గురినియొండను జేరి మెలఁగవలయును

క. తనలోపల సకలంబును
తెనరం దా నగుట నెఱిఁగి తారకమాత్మం
గనుఁగొనుచు బరిణమించిన
మనుజునకును ముక్తి గలదు మహిలో వేమా!.

తనలోనే సమస్తమును గని తానె సమస్తస్వరూపుఁడగుట్లు భావించి సమత్వము నొందినవానికి ముక్తి యవశ్యమును గలదు.

క. తనలో సర్వం బుంగఁగఁ
దనలోపల వెదుకలేక ధరవెదకెడి యీ
తనువుల మోసెడియెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా!.

తనలోనే సమస్తము నుండఁగా బయుల వెదకువారు మూర్ఖులును ఆనివార్యులును

క. తనమతమును తా నెఱుఁగఁడె
మనమునఁ దలపోయ నెవని మార్గం బగునో
యనయము నీజాలంబును
గని మెలఁగుట ముక్తి కిరవు గదరా వేమా !.

తనమత మేదియో యోచించుకొని నయానుసారియై నిన్ను (బ్రహ్మమును) గనుటయే ముక్తి కిరవు

క తనుఁ దా దెలియుట తత్త్వము
తనకన్యులు బోధసేయ ధరలో గలరా
తను దాఁ దెలియక యుండిన
తన కెవరును తెలుపలేరు తథ్యము వేమా !.

తనను తా నెఱుంగుటయే తత్త్వము ఇతరులు తనకు తెలుపు పాటివారలు లోకములో నెవ్వరును లేరు

తే. తాను తానైనబయలున దనరిబుద్ధి
పూనికను నిల్చినప్పుడే పూర్ణమంది
నిర్ణయో నాస్తి సర్వత్ర నిండు నదియె, వి....

తాను (అనఁగా జీవుడు) ఆత్మత్వమునొంది చిత్స్వరూపము నొంది పూర్ణత నొందినప్పుడే ముక్తుఁడయ్యెను

ఆ. తావు లేనిచోట తావు తానై యుండు
తావు గలుగుచోటఁ దాను లేదు
తావు తాని యైనఁ దత్త్వంబు తెలియునా,వి.

శూన్యమునఁ బూర్ణుఁడై పూర్ణమున శూన్యుఁడై చిత్రముగా పరాత్ముఁడు వెలుఁగుచున్నాఁడు ఆతత్త్వము నొందఁ బ్రయత్నింపుము.

క. తొమ్మిది తొఱ్ఱులతి త్తిని
నమ్మి శివుని దలఁప లేక నశియింతువు నీ
విమ్మహి గృధ్రచయంబులు
సమ్మతిగా నిన్ను దినును చక్కఁగ వేమా!. 1412

నవరంధ్రమయమగు నీశరీరమును నమ్ముకము ఇయ్యది చివఱకు గద్దలపాలగునే కాని యుపయోగింపదు

ఆ. తోలుతి త్తిలోనఁ దోలుతఁ బుట్టినవాని
వెనుక దెలియవలయు వివర మరసి
వెనుకఁ దెలియలేమి వెట్టియై చెడిపోవు, వి....

ఈచర్మభస్త్రికలో తోలుతఁ బ్రవేశించిన దెవ్వరా? యని వెదకి తెలిసికొని జాగ్రత్తను వహింపుము

ఆ. త్రాడు పా మటంచు తాఁ జూచి భయపడుఁ
దెలిసి త్రాడటన్న దీఱు భయము
భయము తీఱినపుడె బ్రహ్మంబు తానగు, వి....

అజ్ఞానమున త్రాడే పామని భ్రాంతిగలిగిన భయము కలుగుచుండును. అట్టిభయజనకమగు భ్రాంతి తీరినా తానే బ్రహ్మత్వము నొందును

తే. దర్పణంబున దనరూపు తగిలినట్లు
నేర్పు గలిగినమదిలోన నీదురూప
మర్పణంబుగ నెఱుకలో నడచిచూడ
నోర్పు కలవాఁడె నేర్పుతా నొనర వేమ. 1415

నీరూపము అద్దములో సక్తముగాకయే ప్రతిఫలించి నట్టులు నీశరీరములో జ్ఞానస్వరూపుఁడు సంసక్తుఁడు గాకయే వెలుఁగుచున్నాఁడు

ఆ. దాపున నున్నది యద్దము
రూపున నీరూపుఁ జూచి రూఢిగ గనియూ
పాపకు లోనగుచూపున
బ్రాపై శివుడుండుఁ గనుము పనుపడి వేమా!.

స్పష్టము

ఆ. దూరయోచనలకు దూరమా దైవము
తనువు దూరమైనఁ దగులునపుడు
జీవిదవ్వుచేయ దేవుఁడై నిలుచునా, వి,...1417

యోచనలకు దైవము దూరము కాదు శరీరము ఒక వేళ దూరమున నున్నను నిరంతరము ధ్యాతుఁడైనచో జీవి సామీప్యమున దేవుఁడై నిలుచుండును.

ఆ దేహమూలమందు దేహి దేవుఁ డటంచుఁ
దెలిసియున్న బుధులు తీర్థయాత్ర
లరయ బోరు జగతి నాత్మ తామై యునికి, వి.

శరీరములో నున్నజీవియే దేవుఁడని తెలిసినబుధులు (అనఁగా జ్ఞానులు) తామె దేవరూపులు గనుక తీర్థయాత్ర లకుఁ బోవరు

ఆ. దొమ్మ మాయకొంటకు నమ్మవారికి వేఁట
లిమ్మటంచ్రి దేమి దొమ్మ తెవులో ?

అమ్మవారిపేర నందఱు దినుటకా, వి.... 1419

పీడలు పోవుట కని పలుకుచు అమ్మవారికి వేటనిమ్మను టకు వీరికి పోఁగాలమా? లేక పొట్టనించుకొను నుద్దేశమా?

ఆ. ధాత్రిజనుల కెల్లఁ దగ నెఱింగించెద
నొనర హాగు నెఱుంగు నుపమ యొకటి
మనసు చెదరనీక మహిమతోఁ జూచుటే, వి....

ఈశ్వరుని చూచుటకు మనస్సును నిశ్చలముగా నుంచుట యొక్కటియే మంచియుపాయము.

క. నలుగురుగలచోటను దాఁ
దలఁజూపుచు మెలఁగుచుండి ధన్యత గనఁగా
దలఁచెడియాతఁడు నిచ్చలు
గలమాటలె పలుకుచుండఁగా దగు వేమా!.

సులభము

ఆ. నాకు నెవరు దిక్కు నడినాళములలోన
వేగుఁజుక్కవంటివెలుఁగె దిక్కు
వెలుగుకంటె దిక్కు వెదుకంగ లేరయా, వి....

సులభము

క. నాదము దెలిసినయోగియె
వేదాంతములోన నున్నవిధి దెలుపుమది
న్నాదంబె ముక్తిపదమని
యాదరమున జనులతోడ ననరా వేమా!.

నాదజ్ఞుఁడగువాఁడు వేదాంతమును చక్కఁగా నెఱిం
గించును. కావున నాదమే ముక్తిపదము

ఆ నాదునాదు గూడి నామరూపంబైన
నాదులోన నాదు నాటియుండు
నాదుఁ జేయువారు వర్ణింపలేరయా, వి....

శబ్దము శబ్దమును ఒక్కటిగా చేరి నామరూపాదుల
నొంది ప్రపంచమునందంతటను వ్యాపించియుండును కాని
దీనిని మూర్ఖులు తెలిసికొనఁజాలరు.

క. నాలుగువీథుల మధ్యను
మేలుగ బ్రహ్మంబు నుండ మెలకువతోడం
జాలగ గురుమూలంబున
వీలుగఁ బొందంగ నగును వినరా వేమా!.

నాలుగుతత్త్వములతోఁ గూడికొని బ్రహ్మము జాగ్ర
దవస్థ నొందియుండును కావున గురునిసాయమునఁ బొందు
టకు యత్నింపుము

ఆ నాసికాగ్రమందు నయముగా గురి నిల్పి
వాసిగాను జూడ వశ్యమగును
కాశికంచుల కని కడగండ్లఁ బడనేల, వి....

కాశికని కడగండ్లుఁబడుటకన్న నాసికాగ్రమునందు
ధ్యానించినచో తత్త్వము సాక్షాత్కరించును

ఆ. నిజము వరుస నెఱిఁగి నిత్యుఁడ వగుటకు
పలుకులోనిశబ్ద మలర దెలియ

పలుకకుండువాఁడె పరమాత్ముఁ డందురు, వి....

నిజమును పరుసను తెలిసికొని నిత్యత్వము నొందుటకై వాఙ్నియమము నవలంబింపుము అట్లైన వాఁడె పరమాత్మ యని పెద్దలు సెప్పుదురు

తే. నిత్యసత్యనిరామయనిర్గుణంబు
మృత్యుసమదృష్టిలో నెంచి మిన్నకుండి
భృత్యభృత్యానురాగుఁడై భృకుటి నంటి
నృత్యమాడుచు నుండుటే నియతి వేమ. 1428

నిత్యసత్యనిరామయత్వాదిగుణవిశిష్టుఁడై మృత్యువునందును సమత వహించి విధేయుఁడై మెలఁగుట మంచిది

తే. నిత్యసత్యవ్రతాచారనిపుణుఁడ వయి
పరమధర్మార్థములనెల్లఁ బట్టి చూచి
సిద్ధిబొందెడి పరిపూర్ణచింతఁ బూను
మప్పు డానందమమితమా నయ్య వేమ. 1429

సులభము

క. నిత్యానందవివేకము
సత్యంబుగ దెలియకున్న శక్యంబగునా
ముత్యము సరిగుకుమర్మము
భృత్యుఁడవై మది నెఱుంగఁ బెంపగు వేమా!.

నిత్యానందవివేకము గురునను గ్రహము లేకున్న దుస్సాధ్యము

ఆ నిద్రమేలు తెలిసి నిలుపుడీ మీలోన
బ్రాణిమేలు తెలిసి బాయకుండుఁ
బ్రాణి నిదురసందు పరమాత్ముఁ డుండును, వి....

సమాధిఁ బూను టెఱిఁగి జీవజీవిభేదములను గమనించి నచో పరమాత్మ వ్యక్తము గాఁగలఁడు

ఆ. నిద్రలోననిద్ర నిర్జరతాపికి
తామసంపునిద్రఁ దలఁగఁ ద్రోసి
నిద్రలోననిద్ర నిర్భృతి నుదయించు, వి.... 1432

సమాధి నొంది పరతత్త్వము నుపాసించినచో నిర్భయమగు సాధన మలవడును

క. నిను నీవెఱుఁగఁగ నెంచిన
మనమున సంకల్పములను మానఁగవలెరా
అనుమానరహితముగ గుఱి
వినయంబున గురుని బట్టి వెదకుము వేమా!.

ఆత్మకైవల్యము నొందఁగోరదవేని కామనలను త్యజించి నిరనుమానమగు వినయము నొంది గురునిద్వారా పొందుము.

ఆ. నిన్ను జూచు చుండ నిండును తత్త్వంబు
తన్ను జూచు చుండ దగులుమాయ
నిన్ను నెఱిఁగినపుడె తన్ను దా నెఱుఁగును,వి.

అంతశ్శరీరముపై ధ్యాన ముంచిన యాత్మత్వము పరిపూర్ణభావమునఁ బ్రత్యక్షత నొందును

ఆ. నిన్ను జూచె నేని తన్ను దా మఱచును
దన్ను జూచె నేని నిన్ను మఱచు
ఏవిధమున మనుజుఁ డెఱుఁగు నిన్నును నన్ను, వి
స్పష్టము

ఆ నిర్మలాత్మ విద్య నిత్యసత్యజ్ఞాన
నిరతుఁడై నవాఁడ నేర్పుమీఱ
ననుభవింపఁ గోర నలసట బొందును, వి....

నిర్మలమగు నాత్మవిద్యను నిత్యసత్యవ్రతనిరతుఁ డగు వాఁడు ఎన్నికష్టముల కైన నోర్చి యభ్యసించి యనుభవింపఁ గోరునే గాని వదలివేయఁబోఁడు

క. నీతియు భక్తియు జ్ఞానము
రీతుల వర్తించు మదిని రేవెలుఁగగుచుఙ్
జ్యోతిగ నాదగు బ్రహ్మము
భూతాత్ముఁడు నిన్నుఁబొందు బొడగను వేమా!

నీతియుం భక్తియును జ్ఞానమును గలుగుమనస్సును చిక్కఁబట్టి జ్యోతిస్స్వరూపమగు బ్రహ్మముఁ జేర్పవలయును.

క. నీలోని యొఱుక యనునది
నీలోనని పెరిఁగి పెరిఁగి నీలోనడగుఙ్
నీలోనిచిత్ర మడఁచిన
నాలోనన బ్రహ్మ బయలు నందును వేమా!

హృదయాంతరస్థమగు జ్ఞానము పెటిఁగి పెటిఁగి యందే లీనమగును అందలిచిత్రములను బరికించినఁ బ్రహ్మ మట్టివానికి సులభ మగును.

ఆ నీళ్లమునుఁగ నేల నిధులు మెట్టఁగ నేల
మొనసి వేల్పులకును మ్రొక్క నేల
కపటకల్మషములు కడుపులో నుండఁగా, వి....
స్పష్టము

క. నీవనినను నేననినను
భావమ్మున నెఱుకయొక్క పద్ధతి యగునా?
భావంబు దెలిసి మది ని
ర్భావముగా నిన్ను గనుట పరమగు వేమా!.

నీవు నేను అని వాగులాడుకొనుభావము జ్ఞానపురీతి గాదు మరి యేదియందురా, నిర్భావముగా ధ్యానించుటయే పరమునొంద సాధకము

ఆ నీవు నిలిచియుండ నిఖిలంబు నిలువదు
నిలిచియుండు నొండ నీగువలెను
నీవు నిశ్చయంబు నిఖిలంబు మాయయా, వి....

దైవము నీవను నిత్యము తక్కినది అనిత్యము కావున నీవు అనుపదార్థము నిత్యము తక్కినది మాయాస్వరూపము

ఆ. నీవు పలుకుచున్న నిత్యపూజితుఁ డౌను
నీవు పలుకకున్న నిదురపోవు
నీవు పలుకుపలుకు నిర్మలుం డగునయా, వి....

భాషించుచున్న పూజితుఁడ వగుచుందువు భాష లుడిగినను సుషుప్తిని జెందవు (అనఁగా సంభాషణభూషణాదులు జాగ్రత్స్వప్నాదులు లేనిది బ్రహ్మ మనుట)

ఆ. నీవు వినఁగ నొకటి నిలిచి యుండఁగ లేదు
నిలువ నెండమావు లలరునట్టె
నీవు నన్నుఁ గుట నిశ్చయం బాయెరా, వి....
సంలభము

ఆ నేను నీవనియెడి నత్తంపుమాటలు
మానియుండువాఁడె మానవిదుఁడు
తాన నే ననియెడి తమకంబు మానరా, వి....

నేను నీవను విభేదబుద్ధిని మాని యుండువాఁడె మాన్యుఁడు గాన నట్టిబుద్ధిని పరిత్యజింపుము

ఆ నేయి వెన్నకాచి నీడనే యుంచిన
పేరి గట్టిపడును పెరుఁగు రీతి
పోరిపోరి మదిని పోనీక పట్టుము, వి.... 1445

వెన్న కాచి సిద్ధము చేసినదైనను రేయి నీడనుంచిన గట్టిపారినట్టులే పరిపక్వము చెసినను మనస్సును కొంచె మే మరినచో పారిపోవును

ఆ. నేననువచనంబు నీవనఁగా వచ్చు
నీవు నేననఁబడు నిష్ఠ దెలియు
నేను నీవె నీవె నేననవచ్చురా, వి.... 1446

నీవు నేను అనుశబ్దముల కైక్యమును సమర్థించుటయే బ్రహ్మత్వప్రాప్తియందలి ముఖ్యతత్త్వము

ఆ. పంచభూతములను పరఁగవలను బట్టి
సంచరింపకుండు సరణి దెలిసి

వేఁటలాడి బే స్తవాటంబు నెఱుఁగుము, వి....

పంచభూతములను పట్టి చలనము లేకుండఁ గట్టి వైచి వేటకారునిబోలె వశపఱచికొనవలయును

ఆ. పంచఋషులు భువిని పరమపవిత్రులు
మించి లోకమునకు మేలుకొఱకు
సంచితార్థములను సమసింపఁజేయురా, వి....

ఏవురు ఋషులు కేవలము లోకోద్ధరణమునకు మాత్రమే పుట్టియున్నారు వారు సమస్తపాపములను పోఁగొట్టు శక్తి గలవారలు

ఆ. పంచముఖములందు పంచాక్షరి జనించె
పంచవర్ణములను బ్రబలె జగము
పంచముఖుని మీరు ప్రస్తుతిసేయుఁడీ, వి.... 1449

పంచముఖుఁడగు నీశు నైదుముఖములనుండి పంచాక్షరి జనించెను కావున పంచాక్షరిజనకుఁడగు నీశుని స్తుతింపుఁడు

ఆ. పంచవర్ణ మెఱుఁగ పరము నెఱుంగును
పరము నెఱుఁగ నిచ్ఛ ప్రజ్వరిల్లు
ప్రజ్వరిల్లువాఁడు పరము తా నగునయా, వి.

పంచవర్ణములలోనితత్త్వ మెఱింగినచో పరునిగూడ నెఱుఁగగల్గును అట్టివాఁడు తానే పరముఁ డగును

ఆ. పట్టరానిపట్టుఁ బట్టి యుండినవాఁడు
పుడమి గీర్తి నెపుడుఁ బొంద లేఁడు
సుగుణలక్షణమున సుజ్ఞాని యగునయా, వి....

దుర్లభమగు (జ్ఞాన) ఫలము నొందినవాఁడు లోకము వారి మెప్పులకు పాత్రుఁడు కాఁజాలఁడు; కాని సుజ్ఞాని మాత్ర మగును

క. వడయఁగరానిది పూర్ణము
తడఁబడకలమననమందు దలపడినంతం
జిడిముడి లేకటు నిల్చిన
విడనాఁడఁగ బట్టబయలె వెలయును వేమా!.

లభ్యము గానియట్టి పరాత్ముని పూర్ణస్వరూపమును తత్తఱపాటు లేనిమనముతో మననము చేసిన బ్రహ్మము ప్రకట మగును

క. పసుపడి నిర్గుణ మనునది
తన కెద్దియుఁ దోఁపఁ బోదు తత్త్వమెఱుఁగకే
మన నాంతరంగమందును
వినయం బగుబఱులు జేరి వెలయును వేమా!.

నిర్గుణమనునది ఏదియును తత్త్వము నెఱుంగనంతవఱకును బాహ్యచక్షుస్సులకు గోచరింపదు.

తే. పరమసిద్ధాంతమగునట్టి బయలు చేరి
పట్టువిడుపులు వదలి తాఁ బ్రాకి నిలచి
పట్టినని లోకపాశంబు వదలి నగును, వి....1454

ఉపనిషత్ప్రతిపాదితుఁ డగునీశ్వరుని నవిరతము ధ్యానించుచు నైహికమును విడనాడినవాఁడు ముక్తుఁ డగును.

ఆ. పరముపరమటంచుఁ బలుకుదు రందఱు
పరమునందు నేమి ప్రబలముండు
పరమునందు నిందు పరిపూర్ణతయె కదా! వి....

స్పష్టము

ఆ. పరుస మినుము సోక బంగారమైనట్లు
కప్పురంబు జ్యోతి గలసినట్లు
పుష్పమందు దావి పొసగినట్లగు ముక్తి, వి....

ఇనుము పరుసవేది సంస్పర్శమున బంగరైనట్టులనే, కర్పూరము జ్యోతిలో లీనమైనట్టులనే, పువ్వులో దావి యున్నట్టులనే ముక్తి యుండును.

ఆ. పరమసిద్ధికొఱకు బాపల నిగుడించి
శ్రవణమననవృత్తి సంగ్రహించి
యెఱుక మఱచువాఁడె యేకాగ్రచిత్తుఁడు, వి.

పరాత్మసిద్ధికొఱకు శ్రవణమననములను పెద్దలవలనఁ జేయుచు నేకాగ్రచిత్తుఁడై యైహికజిహాసువగువాఁడు ముక్తుఁడగును

క. పరమాత్మునిచింతనలో
దఱుచుగ నుండుటయె తగును ధర నాఁకటికిం
దిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందు దొంగుము వేమా!.

దైవమును మనస్సులోనే ధ్యానించికొనుచు కలిగిన మట్టుకు భుజించుచు నింటిపట్టున నుండుట యుత్తమము.

క. పరిశీలించినజ్ఞప్తిని
గుఱినిల్పెడుభక్తిచేత గోర్కు లడిగెడిఁ
స్థిరరూప మంది పొందెడు
పరిపూర్ణసమాగమంబుఁ బడయుము వేమా!
వివేచన చేసి లక్ష్యము నుంచెడికోలఁదిని కోర్కులు
అడంగి పరిపూర్ణకైవల్యము నొందఁ గలుగును

ఆ. పరుల కుపకరించి పరుసొమ్ము పరునకు
పరఁగ నిచ్చెనేని పరము కలుగు
పరముకన్న నేమి పావన మాసొమ్ము, వి....1460
సులభము

ఆ పలుకులోనిపలుకుఁ బరగంగఁ జూచినఁ
బలుకులందు బ్రహ్మపదము గలుగు
పలుకుఁ గానలేక పరువు దప్పిరి జనుల్, వి....
వాక్కులలోని యంతస్తత్వములను విమర్శించినచో
అందును బ్రహ్మము నెలకొనియుండును గాని మూర్ఖులు
గొంద ఱిద్దానిఁ దెలియరైరి

ఆ. పలుకులోనిబిందు వలరంగఁ దావలె
పలుకులోనిదాని పదిలపఱచి
వేడుకైనఁ దాని వెతఁ బెట్టకుండుము, వి....
సులభము

ఆ. పాశమునను జూడఁ బరఁగ దేహమునకు
హానివచ్చుఁగాన నదియుఁ జూచి

జ్ఞానదీపకళిక కడకొత్తవలెనయా, వి.... 1463

స్పష్టము.

ఆ. ప్రాణమందు శివుని భావించి తెలియక
ముద్రలనుచు బడిడిమూఢులార
ముద్రలందు లేదు మూలమందే కాక, వి....

ప్రాణమునం దున్నశివుని భావింపలేక ముద్రలు ముద్రలని బడుచుందురు మూఢులార' దైవము మూలమునందే కలదు. గాని ముద్రలలో లేఁడని నమ్ముఁడు

ఆ బ్రదుకువార లెవరు బ్రదుకకుందు రెవరు
బ్రదికి బ్రదుక లేనిప్రాణు లెవరు
క్షితిని శోధ జేసి స్థిరముగాఁ జూడరా, వి ...1465

చక్కఁగా వివేచనఁ జేసి చూచినచో నీ ప్రపంచము నందు బ్రదుకువారు బ్రదుక గలవారలు బ్రదుక లేనివార లెవరెవ్వరో తేటతెల్ల మగును

క. భగవంతుఁడైన దేవుఁడు
జగముల దనలోనఁ బెంచి జాలముజూపుం
దగురీతిని దానన్నిటి
నగణితుఁడై వెలయుచుండు ననువుగ వేమా!.

షడ్గుణైశ్వర్యవిరాజితుఁడగు దేవుఁడుజగము తనలోనే పెంచి మాయఁజేసి తానాజగము లన్నిటిలోను నిండి వెలుఁగు చున్నాఁడు

క. భగవంతుని ప్రతిబింబం
బగు నీశుం డొరసి మాయనగులోకమునం
దగభోజ్యమునగు జీవుం
డొగి భోక్త యవిద్య గూడి రొప్పఁగ వేమా!

భగవంతుని ప్రతిబింబమే ఈశుఁడగుననియును మాయ వలన భోజ్యము నగుజీవుఁడు అవిద్యతోఁ గూడియుండు నని యు నెఱుఁగుము

ఆ. భద్రమైనమనసు బలపడినంతట
వర్ధ దగును పరము నశేముగాను
నిద్రలోనినిద్ర నిలుపుకొనుచుఁ జూడు, వి....

మనస్సును జాగ్రత్తగా బలపఱిచినచో నిద్దుర (అనఁగా సమాధి) యలవడును అటుపైని ధ్యానము తద్ద్వారా సిద్ధించును

క. భయముసుమీ యజ్ఞానము
భయ ముడిగిన నిశ్చయంబు పరమార్థంబౌ
లయముసుమీ యీదేహము
జయము సుమీ జీవుఁడనుచు సాటర వేమా!

భయమే తెలివిలేమి అయ్యది పోయిన పరమార్థము తెల్ల మగును ఈశరీర మెప్పటికైనను లయమనునదియే యని సాటి చెప్పుము

ఆ. భానుసోమవహ్నిభవ్యలోచను మదిఁ
దలఁపకున్న ఫలముగలుగఁ బోదు

ఇహాపరములకు మహేశ్వరుఁ డతఁడౌట, వి....

సూర్యచంద్రాగ్నులు నేత్రములు గాఁగల ఈశ్వరుని మదిలో దలంపనివారికి ఇహపరముల కధినాథుఁ డన నీశ్వరుని యనుగ్రహము లేకపోవుటచేత ఫలము లభింపదు

ఆ. భార్యమీఁద నాశ పరఁగు బురుషునకును
మగనిమీఁద నాసమగువకుండు
శివునిమీఁద నాశ సిద్ధున కుండురా, వి....1471

భార్యను ప్రేమించిన భర్తనుకూడ భార్య ప్రేమించును ఇయ్యది ప్రపంచలక్షణము ఇట్లే ముక్తుఁడగు సిద్ధునకును శివునకును పరస్పరము ప్రేమ ముండదు

ఆ. భావ మరయ వేఱె పరదేశమున లేదు
తాను జేయుపనులఁ దగిలియుండు
భావమందు శివుని పరికింపుచుండుము, వి....

భావము భావ మనఁగా ఎచ్చటనో లేదు తనభావము దాను పరీక్షించినచో దనయందే ఈశ్వరుఁడు నంతర్యామియై యున్నాఁడు

క. భావాభావము లంటక
సేవించెడు బట్టబయలు స్థిరమతిలోనం
కేవలము శివధ్యానము
తావరమును గన్నవాఁడె ధన్యుఁడు వేమా!.

స్పష్టము

తే. భాషలెన్నిటిలో నైన భావ మొకటె
వేషములలోన జిక్కనివిధమెఱుంగు
పోషకుండని తలఁచుట పొందు గాదు
దోషమున్న నెఱుంగుము తొలుత వేమ. 1474

ఎన్నివిధములగు భాషలున్నను భావ మొక్కవిధమైన తెలుంగుననే ఏవేషమున నీశుని ధ్యానించినను పోషకుఁడగును

క. భువనాకారుని మదిలోఁ
బ్రవిమలశుభమూర్తిగాను బరికించినచో
భవనాశమగును బూర్ణుఁడు
శివదేవుఁడు చిన్మయుండు స్థిరుఁడగు వేమా!.

ప్రపంచస్వరూపుని మదిలో నెలకొలిపి ధ్యానించినచో చిత్స్వరూపము తప్పక సాక్షాత్కరించును

ఆ. మంట లోహమందు మ్రాకుల శిలలందు
పటములందు గోడబ్రతిమలందు
దన్నుఁ దెలియుకొలఁకుఁ దగులదా పరమాత్మ, వి.

మంట లోహము మ్రానులు శిలలు పటములుఁ బ్రతిమలు మున్నగువానియం దెల్లయెడలను పరమాత్మ నిండియే యుండును

ఆ. మంటికుండవంటి మాయశరీరంబు
చచ్చు నెన్నఁడైనఁ జావదాత్మ
ఘటము లెన్నియైన గనన మొక్కటికదా, వి....

ఘ్ర్య ఘటమువలె నున్న నీశరీర మెప్పుడో యొకప్పుడు నశించును. గాని ఆత్మ నశింపదు.

ఆ మఱియువాఁ డెవండు మఱియనిదెవ్వఁడు
పాటుఁ జేసి చూడ బట్టబయలు
సొరది జలఘటమున సూర్యునిచందము, వి....

నీటికుండలలో వ్యాపించు సూర్యుని ప్రతిబింబమువలె నీప్రపంచమున మఱిసియు మఱియకయు నుండువాఁ డెవ్వఁడో యూహింపుము

ఆ. మతము లెన్నియైన సతముగా నుండదు
సతముగానె యుండు జగతి నొకటి
అన్నిమతములువీడుమఱియు మొక్కఁడు లేఁడు,వి.

ఎన్నిమతములయినను గొంచెమైనను ప్రయోజనము లేదు కావున నన్నిటిని విడచివేయుము

ఆ. మది నెఱిఁగినవాని మహి గాన మెందును
మదినెఱుంగువాఁడె మహి మనుజుఁడు
వెదకి తనువులోన వేడ్కతో నిను జూచు, వి....

మనోమర్మము నెఱిఁగినవాని నీమహిలో నెచ్చట వెదకినను కానఁ జాలము అతఁడే ఈశ్వరుఁడు అనుపేరున సమస్తశరీరములందు నిండి మనలను చూచుచుండును.

ఆ. మనముఁ జూచి గెల్చి మనములో సుఖయింప
గడకు మోక్షపదము గను నచటనె
చెట్టుఁ బెట్ట ఫలము చేకుఱదే దాన, వి....1481

మనస్సును పరికించి జయించి సుఖింపనేర్చినట్లైన విత్తినచెట్టు ఫలించునట్టులనే మోక్షమును లభించును

ఆ. మనసునందు ముక్తి మలయుచు నుండఁగ
మనసు నెఱుఁగ లేనిమనుజు లెల్ల
మనసునంట లేక మాయమై పోయిరి, వి....

మనసులో నే ముక్తి యుండఁగా మూర్ఖులైన మనుజులందఱును మనస్సును తెలిసికొనలేక నశించిపోయిరి

ఆ. మనసు ముక్తి యనుచు మది నెఱుఁగఁగ లేరు
మనసు చేతఁ దగిలి మాయ మైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁ డగుయోగి, వి....

మనసు ముక్తి యని యెఱుఁగలేక అనేకులు మాయమైరి కావున మనస్సు నెఱిఁగినవాఁడే మర్మజ్ఞుఁడగు ననఁదగును.

ఆ. మనసులోనిశివుని మానక నిల్పిన
యోగియగునతండె యుర్విలోన
శివుని దలఁపలేనిచిత్తం బదేలనో, వి.... 1484

మనసులో నున్న శివుని అనారతమును ధ్యానించుచున్న యోగి యగును గాని మనస్సు శివుని నిలుపఁజాలదు ఏమి చిత్రము!

ఆ. మాయరూపు రూపుమాయగాఁ జేసియు
మాయరూపును పెనుమాయఁ జేసి

మాయలోనిమాయ మఱి పరంజ్యోతిరా, వి....

సులభము

ఆ ముగురిలోన వెనక ముందు గానఁగ లేక
నరకమునకుఁ బోవునరులు గలరు
ముగురికందనట్టిమూలమూర్తి యొకండు, వి.

త్రిమూర్తులలో ముందు వెనకలను చర్చింపఁ బోయి తెలియక నరకమునఁ గూలుచుందురే గాని త్రిమూర్తుల నతిశయించి యున్నమూర్తిని ఎఱుంగఁజాలరు

ఆ. ముగురుమూర్తు లన్నమూలభావ మెఱిఁగి
మూలవానితోడ ముచ్చటాడి
సత్తుచిత్తులోనిసారంబు తెలియురా, వి....1487

త్రిమూర్తు లున్నచోటును కని వారిని దర్శించి సత్తు చిత్తుల సారమును తెలిసికొని ముక్తుఁడు వగుము

ఆ. మూఢజనుల కెల్ల మూలమై తగుయోగి
తారకంబు గాను దైవరూపు
బట్టబయలు జేసి పరమాత్మ జూపఁడో, వి....

మూఢజనుల కందఱికి తారకుఁడై సజ్జనుఁడగు యోగి దైవరూపము నెఱింగించి దొరలను ధన్యులను చేయక యుండునా ?

ఆ. మేకచంకఁ బెట్టి మెలగుచు మందలో
బ్రమసి తిఱుగు గొల్లపగిది గాను
దేవు నెఱుఁగక పెఱదేవతల దలంచు, వి....

మేఁకను చంకలోఁ బెట్టికొని మందంతయును వెదకు గొల్లవానివలె హృదయమునందున్న దేవుని గుర్తింపలేక పెఱ దేవతలను దలంచుచుందురు

ఆ. మ్రాకుఁగాలవైచి మహిమీఁద నొకజాణ
పూని తిరుగుచుండెఁ బొందుగాను
కాల్చినట్టి మ్రానుఁ కడురమ్యమై యుండు, వి.

మాయయను వృక్షమును జ్ఞానాగ్నిచేత తగులఁ బెట్టి ప్రకృతి యనుజాణ తిరుగుచుండును ఆకాల్పఁబడిన మాయా వృక్షము మిక్కిలి రమ్యముగా నుండును

క. మ్రాకున ననలంబుండును
మ్రాకున నాయనలమువలె మనుజులలోనన్
డీకొని తా రాజిల్లుచు
నేకంబగు బ్రహ్మముండు నెప్పుడు వేమా!. 1491

మ్రానులో నగ్ని యంతర్ధానమై యున్నయట్టులనే పరమాత్మయును సమస్తములోఁ జేరి విరాజిల్లుచునే యుం డును.

ఆ. రతి యొనర్పఁ బూని సతిని వేఁడినయట్టి
మతిని వేఁడి పరముమఱుగు దెలిసి
గతిని. గోరుచుంద్రు ఘనయోగు లిలలోన, వి.

రతి యొనర్చుటకై సతిని బిలిచినయామతినే పట్టి యుండలిమర్మమును కనుఁగొని యోగీశ్వరులు గతిని తద్ద్వార మున గోరుచు నుందురు.

ఆ. రమ్యమైన మనసు రాజని యెంచుచు
గమ్యముగను దాని గట్టు బెఱఁగి
మఱగి పూర్ణపదవి మహిలోన గానరా, వి....

మనస్సునే సర్వస్వతంత్రమునుగా నెఱింగి దానిని అరికట్టుటకు ఉపాయముల నరసి అభ్యాసముఁ జేసి పూర్ణమగు బ్రహ్మస్వరూపమును సందర్శింపవలయును

ఆ రూపమడఁగ జీవరూపంబు గనరాదు
అట్టిరూప మడప నలవి గాదు
బ్రహ్మమడఁగకున్న బ్రహ్మంబు గనరాదు, వి....

రూపము పోయిన జీవరూపమును కూడ పోవును. కావున నట్లు కానీయక ఆకృతిసహితముగనే దైవముఁ గాం చుటకై యత్నింపుము

ఆ. రూపవంతులట్లు రూపులు ముగ్గురు
వారివారి నెఱఁగి గారవింప
మొదల తానె యుండి మోక్షంబు గల్గురా, వి.

సొగసు గలవారివలె ముగ్గురు సొగసరులు నాడియున్న వారు వారిని గుర్తించి గౌరవించెద వేని నీవు తొలుతనే మోక్షము గలుగును

ఆ రూపుఁ జూచి మెచ్చి రూపింప నేరక
వేదశాస్త్రములను వెదకులేల
దాపుగానె యున్న దర్పణ మట్టుల
శివుఁడు భావమందు జెలగు వేమ. 1496

బ్రహ్మస్వరూపును కన్నులారఁ జూచియును ఇట్టిదని నిరూపింపఁజాలక వేదశాస్త్రములలో వ్యర్థముగా వెదుకఁ బూనెదరే కాని భావములోని శివుని కానఁజాలరు

క. లలితశివతత్త్వపదమునఁ
గలిసిన శివయోగి యేల గలియు జగములన్
జలబిందువు ముక్తియనై
కలియునె తొల్లింటినీటఁ గనరా వేమా!. 1497

ముక్తుఁడైనవాఁడు మఱల నిఁక నెప్పటికిని జగములలో కలియక ముక్తియమైన నీటిబిందువు మరల నీటిస్వరూపమును పొందనియట్లులనే యవినాశియు నవికారియునై యుండును.

ఆ. లేదు జగతి నంచు వాదు సేయఁగ వచ్చు
సోది సెప్పరాదు సూక్ష్మ మెఱిఁగి
పాదుకొల్పి బుద్ధిఁ బరికించి చూడఁగా, వి....

ప్రపంచమునందు ఈశ్వరుఁడు లేనే లేఁడని ఎన్ని వాదములను అయినను చేయవచ్చును , గాని ఆవాదముల నటుంచి సూక్ష్మవిచారములతో బుద్ధిని పాదుకొల్పి పరికించినచో బ్రహ్మము సాక్షాత్కరించును

ఆ. వాడు వాఁడు గాడు వానిలోపలనుండు
వాఁడెవాఁడు వాఁడువాఁడుగాఁడు
వాఁడు వాని గూర్చువాఁడె పో బ్రహ్మంబు, వి.

వాఁడువాఁడు అని చెప్పఁబడెడివాఁడు వాఁడు గాక వాఁడు అనే వానిలోనుండే వాఁడు (బ్రహ్మము) మాత్రమే వాఁడగును (అనఁగా' బ్రహ్మము' అగును )

క. వినవలె నాదము తనలోఁ
గనవలె బ్రహ్మంబు విడక కౌతుకమొప్పన్
గనవలె సోహంభావము
తను దానై పరమునంద దగులక వేమా!. 1500

ప్రణవమును విని యద్దానియందు మ్రోయుచున్న నాదును గని సోహ మస్మి యను మహావాక్యార్థమును చేసి తత్త్వైకల్యమును పొందఁగా దగును

ఆ. విన్నవాఁ డెవండొ కన్నవాఁ డెవ్వఁడొ
విన్నకన్న వానివివరమేమొ
అరసిచూడనలయు నంబుధి నైనను, వి ....1501

సృష్టము

ఆ. విమలసృష్టిఁబూని విజ్ఞానమందమి
తమము బాయనగును తథ్యముగను
దమముమీాఱినంతఁ దత్త్వజ్ఞుఁ డగునయా, వి.

నిర్మలముగుసృష్టిచక్రమునందుఁగల విజ్ఞానమును పొందకున్నంతవఱకును తమ మడంగదు అట్లు క్రమక్రమమున తమ మడంగె నేని వాఁడే తత్త్వజ్ఞుఁ డుండఁగలఁడు.

తే. వేదగీతంబులను మించి వెలయువాని
నాదబిందువు కళలంటి నయము గాను
సాధకంబున జొచ్చుచే సన్మతంబు
జన్మసార్థకమప్పుడె జనును వేమ. 1503

వేదాతీతుఁడును నాదబిందుస్వరూపుఁడును అగు బ్రహ్మమును సాధకమున (అనఁగా సాధనచతుష్టయసంపత్తిచేత) కలియుటే తన్మయత్వ మనఁబడును. అయ్యది కలిగిననే జన్మము సార్థకమైనట్టులు లెక్కింప నగును

ఆ. వేదముఁ జదివియు విఱ్ఱవీగుటె కాని
యధమగతిని బడిరి యయ్యలెల్ల
బ్రహ్మమహిమఁ దెలిసి బ్రదికిన బ్రదుకయా, వి.

వేదములను జదివితి మని విఱ్ఱవీగుటే కాని బ్రహ్మమహిమను గనఁజాలక యధోగతికి పాలగుటను ఎఱుంగరైరి. పాపము !.

ఆ. వేదవిప్రులెల్ల విశ్వోపకారులు
సాక్షియున్నవాఁడు జగతిలోన
నట్టివారి నరులు నరయు రిదేలొకో, వి.... 1505

వేదవిప్రులందఱును విశ్వమున కుపచరించినవారలు అందులకు దైవమే సాక్షియై యున్నాఁడు లోకులు అట్టి వారిని ఎందులనో విచారింపనైనను విచారింపరు

తే. వేదశాస్త్రపురాణముల్ వెదుక నేల ?
ఆది తుదియును లేకయ యచల మగును
సారమిది మించి వెలిగెడి సత్యమగును
వాదములఁ గానరాకుండి వరలు వేమ. 1506

వేదములు పురాణములు మున్నగువాని నేల వెదుక వలయును ? ఆద్యంతశూన్యుఁడై యచలుఁడై యున్న బ్రహ్మము సర్వవ్యాపిని కోరినచోట కనుము

ఆ. వెన్ను దగిలియుండు కన్నుగాననినాఁడు
చిన్ననాఁటినుండి చెలిమిఁ జూపు
అన్నదమ్ములకును నాప్తుఁడై యుండును, వి....

దైవము నరులందుఁ గలయనుకంపచేత కన్నులు కనుపింపనినాఁడు వెన్నునంటియుండి బాల్యమున చెలిమిఁజూపి ఆప్తుడై మెలఁగుచుండును

ఆ. వేదసార మెల్ల వెదకి తాఁ జూచియు
లీనమైన బ్రహ్మరీతి దెలిసి
పరము గనెడివాఁడు పరమాత్ముఁ డగునయా, వి.

వేదములలోనిసారమునంతను వెదకి లీనుఁడై యున్న పరమాత్ముని తెలిసికొనెడివాఁడే పరమాత్మ యగును

క. వేదాంతసారగుణ సం
వాదితుఁ డగు గురుని వేఁడి పరిపూర్ణుఁడవై
మోదంబున గుఱినుంచుము
సాధనలో ముక్తి గలుగు సత్యము వేమా! 1509

ఉపనిషత్సారజ్ఞుఁ డగుగురువును ప్రార్థించి పరిపూర్ణ భావములో గురూపదేశమును సంతోషపూర్వకముగా గుఱి దప్పక ధ్యానించినచో ముక్తి తప్పక కలుగును.

---

# గురుభక్తి పద్ధతి.

---

ఆ అంజనంబు కనుల కంటించి చూచిన
సొమ్ము దొరకి భువిని సూత్రముగను
గురునినమ్మికరుణ గుణమంటిచూడరా, వి....

కాటుకను పెట్టుకొనిన భూనిక్షేపముగునిధి దొరకిన రీతిగానే గురుసహాయమున మోక్షము నొందఁ గలుగుదువు.

ఆ. అన్నిదానములను నన్నదానమె గొప్ప
కన్నవారికంటె ఘనులు లేరు
ఎన్నగురున కన్న నెక్కువలేదయా, వి.... 1511

ప్రపంచమునందలి యన్ని దానములకంటె నన్నదానముత్తమమైనట్టులే గురునికంటె నుత్తములు వేఱే లేరు

ఆ. ఆత్మయందు జ్యోతి యమరుట లింగంబు
తెలిసి చూడఁగాను తేటపడును
అదియుఁ గురువులేక యబ్బునా మొప్పెకు, వి.

ఆత్మలోనిపరంజ్యోతియే లింగస్వరూపము. ఇట్టి దీని నిజము గురువు లేక కుదురదు

ఆ. ఆత్మయందె దృష్టి ననువుగా నొనరించి
నిశ్చలముగ దృష్టి నిలిపెనేని
అతఁడు నీవె సుమ్మి యనుమాన మేలరా, వి....

చూపును ఆత్మయందు బెదరనీయక నిలుచునట్టులు చేయఁగలిగినచో కైవల్యము నొందఁగలుగుదువు

క. ఇతరాపేక్షలు గోరక
సతతము గురుభక్తి యుక్తి సారముగనకే
గతి యగు బ్రహ్మానందము
మతి కింపుగ దొఁప బోదు మహిలో వేమా!.

గురువులందు భక్తి తప్ప తక్కినవానిని వేనియును అపేక్షింపక బ్రహ్మానందసుఖము ననుభవింపఁ బ్రయత్నింపుము

క ఇరువదియారవతత్త్వం
బరయగ జీవాత్మనెలవు నలపరమాత్మ
న్నిరువొందఁ గూర్చు గురుపద
మెరయంగా గురువటంచు నందురు వేమా!.

శరీరము పంచవింశతి తత్త్వమయమైనది గురువు ఇరువదియారవతత్త్వ మనఁదగు జీవునిస్థానమును పొందునట్లు చేయును గనుక గురువని యందురు

ఆ ఇహమునందు గురున కీదేహ మిచ్చిన
పరముఁ జూపి గుఱుతు బట్టియిచ్చు
స్థిరముగాను బుద్ధి చెడనీక చూడరా, వి....1516

ఈలోకమునం దనశరీరమును గురువుల కర్పించువాని కాగురుఁడు పరము నెఱుఁగు నుపాయములఁ జూపించును. పిమ్మట నిశ్చలబుద్ధితో కనుంగొనుము

ఆ. ఇహమునందు నేమి యిడుములఁ బడినను
బరమసాధనార్థపథము గాదు
గురునియుక్తి మీఱి గుర్తించి చూడరా, వి....

ఇహలోకనమునకై యెన్నిపాటులఁబడినను అయ్యవి పరలోకసాధకములు కానేఱవు కావున వానిఁ బరిత్యజించి గురువుల సేవించి బ్రహ్మమును సందర్శింపఁ బ్రయత్నింపుము.

ఆ. ఇహము విడచి ఫలము లింపుగ గలవని
మహిని బల్కువారి మాట కల్ల
ఇహములోనె పరము నెసఁగుట కానరా, వి....

ఇహమును త్యజించిన పరమునఁ బెక్కులు ఫలములు కలవని చెప్పెడివారిమాట యంతగా పాటింపఁదగినది కాదు. గనుక ఇహమునందె పరమునుకూడ సాధింపవలయును

క. ఈఘటమునందుఁ జూచియు
ఏఘటమున నింతె యనుచు నెఱుఁగక మదిలో
నేఘటముమీఁద వాంఛయు
మోఘం బని కొనఁగవలయు ముఖ్యము వేమా!

ఆత్మోపమ్యమున సమస్తశరీరులు నిట్లే యుందురని నిశ్చయించికొని ఇతరులపై మమత్వము నభిలాషమును వ్యర్థమని విడిచి పెట్టవలయును

ఆ. ఈదవచ్చు నేరు బాధ లేకుండనే
యాదిగురువు లేక యందరాదు
సోదిఁ జెప్పు టేల చొక్కినమది చూడు, వి....

అనాయాసముగా నేటికైన నీఁదవచ్చును; గాని గురువు లేక బ్రహ్మము నుపాసింపఁ జాలము

క. ఈలోకచిహ్న లన్నియు
మేలుగ గురుశక్తి కూడి మిన్నందినచో
కాలుఁ డెదుర్కొనఁజాలఁడు
చాలును జన్మంబు లంచుఁ జాటర వేమా! 1521

ఈలోకమునఁ గలిగినయనుభవమును గురుసాయముతో చేర్చి యుపయోగించినచో జననమరణములు తొలఁగి చనును.

తే. ఈషణాదుల నన్నిటి నీడ్చిపట్టి
మోసపోకయు మదిలోన గాసిపడక
రోసి బయలున జేరుట వాసి యగును
ఇట్టులగు నాశఁ డెన్నిక కెక్కు వేమ 1522

కోరికలను నాశముఁ జేసి విషయాభిలాషివి గాక సంసారమును రోసి విజనమున వసించుట యుత్తమము

క. ఉచితాహారమువల్లనె
యుచితంబుగ బుద్ధిస్థిరత నొప్పునటులనే
యుచితగురుబోధవల్లను
సుచరితుఁడై పరము గాంచునమ్ముర వేమా!.

తగినయాహారమును సేవించినఁ దగినబుద్ధి యొప్పునట్టులనే గురునిబోధ ననుసరించి పరమును సిద్ధించుచుండును

క. ఉచ్చకు త్రోవగు తావున
ద్రచ్చంగా జగము పుట్టె తాతలనాఁడే

హెచ్చుగు కులజుం డెవ్వఁడు
మచ్చిక మది దోయుమయ్య మాన్యత వేమా!.

ఉచ్చము నిలయమగు స్థానమునఁ బుట్టి నచ్చుచున్న నీజగత్తులోని మనుజులు తమలో తాము హెచ్చుతగ్గులకై పోరుట మంచిది కాదు

ఆ. ఉండునుండ జ్ఞాని యుగములు చనినను
ప్రాణహాని లేదు బ్రళయమునను
బ్రాణహానియైనపరమాత్మ గలియురా, వి....

ఎన్ని యుగములు గడచి చనుచున్నను చలింపక జ్ఞానియగువాఁ డుండును అతనికి ప్రాణహానియే లేదు అట్లెప్పుడైనఁ గల్గినచో నదియే కైవల్యము

క. ఉడుగునె క్రతువులఁ దపముల
నడవుల తీర్థములఁ దిరిగినంతనె ధరలో
నొడయని గనుగొనఁ జాలఁడు
కడుధీరత గురుఁడు సెప్పఁగల డిది వేమా!. 1526

యజ్ఞములను యాగములను అరణ్యవాసముల నుపవాసములను కర్మబంధములు ఉడిగిపోవుఁ గాని గురుకృపవలన నుడుగఁగలవు

తే ఉత్తమజ్ఞాననిలయమహా నుపముచేత
భక్తి సాధించి పూర్ణత బడయవచ్చు
ముక్తి కిరవగు గురునాజ్ఞ మొదటిదయ్యె
నది లభించిన సర్వంబు నబ్బు వేమ. 1527

పరిపూర్ణమగుభక్తిని సాధించి పూర్ణుఁడై గురువులు చెప్పిన చొప్పున నడచుకొనుచుండెడేని వాఁడు తప్పక ముక్తికిరవగును

తే. ఉదధి లంఘించి దాఁటినయుత్తముండు
మదిని రామాజ్ఞమీఱక మాఱు లడఁచి
హృదయమందున రాముని బదిలపఱచి
నౌర మారుతి తత్త్వజ్ఞుఁ డగుట వేమ. 1528

సముద్రములను కూడ నొక్కయంగలో దాటినమారుతియును సంసారమును దాఁటుటకై శ్రీరాముఁ డనుగురుని సేవింప వలసివచ్చెను

ఆ. ఉన్నదన్నదెఱుక నూహించు రెట్టించి
మన్నుమిన్నునడుమ మాఱులేక
యున్నవాఁడె పరము గన్నవాఁడగునురా, వి.

అస్తి యనెడిబుద్ధిని మనస్సున నుంచి పృథివ్యాకాశముల నిండియుండినపరమాత్మ తత్త్వము నరయువాఁడే యుత్తముఁడు.

ఆ. ఉపముచేత గురుని దపమునఁ జూడక
జపముచేయువాఁడు చపలుఁడగును
నెపము వడక మించి నేర్పున జూడరా, వి....

యుక్తితో గురుని సేవింపకయే సాధింతునని జపము చేసినచో వడఁకునే కాని పరము స్వాధీన పడదు

ఆ. ఉపము గలుగునాతఁ డూఱకుండగ రాదు
గురునితోడ బొందు కూడవలయు

గురుఁడు సెప్పురీతి గుఱిమీఱరాదయా, వి....

యుక్తిగలవాఁ డూరక శ్రద్ధఁ బుచ్చక గురుని జేరి యాతని సేవించుచు నతని చెప్పినచొప్పున నడచికొని కృతార్థుఁడగుటకై యత్నింపవలయును.

ఆ. ఉపముతోడ గురుని నొప్పుగా సేవించి
జపము హృదిని జేయు జాడ లెఱిఁగి
తపముఁ జేయువాఁడు తత్వజ్ఞుఁ డగుయోగి, వి.

యుక్తిగా గురుని సేవించురీతులను జపముచేయు చొప్పును నరసి ధ్యానించువాఁడు తప్పక తత్త్వజ్ఞుఁడు గాగలఁడు.

ఆ. ఉపము దోఁపనట్టియుపవాసముల లేదు
తపము చేయనైన తగులరాదు
జపములోన గురుని జవదాటకుండరా, వి....

ఉపము లేనియుపవాసాదుల నెన్ని చేసినను నిష్ప్రయోజనమే కావున గురువుల నాజ్ఞను మీఱక మెలంగి కృతకృత్యుఁడవు అగుము

ఆ. ఉబ్బి గురుని వేఁడి నిబ్బరపడువాఁడు
దబ్బరాడఁబోఁడు తత్తరమున
నిబ్బరంపుమదిని నిర్విణ్ణతను గాంచు, వి....1534

సంతుష్టుఁడై గురుని నుతించుచు మిథ్యావాక్యములఁ బలుకక యాత్మధ్యానముఁ జేయువాఁడు తన్మయుఁ డగును.

ఆ. ఉసురులేనితిత్తి యినుమంత నూఁదిన
పంచలోహములును భస్మమగును
పెద్ద లుసురు మన్న పెనుమంట లెగయవా, వి.

ప్రాణము లేనితిత్తిని కొంచె మంత యూఁదిననే రాళ్లను మాడ్చు నగ్నిని బుట్టించును గదా! ఇఁక ప్రాణముగల పెద్ద లుసురుమన్న లోకములు మండవా?

ఆ ఊడిగంబుఁ జేసి యుబ్బించి గురువును
గూడి పొందవలెను కోర్కె లడఁచి
వేడి పరమపదవి వెలయంగఁ జూడరా, వి....

గురువును చక్కగా శుశ్రూషించి యాతని దయను సంపాదించి పరతత్త్వము నొందఁ బ్రయత్నింపుము

క. ఎక్కడ వెదకిన తానై
మ్రొక్కను తా వెందు లేక మూలము తానై
చక్కగ నిర్భయుఁ డగుచును
నిక్కము నిన్నంటియుండు నిజముగ వేమా!.

పరమాత్మ ఎచ్చటఁ జూచినను నిండియుండి నీవెను వెంటనే సంచరించుచుండును గాన ధీరుఁడవై తత్త్వమును కనుఁగొనుము

తే. ఎక్కువెట్టిన రూపము చిక్కువెట్టి
నిక్కఁబట్టుము నిజ మని సాక్షి ముట్టి
చిక్కగను బూర్ణమందుము చిక్కవెందు
గురుని బేడియ నుపాయంబు కుదురు వేమ.

ధ్యానమున నిల్పినపరరూపమునే చెదఱనీయక పట్టి పూర్ణరూపుఁడవై గురునిసాయమున కేవలుఁడవు అగుటకై యత్నింపుము

ఆ. ఎట్టిమంత్రమైన నెంగిలి గాకుండు
బలుకవశము గాదు బ్రహ్మకైన
ఎంగి లెంగి లందు రీనాటిలోఁడనే వి.... 1539

ఎటువంటిమంత్రము నైనను నోటితోనుచ్చరింపవలని వమ్మటచే నెంగిలి గానిది ఇఁక ఈలోకములో లేనే లేదు. కావున ఎంగిలని నిందింపరాదు

క. ఎడపక క్రతువులు తపములు
నడవులవాసంబు తీర్థయాత్రలచేయున్
ఒడయుని కనుఁగొనఁజాలఁడు
కడువడి గురునిష్ఠ పరుఁడు కావలె వేమా!.1540

సదా తీర్థయాత్రాదులఁ జేయుచున్నను సర్వవిభుఁడగు నీశ్వరుని గురునిష్ఠ పరుఁడు గాక కనుంగొనఁ జాలఁడు

క. ఏపాపమైనఁ జక్కఁగఁ
బాపును గురుమర్మఘటిక బహుజన్మతతిన్
జూపట్టి యుడఁగ ద్రొక్కుచు
కాపై మదిలోన వెలుఁగు ఘనమున వేమా!

గురుభక్తి యనున దెట్టిపాపముల నైనను పొఁడ ద్రోలి జన్మదుఃఖములను తొలఁగించి పరతత్త్వమును సాక్షాత్కరింపఁ జేయును.

ఆ. కపట ముడిగి గురునికై దండ యొనరించి
యుపముతోడ భక్తి నునికిఁ జేసి
తప మెఱింగినంత ధన్యత వొడమును వి....1542

కపటమును వదలిపెట్టి గురుని సాయము నవలంబించి శుశ్రూషఁ జేసి తప స్సత్యపు రహస్యము నెఱుంగఁ గలిగిన చో ధన్యుఁడు కాఁగలఁడు

ఆ. కారుకారు గురులు కాగుణితముఁ జెప్ప
శాస్త్రపారములను జదివి చెప్ప
ముక్తిదారిఁ జూపు మూలము గురుఁడురా, వి....

కాగుణింతమును కావ్యాదులను చెప్పినంతమాత్రాన గురువులు కారు, కాని ముక్తిదారి జెప్పువాఁ డొక్కఁడే గురువు అగును

తే. గుట్టుగురుభక్తిలో ముట్టి మిట్టిపడక
జెట్టివలె బోరి లోమర్మ మిట్టి దనుచు
నట్టుపడఁ జూచి మించుట నాణె మరియు
పిట్టకబురులచే నేమి గిట్టు వేమ 1544

గురుభక్తిలోనిగుట్టును తెలిసికొని గర్వింపక మర్మమును కనిపెట్టి ప్రయత్నింపవల యునే కాని పిట్టకబుర్లవలనఁ గొంచె మైన నుపయోగము లేదు

ఆ. గురుచరణము బట్ట గుక్కలు గరచునా
గురుచరణము విడువ గుక్క కఱచుఁ
గుక్కకున్న గుణము గురునకు లేదురా, వి....

గురునిపాదములయందనున్నన్ని నాళ్లును మాయయేమియుం జేయఁజాలదు. కాని అండఁబాసినచో బాధింపఁబూనును

క. గుఱిగాన లేక మర్త్యులు
పరిచితశాస్త్రముల వాదపద్ధతిగనర
గ్గుఱి గురువు జ్యోతి నిచ్చును
దరిదెలిసినవాఁడె యోగి ధరలో వేమా!. 1546

లక్ష్యశుద్ధిని పొందలేక ఎన్నిదినములు శాస్త్రముల వాదించినను బ్రహ్మము నొందఁజాలఁడు; కాన గురుని సేవించి ముక్తుఁడ వగుము

క. గురుఁడగునాత్ముఁడు శిష్యుఁడు
పరగంగా జీవుఁడనుచు బరికించుచు నీ
గురుశిష్యపరమయోగం
బురుతరముగ గూర్చువాఁడు యోగిర వేమా!.

బహుకాలపరిశ్రమమువలనను గురుశిష్యులు జీవజీవులు ఐక్యము నొందినట్లు కైవల్యము నొందెదరు

క. గురుఁ డనఁగ ధేనువై తగు
వరశిష్యుఁడు వత్స మగుచు వర్తింపంగా,
దఱిగలిగినప్పు డొసఁగును
నిరుపమలభ్యామృతంబు నిజముగ వేమా!.1548

గురువు కామధేనువు. శిష్యుఁడు వత్సమువంటివాఁడు కనుక గురువు జ్ఞానామృతమును శిష్యుని కొసఁగును.

క. గురుఁ డనఁగా బరమాత్ముఁడు
పరగంగా శిష్యుఁ డనఁగ బటుజీవుఁ డగుఁ
గురుశిష్యజీవసంపద
గురుతరమునఁ గూర్చు నతఁడె గురువగు వేమా!.

గురువు సాక్షాత్తును బరమేశ్వరస్వరూపుఁడు అని యుపాసింపవలయును

క. గురుఁడనఁగా మొదలంతకు
గురుశిష్యుఁ లనంగ నెల్లకొమ్మలు కానం
గురువును గానఁగఁ జాతురు
ధరలోపల మనుజు లెల్ల దలఁపగ వేమా !.1550

సమస్తమునకును గురుఁడు మూలము శిష్యులు శాఖలు కావున వా రుభయులును పరస్పరసాయమున లోకము నుద్ధరింపఁబూనవలయును

ఆ. గురువు శిష్యుఁ డనఁగ గొన లెట్టు మొదలెట్టు
గురువు శిష్యుఁడనెడి గుఱుతు లెట్లు
గురునకూడఁ దగినపరువు లేకుండిన, వి.... 1551

గురువులేకుండఁ దగినపరువు ఇసుమంతయైన లేనిచో గురువు మూలమును శిష్యులు శాఖలును గానుండక యుందురు.

ఆ. గుఱుతు గనుచుఁ జెప్పు గురు వెవ్వఁడును లేఁడు
గురు తెఱుంగు శిష్యనరుఁడు లేఁడు
గురుఁడు శిష్యుఁ డనుట గ్రుడ్డెద్దుచేను రా, వి.

లోకములో మోసగాండ్రు కొందఱు గురువులమని

వత్తురే కాని గురుశిష్యుల తెఱంగు నెఱుంగఁజాలక గ్రుడ్డెద్దు చేనులో పడ్డ యట్టు లుందురు

ఆ. గుఱుదు గూడు చేసి గుణము వత్తిగఁ జేసి
పరవి గర్మసమితిఁ జేసి మూల
నొనర నొక్క జ్యోతి ముట్టించి చూడరా, వి....

లక్ష్యలక్షణములను వత్తిపాత్రములుగాఁ జేసి ఆత్మ జ్యోతిని వెలిగించి చూచినచో పరతత్త్వము అనుభవపడును

ఆ గుఱుతు తిథులవలనఁ గులమెల్లఁ జెడిపోయె
స్త్రీలనడతవలన సిగ్గుపోయె
నేహ్యపల్వలముల నిల యెల్లఁ జెడెనయా, వి....

గుఱుతు తిథులవలన కులములును స్త్రీలవలన సిగ్గును పాడుగుంటలవలన భూమియును చెడిపోయెను

ఆ గురునితోడఁ బొందు గూడి యుండినవాఁడు
చేరి బ్రహ్మమంటి చెలఁగి యుండు
మఱుగు తెలిసెనేని మర్మంబు లేదయా, వి....

గురునితో నైక్యముఁ జెంది యుండుటే కైవల్యము. ఈమర్మము నెఱింగినవాఁడే బ్రహ్మము ఇంతకంటెను వేద్య మింకను లేదు.

ఆ. గురుని నిందఁ జేసి గుట్టెఱుంగనివాఁడు
యముని బాధ నొందు క్రమముగాను
దేనెలోనియీఁగ తెఱఁగున నగునయా, వి....

గురుని సంతుష్టునిఁ జేసి మర్మము తెలిసికొనని వాఁడు
తేనెలోఁ బడినయీఁగవలె యమునిబాధలకు పాల్పడును

ఆ. గురునిపరముగురుని గుఱుతుగా దెలియక
గురు వటంచుఁదలఁప గ్రుడ్డిరీతి
గురునకు గురువైన గురుఁడు ప్రాణేశుండు, వి.

గురుపరము గురుపరము పరముగురువులలో గలతార
తమ్యము నరయ లేనివాఁడు గ్రుడ్డివాఁడే యనఁదగును

ఆ. గురుని శిష్యునియతి గుఱుతుగా మదిలోన
గానలేఁడు భ్రాంతి మానలేఁడు
గురునిశిష్యుఁడెంచు గుఱియదె యగునురా, వి.

గురుశిష్యుల స్వధర్మములను కనిపెట్టఁ జాలక భ్రాంతు
లై పరస్పరము నిందించికొనుచుందురు

తే. గురుపరంపర నీవిద్య గూఢ మెఱిగి
పరమపరిపూర్ణ మందుట పరవశతర
నిరుపమానందసుఖకేళి నెఱపవలెను
బరశివుండన భాసిల్లవలెను వేమ. 1559

గురుపరంపరవలన నీయాత్మ విద్యలోఁ గలరహస్యము
నెఱింగి పూర్ణత నొంది ఆనందము ననుభవించుచు పరశివుఁడు
కాఁదగును

ఆ. గురువు తానయ్యును గుణమించుకయు లేక
చందమామ కిచ్చె శాప మతఁడు
గురుఁడు కోపమూనఁగూడ దెప్పటికైన, వి.

తాను గురువయ్యును ఓర్పునకు బయలుగా మార్పు నెంది బృహస్పతి చంద్రుని శపించెను గురుఁడైనవాఁ డిట్లెన్నటికిని చేయరాదు

తే. గురుముఖంబున నెఱిఁగిన గుర్తువిడక
నిస్తరంగసముద్రంబు నియతి మనను
నిలిపి యపరోక్షమందుట నిర్గుణంబు
దాన పరిపూర్ణసంతోష మగును వేమ 1561

గురుముఖమున విని యున్న గురుతును వదలి పెట్టక నిశ్చలసమాధియందు మది నంది ప్రత్యక్షము నొందవలయును.

ఆ గురువు కలుగు నాత్మ గురు తెఱిఁగెద మని
కాల మెల్ల విత్త గడిపి రయ్య
గురువు దొరకుపపుడు కూలు నీ దేహంబు, వి.

గురుత్వమునకు నిలయమైనయాత్మ నెఱిఁగెదమని కలకాలము నంతయును మూర్ఖులై పోఁగొట్టి కొనిరి గదా!

ఆ. గురువు చిల్లగింజ కుంభ మీ దేహంబు
ఆత్మ కలుషపంక మడుగుఁ బట్టు
తెలిసి నిలిపెనేని దివ్యామృతము తేరు, వి....

ఈశరీరము పంకకలుషితము గావున గురువను చిల్లగింజ నిందు చేర్చిన పంకము అడుగంటి దివ్యామృతము తేరును.

ఆ. గురువు తా నయినను హరుని తాఁ జూపును
బ్రహ్మలోక మితఁడు పాఱఁజూపు
శిష్యు నఱసి తట్టి చీకటి బాపురా, వి.... 1564

నిజమగు గురువే యైనయెడల యాతఁడు ఈశుని జూ

పించి శిష్యుని చేరఁదీసి యాతనియజ్ఞానమును పొలఁద్రోలి ముక్తు నొనయించును

ఆ. గురువునకును పుచ్చకూరైన నీయరు
అరయు వేశ్యకిత్తు రర్థమెల్ల
గురుఁడు వేశ్యకన్న గుణహీను డగునొకో, వి.

లోకులు నాస్తికులై గురువనినఁ బుచ్చకూర నైనను నీయక భోగముల కర్థముల నర్పింతురు ఆహా! భోగము దాని కన్న గురుఁడు గుణహీనుఁడా?

ఆ. గురువు లేక విద్య గురుతుగా దొరకదు
నృపతి లేక భూమి నియతిగాదు
గురువు విద్య లేక గురుతరద్విజుఁ డౌనె, వి....

గురువు లేనివిద్యయును రాజులేనిరాజ్యమును తుది ముట్టఁ జాలవు కావున గురుని సేవించి కృతార్థుఁడ వగుము.

ఆ. గురుని శిక్ష లేక గుఱు తెట్లు కల్గునో
అజునికైన హరియుబ్బకైన
తాళపుఁజెవి లేక తలుపు పెట్టులూడును, వి....

గురునియనుగ్రహము కొంచెమైనను లేక బ్రహ్మాదేవు నంతటివాని కైనను లక్ష్యము సిద్ధింపదు తాళము చెవి లేక తలుపువచ్చునా? రాదు కదా.

ఆ. గురువు వచ్చుచున్నఁ గూర్చుండి లేవని
తుంటరులకు నెట్లు దొరకు ముక్తి
మగని లెక్కగొనని ముగుద కాగతి పట్టు, వి....

గురువువచ్చుచున్న లేచి యెదురురానిమూర్ఖులకు సద్గతి దొరకదు

ఆ. గురువుసెప్పినయుక్తులు కూడి మిగిలి
మఱపులేదని నిజమాడి మహితుఁ డగుచు
నెఱపుచుండును శివయోగి నేర్పుతోడ, వి....

గురువు చెప్పినయుక్తులను మదిని నిల్పికొని మఱచి పోక సర్వదా యభ్యసించువాఁడు అత్యుత్తముఁ డగును

ఆ. ఘటములోన నున్నగతు లన్నియును ద్రెంచి
దిటవు చేసి మనసు తేటపఱచి
ఘటము నిల్పువాఁడు ఘనతత్త్వయోగిరా, వి....

ఘటములో నున్నట్టిగతులను త్రుంచివైచి మనస్సును దిటవు చేసికొని శరీరమునం దీశుని నిలుపుకొనువాఁడే తత్త్వవేత్త యగును.

ఆ. చపలచిత్తవృత్తి సాధించి నిలిపినఁ
ద్రిపుటిబిలముఁ జేయ దెంపుగలిగి
జపము లోనిజపము జయశీలతను మించు, వి....

చపలమగు చిత్తవృత్తిని నిలిపి త్రిపుటియందు చేర్చి బ్రహ్మమును ధ్యానించుచుండవలయును

తే. చర్చమీఱినజ్ఞానంబు సంతరించి
మూర్ఛజెందినయట్లున్న ముక్తిగలుగు
గూర్చి మెచ్చఁడె గుఱిదాఁటి కోవిదుండు
తీర్పు గురుదరి జేరంగ దివిరి వేమ. 1572

జ్ఞానమును కూర్చికొని మోహముఁ జెందినట్లు నటించుచు లక్ష్యమును దాఁటి బ్రహ్మమును జేరుటకై కోవిదుఁడు యత్నించును

ఆ చెడుగుణంబు లెల్లఁ జేపట్టి శిక్షించి
పరమపదవి సిద్ధపడఁగఁ జూపు
నట్టి గురుని వేఁడి యపరోక్ష మందరా, వి....

దుర్గుణములను పొలఁద్రోలి పరమపదమును జూపించు గురుని ప్రత్యక్షమున సేవింపుము

ఆ చదువురా దటన్న సామాన్యత యిఁకేల
బుద్ధి కుదురకున్న పొందికేల
గురుని గూర్చు ముక్తి కరతలామలకమౌ, వి....

చదువురానివాని సమర్థ్యమును నిశ్చలబుద్ధి లేనివాని పొందికయును నిరర్థకములు.

ఆ చనఁగఁ జనగ దాఁకుఁ జనుఁద్రోవలో గాశి
వినఁగ వినఁగ బ్రణవవిభవ మెచ్చు
గనఁగఁ గనగఁ బుట్టు కారణ మాయెరా, వి....

పోఁగా పోఁగా కాశియును, వినఁగ వినగ బ్రహ్మమును చూడఁగాఁ జూడఁగా కారణమును సిద్ధించుచుండును.

ఆ చదువురా దటన్న సామాన్యత యిఁకేల
బుద్ధికుదిరియున్న పొందు లేల
గురునిగూర్చు ముక్తికూడియుండునుసుమీ, వి.

చదువురాని సామ్యము వ్యర్థము కావున మనస్సును

స్థిరమును జేసి గురుని యనుగ్రహమును సంపాదించి ముక్తుఁడు కావలయును.

క. చుట్టుకొనియున్నమాయను
నెట్టుము గురుభక్తి మీఱి నియతాత్ముఁడవై
ముట్టుము తత్పరతను మన
మట్టెట్టును జెందనీక మాన్యత వేమా!. 1577

ఆవరించియున్న మాయను నశింపఁజేసి గురుభక్తిగలిగి నియతుఁడవై తత్పరతతో బ్రహ్మము నుపాసింపుము

క. చూచెడివఱకే సాధన
చూచిన మదియందు దోఁచి సులభం బగునా
తోచెడిమర్మము నీవని
కాచుకొనియు గురుని గోరి కనవలె వేమా!

చూచునంతవఱకే సాధన కావున మనస్సునందున్న మర్మమును కని సర్వము నాత్మమయమని నమ్మి ముక్తుఁడవు కావలయును.

ఆ. ఛాత్రధర్మ మెఱిఁగి చక్కని భక్తితో
గురుని సేవఁ జేయ గుదిరినపుడె
సర్వమర్మములును జక్కగా విడిపోవు, వి....

శిష్యధర్మమును ఎఱింగి భక్తితో గురువుల సేవించి సమస్తధర్మముల యందలి మర్మములను ఎఱుంగవలయును.

ఆ ఛాయనొసఁగుఁ జెట్టు సాధువు బోధట్టు
లడఁగి దరినిజేరి బడయవచ్చు

నట్టునిట్టు దాఁట నది పోవు నిది గాదు, వి....

చెట్లు నిష్కామనతో నీడ నొసంగినట్లులుగానే సాధువులును సర్వోత్తమమగు బోధ నొసంగెదరు కాని దానిని లక్ష్యము సేయనిచో వ్యర్థము

ఆ. ఛిద్రమెన్నువాఁడు శిష్యుఁడు తానౌనె
ఛిద్ర మెఱుఁగువాఁడు శిష్యుఁ డగును
ఛిద్ర మెఱిఁగి మూసి భద్రంబు చేకుఱు, వి....

నేరము లెంచువాఁడు శిష్యుఁడు కాఁడు; కాని గురుని నేరముల నెఱింగి వాటిని కప్పి వేయువాఁడే యగును

ఆ. ఛేద్యమైనదాని చేపట్టినాఁడని
మూలవస్తు వెట్లు కేలఁబట్టు
దాని మూనఁ గలుగు దార్ఢ్యంబు లేకున్న, వి.

ఛేద్యమైనది చేత జిక్కినంతమాత్రాన మూలము వశమగునా ? కావున దానిని పట్టుకొనఁగలుగు దార్ఢ్యమును ముందుగా నలవఱచుకొనవలయును

క. జగమున గురుఁడుదయించిన
జగమునఁ గలజనులు శరణుశరణనరొక్క
జగ మెఱిఁగి మ్రొక్కఁ జూచెడి
నిగమాగమ నిర్వికారనిపుణుఁడు వేమా! 1583

గురుని యుదయమున లోకులు అతని నుతించినట్లే సద్గురుని నుదయమున మ్రొక్కెడివాఁడు సర్వోత్తముఁ డగును.

ఆ. జననమరణము లన స్వప్నసుషుప్తులు
జగములందు నెండ జలములుండు
నరుఁడు జగమునంట నగుబాటుగాదొకో, వి.

జననమరణాదు లన్నియు జగములందు నిండియుండుట చేత నరుఁడు జగమని యనుకొనుట నవ్వులచేటే యగును

ఆ జాతిలోన నెట్టిజాతిముఖ్యం బని
యెఱుఁగ లేక తిరుగ నేమి కలదు
యెఱుక కల్గినవెన్క నేజాతి కానేమి, వి....

ఏజాతిముఖ్యం బని తెలిసికొనఁ జాలక తిరిఁగిన గొంచె మైనఁ బ్రయోజనము లేదు కావున ముందు నెఱుకను సంపా దింపవలయును

తే. జాడ గలగుఱిమేడలో జోడుగూడి
వేఁడి యష్టాక్షరములందు విధ మెఱింగి
కూడియుండెడివాఁడెపో కోవిదుండు, వి.... 1586

చేతనముగల సౌధములో నున్నబ్రహ్మమును అష్టాక్షర ములలో తత్త్వమును తెలిసికొని యుండెడివాఁడే కోవిదుఁ డగును

ఆ. జక్కి నెక్కి వీథిఁ జక్కఁగా వెలువడు
కుక్క లిన్ని వెంటఁ గూయు దొడఁగు
ఘనున కోర్వలేనికాపురుషులు నిట్లు, వి....1587

గుఱ్ఱము నెక్కి వీథి వెంటఁ బోవు నెడఁ గుక్కలు అఱచునట్లే గొప్పవానిఁ జూచి యల్పులు అల్లరిఁ జేయుదురు.

తే. జాగుసేయక గురుసేవఁ జరిపి దాన
యోగయోగాంగముల నేర్చి యోగు లగుచు
ఆశలను మానుటను గాదె యచలతపము
సిద్ధినొందును ముక్తికిఁ జేర్ప వేమ. 1588

ఆలస్యము సేయక గురువుల సేవించి ఆశను పరిత్యజించినయోగులనే యచలత్వము నొందుచున్నారు

ఆ జ్ఞానులమని యందు చపలాత్ము లగువారు
తెలివి లేకతమ్ము తెలియ లేరు
కష్టమైనయడవి గాసిలుచున్నారు, వి.... 1589

చపలులు తమ్ము జ్ఞానుల మని చెప్పికొందురే గాని తమ తెలివితేమిని కష్టములను తెలిసికొనఁ జాలరు

ఆ జ్ఞానమెన్న గురువు జ్ఞానహైన్యము బుద్ధి
రెంటిసందు రిమ్మ రేచునపుడు
తెమ్ము తెలిసెనేని రెండొకరూపురా, వి....

జ్ఞానమే గొప్ప! తద్భిన్నమే నీచము కావున జ్ఞానాజ్ఞానములవిమర్శించుభావమును తెలిసికొని దాని నొంది సుఖింపుము

ఆ జ్ఞానవంతునికడు కర్మబద్ధులు
వెఱ్ఱియండ్రు ప్రకృతి విడువలేక
వెఱ్ఱి కనని ప్రకృతి వెదకినఁ గల్గునా, వి....

జ్ఞానము గలవానిని గొందరు వెఱ్ఱివారని యనెదరే

గాని లోకములో నెట్టికి తెలియని వేద్య మేదియును లేదని యెఱుంగరు కదా!

ఆ. జ్ఞానియనెడువాఁడు ఘనతేజమందును
బూనిసుఖముఁ జెందు పుట్టఁబోఁడు
తానె తానటయ్యు తనలోనె వెల్గును, వి....

జ్ఞాని తేజమును దర్శించి సుఖమును జెంది జననమర ణాదులనుండి ముక్తుఁడై చిన్మయతఁ జెందును

ఆ. టీక వ్రాసిన ట్లనేకులు పెద్దలు
లోకమందు జెప్పి రేకమనుచు
కాకులట్టిజనులు కాన రీమర్మము, వి.... 1593

ఎందరో పెద్దలు ప్రపంచములోని మర్మమును టీక వలె వివరముగా చెప్పినను తెలివిలేనివారై లోకులు ఇద్దాని నెఱుంగఁజాలకున్నారు

ఆ తత్త్వ మెఱుఁగువాఁడు దైవంబు నెఱుఁగును
సర్వసారములను జానఁ జేయు
కదళిమ్రింగువాఁడు గరళంబు మ్రింగడు, వి....

తత్త్వవేత్త దైవమును ఎఱుంగఁగలుగును సమస్తమును కూడ తెలిసికొనఁగలఁడు ఎట్లన గరళము మ్రింగెడివాఁడు కదళిని మ్రింగఁజాలఁడా?

ఆ తనదుమనసుచేత దర్శించి జ్యోతిష
మెంతఁ జేసె ననుచు నెంచి చూచు
తనయదృష్టమంత దైవ మెఱుంగఁడా, వి....

మూర్ఖుఁడై తాను విఫలుఁడైనప్పుడు జ్యోతిషమును నిందింపఁబూనుకొనునే కాని తొలుత కినయదృష్టమును తా. నెఱుఁగఁజాలఁడా ?

ఆ. తనవిరక్తి యనెడి దాసిచేతను చిక్కి
మిగిలి వెడల లేక మినుకుచున్న
నరుని కేడ ముక్తి వరలెడి చెప్పఁడీ, వి ... 1596

విరాగ మనుదాని పాలఁబడి తప్పించికొనలేక తిరి గెడివానికి ముక్తి ఎట్లు కలుగఁగలదు ?

ఆ. తనివి దీఱ గురుని ధ్యానించి మదిలోన
దనువుమఱచి గురుని దాకినపుడె
తనగుచుండు బ్రహ్మతత్త్వమందురు దాని, వి.

మనస్సు సంతృప్తి నొందునట్లు ధ్యానించి తత్త్వమును గని తన్మయత్వము నొందవలయును

ఆ. తలఁపులోనఁ గలుగు దా దైవ మేప్రొద్దు
తలఁచి చూడ నదియ తత్త్వమగును
ఊరకుండ నేడ్వ నుత్తమయోగిరా, వి.... 1598

దైవ మెల్లపుడును మనమనస్సులోనే యుండి తలఁచి నంతన బయల్పడును కావున చింతింపక సర్వదా యానంద మయుఁడై యుండవలయును.

ఆ తలపులోనిమరులు తలఁపు లెఱుంగక
తలలు బోడులైన ధన్యులేమి
తలఁపులోనితలఁపు తత్త్వముం చెఱుఁగుము, వి.

మనోమర్మముల నెఱుంగఁజాలక తలలను బోడులను
చేసికొనినంతనే ధన్యులు గాఁజాలరు

తే. తలవరులకైన నెప్పుడు ధర్మ మొప్పు
సామియానతిఁ జేయుచు తారెఱుఁగమి
గురులహితబోధ మీఱెడికూళలకును
నరకకూపంబె శరణమా యరయ వేమ 1600

భటులకైనను కొంతధర్మము గలదు వారు తమ యేలిక
మాటను జవదాఁటరు అట్లే జనుఁడును గురులయాజ్ఞ చొ
ప్పున నడుచుకొనవలయును

ఆ. తల్లిదండ్రిమీఁద దయలేనిపుత్రుండు
పుట్ట నేమి లేక గిట్టనేమి
పుట్టలోనఁ జెదలుపుట్టదా ? గిట్టదా, వి....1601

తల్లిదండ్రులపై ప్రేమలేని పుత్రుని పుట్టుక పుట్టలోని
చెదలుపుట్టుకవలె నిరర్థకము అగును

ఆ. తల్లిదండ్రు లెన్నఁదగు తొలిగురువులు
పార్వతీభవులిల పరమగురులు
కూలివాండ్ర జగతి గురులన ద్రోహము, వి....

తల్లిదండ్రులు ఆదిగురువులును పార్వతీపరమేశ్వరులు
పరమగురువులు నగుదురే గాని కూలికై చెప్పువారు గురు
వులు కారు

ఆ. తల్లిబిడ్డలకును తగవు పుట్టించెడి
ధనము సుఖము గూర్చు నని గడింత్రు

కాని యెల్లయెడల ఘనదుఃఖకర మది, వి....

తల్లిబిడ్డలకు తగవుల బుట్టించు ధనము సుఖప్రద మని కూర్చుటకు యోగ్యము కాదు

ఆ. తల్లి యాలు నయ్యె తగఁ గోడలును నయ్యె
గోడలనఁగ నంగ గూఁతు రాయె
మాయవిడక ముక్తి మహిం నిఁకఁ గల్గదు, వి....

జనులు మాఱల మాఱల పుట్టుచుండుటచేత ఈజన్మము నందలి తల్లి మున్నగువారు ఇంక నొకజన్మమున ఆలు మున్నగువారుగా పుట్టుచుందురు

ఆ. తాను నిర్మలుఁడు గద నరుగుణము లన్ని
చేయ లేని గురుఁడు చెడుగురుండు
గుడ్డితట్టు నెక్కి గుణికిన ట్లగునురా, వి....

తాను నిర్మలుఁడై గుణముల నన్నిటిని నిర్మలములుగా చేయలేని గురువు నాశ్రయించుట గ్రుడ్డిగుఱ్ఱము నెక్కిన ట్లగును

ఆ. తాను విమలుఁడైన దనగుణ మంతయు
శివున కీని గురువు చెడుగు గురువు
గ్రుడ్డిగుఱ్ఱ మెక్కి గ్రుడిఁ జుట్టినట్లగు, వి....1606

తాను విమలుఁడై తనగుణములను లోకముల కుపయోగింపనివాఁడు కుజనుఁడు

ఆ. తాను సకలమాట తనలోనిసకలంబు
తనదులోనివెలుగు తాన యెఱిఁగి

యున్నమానవునకు నొనరఁగా ముక్తిరా, వి....

సమస్తస్వరూపమును తానే యని యెఱింగియున్న మనుజునకు ముక్తి మిక్కిలియును సులభముగా దొరకును

ఆ. తామసించి చేయఁ దగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె, వి....

ఏపనినైనను త్వరపడి చేయరాదు అట్లైనచో పచ్చికాయను మ్రాగ వైచిన పండనియట్టుల నే వ్యర్థమగును

ఆ. తాము కన్నవారు తము గన్నవారును
చచ్చు టెల్ల తమకు సాక్ష్యమె గద
బ్రదుకు లెల్ల తెలియ బ్రహ్మకల్పంబులా, వి....

కొడుకులు తండ్రులు మున్నగువారు అందఱును చనిపోవుట ప్రపంచ మస్థిరమునకు తార్కాణమె యున్నయది.

ఆ. తిత్తిలోనిశివుని స్థిరముగా దెలియక
తిక్కపట్టి నరుఁడు తిఱుఁగుచుండు
దిక్కుదెల్ప గురుఁడె కొక్కఁడె దిక్కురా, వి....

శరీర మనునిసంచిలో నున్న యీశ్వరు నెఱుంగఁజాలక తిరుగు నీనరులకు తెల్పి సమాధానముచేయుటకు గురుఁడు తప్ప యితరులు తగరు

ఆ తిరిగి తిరిగి నరుఁడు మరులు కొనుటె గాక
యందువలననేమి యధికమగును
అంతరంగ మెఱుఁగ నప్పుడు శివుడగు, వి....

ఎన్నిదేశములందు తిరిగినను ఎక్కువేమియును లేదు; కావున తిరుగక యంతరంగము నెఱుఁగ యత్నింపుము

ఆ. తీర్థయాత్ర కనుచు తిఱుగఁబోయినవాఁడు
 పామరుండు గాక భక్తుఁడగునె
 తీర్థయాత్రచేత దివ్యుండు గాఁడయా, వి....

తీర్థయాత్రల కని తిరిగెడివాఁడు పామరుఁడే గాని భక్తుఁడు కాఁజాలఁడు

1613

తే. తొల్లి జేసినపాపంబు తొలఁగుకొఱకె
 పుట్టిచచ్చుచుమఱలను బుట్టుచుంద్రు
 గురుని జేరియు వేఁడితా గొల్చునేని
 పుట్టుదుఃఖము బాఁడయి పోవు వేమ 1614

పూర్వజన్మసంచితపాపములు నశించుటకే మనుజుఁడు మఱల మఱల చచ్చిపుట్టుచుండును, గాన గురుని సేవించి ముక్తుఁడ వగుము

ఆ. త్రాడు మెడకు వేసి తనకు శూద్రత్వంబు
 పోయె ననెడి దెల్ల బుద్ధిలేమి
 మది నిలువక త్రాడు మఱి వన్నె దెచ్చునా?, వి.

మెడలో (జందెము) వ్రాతచేత శూద్రత్వము పోయి నదని పోదు; మొగస్సు వెళ్ళల మెడ...ని వస్త్రయును రాదు.

ఆ. దగ్గఱున్నవాఁడు తప్పక దక్షుఁడు
ఎడము పడినవాఁడు దుడుకు గడును
అనుసరించువారి కయ్యెడు గార్యముల్, వి....

ఎంతటి నేర్పరియైనను సర్వదా యాశ్రయింపనిచో కార్యములను చెడుపుకొనవలసినవాఁ డగుచున్నాఁడు

ఆ దశ
ద?

లు
కొనుచుందురు, గాన లో... ...న్నటువంటి ...
గొప్పది

ఆ దర్శనంబునందు ధరషణ్మతములందు
వర్ణమాశ్రమమును వదల కెపుడు
తిరుగుచున్నవాఁడు ధరలోన నజ్ఞాని, వి ...1618

శాస్త్రములలోను షణ్మతములలోను వర్ణాశ్రమముల లోను ఆసక్తి గలిగి అజ్ఞుఁడు తిరుగుచుండును

ఆ. దాత లేనికొంప దయ్యాలపెనువాఁడ
నీతిలేనిమాట రాతివేట
ప్రీతిలేనిలంజె ప్రేతవాహనముయా, వి....1619

దాతలేనికొంపయును నీతిలేనిమాటయును ప్రీతిలేని సతియును కొఱగానిది

ఆ. దాస రనఁగవచ్చు వేసార్లకైనను
జంగమనఁగ వచ్చు లింగమున్న
బాపడనఁగ రాదు పదివేలకైనను, వి ... 1620

వేయి యత్నములైనను జేసి దాసరిజంగము అని యనిపించుకొనవచ్చునుగాని బ్రాహ్మణుఁడనిపించుకొనుట కష్టము.

క దినములు వ్యర్థము పుచ్చక
కనుఁగొనుమి యాత్మ నెపుడు ఘనగురుబోధ
న్నినను నీవెఱుఁగక యున్నను
గొనకొని మది చెఱచు నిన్ను గొబ్బున వేమా!

కాలమును వ్యర్థముగా గడపఁ ద్రోయక నీలో నీవు గురువు చేసినయాత్మబోధను ధ్యానించి ముక్తుఁడ వగుము

ఆ దున్నపోతునకును తోడిరాగం బేల
కన్నగాని కేల కంటినిదుర
వెన్నముద్ద కేల వేఁడినీరపు బొందు వి.... 1622

దున్నపోతునకు తోడిరాగమును కన్నగానికి నిద్దురయును పనికిరావు

తే. దురితముల నెల్ల ఖండించుగురుని జేరి
పరమనిర్గుణమననంబు ప్రాకినంత
గురుతరంబుగ గుణములు కొట్టువడును
పరశివుం డన భాసిల్లు ధరను వేమ. 1623

పాపముల బాయఁ జేయుఁగురునిఁ జేరి ప్రార్థించినచో సమస్తమును సిద్ధించి కైవల్యము నొందఁగలుగును

తే. దివ్యపరతత్త్వ మనుజ్ఞప్తి ధీజయుండు
మరలి పుట్టనిగురుభక్తి మహిమతోడ
నక్షయాత్మకపరమంది యమలుఁ డగును, వి....

దివ్యమగు పరతత్త్వముపైని మఱపు లేకయుండి గురుభక్తుఁడై యక్షయత నొందుటకై యత్నింపవలయును

తే. దివ్యమైనట్టిపరశివ తేజ మూని
భవ్యమగుయుక్తి మదిలోనభద్రపఱచి
సేవ్యుఁడై యుండుటేముక్తి స్థిరముగాను, వి....

దివ్యమగు శివతేజమునుపూని యుక్తితో నాత్మను నిలిపి కొనినవాఁడే ముక్తి కర్హుఁడు

ఆ. దృశ్యమైనదాని దెలిసి నమ్మెద రట్లు
కాని దాని నమ్మఁ బూనుకొనరు
కాని దృశ్యమగుట గాన రే యది యెట్లు, వి.

దృశ్యమును నమ్మి ట్లు అదృశ్యమును నమ్మరే గాని దృశ్యమె యదృశ్య మగుటను తెలిసికొనఁజాలకయుందురు

ఆ. దేవభూములందు దేవాలయములందు
దేవుఁ డనుచు మ్రొక్కి తెలియలేక
తిరుగుచుండువాఁడు దేవాదిదేవుఁడా, వి....

స్పష్టము.

ఆ. దేహభావమెల్ల తెలియుంగఁ జూచిన
నఖిలహేయములకు నాలయంబు
పరసతిగమనము ప్రత్యక్షనాశము, వి....

దేహపురీతి నాలోచించిన సమస్తాపదలకు మూలకార
ణమని తోఁచును కావున పరదారాగమనము నాశనకరము.

ఆ. దేహమాత్మరూపు తేటతెల్లము జేసి
యవలి చూపు జూచు నతఁడె గురువు
భ్రమరము తనరూపు క్రిముల కిచ్చినరీతి, వి....

స్పష్టము.

తే. దేహమాత్మలు వేఱని తెలియలేక
మోహమునఁ జిక్కి నిద్రలో మునుగు టేల?
సాహసంబున గురుభక్తి సలుపవలెను, వి....

దేహము ఆత్మ వీని నిజస్థితిని దెలిసికొనుటకు గురుభక్తి
నార్జింప వలయునే గాని అజ్ఞానియై నిద్దుర బోరాదు

ఆ. ధర్మమునకు గీడు తలఁచినవాఁడు తా
దుష్టుఁ డగుచు తుదకు ద్రోవయె చెడు
గురువుపత్ని గనయ గోరెడునట్టులు, వి....1631

ధర్మమునకు ద్రోహము చెయదలఁచువాఁడు గురుద్రోహి
వలె తానే నశించును

ఆ. నిజగురూపదేశ నిశ్చయాత్మకవిద్య
రక్షకం బటండ్రు రాజవీథి
మధ్య మార్గమందు మాన్యతఁ జూడరా, వి....

తాను తనగురువు చెప్పినచొప్పున మఱచిపోక పది
లముగా రక్షించుకొనవలయును ఇట్టివారిని మిక్కిలి గౌరవ
భావముతో గిలకింపవలయును

ఆ. నిజము కల్లరెండు నీలకంఠుఁడెఱుంగు
నిజము లాడకున్న నీతి దప్పు
నిజములాడునపుడు నీమాప మనవచ్చు, వి....

సత్యాసత్యములను సర్వేశ్వరుఁడెఱింగియున్నాఁడు.
కావున నిజమునే బలుకుము నీతిని తొలఁగి నడవకుము

క. నిందించు భ్రమలఁ జెంపక
పొందినమదిఁ జేర నొక్కి పోడిమితో నీ
వందుకొని గురురహస్యము
సందియ్యక పూర్ణు డగుము సరగున వేమా!.

నిందాభ్రమలను వీడి మదిని చిక్కఁబట్టి గురూపదేశ
రహస్యమును సర్వదా ధ్యానించి పూర్ణుఁడవగుము

తే. నిరతమాత్మచిదానంద నిలయమందు
సరవితోఁడుతపరిపూర్ణ సౌఖ్యమెఱిఁగి
యరిది యగుబయ ల్సేరుట యనుభవంబు, వి.

ఎల్లప్పుడును ఆత్మ యనుచిదానందనిలయమునందు పరి
పూర్ణసౌఖ్యపుస్వరూపము నెఱిఁగి చిన్మయుఁడగుటయే యను
భవ మనఁబడును

ఆ. నూటెనిమిదిగళ్ల నోముల పుణ్యాలు
కలవొ జీవులకును చింత లేదు

చెడిననీళ్లు నదుల చేరెడినట్లయా, వి.... 1636

నూటెనిమిదిగళ్లనోములు మున్నగు వానివల్ల పుణ్యములు లేవు కావున గురువు నాశ్రయించి ముక్తుఁడ వగుము

ఆ. నూరు పలుకవచ్చు నుడి వ్రాయగారాదు
వ్రాశికన్న సాక్షి వలవ దెన్న
బరగ లేనివ్రాత భంగపాటుం దెచ్చు, వి....

నూరుమాటలనైనను పలుకవచ్చును వ్రాయుట యసాధ్యము అట్లు వ్రాసెనేని అయ్యది భంగపాటు దెచ్చును

ఆ నెనరు గలుగుగురుఁడు నిటిలదుర్గముఁ జూపు
కనులచూడ్కి మఱుగు గవయఁజూపు
చెనకి యాత్మరూపుఁ జేజేతచూపురా, వి....

ప్రియము గలుగుగురుఁడు యోగమును చూపి ఆత్మరూపు నొందు తెఱంగును వివరించును

ఆ నేరనిజనులకు నేర్పునేరము లెల్లఁ
జక్కఁ జేయుదు రిల సాధుజనము
ఒప్పుదుర్జనులిల తప్పుగా నెంతురు, వి.... 1639

అజ్ఞులకు వంచకులు నేర్పిననేరములను సజ్జనులు దిద్దినచో దుర్జనులు ఆపనిని గొప్పతప్పుగా నెంచెదరు

ఆ. నేర్చి నడతు నన్న నేరమి తా వచ్చు
నోర్చి నడతు నన్న నోర్పురాదు
కూర్చి నడతునన్న కూడంగ నీయదు, వి....

స్పష్టము

ఆ. పంచమనిగమంబు భారతం బగునని
పొగడి రేల జనులు బుద్ధిమాలి
హింసకార్యము తమ కిష్ట మెట్లయ్యెనో, వి....

భారతము పంచమవేదమని పొగడిరే కాని అందలి హింసాకార్యము నెట్లు ఒప్పుకొనిరోకదా!

ఆ. పట్టుగొమ్మ వదలి పలవింప నేటికి
ఇట్టి గురుని వేడి గుట్టు నెఱిగి
నిట్టనిలువు గాంచి నిర్గుణ మందరా, వి 1642

అవలంబము లేక విలపించుటకంటె గురువును జేరి రహస్యము నొంది నిర్గుణత్వము నొందుము

ఆ పడతిమోసె నొకఁడు పడతి మెసె నొకండు
పడతి నురము జేర్చి బ్రదికె నొకఁడు
పడతికొఱకె పెక్కుపాట్లను బడిరయా, వి....

లోక మంతయును హరిహరబ్రహ్మాదులవఱకు స్త్రీలకై పెక్కుపాటులను అనుభవించి యున్నయది

ఆ. పడుచుమాటలాడి పరితపింపఁగ నేల
వెడగుచర్య లడచి వేఁడిగురుని
యడుగులంటిమ్రొక్కి యాసనువిడఁద్రొక్కు, వి.

పడుచుమాటలఁ బలికి పిమ్మట పశ్చాత్తప్తుఁడ వగుట కంటెను ముందుగనే గురువులపాదములపై వ్రాలి ముక్తుఁడ వగుటకు యత్నింపుము

ఆ. పడచునూరకేలఁ బారచూచెదరొకొ
యెంతవారలైన భ్రాంతి సెంది
లోన మీఱుకామ లొంగఁజేయఁగ లేక, వి.

స్త్రీలు కనుపింపఁగనే కామమును లొంగదీయఁజాలక లోకులు వారినేల పాఱఁజూచి చెడిపోయెదరో కదా!

ఆ పరఁగ దేవుఁ జేసి ప్రజలను మ్రొక్కించి
తొక్కుభూమి కెల్ల దొరను జేసి
మనుజవరులకు నిల మాంగల్యమును జేసె, వి.

దేవుని నిర్మించి ప్రజలను ఆమూర్తికి మ్రొక్కించి ఈభూమి కంతకును రాజులను చేసియుండెను ఆహా! ప్రకృతి మాహాత్మ్య మిట్టిది

ఆ. పరఁగ నింతదనుకఁ బడినపాటులుఁగఁడో
ఘనత నొప్పుమనుజుఁ డనఁగఁ బుట్టి
కీడు మే లెఱుఁగక క్రిందగు చిత్రము,వి....1647

మనుజుఁడు తా నిన్నిజన్మములందును పడినపాటును స్మరించియును మఱల క్రిందుమీ దగుచుండును ఎంతటి చిత్రము!

ఆ పరధనంబులకును ప్రాణము లిచ్చును
సత్య మింత లేక జారుఁ డగును
ద్విజులమంచు నెంత్రు తేజ మించుక లేదు, వి.

పరధనపరాంగనలన్న ప్రాణములనైన నర్పించు మూర్ఖులను బ్రాహ్మణులని పలుకరాదు

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబు వెట్టుక
మగువ సేయుచుండు మంచితనము
అట్టిభంగి యోగి యాత్మ భావించును, వి....

జారిణి పరపురుషునిమీఁది యాసచేత మంచితనమున నటించునట్లులే యోగియును ఆత్మసిద్ధికై శరీరమును పోషింపవలయును

క. పరమాత్మునిచింతనలోఁ
దలఁచుచుగ నుండుటయె తగును ధర నొక్కటికిన్
దిరిపము నెత్తి భుజించుచు
దొరవలె గృహవేదికందు దొంగుము వేమా!.

పరమాత్మధ్యానమే తలఁచుచుగా మదిలో నుంచుము. ఇట్లు చేయుచు నిరీహుఁడవై స్వగృహముననే యుండి సుఖింపుము

క. పరిపక్వ మొప్ప శిష్యున
కురమందలి బయలుఁ జూపి యుద్ధతిమీఁఱన్
పరిపూర్ణ మందఁ జేసెడు
గురుఁడు పరబ్రహ్మమైన గుణనిధి వేమా!. 1651

కర్మము పరిపక్వము అగునట్టులు శిష్యునకు ఆత్మబోధ చేయుగురుఁడే గురుఁడు గాని తక్కినవారు కారు.

ఆ. పరుల కుపకరించి పరుసొమ్ముపరునకుఁ
బరఁగ నిచ్చెనేని పరము కల్గుఁ
బరముకన్న నేమి పావన మాసొమ్ము, వి....1652

పరుల కుపకారముఁజేసి వారిధనమును వారికిచ్చుటయే పరసాధకము

ఆ పరులవిత్తమందు భ్రాంతి వాసినయట్టి
పురుషుఁడవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయ పాపసంచితమగు, వి ...1653

పరద్రవ్యములపైని ఆశ లేనివాఁడే యఱసినచో పుణ్యమూర్తి యని తెలిసికొనుము

ఆ. పక్షిజాతి బట్టి పరఁగ హింసలు బెట్టి
గుళ్లు గట్టి యందు గుదురఁబెట్టి
యుంచువారి కట్టిపంచన రాదొకో, వి.... 1654

నిరపకారులై యుండుపక్షులఁ బట్టికొని గూళ్లలో బంధించువారికఁ గూడ అట్టెగతియే కలుగును

క. పాదుకొని హృదయమందును
సాధారణవృత్తు లడఁచి సన్నుతిగను జీ
వాధారచక్రమందును
మోదంబున విఘ్నపతికి మ్రొక్కుము వేమా!.

హృదయమునందు జీవాధారచక్రమునందు మది నిల్పి ఈశ్వరుని సేవింపుము

ఆ పాలగలియు నీరు పాలైయె రాజిల్లు
నట్లు గురునివలన కోవిదుఁడగు
సాధుసజ్జనముల సంగతు లిట్లురా, వి.... 1656

పాలలోఁ గలసిననీరు పాలయినట్టులనే గురునితోఁ గూడినశిష్యుఁడు తన్మయత్వము నొందును

ఆ. పాలనీటికలఁత పరహంస మెఱుఁగును
నీరుపాలనట్లు నేర్చు నెమలి
అజ్ఞుఁడైన హీనుఁ డలశివు నెఱుఁగునా, వి....

పాలనీళ్ల భేదమును పరహంస మెఱుఁగునుగాని నెమలి యెఱుంగనట్టులనే అజ్ఞుఁడును ప్రాజ్ఞునివలె శివుని యెఱుఁగఁ జాలఁడు

ఆ. పాలప్రియముచేతఁ బఱఁగ నేడ్చెడిబిడ్డ
తుత్తుదవ్వుల కిలశోకపడఁగ
దల్లిపనులు తీర్చి తనయుని ముద్దాడు, వి....1658

పాలకై బిడ్డ లేడ్చుచున్న పని త్వరితముగ తీర్చికొనిన పిమ్మటనే బిడ్డలను తల్లి ముద్దాడినట్టులు గురువును శిష్యుని ఆదరించి ముక్తునిఁ జేయును

ఆ పాలరాళ్ల దెచ్చి పరఁగంగ గుడిగట్టి
చెలఁగి శిలల పూజచేయుచుంద్రు
శిలలసేవఁ జేయఁ జిక్కున దేమిటి వి.... 1659

పాలరాళ్లతోఁ గూడి గట్టి శిలలను పూజించినందువలన ప్రయోజన మింత యైనను లేదు

ఆ. పాలసాగరమునఁ బవ్వళించినహరి
గొల్లపల్లెపాలు కోరనేల
ఎదుటివారిద్రవ్య మెల్లరకును తీపి, వి.... 1660

పాలసముద్రములోఁ బరుండిన విష్ణువే గొల్లవారిపాల కాసించె ననుటఁ జూడఁగా పరద్రవ్యముపైని అందఱకును ఆసక్తి గలుగునని తోఁచుచున్నది

ఆ. పాలు పెరుగు వెన్న పాయసంబును నేయి
జున్ను లెన్నియైనఁ జూడపాలె
పాలవంటికులము బ్రహ్మంబు గానరో, వి ....

పాలు పెరుగు మున్నగు భేదము లెన్నియున్నను వస్తైక్యము గనినట్లులే బ్రహ్మము నని యెఱుంగుము

ఆ. కల్లలాడుకంటె కష్టంబు మఱి లేదు
కష్ట మెపుడొ కీడు కలుగఁజేయు
ద్విజుఁడ ననుట చూడ త్రిమ్మరితనమురా, వి....

కల్లలకంటె కష్టప్రదములు వేఱుగాలేవు అయినను కల్లలను జంకక ఆడిగెడివాఁడు ద్విజుఁడైనను ద్రిమ్మరియే యగును

ఆ. కల్లుద్రాగువానికల్లు ముచ్చనరాదు
కల్లలాడువాఁడె కల్లుముచ్చు
కల్లుద్రాగుకంటె కల్లలాడుట కీడు, వి.... 1663

కల్లుద్రాగువానికంటె కల్లలాడువాడే పాపాత్ముఁడు.

ఆ నిజములాడు నతఁడు నిర్మలుండై యుండు
నిజమునాడు నతఁడు నీతిపరుఁడు
నిజము బల్కకున్న నీచచండాలుఁడు, వి.... 1664

నిజముబల్కువాఁడు నిర్మలుఁడైయుండును వాడే నీతి పరుఁడు. నిజమును పలుకనివాడే నిజమును బరికించినచో చండాలుఁడనఁదగును

ఆ. నెనరు గలుగ గురుఁడు నిఖిలదుర్గముఁ జూపు
గనులచూడ్కి మఱుగు గవయుఁ జూపు
చెనకి యాత్మరూపు చేజేతఁ జూపురా, వి....
స్పష్టము

క. పగ లుడుగ నాశ లుడుగును
వగపుడుగం గోర్కె లుడుగు వడిజన్మంబుల్
తగు లుడుగు భోగ ముడిగిన
త్రిగుణంబును నుడుగుముక్తి తెలుపుగ వేమా!
శత్రుత్వము పోయినచో నాశయును వగపుపోయిన చో కోర్కెలును సంగముడిగిన భోగములును త్రిగుణము లుడిగినచో భోగములును నశించును

ఆ పుట్టినపుడె బొడ్డు పట్టి కోయుచు నుండ
నప్పుడు గురుముద్రలానతిపడె
ముద్ర లేనివారు ముజ్జగంబుల లేరు, వి....1667
పుట్టినపుడే ప్రతివారికిని గురుముద్రలు వైచుచుండఁగా ముద్రలు లేనివార మనుకొనుట వ్యర్థము

ఆ. పుట్టిపుట్టలేదె పుడమిని జను లెల్ల
పుట్టు గిట్ట లేదె పూర్వు లెవరు?
పుట్టిగిట్టు టెల్ల పట్టి భ్రాంతులు సుమీ, వి....

లోకములో నెందఱో పుట్టుచున్నారు; కాని వారిలో నెక్కడనో యొకరిద్దఱు తప్ప తక్కిన వారెల్లరును కేవలము భ్రాంతులే

ఆ. పూసపోగుపసిడి పుష్పంబు మొదలగు
సంపద గలవాఁడు జగతియందు
హీనకులజుఁడైన హెచ్చనియందురు, వి....1669

పూసబుట్ట మున్నగు నాభరణము లున్నవానిని హీన జాతి వానినైనను హెచ్చనుచుందురు ఆహా ఏమి చెప్పఁదగును అర్థవైభవమును!

ఆ. పెట్టిపోయు లేని వట్టిదేబెలు భూమి
బుట్టిరేమి వారు గిట్టిరేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి.... 1670

పెట్టిపోయలేనిదేబెలు పుట్టలోని చెదలువలె పుట్టినను గిట్టినను లాభము లేదు.

ఆ. పొత్తుగుడువ వచ్చు పుత్త్రుఁడే వయసైన
దొత్తుకొడుకు నెంగి లెత్తుకుండ్రె
కాని వానిజోలిఁ గాన రీరితిగా, వి.... 1671

కొడుకును ఎంతపెద్దవాఁడైనను దగ్గఱఁ జేర్చుకొన వచ్చును; కాని కానివానిని కూడరాదు

ఆ. ప్రభువు క్రోతియైన ప్రగ్గడ పందియా
సైనికుండు పక్కి సేనపసులు
నేస్తు లళ్వములును నెలుకలు పిల్లులు వి....1672

రాజులు చపలులైనచో మంత్రులు మున్నగువారిని గుఱించి విశేషముగాఁ జెప్ప నవసరములేదు

ఆ. ఫణికి కోర లుండ భయ మొందునట్టులే
వెరతు రయ్యదుష్టవిభవమునకు
కోరలూడఁ ద్రాఁచు కూఁకునా దుష్టత, వి....

పాముకు కోరలున్నవని భయపడినట్టులే దుర్మార్గుల సంపదకును భయపడవలయును

ఆ. పాపఁడనఁగ నేమి భక్తుఁడనఁగ నేమి
జోగి యనఁగ నేమి సుక్క నేమి
ఇన్ని యేల వెనుక నినుజూఁడు పని దీర్చు, వి....

బ్రాహ్మణుఁడు భక్తుఁడు మున్నగు భేదముల నాలోచింపక యముఁడు అందఱను వారివారి పాపముల కనుగుణముగా దండించును

ఆ. బాలచనులఁ బూలబంతులఁ బోల్తురు
ప్రాలుమాలినట్టి భ్రాంతు లవని
మాంసఖండమందు మరి యేమి యున్నది, వి

స్త్రీలచన్నులను పూలబంతులు అని ఈవిధముగాఁ బల్కుదురే కాని అందేమియు లేదు.

ఆ. బాల్యమందు తాను బహువిధముల పట్టి
చప్పరించినట్టి స్తనములకును
మోహ మింత యేల మూఢాత్మ తెలియరా, వి.

స్పష్టము

ఆ. బూతులేనిలంజె భూతంబు కూతురు
ప్రీతిలేనిపాటు చేతిచేటు
దాతలేనియూరు దయ్యాలపేటరా, వి....1677

స్పష్టము

ఆ. బ్రహ్మ తలను గొట్టి పాఱవైచినయప్పు
డడ్డపడఁగనోప రయిరి సురలు
శివునికరుణ లేక చెడిపోదు మందురు, వి....

ఈశ్వరుఁడు బ్రహ్మను తలద్రుంచినపుడు తక్కిన దేవతలు అడ్డగింపఁగలిగిరా? కావున శివుని నుపాసింపుము

ఆ బ్రాహ్మణునకు మ్రొక్క బహుదీవన లొసంగు
నాత్మశుద్ధి గలుగు నాతఁడైనఁ
గలుగు నన్ని కామి గంఠశోషయె సుమీ. వి.

ఆత్మశుద్ధి గలవాఁడైన బ్రాహ్మణునకు మ్రొక్కిన పెక్కుదీవనల నిచ్చునే కాని కామికి మ్రొక్కినఁ గంఠశోష తప్ప వేఱె ఫలము లేదు

క. భక్తికి మూలము జ్ఞానము
రక్తిగ గురు చెంతఁ జేరి రక్కొనినంతన్
యుక్తిగ నెఱుకై తోఁచును
ముక్తికి నిలయమగు దారి మునుకొని వేమా!.

భక్తిమూలముగాఁ గలది జ్ఞానము గనుక గురువులభక్తితో సేవించి ముక్తికిరవగుజ్ఞానము నొందుము

ఆ. బత్తి లేక లంజె పలుమారు పిలచిన
బత్తి గాదు లయుపుమిత్తిగాని
మిత్తి చొరఁగ నిల్లు మ్రింగక పోవునా, వి....

భక్తిలేనిస్త్రీ మృత్యుదేవతయే కాని వేఱు గాదు అట్టి దాని నిల్లు సేర్చినచో ఇంటితో కూడ మ్రింగి వేయును

ఆ. భక్తిముక్తి గలుగుభాగ్యంబు గలుగును
చిత్తమెఱుగుపడతి చెంతఁబతికి
జిత్త మెఱుఁగనిసతిఁ జేరంగ రాదుగా, వి....

చిత్తానుకూల యైనచో భక్తిముక్తులు మున్నగునవి చేకుఱును లేనిచోఁ గలుగవు కావున చిత్తము నెఱుఁగక స్త్రీని కూడఁదగదు

ఆ. భక్తి యున్నచోటఁ బరమేశ్వరుం డుండు
భక్తిలేనిచోటఁ బాపముండు
భక్తిగలుగువాఁడు పరమాత్ముఁడగునయా, వి.

భక్తియున్నచోటుననే పరమేశ్వరుఁ డుండును గనుక భక్తుఁడు పరాత్ముఁడు కాఁగలుగును

ఆ. భగము గోరువారె పలువురు గాన్పింత్రు
భగము గోరకున్కి జగతి లేదు
భగము గలుగువాఁడుభగవంతుఁడగునయా, వి.

లోకములే విషయాసక్తులే పెక్కురు గాన్పింతురు; గాని ఇతరులు కానరారు

క. భల్లుకము లోలి ప్రాజ్ఞులు
యీలోకమునందు గురుని నెఱుఁగరు తమలో

ముల్లోకము లెఱిఁగినటుల
గొల్లున బొగడుకొనుచుంద్రు, గొనకొని వేమా!.

కొందఱు ఎలుగుబంట్లవలె బలిసి ఈలోకములో గురుని దెలుపంగ లేక తమ్ము తామే పొగడుకొనుచుందురు.

ఆ. భవుఁడు చిత్రముగను భార్యల మోయును
అట్టు మోయగలుగు దిట్టయైన
అతనివలెనె బూది యలఁదిన మెఱుఁగగు, వి.

ఈశుఁడు భార్యను ఆసక్తుఁడైయ్యే వహించును అతనితో సామ్యము గోరువాఁడును అట్టి నేర్పుగలిగిననే భస్మము నలఁదికొనవలయును

తే. భోగభాగ్యంపుసుఖములఁ బొందవచ్చు
రాగవైషమ్యములనెల్ల దీగ డెంచి
వేగ మదియందు గురుభక్తి నాగనిమ్ము
యోగివరులకు దీటుగా నుందు వేమ 1687

రాగద్వేషాదులను నిర్జించి గురుభక్తిని ఆర్జించినచో పెక్కుభోగభాగ్యములను అనుభవింపఁగలుగుదువు

తే. భ్రాంతిచేతను మర్త్యులు భక్తి విడువ
భయదమౌ పుట్టుచావులు ప్రాప్తములగు
నిట్టినరులకు కష్టంబు లెట్లు తీఱు
గురుని సన్నిధిచేర్చునా కొఱఁత వేమ. 1688

భ్రాంతులై మర్త్యులు భక్తిని త్యజించి జననమరణముల పాల్పడుదురు. ఇట్టివా రెన్నటికిని ముక్తులు కాలేరు.

ఆ. మంటలోహములను మ్రానుచీలలయందు
పటముగోడలందు బరగ నినుక
బెట్టునంటునట్లు పెనఁగుదేహము జీవి, వి....
స్పష్టము

ఆ. మంటిలోనఁ బుట్టి మంటిలోనఁ బెఱిగి
మంటిలోనె తిరిగి మనుజుఁ డాయె
మన్నుమంటిఁ గలుప మనుజుఁడే తత్వము, వి....
మంటలోఁబుట్టి మంటలోఁబెఱిగి మనుజుఁడు తుదకు
మన్ను అయిపోవుచున్నాఁడు

ఆ. మట్టువెట్టి కోర్కె మదినిల్పి చూచిన
గుట్టు మిగుల దానిగుణము దొరకు
నట్టు నిట్టు చెదర నమరదు తత్త్వము, వి ...
కోర్కులను కుదించి పట్టి నిశ్చలమనస్కుఁడైఁగాని
తత్త్వము అమరఁ జాలదు

ఆ. మరములోనియోగి మాయ లన్నియు గోసి
ఘటములోన నున్నఘనుని దెలిసి
మాటమాటకు గురు మఱువక తెలుపురా, వి.
స్పష్టము

ఆ. మంత్ర మొకటి చెప్పి మఱి దేవతార్చనఁ
జేసి కరుణ తమకు జెందినదని
వేదపరనఁ జేసి వెఱ్ఱులై పోదురు, వి.... 1693
మంత్రముల నుచ్చరించి దేవతలఁ బూజించి తాము

కరుణాకర మైతి మనుకొని మనుజులు వెట్టినారై పోయెదరే
కాని కరుణాకరుమాత్రము నిక్కముగా కాఁజాలరు

ఆ. మతిని గానలేరు మఱి బ్రహ్మమూర్తిని
మదిని గన్నవారు మహిని లేరు
వెదకి తనువులోన వేడ్కతో నెఱిఁగిన
యతఁడె యోగివర్యుఁ డండ్రు వేమ. 1694

మాటలే గాని మదిలో నున్న బ్రహ్మము నెఱుఁగ
లేరు ఎవ్వరైనను తనశరీరమును శోధించి యందలి ఈశ్వరు
నెఱుంగఁ గల్గిరేని వారే యోగివర్యు లనఁదగుదురు

ఆ మదమునలనఁ గలుగుమాటల మఱి బల్కి
ముచ్చుబుద్ధులనొగి మోసపుచ్చి
కానుగాఁ బెనఁగెడు కిష్టుండు గురుఁడగు, వి....

మదజనితములగు మాటలతో దొంగవేషమువైచి ధనము
గుంజుకొనెడివాఁడు గురుఁడు కాఁజాలఁడు

ఆ. మదిఁ గలిగినపూజ మదనారి మెచ్చును
మనసు నిల్పినంత మహితుఁ డగును
మనసు లేనిపూజ మట్టిసమానము, వి.... 1696

మనస్ఫూర్తము గలిగిన పూజ యైనచో ఈశ్వరుఁడు
సంతసించి జనుని తరింపఁజేయును; కాని అట్లు గాదేని
ఆపూజ నిరర్థక మగును

ఆ. మనసులోనఁ బుట్టు మదికోర్కు లన్నియుఁ
గోర్కులందు ముక్తి కుదుగుపడదు

మనము బ్రహ్మమనుచు మదినెఱుంగఁగ లేరు,వి.

మనస్సులోనికోర్కెల నన్నింటిని రూపుమాపినఁగాని కుదుటపడఁ జాలదు అట్లైన గాని మనస్సు బ్రహ్మము నొందఁ జాలదు

ఆ. మనసునందు ముక్తి మఱియెఱుంగఁగ లేక
మనసుచేతఁదగిలి మాయ మైరి
మనసు తానయైన మర్మజ్ఞుఁ డగుయోగి, వి....

మనస్సులో నున్నముక్తి నెఱుంగఁగా లేక మనుజు లనేకులు మరణించిరి కావున మనసులోనిమర్మము నెఱుంగ వలయును.

ఆ. మనసులోనివాని మనసులోనె కలిసి
మనసులోనివాని మగ్నమంది
మనసుఁ దెలియువాఁడు మర్మజ్ఞుఁడై యుండు, వి.

మనసులో నున్నవానిని మనస్సులోనే కలిసికొని తన్మయుఁడై తత్త్వము నెఱింగినవాఁడే బ్రహ్మము నొందఁగలుగును

ఆ. మనసులోనె పుట్టె మాయసంసారము
మనసు విఱిగె నేని మాయతొలఁగు
మనసు నిల్పెనేని మహి దానె బ్రహ్మము, వి.

సంసారము మనోజన్యము మనస్సు విఱిగిన సంసారమూ విఱుగును కావున మనస్సును నిలుపుటయే బ్రహ్మ మనఁ బడును.

ఆ మన్నుకుప్పఁ జేసి మంటిలో గోరాడి
మంటికుండ నంటి మఱిగి తిఱిగి
మన్ను మింటఁ గలియమఱియెందుఁబోయెనో, వి.
స్పష్టము

క. మని యుండెడిజగ మెల్లను
చనిపోయినవారిపుణ్య సత్కథ లెలమి
న్వినవలె మనవలె చనవలె
ననిమిషులకు నైన తెలియ దంత్యము వేమా!.

బ్రదికియున్నవారల్లను భుక్తిభుక్తులకు మూలములగు. గతించినవారిచరిత్రములను వినవలయును చదువవలయును. అరీతిగా నడచికొనవలయును

ఆ మనసు వాక్కుకర్మ మఱియేమి లేకయె
రాకపోక లేని రాజవీధి
పరఁగ హాని కలదె పరతత్త్వయోగికి, వి....

మనోవాక్కాయములకు అందక ప్రవృత్తి నివృత్తికూన్యుఁడగుపరాత్మునితో నైక్యము నొందిన యోగికి నాశము లేదు.

క మనసే మాయామృగమా
మన సేమిటి పైకిఁ గాని మఱిపోనీకా
మనసున మనసును జంపిన
మనసందే ముక్తి గలదు మహిలో వేమా!.

ముక్తికిఁ గాని సంసారాసక్తికిఁ గాని మనస్సే మొదటి కారణ మగుచున్నది

ఆ. మన్ను పాఱఁ బట్ట మన కేమిలాభము
ధాన్యమట్లు చేయఁదగును గాని
ఘనునిలోప మెల్ల గారాదు విడువుము, వి....

ధాన్యమును పాఱఁబట్టిన లాభము గాని మన్ను పాఱఁ బట్టిన లేదు గదా! అట్లే గొప్పవానిలోపముల నెన్నకూడదు.

ఆ. మన్ను మిన్నునంటి మహిమీఁద నొకకోట
కొమ్ము లమరియుండుకొనలు మిగిలి
దివ్వె లేనివెలుగు తేజరిల్లుచు నుండు, వి....

పృథివ్యాకాశముల నిండి మహదాకృతితో సమస్త వస్తుగతమై బ్రహ్మము ప్రకాశించుచున్నది

క. మాటల మాటలు వచ్చును
మాటలనే కలుగుచుండు మఃశిమంత్రంబుల్
మాటలపొందిక తెలిసిన
మాటలనే ముక్తికలుగు మహిలో వేమా!.

మాటలలోనే సమస్తము నిమిడియున్నది కావున మాటపొందిక తెలిసినచో ముక్తియును సులభ మగును

ఆ. మాదిగ యనఁగనె మఱి తక్కువందురు
మాదిగయిల సురల మామగాదె
మాదిగకును బిడ్డ మనయరుంధతి గదా, వి....

స్పష్టము.

ఆ. మాయ నఱక మనుచు మాయ రోయక సాటి
సమముగ నరదేవ సభలయందు

నందఱు ఘనులైన హరునకు దా వేది, వి....

మాయ నరక మనియును మాయయందే జనులు మగ్నులై పోవుచున్నారు అట్లు వారు కానిచో నందఱును ఈశ్వరమయులే యైనచో నీళ చోటుండునా?

ఆ. మొదమునను గురుముఖ్యులకరుణచేఁ
దొమ్మిదిస్థలముల దొడ్డువాయు
సర్వజీవుఁ డాయె సర్వంబు తా నాయె, వి....

సంతసముతో గురువుల ననుగ్రహమును సంపాదించి నవరంధ్రయుతమగు నీశరీరబంధమును వదల్చుకొనఁగలిగినచో సర్వమయత్వము నొందఁగలుగును

ఆ. మోహజలధిలోన మునిఁగి చచ్చుటె కాని
హరిపరాయణత్వ మమరఁబోదు
ముట్టిగురుని పాద మూలము నొందుము, వి

ఎన్నిదినములు శ్రమపడినను మోహమున మునిఁగి చచ్చుటే కాని హరిపరాయణత్వము కలుగఁజాలదు

ఆ మోహమనెడి బుద్ధి మూలంబు నెఱిఁగి తా
మోహరించి గురునిమోముఁ జూచి
మోహమందు ముక్తి ముక్కును నిక్కము, వి.

మోహమనెడిబుద్ధిమూలమును కనిపెట్టి గురుని సేవించి ముక్తినొందుటకై ప్రయత్నింపుము.

ఆ. యోనియందు బుట్టి యుత్తమకులజుఁడై
బ్రహ్మకులమునందు బ్రదుకుచుండ్రు
బ్రహ్మ నెఱుఁగలేక పడి చత్తురిదె వింత, వి.

యోనిజనితజీవులే తాము యోగ్యులను సర్వోత్తములని బ్రాహ్మణులమని చెప్పికొనుచు బ్రదుకుదురు ఎంత వింత!

ఆ. రద్దిమాని మనసు రాపాడి ధ్వనిఁ జూపి
ముద్దుగులుకునాత్మ మూల మంది
సద్దు సేయకున్న సంసారి యోగియా, వి....

లేనిపోనియార్భాటములఁ జేయక మనస్సును చిక్కబట్టి యాత్మమూలమునఁ బాదు సేసి కేవలానందమును పొందవలయును

ఆ. రాకపోక లుడచు రాజమార్గముఁ బూని
నాక మనెడిగుర్తు వీక నెఱిఁగి
పోకి బయలు మించ సూత్రంబు గాదొకో?, వి.

మనోవినిర్గమప్రవేశములను గుర్తించి చిత్స్థానమునందు నెలకొల్పి ధ్యానించుట బ్రహ్మసాక్షాత్కారమునకు తగిన సూత్రము

ఆ. రాకపోక లేని రాజమార్గములోన
నేకరూపు దలఁచి యెన్ను టరుదు
పోకి పోకి మాయ పొక్కించు టరుదురా, వి.

ప్రవృత్తినివృత్తిరహితమైనపద్ధతిని భగవంతుని ఏకరూపుగా ధ్యానించుచు మాయకు లోఁబడక మెలంగవలయును.

ఆ. రాజయోగమూని తేజమందుట ముక్తి
తేజ మందకున్న దేబెలె కద
మర్మ మంత లేక మహిఁ గురుఁ జూడుము, వి.

రాజయోగము నవలంబించియును తేజము నందఁజాలక యున్నచో నట్టి తెలివిలేనివారలు గనుక గురువుల నాశ్రయించి ముక్తుఁడవు గమ్ము

ఆ. రాజయోగమునను రాజత్వమును బొంది
రాజరాజు దొడ్డరాజనంగ
రాజయోగముననె రాజశేఖరుఁ డాయె, వి....

రాజయోగము నాశ్రయించుటచేతనే రాజరాజుచక్రవర్తి యయ్యెను రాజయోగమున నీశ్వరుఁడు రాజశేఖరుఁ డయ్యెను

ఆ రాజసంబుచేత రాజ్యభారం బందు
నోర్పులేనియాతఁ డుభయతఁ జెడు
నీటిపైన గుండు నిలుచునా మునుఁగక, వి....

రాజసమువలన రాజ్యమును పాలించుపట్టుల నోర్పు లేనివాఁ డెందుకును గొరగాక యుభయత్ర చెడిపోవును

ఆ. రాజసంబు జెంది రమణులపొందాస
పడెడువాఁడు గురుని ప్రాపెఱుఁగునె!
విటులమరుగుయువతి విభుభక్తియెఱుఁగునా, వి.

రాజస్థభావముతో స్త్రీలపై నాసపడుచు తిరుగువానికి గురుభక్తి కుదుఱ నేఱదు

ఆ. రూఢిగాను భక్తి రూపించి చెప్పిన
వాఁడె పరమగురుఁడు వసుధలోన
వేఁడి పరము గనుటె వేదాంతవేద్యము, వి....

భక్తిని నిరూఢిగా తెలియఁ జెప్పువాఁడే యుత్తమో త్తముఁడగు గురువు కావున నాగురువును బ్రార్థించి ముక్తుఁడ వగుము

ఆ. రూఢి మదిని మించి రోదవినఁ జాలక
కాఁడు జేర నేమి ఘనము గలుగు
పీటిలోన రవము విస్నంద వినుచుందు, వి....

మనస్సును మించి శబ్దమును కనిపెట్టఁజాలక శ్మశాన ములో తిరుగాడుచున్నంతమాత్రాన నేమియు నాధిక్య మల వడదు

ఆ. లజ్జలజ్జ యనుచు లలనల మీఁదికి
లజ్జ విడిచి తిరుగు లావరియయి
లజ్జ తెలిసె నేని లలనలఁ దాఁకునా, వి....1723

లజ్జ యని పలుకుచునే స్త్రీలఁ గోరి పైఁబడుచుందురు. ఎంతటిమూర్ఖులు నిజముగా లజ్జగలవా రిట్లు చేయుదురా ?

ఆ రోగియైనవాఁడె రోగి నెఱుంగును
రోగి నరసి చూచి రూఢిగాను
రోగి కిడినవాని రాగి బంగారమౌ, వి.... 1724

రోగియే రోగి నెఱుంగును కావున నెందును సమాను‌ఁడే సమానుని కనిపెట్టఁజాలును

ఆ. లేఁదులేఁడనినను లేఁడు లేనే లేఁడు
కాఁడు కాఁ డటన్న గానెగాఁడు
తోడుతో డనినను దోడనే తోడగు, వి....

దైవము మనుజుల మనోధర్మము ననుసరించి లేఁడన్న వానికి లేకయుఁ గాఁడనినవానికి గాకయుఁ దోఁడనినవానికిఁ దోడ్పడియుఁ వచ్చుచుండును.

ఆ. లోకమందుఁ బుట్టి లోకమందె పెఱిగి
లోకవిభవ మోర్వలేక జనుఁడు
లోకమందు జవికి లోఁబడి చెడిపోవు, వి....

లోకములోఁ బుట్టి అందే పెరిగి యిచ్చట వారిసంపదల నోర్వఁజాలక విషయాసక్తులై చెడిపోవుచుందురు.

ఆ. లోకములకు గురువు లోకులకును గురు
వదియుఁ దెలిసి మోక్షమందఁ గోరి
గురుని గనక నరకకూపముఁ జెందును, వి....

లోకములకును లోకులకును గురువే మూలాధారము. అట్టిగురుని ఆశ్రయింపనివాఁడు అధోగతిపాలగును

ఆ. లోను జూచినతఁడు లోకంబు లెఱుగును
బయలఁ జూచినతఁడు పరమయోగి
తన్నుఁ జూచినతఁడు తానౌను సర్వము, వి

అంతస్సును కనిపెట్టినవాఁడు అఖిలమును కనిపెట్టఁజాలును కావునఁ దన్నుదా నెఱుగఁ బ్రయత్నింపుము.

ఆ. వట్టిమమతఁ జిక్కి వావివరుస లంచు
దిక్కుపట్టి నరుఁడు తిరుగుఁ గాని
యెక్కుడితలిదండ్రు లేమియుఁ దన కేల, వి.

నిరర్థకమగు మమత్వమునకు లోఁబడి వావులని వరుస

అని నరుఁడు తిక్కపట్టి తిరుగుచుండునే కాని తలిదండ్రుల
తత్వము నరయ జాలఁడు.

ఆ. పక్షమందు గురుని వర్ణించి చూడరా
రక్షకత్వమునకు రాచబాట
అక్షమాల జపమె యనని దొంగలరీతి, వి....

హృదయస్థితుఁడగు దైవమును గుర్తించి తదక్షరత్వ
మును ధ్యానించి ముక్తుఁడ వగుము

ఆ వాక్కుశుద్ధి లేక వైపగుదండాలు
ప్రేమ గలిగినట్లు పెట్టనేల
నొసల భక్తి గలదు నోరుతో డేలయా, వి ...

వాక్శుద్ధియనునది ఇసుమంతయును లేక దొంగదండ
ములఁ బెట్టుచు లోకముల వంచించువారిని చేరఁబోకుము

ఆ. వాక్కువలనఁ గలుగు వరముగు మోక్షంబు
వాక్కువలనఁ గలుగు నరలు ఘనత
వాక్కువలనఁ గలుగు నెక్కుడైశ్వర్యముల్, వి.

మాటవలననే మోక్షము ఘనత యైశ్వర్యము మున్నగు
నవి యన్నియును గలుగును

ఆ. వాక్కునందు గురువు వక్త్రతను గురువు
చీకటినటు గురుఁడు చిక్కియుండు
అఖిలమునకు గురువె యాధారమై యుండు, వి.

వాక్కులకు వక్త్రత్వమునకు అంధకారమునకు దానిని
పోగొట్టుటకు ఇంతయేల సమస్తమునకు గురువే మూలాధార
మని నమ్ముము.

# ప్రపంచస్వభావ పద్ధతి.

---

ఆ అండములను బుట్టునలరు ప్రాణులు కొన్ని
బుద్బుదములఁ బుట్టు పురుగులెల్ల
స్వేదములను బుట్టు జీవులు కొన్నిరా, వి....

ప్రపంచమునందలి ప్రాణులు అండజము అని స్వేదజము అని బుద్బుదజము అని యనేకవిధములుగా నున్నవి

ఆ. అందెయింద్రజాల మయ్యె లోకంబులై
మించె నొకటికొకటి మింటియందు
తన్నుఁ దాన జూడ తలపులు మఱచెను, వి....

ఇట్టి యీప్రపంచమునందె మాయ పుట్టి యద్దానియందు ఒకటి నొకటి మించియుండును

ఆ. అన్నిజాతులకును నాధారమైనట్టు
లున్నసాన గాది మన్నె ఋషుల
నెన్నిజన్మములను నెక్కడ గానము, వి.... 1742

సమస్తమునకు నాధారమైయుందు రని వినునట్టి సానగాదిఋషిగణము ఎచ్చటఁ జూచినను కానఁజాలము

క. అరిషడ్వర్గంబులచే
నరు లెల్లను జిక్కి సొక్కి నైజము విడకే

యరుగుదురు గాక యెఱుఁగక
మఱుగైనది బ్రహ్మమనుచు మహిలో వేమా!.
అరిషడ్వర్గమువలన మనుజులు మత్తిలి యభిమానము వహించెదరే గాని బ్రహ్మము నెఱుఁగ లేరు.

ఆ. అరుణు నుదయసంఖ్య న స్తమానపు సంఖ్య
జననమరణసంఖ్య జాతిసంఖ్య
దీని నెఱిఁగి యోగి ధీరుఁడై యుండును,వి....
సూర్యోదయ సూర్యాస్తమయాదులు పెక్కులగుటఁ గని దేహ మనిత్య మని ధీరత వహింపవలయును

ఆ. అలివంకవార లాత్మబంధువు లైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాదు లైరయా, వి ...
సులభము

ఆ. అలివంచలేక యధమత నొందుచు
వెనుక నుంటినేనుట వెఱ్ఱితనము
చెట్టుముదురు నేని చిదిమిన బోవునా?,వి....1746
భార్యను స్వాధీనముఁ జేసికొనఁజాలక వెనుకఁబడుట తెలివితక్కువ యగును గావున తొలుతనుండియే యత్నింపవలయును.

ఆ. అలు రంభయైన నతిశీలవతి యైన
జారపురుషుఁ డేల జాడ మాను
మాలవాఁడ కుక్క మఱిఁగిన విడుచునా, వి....

స్త్రీ లెంతటిగుణవతు లైనను ఏమఱియుండరాదు.

౩ ఇచ్చి పుచ్చుకొన్న హితులును మనుములు
తగ్గు లేక యల్లుఁ దామరవలె
కాచి పూచి పండి కడు రమ్యమై యుండు, వి.

సంబంధబంధుత్యాగల నిచ్చి పుచ్చుకొన్నచో దామర తంపవలె నల్లుకొని రమ్యముగా నుండును.

ఆ. ఇలను శూద్రులౌట నెఱుఁగరు మొదలను
మనను సతనివిూద మరులుకొల్పి
కొల్వఁగారొ ద్విజులు కోటానుకోట్లుగా, వి....

పుట్టుకలో తాము శూద్రులౌట నెఱుంగరు; కాని మనస్సు నెల్లప్పుడును ద్విజత్వభావనఁ జేయుటచేత ద్విజు లగుచున్నారు

ఆ ఇల్లు కల్లఁ జేసి యిహము పరముఁ జేసి
దీనవృత్తిచేత దిరుగుచుండి
భక్తి కలిగియున్న ఫలమేల లేకుండు, వి....

ఇల్లు గుల్లఁజేసి వ్యర్థుఁడై దీనవృత్తితో తిఱుగుచు భక్తి లేక యున్నచో కొంచె మైనను ఫలము లేకుండును

ఆ. ఈకె లంటఁ జేసెఁ దోకలంటగ జేసె
గోక లంటఁజేసె లోకమునకు
మానరక్షణంబు మర్యాద యని తెల్ప, వి....

దేవుఁడు మనుష్యులకు మానసంరక్షణమే మర్యాద యని తెలుపుటకు తనసృష్టిలోనిజంతువులకు ఈకలు తోకలు కోకలు మున్నగువానిని సృజించెను.

క. ఈఘనసూత్ర మెఱుంగుము
నీఘటమున శివుఁడు జేరి యిరవుకొనంగా
నేఘటపటముల కందక
తా ఘనుఁడై యాడుచుండు తథ్యము వేమా!.

శరీరమునందే ఈశ్వరుఁడు నివసించి ఘటపటాది విషయగమ్యుఁడు గాక యున్నాఁడని యెఱుంగుము

క. ఈచెవిగోఁకగక నొల్లరు
వాచవులకు విందు మన్నవాక్యంబులచే
పూచను బడుచులు వెఱచెను
ఆచందము లాయె జగము లన్నియు వేమా!.

ఉపదేశవాక్యములను వినక యుపనిషత్సారమును గ్రోల గోరి వ్యర్థు లగుచున్నారు

క. ఈతనువునందుఁ జూచిన
నేతనువుల కింతె యనుచు నెదిరిసి దన్నుం
జూతురు లోఁగాఁ జూపున
నాతురముగఁ దపసు లెల్ల నమరఁగ వేమా!.

సమస్తమును ఆత్మశరీరసాదృశ్యమునఁ బరికించుచు దన్ను నెదుటిని జూచుటయే తపస్విజనులకు లక్షణము

ఆ. ఉత్తమోత్తముఁడగు నుర్వి తత్త్వజ్ఞుఁడు
మహిమజూపువాఁడు మధ్యముండు
వేషధారి యుదరపోషకుఁ డధముండు, వి....

తత్త్వము తెలిసినవాఁ డుత్తముఁ డనియును మహిమఁ

ప్రదర్శించెడివాఁడు మధ్యముఁ డనియును దాంభికుఁ డధముఁ డనియు నెఱుంగుము

ఆ. ఉదకమందు మొసలి యుబ్బి యేనుఁగుఁ బట్టు
మతక మే మొబయుల మొసలబోదు
ఎఱుక నుఱుగుఁ దెలిసి యేకమై యట్లుండు, వి.

నీటిలో మొసలి ఏనుఁగును పట్టి కదలనీయని యట్టులే విజ్ఞానమువలన మనస్సును బట్టి మఱగనీయక యైక్యము నొందింపవలయును

ఆ. అనయ మీసు బాపి యనలంబుఁ జల్లార్చి
గోఁచి బిగియఁగట్టి గోపమడఁచి
ఆస విడచెనేని సతీఁడు దా యోగియా, వి....

ఈర్ష్య కాము క్రోధము మున్నగువానిని విడచువాఁ డుందఱకంటె నుత్తముఁడు

ఆ. అన్నము తినువేళ నాత్మ రుచుల గోరు
మదియు నాల్క సెప్ప నడుగుచుండు
ఆత్మకు తృణమైన నయ్యరో యనరాదు, వి.

భోగముల ననుభవించు కొలఁదిని సంతృప్తి కలుగక ఆశయే పెరుగుచుండును కనుక ఆత్మకై (మనస్సుకై) దయపడరాదు

ఆ. ఆశకన్న దుఃఖ మతిశయింపఁగ లేదు
చూపు నిలుపకున్నసుఖము లేదు
మనసు నిలుపకున్న మఱి ముక్తి లేదయా, వి.

ఆశకంటె దుఃఖమును నిశ్చలత్వముకంటె సుఖమును మనస్థిమితముకంటె ముక్తియును వేఱుగా లేదు

ఆ. ఆశగననివాని నాశ్రయింపఁగ రాదు
ఆశ దీర్చువాని నడుగవలయు
ఆశ గలుగునంత కములుండు గాఁడయా, వి....

ఆదర మీయనివాని నాశ్రయింపక ఆదర మిచ్చి కోర్కెఁ దీర్చువానిని అడుగవలయును

ఆ ఆశ గోసివేసి యనలంబు చల్లార్చి
గోఁచి బిగియఁగట్టి కోప మడఁచి
యాస విడుచువాఁడు నగు నిల యోగిగా, వి.

విషయములపై గలయభిలాషను పో నడంచి కోపము మున్నగువానిని రూపు మాపి నిరీహుఁడై యుండువాఁ డుత్తమయోగి యగును

ఆ ఆశచేత ధనము నార్జింపఁగా నేల
మట్టి క్రిందఁ బెట్టి మఱవ నేల
ధనము పోవువెనుక ధర్మంబు తలఁతురు, వి....

ఆశతో ధనముఁ గూడబెట్టి మట్టిలో పాతి ఏల మఱువవలయును కావున నాశయే పరిత్యజింపఁదగినది

ఆ ఆశచేత మనుజు లాయువు గలనాళ్లు
దిరుగుచుంద్రు భ్రమలఁ ద్రిప్ప లేక
ముఱికిభాండమందు ముసరు నీఁగలభంగి, వి.

విషయాభిలాష చేత బ్రదికినన్నినాళ్లును మనుజులు ముఱికికుండపై నీఁగలు ముసరిన ట్లుందురు

క ఆశను విడువనిజీవికి
క్లేశము విడిపింప దరమె కేశవునకు నా
యాశాపాశము లెల్లను
రోసిన క్లేశంబు విడుచు రూఢిగ వేమా!. 1764

ఆశను త్యజింపనివానికి కేశవునంతవాని కైనఁ గాని ముక్తి దుర్లభ మనియును విడిచినచో క్లేశములు వదలు ననియును భావము

ఆ. ఆశపాపజాతి యన్నిటికంటె నా
యాసచేత యతులు మోసపోరె
చూచి విడుచువారు శుద్ధాత్ము లెందైన, వి....

అన్నింటికంటెను ఆశయే పాపజాతి కావున సదా మోసపోక తత్త్వము నెఱింగి త్యజించువారు ధర్మాత్ము లనఁ దగుదురు

ఆ ఆశపాశము మొదలంటగా దెగఁగోసి
పారవేయకున్న ఫలము గలదె
కొక్కుబోనులోనఁ జిక్కినచందము, వి.... 1766

ఆశ యొకపాశము (బంధము) వంటిది కాన దానిని మొదలంట కోసివేయనంతవఱకు బోనులోని పందికొక్కునకువలె విముక్తి కలుగఁజాలదు

ఆ. ఆశపాశ మెల్లఁ గోసి వేసినవాని
చిత్త మెపుడు గురుని చేరియుండు
మోహపాశ మున్నమోక్ష మెక్కడిదయా?, వి.

ఆశాపాశమును ఛేదించి గురుసేవ చేయుచుండుము అట్లుగాక మోహమునఁ బడితివా ఇఁక మీఁద మోక్షమే నీకు దుర్లభ మగును

ఆ. ఆశ యనెడి త్రాట నఖిలజంతువు లెల్ల
కట్టువడెను గాని నిట్టలమున
జ్ఞాన మనెడి చురియఁ బూని కోయఁగనైతి, వి.

ఆశాపాశముచేత సమస్తజంతువులును బద్ధములై యుం డుటను పరికించియు జ్ఞానమును కత్తితో కోయలేక పోయితిఁ గదా!

ఆ. ఆశయనెడి దాని కోసి వేయఁగ లేక
మోసబుద్ధివలన మునుఁగువారు
కాశివాసులైనఁ గనఁబోరు మోక్షము, వి....

ఆశాపాశమును వదల్చుకొనఁజాలక మోసపోయియుం డెడివారు కాశికి పోయినను ముక్తినొందఁజాలరు

క. ఆశయె యిహపరసౌఖ్యవి
నాశము భవబంధములకు నయముగ తానే
యీశుని గనుఁగొన నీయదు
ఆశవినాశంబె పరమదవనిని వేమా! 1770

ఇహపరసౌఖ్యములను వమ్ముచేయును భవబంధముల గల్పించును నశింపచేయును కావున ఆశ మంచిది కాదు.

ఆ. ఆశలనెడి త్రాళ్ల నఖిలజనంబులు
కట్టుపడుచు ముక్తి గానరైరి

జ్ఞానఖడ్గమునను ఖండింపరాదొకో, వి.... 1771

జనులు మూర్ఖులు కాకపోయినచో తెలిసియు ఆశా పాశములను జ్ఞానఖడ్గముచేత నేల తెగవ్రేయక యుందురు.

ఆ. ఆశ లుడుగఁ గాని పాపముక్తుఁడు గాఁడు
ముక్తుఁడైనఁగాని మునియు గాఁడు
మునియు నైనఁగాని మోహంబులుడుగవు, వి.

ఆశ లుడిగినఁ గాని పాపవిముక్తుఁడు కాఁడు. ముక్తుఁడైనఁగాని మోహాదులు నశింపవు

ఆ. ఆస పాపజాతి యైహికంబుల నెల్ల
ఆసచేత నెవరు మోసపోరు
చూచి విడుచువారు శుద్ధాత్ములనిని, వి....

పాపజాతిలో మేటియైనది యాశ దీనిని పరికించి విడిచి పెట్టెడివారే యుత్తములు

ఆ ఇంత వగవ నేల యేకాంతబుద్ధిని
హరిహరాదులందు నాసలుడిగి
వాసన దెలిసినవాఁడెపో బ్రహ్మము, వి ....1774

పెక్కువిధములఁ బరితపించుటకంటె హరిహరాదిభేద బుద్ధిని ఆశను పరిత్యజించి వాసనాతత్త్వమును కనిపెట్టినచో ముక్తుఁడు కాఁగలఁడు

ఆ ఇంద్రపదవి గోరి యింపుగా యజ్ఞముల్
కలిమిచేతఁ జేసి కాములైరి
పరమయోగ మూని పట్టఁగలేమిని, వి.... 1775

యోగమును పట్టఁజాలక కొందఱు ఇంద్రపదవిని గోరి యజ్ఞములను చేసి కాముకులై పోవుచున్నారు

క. ఇది నాకుఁ జాల దనుచును
మదిలో దా నెప్పుడు దలఁచి మమతగను మతిం
పొదలుచు విడువం జాలని
దదియే సంసారబీజ మనఁబడు వేమా! 1776

ఉన్నంతతో తృప్తిఁబొందవలయును అట్లు గాక ఎంత ఇచ్చినను చాలదు చాలదు అని అసంతృప్తితో నుండుటయే సంసారమునకు మూలకారణము —

ఆ. ఇదియె పరమటంచు మదికి దోచిన జాలు
మనసు చెదరుకోర్కె మట్టుపఱచి
సుధను గ్రోలువాఁడు సుడిఁబడి చచ్చునా, వి.

తా ననుభవించునదియే యుత్తమ మనుకొని మనస్సును చెదరిపోనీక ఆత్మబోధామృతమును గ్రోలువాఁడు ఎప్పటికిని మృతుఁడు గానేరఁడు

ఆ ఎక్కుడైన యాశ లినుమడియై యుండఁ
దిక్కుపట్టి నరుఁడు తిరుగుచుండు
కుక్కవంటియాస గూర్చుండ నీయదు, వి....

ఆశలు మనుజుని పిశాచములవలె చుట్టుకొని త్రిప్పుచు న్నందున నరుఁ డిట్లు భ్రాంతుఁ డగుచున్నాఁడు

ఆ. ఎక్కువయును దక్కు వెటువంటివారికి
తనువు సతముగాదు తథ్య మఱియు

నెఱిఁగితిరుగ లేరికేమనవచ్చును, వి.... 1779

ఘనత్వాల్పత్వములు ఎంతవారికైనను గలవు కావున అందులకై విచారింపరాదు

క. కన్నుల నవలోకింపఁగ
జన్నులపై దృష్టిపాఱు సహజం బిలలో
కన్నులకింపగుదృష్టిని
తన్నెఱుఁగుట ముక్తికిరవు తగునిది వేమా! 1780

కన్నులఁ జూచినంత మాత్రానఁ జన్నులపై దృష్టి తగులును

ఆ. కమలభవుఁడు సేయుఁ గడుసృష్టి యందును
హరిభరించు చంపుహరుఁడటంద్రు
మూర్తు లిందఱైన మూల మొక్కటియెరా, వి.

బ్రహ్మ సృజించు ననియును హరి పోషించు ననియును హరుఁడు నశింపఁజేయుననియు నందురు; కాని విచారించిన చో నీముగ్గురు నొక్కరే యని యెఱుంగఁగలవు

ఆ. చలిది నారగించి కన్నులు ముకుళించి
బిఱ్ఱబిగిసి యుండు బీదయోగి
మేఁకపోతువలెను మెఱమెచ్చులకు నయి, వి....

చలిదిఅన్నముఁ దిని కన్నులు మూసికొని మేఁకపోతు వలె బిగిసికొని మెఱమెచ్చులకై యోగుల మని కొంద ఱవి వేకులు కూర్చొని యుందురు

ఆ. కలిగినట్లులుండు కలుగక యుండును
మఱియు లేక యుండు మఱియుఁ గలుగు
నాశకోలఁదిని శిష్యుఁ డందించుచుండును, వి....

పోషణ లేనివానికాపురము నిరర్థకము

ఆ. కాసి మధుర కంచి గయప్రయాగలు సేతు
వాసతోడ వీనివసతి తెలిసి
వాసన నెఱుఁగక వట్టి వెట్టివిధంబు, వి....1786

వాసనను గమనింపక కాశి కని గయప్రయాగాదుల కని తిరుగుట వ్యర్థము

ఆ. కాశియాత్రఁ జేసి గాసిపడుటె కాని
మోస మగును దాన ముక్తిలేదు
పాశముడుగఁ బూన ఫలమె యా కాశియా, వి.

కాశియాత్ర కనిపోయి కష్టములపాలగుటయే కాని అందునఁ గొంచె మైనను ముక్తి లేదు

ఆ. కుక్కయే మెఱుఁగును గురులింగదేవర
నక్కపో తెలుఁగునె యొక్కప్రొద్దు
మొక్కఁడీడికెపుడు మోతు మందఁగ నౌనొ,వి.

నీచులు అధికుల నెఱుంగఁజాలరు కుక్క గురుదేవర నెఱుంగునా? నక్కకు ఒక్కప్రొద్దు తెలియునా?

ఆ. కోమటికి దురాశ కొండలు వాములు
చందనంబు సోన చంద్రకళలు
ఆశకు మితి లే దికక్కడ గతి లేదు, వి....1789

కోమటి ఆశకు మితి లేదు ఆశకు తగినయర్థము యుండదు కావున ఆశ నిరర్థకము

ఆ. కోమటి నిష్ఠలు గుఱికిరా వెన్నడు
లోభిగుణముచూడ రూఢియగును
బలిని దాసరి కిడఁ బాలుపడ నగునొకో, వి....

కోమటిచేష్టలు (ఇచ్చకపుపనులు) ఎప్పటికి సఫలములు కానేఱవు; కాని లోభము మాత్రము ప్రకట మగును

ఆ. చిత్తమనెడివేరు శిథిలమైనప్పుడే
ప్రకృతి యనెడిచెట్టుపడును పిదపఁ

గోర్కులనెడి పెద్దకొమ్మ లెందునుగదా!, వి.

మనోమూలము శిథిలత నొందినవెంటనే మాయావృక్షము కూలును మొదలుకూలిన పిమ్మట ఆశాశాఖలు ఎట్లు నిలువఁగలవు ?

తే. చిత్తవృత్తులు మదియందుఁ జేరనీక
రిత్తబయలున గుఱి మించి రేయి బవలు
మత్తుఁడై యుండువాఁడెపో మాన్యుఁ డరయ
నత్తెఁ దెలిసియె దరిజేర సరవి వేమ. 1792

వికల్పములను మనస్సులోనఁ బుట్టనీయక చిత్స్వరూపమును ధ్యానించుచుండువాఁడే యుత్తముఁడగుయోగి యని యెఱుంగుము

క. చక్కెర గలిపి తినంగా
ముక్కినతవుఁ డైన లెస్స మోహము గదుర
న్వెక్కుడు దాసిసయైన
న్మక్కువగను దివ్యభామ మహిలో వేమా !

చక్కెర గలిపినచో ముక్క తవుడును ప్రియమైన యట్లే మోహముఁగలిగెనేని దాసీదియును దివ్యభామవలె కాన్పించును

ఆ. చదువులందు రాజపదవులందును పాడి
మొదవులందు స్త్రీలపెదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు ముక్తులు, వి....

చదువు లుద్యోగములు సంపదలు మున్నగువానిపై నభిలాష లేనివారే నిక్కమగు ముక్తులు అని తెలిసికొనుము.

క. చనువారెల్లను జనులం
జనిపోయిన వారిపుణ్యసత్కథలెల్లన్
వినవలెఁ గనవలె మనవలె
ననిమిషులకుఁ దెలుపఁగూడ దంత్యము వేమా!

చనిపోయిన మహానుభావుల చరిత్రమును పఠనపాఠనాదులవలన సర్వదా ననుకరించుచు సాధారణులు ముక్తులగుటకై యత్నింపవలయును

ఆ. ఛురికతోడఁ గోయఁ జొప్పడునే గాని
దానిపిడిని గోయ తరమె నీకు
తెలివి లేక మేనిబల మేమి చేయును, వి....

కత్తితో కోయవచ్చునే గాని పిడితో వీలు లేదు ఇట్టులే జ్ఞానబలమున జయింపవచ్చునే గాని అదిలేని దేహబలముతో ప్రయోజనము ఇసుమంతయైనను లేదు

ఆ. జననమునకు మున్ను జననిగర్భములోన
మునుపు జేసినట్టి ముష్కరంబు
ననుభవించి యునికి నాశలు విడువరు, వి....

పుట్టుటకు ముందుగా తల్లిగర్భములో తానదివఱకు చేసినకర్మఫలమును పూర్ణముగా ననుభవించియును మఱల నాశలను త్యజింపరు గదా!

క. జన్మము నెత్తినమనుజుఁడు
చిన్మయపరిపూర్ణమహిమఁ జిత్తము నెఱుఁగన్
దన్మయత నొందనేర్చును
చిన్మయుఁ బరమేశు మదిని జేర్చును వేమా!

జనుఁడు చిత్స్వరూపపుమహిమను నెఱిఁగినచో కైవల్యము బొందఁజాలును

ఆ. జాతివార లెల్ల జాతివిద్యలు నేర్చి
జాణలైరి మీఱి జగతిలోన
బ్రాహ్మణులనువారు బ్రహ్మము నెఱుఁగరు, వి.

ఉత్తమజాతివార మనుకొనువారందఱును పలువిధములగు విద్యల నేర్చి గొప్పవార మనుకొందురే గాని బ్రహ్మము నెఱుఁగఁజాలరు

ఆ జిహ్వ రుచుల గోరు జీవించునంతకు
సతియుఁ బతియుఁ గోరు సుతులధనము
హవ్యవాహుఁడు చూడ నందఱఁ గోరును, వి.

జిహ్వారుచియును, సతి బతిని, సుతులు ధనమును, అగ్ని హవ్యమును గోరుచుందురు

ఆ. జిహ్వలంపటంబు జీవనంబై యుండు
జిహ్వలంపటంబె జీవపోష
జిహ్వచేత నరులు చీకాకుపడిరయా, వి....1801

జిహ్వాలంపటము పోఁగొట్టికొన నలవి గానిది గాననే నరులు అనేకవిధములగు కష్టములకు పాల్పడుచుందురు.

ఆ జీవము దెలిసినఁ జెలఁగి మది చలించు
దైవ మగుపడినను దగులు బుద్ధి
దీప్తభానుని గని తిమిరంబు నిలుచునా, వి....

జీవస్వరూపముఁ దెలిసినచో మనస్సు కుదుట పడును.

పిమ్మట దైవ మగుపడును సూర్యు నెదుటఁ బడుచీఁకటులవలె పిమ్మట బంధములు తొలఁగిచనును

క జీవాధారము నీరము
జీవాధారంబు గాలి చెలఁగుచు నుండున్
కావలసిన నవి యొక్కరి
యీవిని కోరకయె చిక్కు నిలలో వేమా!1803

పరమేశ్వరుని జీవదయాళుత్వము నేమని కొనియాడఁ గలము సమస్తజీవములకు నాధారములై నీరముఁను ఇతరాపేక్ష లేక చిక్కునట్లు చేసి యున్నాఁడుగదా!

క. ఎక్కడినుతు లెక్కడిసతు
లెక్కడి బంధువులు సఖులు నెక్కడిభృత్యుల్
డొక్కువడి పోవువేళఁ
జక్కటికిని నెవరురారు సహజము వేమా!.1804

సతీసుతులు మున్నగువా రందఱును బ్రతికినంతవఱకే కాని చచ్చిపోయినపిమ్మట వచ్చెడివారు కారు

ఆ ఏది కులము నీకు నేది స్థలంబురా
పాదుకొనుము మదిని పరమెఱిఁగి
యాదరించుదాని నవలీల ముట్టరా, వి ....1805

నీయంత నీవె నీకులస్థలాదులను గూర్చి చర్చించెదవేని విషయ వాసనపోయి వైరాగ్యము గలుగును. పిమ్మట నీశ్వరుని జేరఁ గలుగుదువు.

ఆ ఏమి కొంచు వచ్చె నేమి తాఁ గొనిపోవుఁ
బుట్టువేళ నరుఁడు గిట్టువేళ
ధనము లెచటి కేఁగు తా నేఁగు నెచటికి, వి.

మనుజుఁడు బ్రదికినన్నిదినములును లేనిపోని ఆశలచేతఁ దిరుగుచుండునే కాని పోయెడునాఁడు ఒక్కటియైనను వెంట రాఁబోదు.

ఆ. ఒక్కతనువున కిలఁ బెక్కుపాట్లను బడి
పెక్కుదినము లెల్ల ప్రేలి ప్రేలి
అగ్నిలోనఁ బడునొ యలనక్కపాలొనొ
తెలియుమయ్య యిఁకను దీని వేమ. 1807

ఈతుచ్ఛశరీరమునకై ఇన్నిపాట్లు పడి ఎన్నిదినములో నోటికొలఁది ప్రేలుచుందురు కాని దీనిని ఎప్పుడో యొకనాఁడు నిప్పువాతనో నక్కలవాతనో వేయుదురు

తే కచముఁ గక్ష్యంబు నోరును గనుఁలు మేను
నాభియును బాహుమూలంబు నాతి కెపుడు
నోర్వఁ దగనట్టిగాలుతో నొప్పుచుండు
నింతకే యేల నింతిపై భ్రాంతి వేమ. 1808

స్త్రీయని భ్రమయే కాని కచకుచాదులయందలి దుర్గంధమును కొంచెమైన ఏలనో విచారింపరు గదా!

తే. కండ లెముకలు నెత్తురు గలిగి తనువు
మూత్రమలములతో నుండు ముట్టరాక
కాయజుని బాణమం చాస గల్గఁ జెడును

ఆస బాపెడివిధమును నరయు వేమ	1809

నెత్తురు మలము మూత్రము మున్నగువానితో నిండిన ఈమురుగుగుంటను మన్మథబాణమని మూర్ఖుఁడై మనుజుఁడు మెచ్చుకొనుచుండును

ఆ. కడుపులోని మలము కఁపమవి యెముకల
కలదు మాంస మింత కప్పుతోలు
మలము నెత్తిమీఁద మానెట్టు కలుగురా, వి.

ఈశరీరములో నేమున్నది? మలము నెత్తురు ఎముకలు మాంసము పైని తోలు ఇట్టిదానికై జనులు ఎట్లు వలతురో కదా!

ఆ. కడుపులోనికోఁత కడు నోటియెంగిలి
కడుగ వశమె బ్రహ్మకొడుకునకును
సత్యమున్నఁ గొంత జగతిపై సిద్ధించు, వి....

నిజముఁ బరికించినచో కడుపులోను నోటిలోను నున్న మలమును కడిగి వేయఁజాలరు గదా! కావున వీరి శుద్ధతలోఁ గొంచెమైనను సత్యము లేదు

✓ఆ కన్నెదాని మేను కస్తూరివాసన
ముసలిదాని మేను ముఱికికంపు
వయసు దానిమేను వర్ణింప శక్యమా, వి....

మనుజులు విషయాసక్తులై కన్నెది కస్తూరివాసనయనియు ముసలిదానిమేను ముఱికికంపు అనియును చెప్పుచుందురు

క. కాలములమహిమ దెలియక
వాలాయము నిత్య మనుచు వరలుదు రింతే
యేలనొ కాలము దెలియరు
వాలాయము జాటుచుయ్యె వసుమతి వేమా!

కాలముయొక్క తత్త్వము గనిపెట్టఁ జాలక నిత్య మనుకొని దుర్విషయములఁ జిక్కి మూర్ఖులై నశించుచుందురు.

ఆ. కాలవశముఁ బట్టి కర్మజీవిగణంబు
మత్తులగుచు నుండి మఱచినారు
మత్తులైనజనుల మనసేటి మనసయా, వి....

కాలమునుబట్టి కర్మగణమును మత్తులై మెలఁగు చుందురు అట్టివారు ప్రశంస్యులు గారు

ఆ కాలిసంకెలయగు గరిమతోఁ దనభార్య
చేతివిఱిచి కట్లు శిశువులెల్ల
సరిపడచెఱసాల సంసారకూపంబు, వి ... 1815

భార్యాపుత్రాదులు సంకెలలును సంసారము చెఱసాల యునని తెలిసికొనుము

ఆ. కైపువస్తువులను గాంక్షించి సేవింప
కానిపను లొనర్చు మేలెఱుఁగక
అట్లుపూనువారి నధము లటందురు, వి....1816

మత్తువస్తువులను తినినచో నల్పవి గానిపనులను చేయఁ బూనుకొని యుందురు అట్టివారిని గౌరవింపరాదు

ఆ. జన్మముల నిఁకెన్ని జన్మంబు లెత్తును

కర్మధర్మములకు గణన యెంతో
కర్మధర్మములను కడ తేఱ లేరయా, వి.... 1817

ఎన్నిజన్మములనైనను నిట్టులు స్వకృతకర్మధర్మముల ఫలము లనుభవించుటకై పుట్టుచునే యుండవలయును గనుక కర్మవలన గడ తేఱఁజాలరు

ఆ. జన్మ నదలి వేరు జన్మంబు లెత్తంగ
కర్మధర్మములకు గణన గలదె
కర్మధర్మములను కడ తేఱవచ్చునా, వి .... 1818

స్పష్టము

క. ధన మెచ్చిన మద మెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధన ముడిగిన మద ముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా!.

ధనమువలన మదమును దాన దుర్గుణమునుకలుగును అది లేకున్నఁ గ్రమముగా మదమును దుర్గుణమును మానును

ఆ. ధర విరక్తితోడ తలఁపుల విడువమి
తనకు తగులు నట్లు తత్వ మరయఁ
దత్త్వ మరయఁ దాను దానగు బ్రహ్మంబు, వి

విరక్తుఁడైనను కామములను పరిత్యజింపనిచో తత్త్వము కలుగఁ జాలదు ఆతత్త్వమే యాత్మరూపమునఁ దేజరిల్లుచుండును.

క. నడజీవులు స్థావరములు
వడి చని పోవంగ నెఱిఁగి భావములోన

నివ్విడువక బ్రహ్మము దలపరు
వడి చని పోకుందు రేమొ వసుధను వేమా!.

స్థావరజంగములయు స్థిరతను మదిలో నుంచికొని యెల్ల ప్పుడును నవినాశమైన బ్రహ్మము నొందుటకై యత్నింపుము.

క. ధర గిరులు జలధు లన్నియు
బరికింపఁగ బ్రళయమునను భస్మములయ్యెన్
సురలును మునులును జనఁగా
నెఱయోధు లిటుండఁ గలరె నేర్పున వేమా!.

పర్వతములు సముద్రములు మున్నగుమహద్వస్తువులే ప్రళయకాలమున లయించు ననఁగా నిఁక తక్కిన మునుష్యాదుల గుఱించి చెప్పవలసినదేమి ?

క ధరఁబుట్టి భోగి నయితిని
బరమం దిచ్చనటు మాని పడతులకై నే
తిఱిగి యలసితిని ద్రవ్యము
మఱి యార్జించితని కడకు మరణమె వేమా!.

ప్రపంచమునం బుట్టి భోగవాంఛచేత పరమును విడనాడి ధనము నార్జించి నిష్ప్రయోజనముగా నలసిపోయితిని కదా!

క. భుక్తిని మిక్కిలి విషయా
సక్తత తా దిరుగుచుండు సత్రములందున్
భుక్తిని ముక్తి లభింపదు
భక్తిని జీవునకు ముక్తి భద్రము వేమా! 1824

తిండికని త్రిప్పల కని జనుఁడు సత్రములందుఁ బడి తిరుగునే గాని భుక్తియును లభింపదు ముక్తియును లభింప నేఱదు కాన ముముక్షుఁడ వగుటకు యత్నింపుము

క. భోగంబుల కాశింపక
రాగద్వేషంబు లుడిగి రంగుగదములో
వేగమె మోక్షపదంబును
రాఁగను నాతండు యోగి రాయుఁడు వేమా!.

భోగంబులను కోరక రాగద్వేషాదులను పరిత్యజించిన వాఁ డతిశీఘ్రకాలములో మోక్షము నొందఁగలవాఁ డగును.

ఆ భోగవాంఛ చేతఁ బోలుపేదో యెఱుఁగక
ద్రోహబుద్ధి నొరుల దూరుచుండు
సాహసించువాఁడు సర్వదాచెడునురా, వి....

భోగముల ననుభవింపవలయు ననునాసతో పరులకు ద్రోహము చేయవలయునని యత్నించువాఁడు తానే చెడి పోవును

తే ముక్కు గోరును సద్గంధములను నల్లి
చెవులు కర్ణంబు గన్నులు జిహ్వ మొదలు
ఇన్నియును గోరునటువంటి ఇల్లురోసి
తన్ను కనుగొని సుఖియింపఁదగును వేమ. 1827

ముక్కు చెవులు మున్నగున విన్నియును విషయములనే వాంఛించుచుండును కనుక వీనిని పరిత్యజించి ఆత్మను సందర్శించి సుఖింపుము.

ఆ. ముండమోపితోడ మునుగుచు తేలుచు
నుండఁగాని మోహ ముండెగాక
అండఁబాయు వెనుక నాయాశలే లేవు, వి....

ఆఁడుముండతో మునుఁగుచు తేలుచు నున్నంతవఱకును మోహము నశింపదు

ఆ. అతిథిరాకఁ జూచి యదలించి పడవైచి
కఠినచిత్తులగుచుఁ గానలేరు
కర్మమునకు ముందు ధర్మము గానరో, వి....

అతిథి వచ్చిన నదల్చి కఠినచిత్తు లగుదురే గాని ధర్మమర్మములను కని పెట్టఁ జాలరు

ఆ. ఊరునూరుదిరిగి యున్నది గన లేదు
మోరయెత్తి చూచి మొనయ లేరు
పాఱఁజూచు టదియె పరముగాఁ గాదొకొ, వి.

ఊరూరును తిరిగి వ్యర్థముగా బడలెదరే కాని పరము శిక్షించి కృతార్థులు కాఁజాలరు

క. ఎండిన మానొక టడవిని
నుండిన నం దగ్నిఁబుట్టి యూడ్చుచు చెట్లన్
దండి గలవంశ మెల్లను
చండాలుం డొకఁడు పుట్టి చదుపును వేమా!.

స్పష్టము

ఆ. జౌ ననంగ వచ్చు నైనది కానిది
యున్యఁ డెదుట నుండి యడుగఁడేని

నిలిచి యడుగువాఁడు కలిగిన నిలువఁడు, వి....

ఎదుట నెవ్వఁడైనను ఆక్షేపించువాఁడు లేక యుండు వంతవఱకును అయినదానిని కానిదానిని కూడ ఎదురు తిరిగి వాదింపవచ్చును

ఆ. కట్టుబట్టఁ జూచి ఘనతఁ జెప్పఁగరాదు
కానరాదు లోనిఘనత లెల్ల
జంగమైనవాని జాతి నెంచఁగ నిట్లు, వి....1833

కట్టుకొనినబట్టను జూచి గొప్ప చెప్పుటకు వీలుకలుగదు. కనుక జంగమైనంతనే నమ్మరాదు

క. కలలోనిసంప దెల్లను
కలగని మేల్కానినపిదప కనఁబడ కేగున్
బలుభోగభాగ్యగుణములు
కలరీతిగ నమ్మవలెను ఘనముగ వేమా! 1834

కలలో కనుపించినసంపద మేల్కొనినపిమ్మట మాయమై పోయినట్టులనే భోగభాగ్యములకూడ తలంపవల యును

ఆ. కలిమిఁ గల్గనేమి కరుణ లేకుండిన
కలిమి తగున దుష్టకర్ములకును
తేనె గూర్ప నీఁగ తెరువునఁ బోవదా, వి....

కరుణ లేనిచో కలిమి యెంత గలిగినను నిష్ప్రయోజనమే యగును.

ఆ. గతికి మతి యటంచు గమకించినంతలో
మదికి గతియుగల్గు మహితముగను

సతికి సుతులు పుట్టి సంతుష్టిఁ జేయరా, వి....

గతికి మతియును మతికి గతియును అని యనుకొనినచో నున్నంతలో సంతృప్తియే కల్గును

ఆ. జీవిజీవి చంపి జీవికి బెట్టంగ
జీవిదానఁ బలసి చెలఁగుచుండు
జీవహింసకులకు జిక్కునా మోక్షంబు, వి....

ఒక ప్రాణిని జంపి వేల్పునకిఁ బెట్టిన వారికి మోక్షము లెట్లు కలుగును? కలుగవు

ఆ. టీక వ్రాసిన ట్లనేకులు పెద్దలు
లోకమునకు జెప్పి రేకమతము
కాకు లట్టిజనులు కాన గామర్మంబు, వి....

అర్థము చెప్పినట్లు పెద్ద లనేకులు లోకులకు ఎన్నివిధములను చెప్పినను వినకరయే యుందురు

ఆ. రీవి లేదటంచు డెందంబులో నెంచి
జ్ఞాని నెఱుఁగ లేనిమానవుండు
డాంబికునకు లొంగి డయ్యును కడపట, వి....

డాబు లేదని తలఁచి మూర్ఖుఁడు జ్ఞానులను సత్కరింపక, వంచకులవలలోఁ బడి నశించును

ఆ. తత్త్వహీనులుండ్రు తఱుచుఁగా భువిలోన
తత్త్వమెఱుఁగువారు తఱుచు లేరు
కలిగి రేని వారు కాన్పింపరారయా, వి.... 1840

ప్రపంచములో చాలమంది నజ్ఞానులే కన్పింతురు; గాని జ్ఞానులు కన్పింపరు.

ఆ. తనకు నొప్పిపుట్టి తనువెంత బడలిన
కూళవిటుఁడు యువతి గూడు నుబ్బి
పండ్లుపడిన కుక్క పసరంబు గఱవదా, వి....

తనశరీర మెంత బడలియున్నను బుద్ధిహీనుఁడై విషయములఁ గోరువాఁడు పండ్లూడినను కుక్క పసరముల కాసించునట్లు యువతుల కాసించును.

క. తనకులగోత్రము లాకృతి
తనసంపదకలిమి బలిమి తనకేలనయా
తనవెంట రావు నిజ మిది
తనసత్యమె తోడ వచ్చు తనతో వేమా! 1842

కులము గోత్రము సంపద మున్నగున వేవియును తన తోడ రావు, కాని తాను చేసినసత్యము మాత్రము వచ్చుచుండును

క. తనకేనాఁడును భిక్షము
తన కేనాఁడును భగంబు తనరవలయునం
చును దనదశకై యెల్లెడ
మనసందున చివుకుచుండు మనుజుఁడు వేమా!

మనుజుఁడు భోగము భాగ్యము మున్నగునవి యన్నియును తనకే కావలయు నని యూఁటక యాశించి చెడిపోవుచుండును

క. తనతల్లిలోప మెఱిఁగిన
మనుజుఁడు చింతిల్లు నెపుడు మానసమందున్
తనయాలిలోప మెఱిఁగిన
ఘనుఁడై నను దానివిడుచు గదరా వేమా!

తనవారిలోపముల నెఱింగినవాఁ డన్నిటికి ఇతరులలోపముల నెంచఁడు

ఆ తనదు భ్రాతృవరులు ధర నేలుచుండఁగా
దనకు నుండునం(దు) వెనుక వారు
తనదుకాలుఁ గోయ తమ్ముఁడు ఏడ్చునా, వి....

తన యన్నలుఁదమ్ములు మున్నుగువారు భూమిని యేలినను తనకర్మమే తనకుఁగాని మఱి యేమియు లాభము లేదు

ఆ. తనవిపత్తు తెలియ దప్పించుకొనఁ జూచు
నెట్టిమనుజుఁడైన నెట్టులైన
నరకబాధ వినుచు నరయఁడా ధర్మము, వి....

తనకు వచ్చినట్టియాపదను తప్పించికొనఁజూచెడి మనుజుఁడు నరకబాధలను ఇతరులవలన వినునప్పుడు వ్యాజములో తనకు పరిహారమును వెదకుచునే యుండును

ఆ. తనవిరక్తి యనెడిదానిచేతను జిక్కి
మిఁగిలి వెడలలేక మిగులుచున్న
నరునికేడ ముక్తి ధరలోన లేదయా, వి....

తాను కేవలము విషయరక్తుఁడై విముక్తుఁడు కాలేక పడియుండుమనుజునకు ముక్తి లేనే లేదు

క. తను వలఁచిన దావలఁచును
తను వలవకయున్న నెవఁడు తా వలవడిలం
తనదుపటాటోపంబులు
తనమాయలు పనికిరావు ధరలో వేమా!. 1848

తానితరులయెడ నెట్టులు ప్రవర్తించుచున్నఁ దనయెడ
లను లోక మట్లే ప్రవర్తింపఁ బూనునే కాని వేఱుగాదు.

ఆ. తనువు తా ననుకొను తనకు.వాసనఁ బట్టి
జననమరణములను జక్కఁ జిక్కి
పొలుపున నెఱుఁగక పొర్లాడుచుండెడి, వి....

ఈశరీరమే తాను అనుకొని జననమరణాదిక్లేశముల
పాలై మనుజుఁడు కొట్టుకొనుచుండును.

ఆ. తనువుపోవువేళ దనువును బాంధవుల్
వెంటరారు నిజము వెఱ్ఱులార
తనువు విడచిపోక దనకు తోడా గుఱి, వి....

శరీరము నశించిపోయెడినాఁడు అంతవఱకును కూడ
నుండినబంధువులు మున్నగువారిలో నెవ్వరును కూడ రారు;
కాని తనసమ్మిక మాత్రమే వచ్చును

ఆ. తనువు విడిచి తాను దరలిపోయెడివేళ
తనదుభార్యసుతులు తగినవారు
లోక్కరైన నేగ రునురుమాత్రమె కాని
తనదుమంచితోడు తనకు వేమ. 1851

పైయట్టులనే.

ఆ. తమకు గలుగు పెక్కు తప్పు లటుండఁగా
నొరుల నేర మెంచు నో గెవుడును
జక్కలంబుఁ జూచి జంతి కేరినయట్లు, వి.... 1852

తాము చేసినతప్పు లెన్నో యుండి నను వాని లెక్క చేయక దుర్జనుఁడు ఇతరులతప్పులను చక్కలము జంతికను వెక్కిరించినట్లు లెక్క పెట్టపోవును

ఆ. తరుణియన్నఁ గన్నఁ దనయుని జూచిన
మరునికళల మించు మనసుపాఱు
పాపజాతిమనసుఁ బట్టంగరాకుండ, వి.... 1853

స్త్రీ అన్నయైనను తమ్ముఁడైనను కొడు కైనను పరిశీలింపక మనస్సును పట్టఁజాలక పైకొనును ఆహా! మనస్సు ఎంత పాపపుది!

ఆ. తల్లి తండ్రి చావఁ దనయుఁడు తా నేడ్చు
మగఁడు చావ నాలు వగచుచుండు
కార్యవశమె కాని కలుగునా మోహము, వి....

తల్లిదండ్రుల మృతికి కొడుకును మగనిమృతికి ఆలును కార్యవశమున దుఃఖించెదరే కాని నిజమగు దుఃఖము కాదు

ఆ. తల్లిదండ్రిహితులు తగినచుట్టము లెల్ల
నేరి కోరి పోరు నెగుపు చూచి
పడుచు నిత్తు రంతె భాగ్య మీయఁగ లేరు, వి.

తల్లిదండ్రులు మిత్రులు మున్నగువారున్నచో పడుచు నీయఁగలరే కాని భాగ్యము నీయఁజాలరు:

ఆ. తాను దినక తగిన ధర్మము సేయక
కొడుకుల కని ధనముఁగూడఁ బెట్టి
తెలియఁజెప్ప లేక తీఱిపోదురు వెన్క
సొమ్ము పరులఁ జేరు జూడు వేమ. 1856

తాను తినకయు కొడుకుల కీయకయు ధనము కూడఁ బెట్టి చివరకు తెలియఁజెప్పకయు మనుజుఁడు మృతినొందును

క. తానును జను లేమనుకొనఁ
బూనుదురో దాని నరసి పొందిక జెఱనీ
రానిపథంబున నడచిన
దానవె ధర్మాత్ముఁడందు రన్నిట వేమా!. 1857

తానును జనులు ఏమనుకొందురో యని భయము నొందుచు ధర్మమార్గమున నడచుకొనుచుండవలయును

ఆ. తాముదినకయుటులు ధర్మము జేయకఁ
కొడుకులకని ధనము గూడఁబెట్టి
తెలియఁజెప్ప లేక తీరిపోయిన లెక్క
సొమ్ముపరులఁ జేరు జూడు వేమ. 1858

స్పష్టము

ఆ. తిరిగి వచ్చు వేళ మఱలిపోయెడు వేళ
వెంటదేరు ధనము నంటఁ బోరు
తానెటకుఁ జనునొ ధనమెందు బోవునో, వి....

పుట్టునపుడును గిట్టునప్పుడును ధనము నెవ్వరును తెచ్చుటయును లేదు తీసికొనిపోవుటయు లేదు

ఆ తేరుమనెడియింటి దినదినంబును నూడ్చి
యలికి పూసి మెత్తి యనువుపఱచి
కాపు విడిచి పోవు కడపట నీజీవి, వి.... 1860
స్పష్టము

ఆ దోపునిచ్చువాఁడు తుంటలేని నెఱదాత
దోచుకొన్నవాఁడు ద్రోహి యయ్యె
ప్రాపుఁజూపువాఁడు పరమపూజ్యుండట, వి....
స్పష్టము

ఆ ద్విజవరుండు చెడ్డ దిక్కులేకయ భూమి
మనుజు లెల్లఁజెడుదు రనుట కేమి
కాలగతులు మాఱ కలియు ధర్మము మాఱు,వి.
బ్రాహ్మణుఁడు చెడినచోఁ బ్రజ లందఱును చెడుదు రనుటలో కాలగతులు మాఱి కలి యధికమై యుండుటచేత నసత్య మేదియును లేదు

ఆ. దానధర్మములను తాఁజేసి పుట్టమి
కర్మగతిని యముఁడు కష్టపఱచు
కర్మధర్మములను కడవీడ బ్రహ్మంబు, వి....1863
తాను దానధర్మాదులను చేసి యుండనికారణమున యముఁడు కష్టపఱుచును కావున వానిని దొలఁగించు కొనుటచే బ్రహ్మముఁ జేరును.

ఆ. ధనవిహీనుఁడయ్యు దండ్రి పుణ్యము చేయు
భాగ్యమునను నరుఁడు పట్టి యగుచు

బహుళధనము గూర్చు భద్రమార్గంబున
పరుల కిచ్చు కీర్తిఁ బడయు వేమ 1864

తాను చేయకున్నను తండ్రి చెసినభాగ్యమువలన నతనికి కుమారుఁడై పుట్టి కలిమి ననుభవించు చుండురు

ఆ. నక్కవినయములను నయగారములు పల్కి
కుడువ కెల్ల ధనము గూడఁ బెట్టు
కుక్కబోనువాత గూడుచల్లినరీతి, వి.... 1865

నక్కవినయములును నయగారములను పలికి లోభి ధనమును ఆర్జించియుంచును

క. నదియుదకంబును ప్రియమగు
మదినొదవెడి తత్త్వబుద్ధి మగ్నత నెన్నం
దుదిపదవి గలియ ఘనమగు
నుదధి ప్రవేశించుగంగ యొప్పగు వేమా! 1866

నదియుదకములను మదియందుండెడి తత్త్వబుద్ధియును తుదిపదవికై ప్రవహించుచుండును

క. నరకులమునఁ దాఁ బుట్టియు
నరకులమునఁ దాను బెరిగి నరుఁడయ్యును దా
నరకులములు ఛీఛీ యన
హరకులమునఁ దిరుగునేని హరుఁడా వేమా!

మనుష్యజన్మము నెత్తియును బెఱిఁగియును మనుజులందఱు నసహ్యించుకొనునట్లు ప్రవర్తించునేని యాతఁడు ముక్తుఁడగును.

ఆ. నరుఁడు జాగరమున నటియించుచుండును
నరుని కిలను జాగ్ర తరుదునమ్ము
నరుఁడు జాగ్రతనుట ధరణిలో పరమాత్మ, వి....
స్పష్టము

ఆ. నీరుపై నిఁబడిన నిప్పులు బొగ్గులౌ
నిప్పుమీఁద కుండనీరు పెట్ట
గళపెళనుచు గ్రాలు కడు చోద్యమిది కదా, వి.
నిప్పు నీళ్లపైఁ బడిన బొగ్గును నిప్పుమీఁద నీటికుండ నుంచిన నుడుకును కలుగుచుండును ఆహా! ఎంతవింత!

ఆ. నీరుమొదలు పెట్ట నీరమే మొలకయ్యె
మొలక విశ్వమగుచు మొనయుచుండు
నీరు విశ్వమగుట నేర్పుతో తెలియుము, వి....
తొలిసృష్టియుదకము అద్దాననే యీప్రపంచమంతయును జనించినది అయ్యది విశ్వమగుటను నేర్పుతో తెలిసికొనుము.

ఆ. నీళ్లలోనిమీను నిగిడి దూరము పాఱు
బయల మూరెడైనఁ బాఱలేదు
స్థానబలిమికాని తనబలిమి కాదయా, వి....
ఎంతవారికిని స్థానబలమును అనుసరించియే మాట చెల్లును గాని వేఱు గాదు ఎట్లనఁగా నీళ్లలో నున్నచేప ఎగిరి తప్పించుకొనిపోవును

ఆ. నేయిలేని కూడు నీయాన కసవది
కూరలేనితిండి కుక్కతిండి

ప్రియము లేనికూడు పిండపుకూడురా, వి....
స్పష్టము

క. నోరెరిగి తామవేవియు
నేరనిజంతువుల జంపి నెమ్మది దినునా
క్రూరపుసంకరజాతుల
మారణమే మందు రింక మహిలో వేమా!
స్పష్టము

ఆ న్యాయశాస్త్ర మరయ నన్యాయ మొనరించు
ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషంబు జనుల నీతులు దప్పించు, వి....
శాస్త్రములను ఎక్కువగా చదువుకొలఁదిని వాదమే
యలవడును గాని వేఱు గాదు

ఆ నేర్చినడతు నన్న నేరమి తావచ్చు
నోర్చి నడతు నన్న నోర్వరాదు
కూర్చి నడతు నన్న గూడంగ నీయదు, వి....
స్పష్టము

ఆ. పంకజాక్షి గన్న బంగరుపోడ గన్న
దిమ్మబట్టి యుండు తెలివి యొప్పు
మనుజులకును తత్త్వ మహిమ మెట్లు కల్గురా, వి.
ఆఁడువారు బంగారము ఎవ్వరికి కనుపించినను ఆశలనే
కలిగించును; గాని అన్యథా కాఁజాలదు

క. న్యూనము గల తనభార్యను
కాననమున జంపవచ్చు గడుచిత్రముగా

దా నెఱుక ద్రింగురీతిని
మానముఁ గాపాడుకొనెడిమహితుఁడు వేమా!.

లోపము గలది తనభార్యయే యైనను మానుషమును గోరినవాఁడైనచో మనుజుఁడు అద్దానిని త్యజించును

ఆ. పంచభూతములను బరఁగ నింద్రియముల
సంచరించినపుడు జగము కలుగు
సంచరింపకున్న జగమెట్లు కలుగును, వి.... 1878

పంచభూతములు నింద్రియములు కలిసి సంచరించినచో జగత్తులుండును; లేకున్న నుండవు.

ఆ. పంచమనిగమంబు భారతం బగునని
పొగడి రేల జనులు బుద్ధిమాలి
హింస నెంచి చూడ నిష్టమెట్లయ్యెనో, వి....

భారతమును పంచమవేదమని పొగడిరే కాని ఆబుద్ధిమంతుల కాహింసాకార్య మేరీతిన నిష్టమయ్యెనో చెప్పఁజాలము

ఆ. పంచవర్ణ మెఱుఁగఁ బరము నెఱుంగును
బరము నెఱుఁగ నిచ్ఛ ప్రజ్వరిల్లు
బ్రజ్వరిల్లువాఁడు పరముఁడు తానగు, వి....

పంచతత్త్వముల నెఱిఁగిన బరమును, అద్దానఁ దేజమును గలిగి తనకు పరతత్త్వము తేటయగును

ఆ. పచ్చదనముఁ జూచి యిచ్చను కాముకు
లిచ్చలో బడుదురు క్షితితలమున

యిచ్చ గలుగఁజేయు నెచ్చుగా మోహము, వి.
పచ్చదనమును చూచి కాముకులై మోహమునం బడి మునుఁగుచుందురు

ఆ. పచ్చవిల్తుచేత గ్రచ్చుఱ జనులెల్ల
దచ్చనాడ నైరి ధరణిలోన
గులజుఁ డెవ్వఁ డిందుఁ గులహీనుఁ డెవ్వఁడు, వి.
మన్మథవిలాసములకు గుఱియై యున్న నీప్రపంచపువారిలో హెచ్చుతగ్గులను ఏర్పఱించుట కష్టము

ఆ పట్టుకుండి యధికభాగ్యంబు పట్టినా
దొడ్డవారిఁ దిట్టి త్రుళ్ళిపడును
అల్పజాతికుక్క యధికుల నెఱుఁగునా, వి....
రాకరాక భాగ్యము కలిగినచో అల్పజాతికుక్కలు అధికులను ఎఱుంగనట్టులనే దుష్టులు గొప్పవారిని తిట్టఁబూనుకొని యెదరు.

ఆ. పట్టనేర్చు పాము పడఁగ యొరఁగఁజేయుఁ
జెఱుపఁ జూచువాఁడు చెలిమిఁ జేయు
చంపఁదలఁచు రాజు చన విచ్చుచుండును, వి....
పట్టుకొనఁ దలఁచు పాము యొరపడగను చంపదలఁచు రాజు చనవును చెరుపఁ దలంచువాఁడు చెలిమిని చెయుచుండును.

ఆ. పచ్చిమలము దినుచు పండుటాకు నములి
యుచ్చ దప్పి దీర్చి యుడుకు కోర్చి

కచ్చను బిగియింపఁగలుగునా తత్త్వమ్ము, వి.

పచ్చిమలమునుదిని ఆకులలమును తినియున్నను తత్త్వము అలవడగాఁ జాలదు.

ఆ. పండువలనఁ బుట్టె పరఁగ ప్రపంచంబు
పండువలనఁబుట్టె పరము నిహము
పండుమే లెఱింగె బ్రహ్మోదుఁడొక్కఁడు, వి....

స్పష్టము

ఆ. పత్తనమ్ములందు పతులకు సతులకు
మోహ మెచ్చుదాన యూహ లెచ్చు
ముక్తిమార్గమునకు యుక్తియే తెలియదు, వి.

స్పష్టము

ఆ పరదళములఁ జూచి ప్రాణంపుబ్రీతిచే
నుఱుకుపిఱికివాఁడు మొండిదాక
యముఁడు వచ్చునేని యడ్డ మిం కెవ్వరు, వి....

శత్రుసేనలకుఁ జంకి పిఱికివాఁ డెచ్చటనేనిఁ బాఱఁ గలఁడు; గాని యమునిబాఱినుండి పాఱిపోఁజాలఁడు

ఆ. పరబలంబుఁ జూచి ప్రాణరక్షణమున
కుఱికి పాఱిపోవు పిఱికినరుడు
యముఁడు కుపితుఁడైన నడ్డ మెవ్వఁడు సుమి, వి.

శత్రువులఁ జూచి ప్రాణములపై నాసచే పాఱిపోవును; గాని యముఁడు కుపితుఁడైన నెట్లు తప్పించికొని పోఁ గలుగును.

ఆ. పరమభాగవతులు ప్రజలు సంతోషించు
నాటపాట నేర్చి నీటుగాను
కోట్లకొలఁది తెచ్చి కూటికి లేకుంద్రు, వి....

భాగవతులు జనులను రంజింపఁజేయుటకు ఎన్నిపాట్లు పడి ఎంతడబ్బు నార్జించినను కూటికి లేకయే చివఱకు తంటాలు బడుచుందురు

క. పాతకసంసారార్ణవ
మే తెఱఁగున దాఁటె దీవు హెచ్చరికమెయిన్
చేతనమూర్తిని మదిలో
ఖ్యాతిగ నెన్నంగ దగును ఘనమతి వేమా!

పాప మనుసముద్రమును బ్రహ్మధ్యానమును చేయకేని తరింపలేవు

ఆ. పాపజాతినరుఁడు పరసతిఁ గోరుట
చేప జిహ్వరుచికిఁ జిక్కినట్లు
తీపునంటి యీఁగ తెగువతో నీల్గదా?, వి....

పాపజాతిపురుషుఁడు పరస్త్రీలకై ప్రయత్నించి తీపి తాకి ఈఁగచచ్చునట్లు చచ్చును

ఆ. పాలప్రియముచేతఁ బడఁగ నేడ్చెడిబిడ్డ
క్షుత్తుదప్పులకిల శోకపడక
తల్లిపనులు దీర్చి తనయుని ముద్దాడు, వి....1893

స్పష్టము

ఆ. పాశబందుజేత బంధువర్గము లెల్లఁ
జక్కఁజూతు రదయు జీవము చన

నొక్కఁడైన నేగఁ దునురుమాత్రమె కాని, వి.

వరునిచేతిలో సమస్తప్రపంచమును జిక్కియుండురే కాని వేఱుకాదు

క. పిండంబై యుదరంబున
నుండును గొన్నాళ్లు పిదప నుర్వీస్థలిపై
పిండంబై జనియించును
పిండం బా ప్రాణరక్ష పృథివిని వేమా! 1895

స్పష్టము

ఆ. భవము పూర్వకర్మ ఫలము ననుభవింపఁ
గలిగె ననుచు మదిని గట్టిపఱచి
కష్టసుఖము లేవి గలిగిన తలఁపకు, వి.... 1896

పూర్వకర్మ ఫలము ననుభవించుటకే తనకీజన్మము కలిగె నని గట్టి చేసికొని కష్టములకు లొంగక యుండుము

ఆ. భవము సాగరంబు భార్యయామకరము
చేఁపజలగలగును శిశువు లెల్ల
భవహారుఁ దలఁపక పాఱ మందగ లేఁడు, వి....

సంసార మనుసాగరమునకు భార్యయే మొసలి, శిశువులుఁ జేపలు జలగల వంటివారలు ఈశ్వరునిధ్యానమే దరిఁ జేర్చునావ

ఆ. మంటికుండవంటి మాయ శరీరంబు
చచ్చు నెన్నడైనఁ జావదాత్మ
ఘటము లెన్నియైన గగనం బ దేకమే, వి....

ఆ. రాజసంబు గోరి రాజ్యభారమునందు
నోర్పు లేనియాతఁ డుభయతఁ జెడు
నీటిపైన గుండు నిలుచునా మునుగక, వి....

రాజసభావముచేత రాజ్యభారమును వహింపలేని రాజు ఉభయలోకములయందును భ్రష్టుఁడై చెడిపోవును

ఆ రాతిబసవని గని రంగుగా మ్రొక్కుచు
రాతిబసవని గాల రుద్దుచుంద్రు
బసవభక్తు లెల్ల పాపులు తలపోయ, వి.... 1917

రాతితోఁ జేసిన బసవనికి మ్రొక్కుచు నిజమగు బసవని కొట్టుచుందురు, కావున బసవభక్తు లెల్లరును ఎంత పాపాత్ములో కదా!

ఆ రాతిప్రతిమ దెచ్చి రాజసంబుగ నుంచి
పూజసేయునరుఁడు బుద్ధిమాలి
భావమందు నరుఁడు భావింప నేరఁడు, వి....

మనుజుఁడు సాధారణముగా తెలివిలేమిచేత రాతిబొమ్మను తెచ్చి రాజసభావముతోఁ బూజఁ జేయుటకు పూనుకొనును గదా!

ఆ. రాతిలింగమునకు రాజులు మొదలుగా

దింపరుకదా!

ఆ. రామభక్తుల మని రాతిబొమ్మకు మ్రొక్కి
భజన సేయ నేల భక్తిలేక
భక్తినిల్ప నతఁడు భజనము సేయునా? వి 1920

రామభక్తి గలవారలమని రాతిబొమ్మకు మ్రొక్కు చుందురు; కాని భక్తిమాత్ర ముండదు భక్తినిలుపనివారు భజన సేయఁగలుగుదురా?

ఆ. రూపులేని వనిత రూఢిపతివ్రత
నీటు లేనివాఁడు పోటుబంటు
తెలుపవచ్చు నెట్లు దేవరబంటుల, వి .. 1921

అందము లేనిస్త్రీ పతివ్రతయును నీటులేనివాఁడు పోటుమానిసియుఁగా నుందురు ఆహా ఇట్టిమూఢలోకము నెట్లు తెలుపఁదగును?

ఆ. రూపువంక పేరు రూఢిగా నిలుచును
పేరువంక క్రియలు పెనఁగుచుండు
నాశ మౌను తుదకు నామరూపక్రియల్, వి....

స్పష్టము

ఆ. రూపువివర మొకట రూఢిగా దాఁగఁగ
తలఁచునప్పు డెల్ల మెలఁగు మదిని

అట్లు మెలపి కోరు మా గురు[illegible]....1923

రూపును విపరమును ఐక్యము నొందించి తలంపుల చందు కలిపి ఈశ్వరుని ధ్యానింపుము.

ఆ. లవణ మెంత దానిలాభంబు గన నెంత
కొద్ది దనుచు నెన్నఁగూడునయ్య
భోగమేటికి నుపయోగంబె లెక్కగు, వి....1924

చిన్నవస్తువులను సైతము లక్ష్యము చేయకుండ నుండ రాదు ఉప్పెంత దానిభోగమెంత? కావున నుపయోగము కొలఁది గౌరవింపవలెను

ఆ. లోభమోహములను ప్రాభవములు దప్పు
దలఁచినపను లెల్ల తప్పి చనును
తానొకటి దలఁచిన దైవ మొండగుచుండు, వి.

లోభమోహము లుండుటచేత ప్రభుత్వములు తలఁచిన కార్యములు మున్నగునవి యన్నియును చెడిపోవును

ఆ లోభివానికల్మి లోలత నాసించి
బడుగు వాఁడు తిరుగఁ బరిణమించు
తగరు వెంట నక్క దగిలినచందము, వి....1926

దాత లోభియై యున్నచో నట్టివానిని ఎవ్వరును అడుగుటకు రాకయుందురు

ఆ. లోభివాని జంప లోకంబులోపల
మందువేఱువల్ల మతమె గలదు
పైక మడుగ నతఁడు భగ్గునమని చచ్చు, వి....

లోభిని చంపుటకు (అనఁగా ఏంచుటకు) తగినయౌషధము డబ్బునడుగుటకంటె మించిన దేదియును లేదు

ఆ. వనము బిలములందు నరయోగి తా నుండు
పనియె యిందుననకె పాటుపడును
తనివిదీర మదిని దలఁగొని చూచును, వి....1929

అడవులందును బిలములందు నుండి విసువక సర్వదా ఈశ్వరుని తనమనస్సునందే ధ్యానించి కనుచుండును

ఆ. వరలు రత్నసమితివలె గూర్చు ధాన్యంబుఁ
జక్క దంచి వండి మిక్కుటముగ
సుష్ఠుభోజనములఁ జూరగా నిడువాఁడు, వి....

రత్నములలాగున నున్నధాన్యమును దంచివండి సుష్ఠుగా నారగింపఁజేయువాఁడు త్తముఁడు

ఆ.

విశ్రాంతిలేనియూరును చెడువిధము గల భార్యను
వితరణము లేనిరాజును పరిత్యజింపవలయును

ఆ. విడువ ముడువ లేక కుడువఁగట్టఁగ లేక
వెఱవు లేక విద్యవిధము లేక
వెడలలేనివాని నడపీనుఁగనరొకో, వి.... 1942

కట్టుటకు పెట్టుటకు మున్నగువానికై ద్రవ్యము నార్జిం
పలేనిమగవానిని నడపీనుఁగు యని పరిహసింతురు

ఆ. విత్తహీనమైన వేళలందును తల్లి
తనయు లాలు సుహృదు లనెడివార
లెల్ల శత్రులగుదు రెందైన నిజ మిది, వి....

ద్రవ్యములేనియప్పుడు తల్లికొడుకులు స్నేహితులు ము
న్నగువారైనను శత్రువులై పోయెదరు

ఆ. విత్తు మ్రగ్గనేని వృద్ధి కానేఱదు
విత్తు మ్రగ్గకున్న వృద్ధి యగును
విత్తువిశ్వమునకు వివరింప నేదిరో, వి.... 1944

సులభము

క. విధి లేక జరుగ దనుచును
మదిలో నేవస్తువైన మనసున గూడున్
బొదలుచు విడువఁగఁజాలని

యది 45

నఁ

గలిగ

ఆ. విన్నవానికన్నఁ గన్నవాఁడధికుండు
కన్నవానికన్నఁ గలియువాఁడు
ఉన్నతోన్నతుఁడై యుర్విలో[illegible]ండు, వి....
విన్నవానికంటెను కన్నవాఁడు[illegible]కంటెను కలి
యువాఁడును గొప్పవాఁడై యుండును

ఆ. వినియు వినకయుండు కనియుఁ గానకయుండు
తలఁచితలఁపకుండు తాను యోగి
మనుజవరులచేత మఱి పూజ గొనుచుండు, వి.

స్పష్టము

ఆ. విప్రు నెంగిలాకు వీథికుక్కలపాలు
మాలపుల్లె యైన మానితంబు
మంతు కెక్కునాకు మాలపుల్లె యటంద్రు, వి.

సులభము.

ఆ. విశ్వమందు పరుని వివరంబుఁ గానక
పరమహంస నెట్లు పట్టవచ్చు
మానసమున నిష్ఠఁ బూనఁగవలెఁ గాని, వి....

ప్రపంచములోనున్న పరుని వివరమును తెలిసికొననిది పరమహంసమును పట్టఁజాలరు. కావున నిష్ఠను పూనుకొనవలయును.

# ప్రపంచస్వభావపద్ధతి.

ఆ. విశ్వమందు బ్రహ్మ విస్తరించుట గాక
వేఱె బ్రహ్మ మనుచు వెదుక నేల ?
తగిలి యుండఁగాదె తనలోన బ్రహ్మంబు, వి....

ప్రపంచమునందు బ్రహ్మము విస్తరించుటే గాక వేఱె బ్రహ్మము లేనే లేదు

ఆ. విశ్వము నడుమంగ విశ్వేశ్వరుం డుండ
బ్రాహ్మణులకు నేల పట్టువలలు
వనములోని క్రోఁతి వసుమతి నడపునా?, వి....

ప్రపంచమునంతకు నడుమునకు ఈశ్వరుఁ డుండఁగా బ్రాహ్మణుఁడు తనతో నున్నదని పట్టుబట్టుట యజ్ఞానవిలసితము.

ఆ.

...

స్త్రీ ఎట్టినీచవంశపు దైనను విటుఁడు మహానందమున దాని నుపభోగించుచుందురు

ఆ. విశ్వసింప దగినవిశ్వంబు మరి లేదు
కుడువఁ గూడు లేదు కోక లేదు
విశ్వమయుఁడై యైన విభు నేల తెలియరో,? వి

తమకింతకన్న వేఱు దిక్కు లేదని తెలిసియును విశ్వమయుఁ డగుదేవుని నరులు పూజింపకయే యుందురు.

ఆ. విష్ణుభక్తులిలను వీభూతిపాలైరి

శివుని భక్తు లెల సిద్ధులై
భక్తు లెల్ల జీవిపాటిని దప్పిరి, వి.... 1954

వైష్ణవులు శైవులుగను శైవులు సిద్ధులుగను మాఱి వివిధ విధములఁ జెడిపోయిరి

ఆ వీడవలయువానిఁ గూడిన నెగ్గగు
వీటివాడలందు వెలయువాఁడు
పాడుచేయుపనులు పరిపాటియే గదా!, వి....

సహవాసము చేయఁదగనివారితో చేరినవెంతవాఁడైనను అవమానము నొందును

ఆ విడుచుదాని పొందు విడువఁ జాలనివాఁడు
చచ్చుదాఁక మాయ చాపగుడిసె
భాగవతుం 1956

పరిత మ
మూర్ఖు

ఆ. [illegible]
తత్త్వవేత్త లేఁడు ధరణిలోన
గలిగ నే నతండు కానంగరాఁడయా, వి....

పరేశ్వరుని వెదకి కన్నులతో చూచినవాఁడు ఎవ్వఁడును లేఁడు ఉన్నను కానరాఁడు

ఆ. వెదకి వెదకి వెదకి వేసారి వేసారి
తిరిగి తిరిగి తిరిగి దిమ్మతిరిగి
బొమ్మలాటఁ జూచి పోఁబడి గంటిరా, వి....

స్పష్టము

ఆ. వెన్న చేతఁ బట్టి వివరంబు తెలియక
ఘృతముఁ గోరునట్టి యతనిభంగి
తాను దైవమయ్యు దైవంబుఁ దలఁచును, వి.

వెన్న చేతిలో పట్టుకొని నేతికై తిరుగునట్లు తాను దైవమైయ్యును దైవముకై తిరిగిన పరిహసింపఁబడును

ఆ

...

సులభము

ఆ వెట్టివానికైన వేషధారికైనఁ
రోగికైనఁ బరమయోగికైన
స్త్రీలఁజూచినపుడు చిత్తము రంజిల్లు, వి....1961

ఎట్టిసిచపు స్థితిలో నున్న వారికైనను స్త్రీలను కనుఁగొని నంతమాత్రాన మనస్సు రంజిల్లును

ఆ. వెలఁదిసొంపుఁ జూచి విఱ్ఱవీగఁగ రాదు
కలికి గుణము కాదె కారణంబు
చపలచిత్తవృత్తి జారిఁజే కుండదా ?, వి.... 1962

స్త్రీలకు సొగసుకంటెను గుణమే ప్రధానమైనది. కావున సొంపుకై గర్వింపరాగు

ఆ వేదములను జదివి వెలివేము గాంచిరి
యఁరిగితిరిగి వత్తు రందఱు కద
బ్రహ్మమేమొ దెలిసి బ్రదుకుట నిజమయా, వి.

వేదములను జదివి విప్రులు వేశ్యలు కాంత కావున బ్రహ్మ మనఁగా నేమి తెలిసికొని బ్రదుకుట యుత్తమము

ఆ. వేదవిద్య లెల్ల వేశ్యల వంటివి
భ్రమల బెట్టి తేటపడఁగ నీవు
గుప్తవిద్య యొకటె కులకాంత వంటిది, వి....

ఆ. వే
వ
సాయుజ్యసాధనము నాత్మగా నెంచుము, వి....

వేదములను శాస్త్రములనుచదివి వాదములాడువాఁడు వ్యర్థుఁడు కావున నట్లుచేయక సర్వసాక్షి యగువానిని ధ్యానింపుము

క. వేదాంతుల మని కొందఱు
వాదములకు నడుముగట్టి వత్తురు వారల్
సాధులుగారని చెప్పఁగ
భేదగుణం బొకటి గుఱుతు పెద్దది వేమా!

కొందఱు వేదాంతులమని వాదింప వత్తురు; కాని వారిని భేదగుణముచేతఁ బోల్చికొనఁగా వచ్చును

ఆ. వేషధారి నెపుడు విశ్వసింపఁగరాదు
వేషదోషములొక విధమె యగును
రచ్చకెక్క గదర రావణు వేషంబు, వి.... 1967

వేషములను వేసికొని యుండువాని నెల్లప్పుడును విశ్వ

సింపరాదు రావణుఁడు వేషము వేసికొన్నందులకే గదా అంతటియపకీర్తికి పాలయ్యెను.

ఆ వేష మొనరఁ గట్టి వెట్టి శూద్రత్వంబు
తనకు లేదనుకొను ధరణిదివ్జుఁడు
అరిది గిట్టువేళ నషఁగునా ద్విజతయు, వి ...
స్పష్టము

ఆ వ్యాధి నెఱుఁగలేని వైద్య మదేలరా ?
కొదవఁ దెలియు లేని కోర్కె లేల ?
మనసు తెలియు లేని మర్మ మ్మేటికి, వి .. 1969

వ్యాధి దెలియనివైద్యమును కొదువ దెలియని కోర్కె లును మనసు నెఱుఁగలేని మర్మజ్ఞతయును నిష్ప్రయోజనకరములు

ఆ. వ్రతము లాచరింప వట్టికష్టమె గాని
బ్రతుకుమీఁద నాశపడుట లేదు
వ్రతముచేత గురుని వెదుకంగలేరయా, వి....

వ్రతము లుపవాసములు కష్టప్రదములు మాత్రమే యగును, గాని కార్యసాఫల్యము నొందింపఁజాలవు

ఆ. వ్రతము లెన్నియైన వట్టిచిక్కులె కాని
యాత్మ చిక్కు గాన నలవికాదు
ఆత్మచిక్కు బాపునతఁడె పో ఘనయోగి, వి....

ఎన్నివ్రతములయినను చిక్కులే గాని ఆత్మచిక్కువిడి యొక్కటియును లేదు. అట్టిదానిని కనుఁగొనినవాఁడే ఘనుఁడగు యోగి యగును.

ఆ. శాంతమె జనులను జయము నొందించును
శాంతముననె గురుని జేరవచ్చు
శాంతభావమహిమఁ జెప్పంగ లేమయా, వి....

శాంతము జయము నిచ్చును గురువులను ప్రసన్నులఁ జేయును అహా దానిగుణములను పూర్తిగా వర్ణింపతరము కాదు గదా!

ఆ. శిలను బ్రతిమఁజేసి చీఁకటలోఁ బెట్టి
మ్రొక్కవలవ దీఁకను మూఢులార
ఉల్లమందు బ్రహ్మ ముండుటఁ దెలియుఁడీ, వి

ఓమూర్ఖులార! ఇటువంటి రాళ్లను బొమ్మలను చేసి మ్రొక్కక హృదయములో నున్న బ్రహ్మము నెఱుంగుఁడు.

ఆ శిలలఁ జూచినరులు శివుఁడని భావింత్రు
శిలలు శిలలె కాని శివుఁడు కాఁడు
తనదులోనిశివుని తా నేల తెలియఁడో, వి....

రాళ్లను జూచి నరుఁడు శివుఁడని భావించునే కాని తనహృదయములో నున్నశివుని కాన లేఁడుకదా!

ఆ. శివుఁడు బ్రహ్మ మనుచు స్మృతు లెల్లఁ బలికినఁ
బరుల నేలఁగొల్చు బ్రాహ్మణుండు
హరునిభక్తు లెల్ల నరయఁగా నరుదెకా, వి....

స్మృతు లన్నియును శివుఁడే బ్రహ్మ మని పలుకుచున్నను బ్రాహ్మణుఁడు పరుల నెందులకు సేవింపవలయును

ఆ॥ శిష్యవర్గమునకు శివుఁ జూపనేఱక
కాని మతములోనఁ గలుపునట్టి
గురుని నరసి చూడ గ్రుడ్డెద్దుచేనురా, వి....

శిష్యులకు శివునిఁ జూపింపలేని గురువు నాశ్రయించుట గ్రుడ్డెద్దు చేనిలో పడినట్టు లుండును

క. శీలము గలసుందరి తన
యాలైనను స్వర్గమేల నైహికసుఖమే
శీలము గల దది చూడఁగఁ
గాలునిపటుదూత యగును గదరా వేమా!

శీలవతి యైన భార్య గలవాని కిలయే స్వర్గ మగును అదిలేనివానికి ఈయిలయే నరక మగును

ఆ॥ శూద్రతనము పోయె శూద్రుఁడ గానని
ద్విజుఁ డనుకొను టెల్ల తెలివిలేమి
ఇత్తడెసగు పసిడి కీడనవచ్చునా?, వి.... 1978

శూద్రత్వము పోయినది బ్రాహ్మణుఁడ నైతి నను కొన్నంతమాత్రాన కాఁజాలఁడు ఇత్తడి ఎత్తుకత్తైనను పసిడికి ఈడగునా?

ఆ॥ శూద్రయువతికొడుకు శుద్ధాంతరంగుఁడై
వేదవేద్య మైనపాదు తెలిసి
బ్రహ్మపదవి గన్నఁ బ్రాహ్మణుఁడే కదా!, వి....

స్పష్టము

ఆ॥ శూద్రులనుచు భువిని శూద్రుల బోనాఁడు

మాలకన్న దుడుకు మహిని లేదు
నరకమునకు నేఁగు నష్టమైన వెనుక, వి....1980
స్పష్టము

ఆ. సకలజాతిపురుష సాంకర్యమునకును
సతుల నిచ్చి తాము సమ్మతింత్రె
ఉంకునె కనలేని యోగులు బాపలా, వి....
స్పష్టము

క. సకలము నాకలికొఱకే
నికరంబుగఁ బెట్టె మనకు నీచపుగుణముల్
సకలంబందు వసించెడి
యకలంకుఁడె యేమి వింతొ యరయర వేమా!
సమస్తమును ఆహారార్థమే యీశుఁడు సృజించెను. ఎంతటివింత!

ఆ. సకలరూప మాత్మసాక్షిలో నెంచుట
నికరమైనబయలు నిర్ణయంబు
వికల మింతలేక వెలుఁగును తత్త్వంబు, వి....
సమస్తజగత్స్వరూపమును ఆత్మలో నెంచుచు చిత్స్వరూపమును వైకల్యము నొందక గాంచుటయే తత్త్వమగును.

ఆ. సకలవిద్య లెఱిఁగి చచ్చి బ్రదుకువిద్య
యొకటినేర మనుచు నుర్విజనులు
కటకటఁబడుదురె కడహోనిఁ దెలియరు, వి....
అన్నివిద్యలను తెలిసికొని చచ్చినవాని బ్రతికించువిద్య

నెఱుంగలేకపోతిమి గదా! యని మనుజులు చివఱకు చింత నొందెదరు

ఆ. సకలశాస్త్రములను జదివియు వ్రాసియుఁ
దెలియఁగలరు చావుఁ దెలియలేరు
చావుఁ దెలియలేని చదువు లవేలరా ?, వి....

సమస్త శాస్త్రములను చదువుకొన్నను తమచావును తాము తెలిసికొనఁజాలరు చావు దెలియలేనియాచదువులు వ్యర్థములు.

ఆ సకలశాస్త్రములను సంపుటంబులు వ్రాసి
చదువ నేర్చియైనఁ జావెఱుఁగరు
చావెఱుఁగనిచదువు చదువంగ నేలనో?, వి....

సులభము

ఆ. సతత మాత్మరూపు సాధించి శోధించి
యుతముగాను బుద్ధి నూని నొక్కి
గతిని గోరి ముక్తి గనుటయే లాభంబు, వి....

సదా యాత్మధ్యానమున నే మదినుంచి మెలఁగిన ముక్తి చేకురును అదియే తారక మగును.

ఆ. సంతబసివిషాందు చలిపందిలిజలంబు
త్రోవ నమ్ముతోదు తొత్తునంటు
రచ్చసభల నిద్ర రాజులు మెత్తురా, వి.... 1988

సంతబసివిపాందును చలివేంద్రనీళ్లను మున్నగువానిని రసికులు మెచ్చుకొనరు

ఆ. సత్యమనఁగ వేఱె జగమున గనలేదు
నిత్య మగుచు నాత్మ నెగడియుండు
నిత్యవస్తు వెఱుఁగ నీవెపో బ్రహ్మంబు, వి....
నిత్యుఁ డగునీశ్వరుని సర్వదా ఆత్మయందు ధ్యానించు
టయే సత్య మనఁదగును

ఆ సత్యవంతులయెడ సరసమాడఁగరాదు
పేదవారితోడఁ బెనఁగరాదు
కలిమిగలుగువారి గలియనేరాదయా, వి....
సత్యవంతులతో సరసము లాడరాదు పేదవారితో
బెనఁగరాదు కలిమి గలుగువారితోఁ గలియరాదు

ఆ. సతికి బతికి నైన సంపదే సంపద
పుత్రసంపదయును భువిని మేలు
సరగ ముదిసి బ్రదుకు సంపదే సంపద, వి ...
స్పష్టము

ఆ. సతి యొనర్చుచెడుగు పతి కవశ్యము వచ్చు
పతియొనర్చు మంచి సతికి సగము
పతి యొనర్చుచెడుగు సతి కేలరాదురా?, వి....
సతి చేయుపాపము పతికి వచ్చును; గాని పతిపాపము
సతికి రాదు

ఆ, సతులమాయనమ్మి సౌఖ్యంబు గలదని
మతివిహీనులైరి మనుజులెల్ల
గతులు సతులవలనఁ గానంగలేరయా, వి....

స్త్రీలమాయను నమ్మి సౌఖ్యము గలదని మనుజులు మూర్ఖులై చెడిపోయిరి

ఆ సంద్రమునకుఁ జూడ సరి యేదియును లేదు
అట్టిజలధినీర మనువు గాదు
అనువుగానినీరె యది యేమి చేయును, వి....
సులభము

ఆ. సదనునందు వేశ్య సైగలు కనుపింప
ముదితమీఁద నాశ ముడిపడంగ
మదిని భ్రమయకెవుడు మారొం నిచూడరా, వి.
స్పష్టము

ఆ. సతియుఁ జూచి మాచి సౌఖ్యంబుఁ గోరును
గతిని గానలేఁడు కిర్మిజీవి
గతులు సతులవలన గానంగ లేరయా, వి....
సులభము

ఆ సాటిచెప్పనగునె సాధుసజ్జనునకు
గొప్పచదువుఁ జదివి యొప్పు ననుచు
వాదులాడునతని వదలుట మేలరా, వి ... 1997
సులభము

ఆ. సాటి చేయవచ్చుఁ జదివి వాదములాడు
చదువరులను జెట్టి సముదయమును
పోరి పోరి గెల్చునోరునోపనివాఁడు, వి.... 1998
శాస్త్రములను జదివినవారిని శెట్టిలను సమానులని

పోల్చవచ్చును ఉభయులును పోరడివారును గెల్చువారలే కదా!

ఆ. సాటి యెవరు లేరు సాంబమూర్తికిఁ బోల్ప
దీటులేని గొప్పదేవుఁ డతఁడె
ధాటి కలుగు నతని ధ్యానించువానికి, వి...

ఈశ్వరుని పోల్చి చూపుట కెవ్వరును అతనిసాటివారు లేరు కావున నతనిని అనన్యచిత్తముతో ధ్యానించి ముక్తుఁడ వగుము

ఆ. సాధనంబు లేక సమకూడ దేదియు
బోధలేని విద్య పొందదెపుడు
పాదుకొల్పి మదిని భావించి చూడరా, వి....

అభ్యాసము లేక యేదియైనను నలవడగా నేఱదు. కావున దేవుని మదిలో పాదుకొల్పి నిరంతరమును ధ్యానించి కనుఁగొనుచుండుము

ఆ. సాధుజనుల చెలిమి చాలింపఁగా రాదు
ప్రకృతి విడక యున్నఁ బరము లేదు
పిందె గోసి చూడ బీజంబు గలుగునా, వి....

సాధువులతో చెలిమిని వీడనాడరాదు అట్లు వీడిన కొంచెమైన నుపయోగము లేకపోవును

ఆ. సాధుజనులఁ బట్టి సంతాప మొందింప
కులవినాశమందు క్రూరజనుఁడు
సాధుజనులపూజ సాయుజ్య మిచ్చురా, వి....

సజ్జనుల సంతాపింపఁ జేసిన కులము నశించును వారిని పూజించినచో నీశ్వరసాయుజ్యము లభించును.

ఆ సారము గలయుక్తి సముముగా మది నిల్పి
నిత్యమైనముక్తి నెల వెఱింగి
భక్తియుక్తి మీఱి బయలంది యుండుము, వి.

యుక్తితో నిత్యుఁడగు నా యీశ్వరుని నెలవును మనస్సులో నెలకొలిపి భక్తితో బయలు నంది మెలంగుము

ఆ సిద్ధులైనవారిచిత్తము రంజిల్లు
నొడలిమెఱుఁగు లెక్క కిసరు గాన
పనసపండు ఘనత పై నేమి కలదురా, వి....

సిద్ధులైనవారి చిత్తము సంతసించి యుండును గనుక పుష్టమై యుండును

ఆ. సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతు లగుచుఁ బుత్రు లొప్ప
స్వర్గమేటి కయ్య సంసారి కింకను, వి.... 2005

భార్య సుగుణవతియై యున్నవానికి వేఱుస్వర్గలోక మక్కఱ లేకయే సంసారమే స్వర్గ మగును.

ఆ సుతులుసతులుమాయ సుఖదుఃఖములు మాయ
సంస్కృతియును మాయ జాలి మాయ
మాయ బ్రతుకున కవి మాయ గల్పించెరా,వి.

కొడుకులు భార్యలు సుఖదుఃఖములు మున్నగునవి యన్నియును నస్థిరములే అహా! ఈయస్థిరమగు బ్రదుకున కన్ని యస్థిరములను నిర్మించినవాఁడు.

ఆ. సురలు మానుఁ లెపుడు సరవి న ర్తింతురు
ధర్మమార్గ మొకటి తారకముగ
అట్లు కానివార లసురులై చచ్చిరి, వి.... 2007

దేవతలు ఎల్లప్పుడును ధర్మమార్గముననే చరింతురు అధర్మముఁ దప్పినవారలు అసురులై జనించి చచ్చిరి కదా! కాన ధర్మమే యనుసరణీయము

ఆ. సూక్ష్మ మరయు నీకు సుఖత త్త్వభావంబు
పుట్టుచావు లేనిపురవుదారి
మానసంబు నంటి మఱవక చూడరా, వి....

సూక్ష్మముగా నరయగా నీకు సుఖతత్త్వభావము చావు పుట్టుకలు లేనియోగము కావున మనస్సులో దాని ననుసంధించి మఱచిపోకయుండుము

ఆ అడుగకర్థ మిచ్చునతఁడు బ్రహ్మజ్ఞాని
అడుగ నర్థమిచ్చు నతఁడు త్యాగి
అడుగ నీయలేని యంతఁడు పెనులోభి, వి....

అడుగకయే ధనమిచ్చువాఁడు జ్ఞాని అడిగిన నిచ్చువాఁడు త్యాగి అడిగినను నీయనివాడు లోభి

క. అడుగఁ దగువారి నడుగుట
యుడిన యెడం గొనరకుంట యూరే ననఁగాఁ
గడుసై వేడకయుండుట
యడిగెడివారలకు నీతి యగురా వేమా! 2010

అడుగఁదగినవారి నడిగి వారు ఈయలేనన్నచో నూరక యుండవలయును

ఆ. అఱుదుగా నడిగినయతఁ డర్థి గాఁబోఁడు
తఱుచుగా నొసఁగక దాత గాఁడు
దాత కర్థి కింత తారతమ్యము సుమూ, వి....

ఎప్పుడో అడిగినంతమాత్రాన అర్థి గాఁడు ఎప్పుడును ఇచ్చినగాని దాత కాఁడు దాతకు అర్థికి నంతటి భేద మున్నది.

ఆ. అల్పుఁడైనవాని కధికభాగ్యము గల్గ
దొడ్డవారి తిట్టి తొలఁగఁద్రోలు
అల్పజాతివాఁరు అధికులనెఱుఁగునా?, వి....2012

అల్పుఁడు ఎక్కువసంపదనొందెనేని గర్వించి గొప్పవారి తిట్టుటకు ప్రయత్నించును

ఆ ఇచ్చినొచ్చు వేల నిల భాగభోగ్యముల్
వచ్చిపోవుచుండు వాంఛదీఱ
చచ్చినట్లు నరుఁడు శత్రుఁడై సాధించు, వి....

సంపదలు పర్యాయాగమకములు అందులకై ఎక్కువగా కష్టపడఁ బనిలేదు

క. ఇచ్చెడివారలసంపద
హెచ్చెడినే గాని లేమి యెట్లు కలుగురా?
నిచ్చెలమనీటిఁ జల్లిన
విచ్చలవిడి నూరుచుండు వినరా వేమా! 2014

ఇచ్చెడివారిసంపద హెచ్చునే గాని తగ్గదు. చెలమ ల్లో చల్లుకొలఁదిని ఊరుచునే యుండును గదా!

ఆ. ఇచ్చువానియొద్ద నియునివాఁడుండిన

చచ్చుఁ గాని యీవి సాగనీఁడు
కల్పతరువుక్రింద గ్రచ్చచెట్టున్నట్లు, వి....2016

దాతయొద్ద లోభి యున్నచో కల్పవృక్షముక్రింద నున్న గ్రచ్చచెట్టువలె ఈయవలదని వారించుచుండును

ఆ. ఇంచుకంత బోన మీశ్వరార్పణ మన్న
పుణ్యలోకములకుఁ బోవు నరుఁడు
అన్నదానముకన్న నధికదానము లేదు, వి....

కొంచెమన్నమును ఈశ్వరార్పణమనిన ఎన్నియో పుణ్యలోకములు లభించును

క. డంబములు పలుకువాని ని
జంబుగదా నమ్మునట్టి జనుఁ డరయగ జ్ఞా
నం బిసుమంతయు లేని మృ
గం బని యెంచుటకు సంశయము లేదుర వేమా! 2017

దాంభికుని జ్ఞానములేనిపశువుఁనుగా పరిగణించి నమ్మక యుండవలయును

ఆ. తండ్రిసొమ్మదైన దాయాదిసొమ్మైన
పరులసొమ్ము లైనఁ బ్రాప్తధనము
దయను దీనులకును దానము నిచ్చును, వి....

సొమ్ము ఎవ్వరిదైనను తనచేతఁ బడినవెంటనే బీదలకు దానము చేయఁ బ్రయత్నించును

ఆ. తనదుదాన మరయఁ దనబిడ్డ సమమగుఁ
దండ్రిదాన మెల్ల తనకు తోడు

౧౧19

౬క

ఆ. ౪౫

దనదుతల్లి గర్భముననె పుట్టి
తన్ను మఱచి యింకఁ దగనివి చేయునా?, వి....
తాను పూర్వము చేసికొని కర్మలవలన తల్లిగర్భమున
జన్మించియును ఇఁకమీఁద నిట్టితగనిపనులను చేయునా?

ఆ తనకుఁ బ్రాప్తి లేమి దాత లీయకయున్న
దోషబుద్ధిచేత దూఱుటెల్ల
ముక్కువంకఁ జూచి ముకురము దూఱుట, వి.
సులభము

ఆ. తనకు భాగ్యమున్న దక్కువ లేకున్న
కలుగుభాగ్యమెల్లఁ గల్ల యనుచు
నమ్మక మిడునగుం డిలయోగి యగునుగా, వి.
స్పష్టము

ఆ. తనదుబాగు గోరి ధర్మంబుఁ జెప్పిన
దిట్టుమందు నధముఁ డెట్ట యెదుట
గడ్డివేయఁ బోట్లగొడ్డు కొమ్మాడించు, వి ...
దుష్టుఁడు తనకు మంచి చెప్పినవారినిసైతము పోట్ల
గొడ్డు గడ్డివేయువానివలె తరిమి పొడువఁబోవును

ఆ.

ఆ తల్లిగర్భమందుఁ దాఁబుట్టినప్పుడు
నటుతలింగము నె [illegible]రయుమయ్య
నడుమ లింగముల్లె [illegible]గాదొకో, వి.

తాను పుట్టినప్పుడు లింగ[illegible]లేక యుండి
మధ్యకాలమున లింగములఁ గట్టుట నవ్వులచేటుగదా!

ఆ తల్లిదండ్రు లాత్మసఖులు నన్నలు దమ్ము
లెలమి బంధుభృత్యు లెల్ల జనులు
గలిగి వర్థిలంగ ఘనతతో నుండుము, వి....

తల్లిదండ్రులు మున్నగు నాత్మీయజను లెల్లరును కలసి
మెలసి సుఖులై యుండఁగా వర్థిలుము

ఆ తాత గన్నతల్లి తండ్రి ని గనుతల్లి
తన్ను గన్నతల్లి తల్లితల్లి
తల్లిశూద్రురాలు తా నెట్లు బాపఁడు, వి....

తాత తల్లి మున్నగువా రందఱును శూద్రులై యుండఁ
గా తాను మాత్ర మొక్కఁడెట్లు బ్రాహ్మణుఁ డగును

ఆ. తాను గుడువనీక తగవేది యాప్తులఁ
జేరనీయఁడెటి చెనటి పశువు

తా ననుభవింపక యాప్తులకుఁ బెట్టక చేర్చిపెట్టెడి వాఁడు చేలదగ్గర కట్టిపెట్టిన దృష్టిబొమ్మతో తుల్యుఁడు

ఆ తాను తను వటంచు తప్పుచుఁ బలికిన
మోహవార్ధిలోన మునుఁగకున్న
కాన తా ననునది గానంగ లేఁడయా, వి....

తాను (ఆత్మ) తనువని భ్రాంతి నొందినచో నిఁక నేల ముగ్ధుఁడు గాక యుండును కాన తానను దానిని గానగల్గుట కష్టము

ఆ తాము గడనసేయు ధనమెల్ల దమదని
నమ్మి యుంద్రు వెఱ్ఱినరులు భువిని
తా మొరుల కొసంగఁ దమకును నది కల్గు, వి.

తాము సంపాదించిన ధన మంతయును తమదే యని నమ్మెదరే గాని వెఱ్ఱిజనులు తమకోర్కు లిచ్చుదాని గనియైన దెలిసికొనలేరు

ఆ తాము కన్నవారు తనుగన్నవారును
చచ్చుటెల్ల తమకు సాక్ష్యమె కద
బ్రదుకులు దెలసిన బ్రహ్మాకల్పంబులా, వి....

తమసుతులు ముసలి గువారందఱును చనిపోవుట తమ బ్రదుకులు అశాశ్వతములనుట కుదాహరణములే కదా!

ఆ తా మొరులకుఁ బెట్టఁ దమకును గలుగును
నడుగ నిడినఁదాము నడుగఁగలరు
ఇందు నీనివాని కెందును గలుగదు, వి.... 2032

సులభము

ఆ. తీర్థయాత్ర కనుచుఁ దిరుగఁబోయినవాఁడు
పామరుండు గాక భక్తుఁ డగునె
తీర్థయాత్రచేత దివ్యుఁడుకాఁడయా, వి.... 2033

తీర్థయాత్రలకని తిరుగఁబోయినవాఁడు పామరుఁడు గాక భక్తుఁడగునా?

ఆ. తీర్ప నార్పలేని తీర్పరితనమును
కూర్ప విప్పలేని నేర్పుపనులు
పెట్టిపోయలేని బీరముల్ వ్యర్థముల్, వి....

సులభము

ఆ. దాతగానివాని తఱుచుగా వేఁడిన
వాఁడు దాత యగునె వసుధనెందు
నవురు దర్భయగునె యబ్ధిని ముంచిన, వి....

దాతగానివాని నెన్నివిధముల వేఁడినను దాత గాఁజాలఁడు నవురుగడ్డి సముద్రములో ముంచినంతనే దర్భలు కాదుగదా! అట్టులనే

ఆ. దాఁచినధనముకు తానును కొడుకులు
వాంఛపడుటె కాని వట్టిభ్రమలు
భాగ్యహీనున కిల ఫలము లభించునా, వి....

దాచికొనినధనము తమదే యని యనుకొనుటయే కాని భాగ్యహీనునకు ఫలము లభింపదు

ఆ. దాతలేనికొంప దయ్యాలపెనువాఁడ
నీతిలేనిమాట రాతిప్రేటు

ప్రీతిలేనిలంజె ఘాతకి నిక్కము, వి.... 2037

దాతలేని యిల్లును నీతిలేనిమాటయును భయమును కలి
గించునవియై యుండును

ఆ. దానములను జేయ ధరఁజేతుఁలాడక
బహుధనంబుగూర్చి పాతిపెట్టి
తుదనుదండుగ నిడి మొదలుతో పోవును, వి.

దానములను చేయుటకు మన సొమ్మక ధనమును పాతి
పెట్టి నశింపఁజేయును

ఆ. దానధర్మములను దాఁజేసి పుట్టమిఁ
గర్మగతిని యముఁడు కష్టపెట్టచు
కర్మధర్మములను గడవీడ బ్రహ్మము, వి ...

దానములను ధర్మములను చేయనికారణమున దరిద్రులై
పుట్టి కష్టములను పొందుచుందురు

ఆ. దానమడుగువాఁడు ధరలోన నధముండు
దాన మడుగనతఁడు దైవసముఁడు
దానమీనివాఁడు ధన్యుఁడుగాఁడయా, వి....

దానమడుగువాఁడు అధముఁడును అడుగనివాఁడు ఉత్త
ముఁడు నని యందురు

ఆ. దానములను జేసి దరిఁజేరునొకవంక
మనసు నొకటి నమ్మ మాయఁ దగులు
జ్ఞాన మెపుడు నమ్మఁ గడతేర్చు కడగండ్ల, వి....

దానములను జేసి దరిఁజేరవలయునని మనస్సును నమ్మిన మఱల మాయకే వశమై పోవును

ఆ దానములను జేసి ధరఁ గీర్తినొందంగ
బహుధనములనొసఁగి భక్తి లేక
తుదకు నరుఁడు చెడును కద గడగండ్లరా, వి.

స్పష్టము

ఆ. దానములను నన్నదానమె దొడ్డది
గానములను సామగాన మెచ్చు
ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు, వి.

దానములలో నెల్ల నన్నదానమె గొప్పది ధ్యానములలో శివుని ధ్యానమే యుత్తమ మైనది

ఆ. దూలములను బోలు దురవస్థలను రోసి
డాసి యాస లన్ని కోసివేసి
వాసనను తెలిసిన వాఁడెపో బ్రహ్మంబు, వి....

స్థూలాకారములగు దురవస్థలను గుణాశలను తెగవీడి వాసనను తెలిసికొనినచో బ్రహ్మము నొందును

ఆ. దేవపూజ సేయ దివ్యభోగములగు
తత్వ మెఱుగు నేని దైవసముఁడె
యేమిలేనినరున కేగతి లేదురా, వి ... 2045

సులభము

ఆ. దేవళములలోను తీర్థంబులందును
మూల మెఱుఁగ కున్న ముక్తి లేదు

ఆత్మ నెఱుఁగనతని కది యెట్లు దొరకురా?, వి.
సులభము

ఆ ధనము చాల గూర్చి తనుదానధర్మముల్
ఒనరుపకయు యిచ్చు తనయులకును
తేనె గూర్చి యీగ తెరువరులకు నీదె?, వి.

లుబ్ధుఁడు ధనమును విస్తారముగా కూడఁ బెట్టి దాన ధర్మములను చెయకయే వ్యర్థము చేయును

ఆ ధనము లేక యున్న ధైర్యంబు చిక్కదు
ధైర్య మొదవదేని ధన మొనరదు
ధనము ధైర్య మరయఁదగు భూమిపతులకు, వి

ధనము లేనిచో ధైర్యమును ధైర్యము లేనిచో ధనమును దొరకదు కావున రాజులు ధనధైర్యముల నార్జింపవలయును

ఆ. ధనము లేమి యనెడిదావానలం బది
తన్నుఁజెఱుచు మీఁది దావు చెఱచు
ధనము లేమి యదిని దలఁచిన పాపము, వి....

దారిద్ర్యము కార్చిచ్చువలె బాధించును విచారించి నచో ధనము లేకపోవుటయే యొకగొప్ప పాపము

ఆ. ధనము గూడఁబెట్టి ధర్మంబు సేయక
యూరకుండు పాపు లూహ లేక
ధనము వెంటరాదు ధర్మంబు సేయుఁడీ, వి....

ధనమును కూడఁబెట్టి పాపాత్ము లూరకుందురు; కాని మీరట్టులు చేయక ధర్మమును చెయుఁడు

ఆ ధర్మకంటకుండు ధనముచే గర్వించి
సకలసంపదలను సరగఁ గనియు
కడకు తాను మేలు గానక చెడిపోవు, వి....

ధర్మకంటకుఁడు ధనమత్తుఁడై గర్వమున తనమేలు తాను తెలిసికొనలేకయే చెడిపోవును

ఆ. ధర్మమన్న వినకు తినువు నమ్మిన నటుల్
యమునివారు వచ్చి యడలఁ జేసి
చొచ్చి కట్టఁ దమరు బోఁ బాఱ గలరొకో, వి.

ధర్మమనిన లుబ్ధులు చెవిని బెట్టక యమదూతలు వచ్చి తమ్మును బాధించునప్పుడు విచారపడుదురు

క. ధనలక్ష్మిని సేవించిన
ధనమార్జింపంగ వచ్చు ధర్మముగానే
ధనహీనులకు నొసంగెడు
ధనమే మూలంబు ముక్తి మహిమకు వేమా!

సులభము

ఆ. ధర్మబుద్ధిచేత దైవంబు తెలిసినఁ
గాలుఁడేమి సేయగలఁడు ప్రజల
ధర్మమంటి వెంట దైవంబు నుండును, వి....

ధర్మబుద్ధిచేత దైవము నెఱింగిననో కాలుఁడు ప్రజల నేమి చేయఁగలఁడు? ధర్మమునంటియే దైవము నుండును.

తే. ధర్మపరుఁడైన పరిపూర్ణదాత గురుఁడు
దాన మొనరించునంతటఁ దత్వ మమరు

దాను దానగు మననంబు దాఁకఁగనగు
దాన సార్థక్య మపుడటు తనరు వేమ.        2055

ధర్మపరుఁడై దాతయైనవానికి తత్త్వము తప్పక సిద్ధించును తత్త్వము సిద్ధించినచో తప్పక ముక్తుఁడే యగును

ఆ ధర్మ మగ
నిర్మల
ధర

సులభము

ఆ. ధాత్రి జనుల కెల్లఁ దగ నెఱింగించెద
నొనర హారు నెఱుంగు నుపమయొకటి
మనసు చెదరనీక మహిముని జూచుట, వి....

మనసును చలింపనీయక యుండుటయే యుత్తమమైన యుక్తి యని యెఱుంగుఁడు

ఆ. నమొనమొయనవచ్చు నారాయణనవచ్చు
మేలువారిఁ జూచి మెచ్చవచ్చు
కొంగుకాసు నడుగ గొబ్బున నీలేరు, వి....

నమొనమొ యనవచ్చును. నారాయణా యనవచ్చును. గొప్పవారిని చూచి మెచ్చుకొనవచ్చును; గాని కొంగుకాసు నడిగినచో నీయఁజాలఁడు.

---

# ~~స్త్రీస్వభావపద్ధతి.~~

---

ఆ.

అఁడుదానియబద్ధము దృఢముగను మొగవానిది దుర్బలముగ నుండును

క. ఆలన గలసౌఖ్యములకు
నాలయ మగు నేని దాని నాలసవచ్చు
న్నాలాగునఁ గాకుండినఁ
గాలునియముదూత యదియె కదరా వేమా!

సౌఖ్యమునకు ఆలయ మగునది ఆలుగాని తద్భిన్నమైనది ఆలు అనుటకు మాఱంగా యమదూత యనఁదగును.

క. ఆలనఁగా నాత్మనుమీ
యాలనఁగా నమ్మనుమ్మి యరయగ మదిలో
నాలమ్మ యనఁగ నెవ్వరో
వాలాయము దీని దెలియవలయును వేమా!

ఆలనఁగా నాత్మయే కావున మదిలో ఆలు అనుదాని గుఱించి చర్చించి నిజమును కనుఁగొనుము

ఆ ఆలిఁ దోలి వెంట నధముఁడై తావెంట
నేల పోవు టెల్ల నెడ్డెతనము
చెట్టు ముదుర నిచ్చి చిదిమినఁ బోవునా?, వి.

భార్యను ముందు పంపి దానివెంటనే తానును పోయెడివాఁడు పరమమూర్ఖుఁడు

ఆ.

వి....

స్త్రీల స్తనములకారిన్యము ఎల్లకాలము నుండు నదికాదు

ఆ. ఇంతి తనదుపేరె యెల్లకాలంబును
ప్రజలు దలఁచునట్లు ప్రతిభ గాంచె
నింతిక పతిభక్తి యెంతసవచ్చును, వి.... 2064

ఆఁడుది తనపేరె శాశ్వతముగా నిలుచునట్లు సంతానరూపమున నెలకొలుచున్నది

ఆ. ఇహాపరంబులందు నింతులపై నాస
సహజన్మత్తె దగిలి సమయుచుంద్రు
నహింత మమరు భక్తి రాణింప దేలొకో, వి....

ఐహికాముష్మికములందు స్త్రీవాంఛచేత ననేకులు చెడిపోయెదరు

ఆ. ఈత వచ్చినపుడు లోతనిపించునా
ప్రాతదోషి కెపుడు భయము లేదు

క్రోతికొత్త కెక్కి కుప్పించి దూకదా, వి....

~~ఈగతవచ్చినవానికి భయము లేనట్లుగా~~ దోసములఁ జేయ నలవాటుపడినవాని కెందును భయమే యుండదు

ఆ ఎట్టిజీవికైన నిల కాంత భ్రాంతియే
తెలియరయుఁ డెప్పుడు తేటగాను
మనన వి.
ఎ గాని

వారిపై :

ఆ ఎట్టి స్త్రీలఁ గనిన నింతింత యనరాదు
కామునిహిమ్మె లక్కు గటిగినట్లు
ఇట్టి గాఢమోహ మెంతైనఁ జేయురా, వి....
చక్కదన మున్నను లేకున్నను ఎటువంటివారైనను స్త్రీలను కనినంతమాత్రాన మోహము కలుగును

ఆ ఒడలు చల్లనైన నోరుపు గలసతి
గుణము మేల్మిఁ బట్టి కోటిసేయుఁ
గాత యెనుము పాలు గోతనవచ్చునా, వి....
చల్లనియొడలుగల స్త్రీ కోటిరూప్యము లైనను జేయును త్తిమురాలు అట్టివారిని దూషింపరాదు

తే. ఓటుపరులకుఁ గల్గించునూహఁ జెంది
కుచ్చితులతోడఁ బనివడఁ గూడకున్న
నప్పు డెక్లైన వారలయూ ప్రతి దన
గౌరవంబును మాపును గదర వేమ. 2070

పతినిమీఱు నగునె సతి మానవతి యేని, వి....

పతిని తిట్టుకొనుటయును ఒరులకు దానమొసగి చెప్పుకొంటయును భర్తను మీఱుకొనుటయును మానవతియగు మగువకు లక్షణములు.

ఆ. పతిని నిందఁ జేసి పాటించి యెంచని
సతుల కెల్లు ముక్తి సాధక మగు
ఎట్లు కల్గు నియతి నెంచఁగా శక్యమా, వి....

పతిని నిందించుచుండెడి సాపాత్రురాండ్రకు గతులు ఎట్లును గలుగఁజాలవు

ఆ పతిని భావమందు పరమాత్మగా నెంచు
పడతి కమరుగతిని పరమటండ్రు
పతిని దూరునట్టి పడతికి దుర్గతి, వి.... 2104

పతిని మనస్సులో దైవముగా భావించు స్త్రీకి పరము కలుగును అట్లుగానిదానికి దుర్గతి కలుగును

ఆ. పరపురుషునిమీఁదఁ బ్రాణంబు పెట్టుక
మగువ సేయుఁ జూచు మంచితనము
అట్టిభంగి యోగి యాత్మను భావించు, వి....

పరపురుషునిపైఁ బ్రాణములను పెట్టుకొని యాఁడుది స్వభర్తకు ప్రియముఁ జేయఁజూచుచుండును

ఆ. పరసతిగమనంబు ప్రత్యక్షనఱకంబు
అరయు నిందల కెల్ల నాలయంబు
పురుషుఁడు వినఁజంపు భూపతి నొప్పించు, వి.

పరస్త్రీగమనమువలన నరకముమాత్రమే గాక నిందయును రాజదండనయును వాటిల్లును

ఆ. పిచ్చివానికైన పేదవానికి నైన
కుష్ఠరోగి కైన కుంటికైన
భామకానుపింపఁ బామువై పెట్టురా, వి....2107

పిచ్చివాఁడైనను పేదవాఁడైనను కుష్ఠరోగి యైనను కుంటియైనను స్త్రీ కనిపించినంతమాత్రాన వరులొత్తును.

ఆ. బోఁటి యొకతె బ్రహ్మ నోటిమీఁద నె తన్నె
కొన్ను యొకతె విష్ణురొమ్ము తన్నె
సఖియ యొకతె శివుని సగముగాఁ జేసెను, వి

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు సైతము స్త్రీలకు దాసులై నోటను రొమ్మునను హృదయమునను వారిని మోయుచున్నారు.

ఆ. బొల్లిమాటలాఁడు బోగముదానితో
దొల్లి డుల్ల నిల్లు గుల్లఁజేసి
వెల్లిర మ్మటంచు వెడలించు నింటిని, వి.... 2109

బొల్లిమాటలాడు భోగముదానితో పొందుఁ జేసినచో నిల్లంతయును దోఁచుకొని వెళ్లిపొమ్మని వెడలనడఁచును

క. భాగ్యవంతురాలు పరులయాఁకలి దప్పి
తెలిసి పెట్టనేర్చు తీర్పనేర్చు
తనదు దుష్టభార్య తనయాకలి నె గాని
పరులయాకలెఱుఁగఁబడదు, వేమా! 2110

సులభము.

భర్త కభిమతముల నొనఁగూర్చుచు నతని కనుకూల
ముగా నున్నయువతి సద్గతి కలది యగును

ఆ. వశము గానియాలి వైరమే మనవచ్చు
యశముఁ జెఱుచు గాని యనువుపడదు
కొసరు టెల్ల దానికోరికనే తీర్చు, వి.... 2120

స్వాధీనము గాని యాలు ప్రబలమైన శత్రువు యశోప
హారిణియునై యుండును అట్టిదానిని మఱల మఱల కొసరుట
దాని యిష్టమును దీర్చుటకే గాని వీనిమంచికి గా నేరదు

ఆ. వాఁడ సత్యమెల్ల వడిసముద్రములోన
బండి

న్యా 21

ద

ఆ.

జేరరాదటన్నఁ జేటు తెచ్చు
గడుసురాలు తెలియ వడిసెంచఁబోలురా, వి....

ఆఁడుది గయ్యాళి ఎంతటివారితోనైనను వాదము
లాడి తిట్టును చెటు తెచ్చును

ఆ. వెడగు వేత్త యనుచు వినగన రీనరుల్
వేయిమార్గములను వేలుపజుఁడె
అతఁడు సృష్టికర్త యంతకు గురు తెన్న, వి.

ఎన్ని చెప్పినను ఈనరులు మోహమున తెలియలేరు; గాని
దేవుఁడే అజుఁడు ఈసమస్తమును అతఁడే సృజించెనని
నమ్ముము

ఆ. వెతలు దీర్చువాఁడు వేదాంత వేద్యుండు
రతుల నేలువాఁడు బ్రహ్ముఁడగును
సతిని గూడువాఁడు సంసారయోగిరా, వి....

ఆపదలు బోఁగొట్టువాఁడే బ్రహ్మస్వరూపుఁడు

ఆ. వెదక వెదక దొరకు వేదాంతవేద్యుండు
వెదకువాని దాను వెదకు చుండు
వెదుక నేర్చినట్టి వెరవన్న గలరొకో, వి.... 2125

వెదుకఁగా వెదుకఁగా వేదవేద్యుఁడగు నీశ్వరుఁడు దొరకును ఇట్టులు వెదకఁగలవారే ప్రాయశః దుర్లభులు

ఆ

...

జవ్వనికి ముసలి మగఁడున్నచో నతనికి వశము గాక విటునివలలలోఁ బడును.

ఆ. ముటికికొంపలోన నిటికించి జీవుని
కర్మపాశములను గట్టి వేసె
నిట్టికర్మజీవి కెట్లగు మోక్షము, వి.... 2127

ఈజీవుని శరీరమును నీముటికికొంపలోనికిదించి యుంచిరి ఇట్టిజీవికి మోక్ష మెట్లు కల్గునో గదా!

ఆ. సముదయంబునందు సర్వ మొక్కటియైన
వైర మొదవ దేమి వార లేమి
ఎచ్చుతగ్గులందు నేర్పడనే హాని, వి.... 2128

సమస్తమునందును ఏకమను బుద్ధితోఁ బరికించినచో ఏవైరమును లేక యుండును

తే. సర్వకులధర్మమర్మముల్ సంతరించి
సకలయోగంబులను మించి సమ్మతముగ
బట్టబయలందుఁ జేరుచే బ్రహ్మవిద్య
గుట్టిది యటంచుఁ దెల్పగా గురుఁడు వేమ

సమస్తకులధర్మములను నశింపఁజేసి యోగములను మించి చిత్స్వరూపము నందగల్గుటయే పరము గనుట

ఆ. సాధుసజ్జనులను సంతరించినవాఁడు
ప్రజలసంతసంబు పఱచువాఁడు
కదిసి శాస్త్రములను గరుణఁజూచినవాఁడు
పొదుకొన్న ముక్తిపరుఁడు వేమ

స్పష్టము

ఆ. సారము గలయుక్తి సమముగా మదినిల్పి
నిత్యమైనముక్తి నెలవెఱింగి
భక్తియుక్తిమీఱి బయలంది పొందరా, వి....

సద్యుక్తిని మదిలో నెలకొల్పి నిత్యమగుముక్తి స్థానము కనిపెంచి భక్తితో బయలునొందుటయే బ్రహ్మవిద్య యనఁబడును

ఆ సాహసమునవైన సత్యముచే నైన
మోహబుద్ధి విడిచి ముక్తి నెఱిఁగి
చేర్చి మదిని గురుని చెలరేఁగి యుండరా, వి....

ఏవిధమున నైనను ఈశ్వరుని మనస్సులో నిల్పి ధ్యానింపుము.

ఆ సిగ్గటంచనఁబడు సిగ్గ దెచ్చో నుండు
నాఁక లెచ్చటనుండు నరయుగాను
దాఁగియున్నయన్ని దాగినచో నుండు, వి....

సిగ్గు, ఆఁకలిమున్నగునవి మనోజన్యములే కాని వస్తుతః లేవని యెఱుంగుము

ఆ. సిగ్గుగల దటంద్రు సృష్టిలోపలివారు
వెఱ్ఱివేమ నగని వెఱగుపడిరి
తనకు గలుగు సిగ్గు దైవ మెఱుంగడా, వి....

సులభము

ఆ సిగ్గుదాగునెపలుఁ జీఁకటియెటుఁ దాగు
నాఁక లేడ దాగు నాత్మలోన
దాగియున్ననిద్రదాగుట తెలియుఁడీ విశ్వ, వి.

సిగ్గు నొకవేళ దాచికొనఁగలిగినను అజ్ఞానమును మాత్రము దాచికొన నేఱడు కావున నాత్మలో లీనమై యున్న సమాధిని తెలిసి ముక్తుఁడగుఁడు

ఆ. సిగ్గువిడువకున్న శివసౌఖ్యమే లేదు
తగ్గిమొగ్గకున్న సిగ్గు విడదు
సిగ్గువిడుచువాఁడె చిరకాలజీవిరా, వి.... 2136

స్పష్టము

ఆ శీలవ్రతముచేత శిష్యులశిష్యులై

తపసి కర్మములను దార వోసి
విశ్వకర్మకులము వీటిఁ బుచ్చిరి గదా, వి....2137

శీలము, శుశ్రూష తపస్సు మున్నగువానిని పరిత్యజించి విశ్వకర్మలు (కంసాలులు) కులము నధోగతికి తెచ్చుకొనిరి

ఆ. సున్న మున్న నేదొ సూక్తిని తెలిసిన
వన్ని గన్న యట్టి వారు గాక
యెన్నఁగలరె యొరు లింకెన్ని యోజించిన, వి.

సులభము

ఆ. సొమ్ముగన్నదనుక జ్యోతివెలుఁ గనవలె
సొమ్ము గన్నవెనుక జ్యోతి యేల
దేవుఁడైన వెనుక దేహంబు చీకేల, వి....2139

సొమ్ము చిక్కుఁడుదాఁక వెల్తు రుండవలసినట్టులనే ఈశ్వరుఁడు చిక్కునందాక గురుసాయము కావలసి యుండును

ఆ సొమ్ములున్నచోట్ల శోధింపఁగలుగును
సొమ్ము లేనిచోట శోధ యేల
అంజనంబు లేక యాసొమ్ము తెలియదు, వి....

తత్త్వ మెచ్చట నున్నదో అచ్చట శోధింపవలయును. అయ్యది గురువుల యనుగ్రహము లేనిది లభింపదు.

ఆ. సోమయాజి ననుచు సొంపుగా వేషంబు
గట్టిమాంస మెల్లఁ గాల్చి తినును

దిక్షఁ[illegible]ను వధిక మేమి గల్గును, వి....
[illegible]యాజి[illegible] వేషము వేసికొన్నంతమాత్రాన సాధిక్య మే[illegible] నుండదు

ఆ. సోమలతలరసము సోలలకొలఁదిని
త్రావ రేల తామె మేలటంద్రు
క్రతుఫలంబు కంతగా మగుఁ గాఁబోలు, వి....
సోమలతలరసము ఎంతదాఁగినను ప్రయోజనము కొంచె మైనను కానరాదు

ఆ స్వప్నమనఁగ మేనిస్వాతంత్ర్యమా గాదు
స్వప్నమనఁగజీవ సంకటంబు
అల్పనరుఁడు తెలియు టనినిలో నగుదయా, వి.
స్వప్నమునందలి నిజస్థితిని లోనఱసిన మనుజుఁడు ముక్తిని నొందగలఁడు

ఆ స్నానమొనరఁ జేసి సద్ధర్మ మీయక
నీళ్లమునుఁగనగున నేర్పు లేక
నీళ్లయందు కోడి నెలవుగా మునుఁగదా ? వి.
స్నానముఁ జేసి ధర్మము చేయక మునిఁగితిమన్నంతనఁ గొంచె మైనను ఫలము గలుగఁబోదు

ఆ. స్నానసంధ్యజపము జరియించు భుజయించు
నిష్టలెన్నియైన నెఱపుగాని
ఒకని కీయఁడేమి సుకృతంబు కలుగునో, వి....
స్నానము సంధ్య జపము మున్నగువాని నెన్నిటినైనను

అసాధ్యుఁడగువానిని బంటుగా నుంచికొనినచో తనకే వినాశము సిద్ధించును

ఆ. అప్పులేనివాఁడె యధికసంపన్నుఁడు
తప్పులేనివారు ధరను లేరు
గొప్పలేనిబుద్ధి కొంచెమై పోవురా, వి.... 2155

లోకములో నప్పులేనివాఁడే యధికుఁడు తప్పులేని వారు ఎవ్వరును లేరు

ఆ అప్పుదీయ రోఁత హరిహరాదుల కైన
మొప్పెతోడ మైత్రి మొదలె రోఁత
తప్పు పలుక రోఁత తాకట్టిడినరోఁత, వి ... 2156

అప్పుతీయుట, అసన్మైత్రి, అసత్యభాషణము హరిహరాదులంతటివారి కైనను రోఁతను పుట్టించును

ఆ. అరయలజ్జఁ జూడ నందఱియందుండు
లజ్జలేనివాఁడు బాలితుండె
లజ్జ గల్గువానిలాభంబు లేమయు, వి.... 2157

లజ్జ అందఱకు నుండును నిర్లజ్జుఁడు లోకమునందు ఎచ్చటను ఎవ్వఁడును లేఁడు

ఆ. అల్పుఁడైనవాని కధికార మబ్బినా
దొడ్డ కొంచె మనక తూల బలుకు
చెప్పుకొఱకు కుక్క చెఱకు నే మెఱుఁగురా, వి.

అల్పునకు అధికార మిచ్చినచో మంచిచెడ్డలను విచారింపఁబూనక పెద్దల తూలనాడఁ బూనును

ఆ. అల్లుని కగుమృతికి నాత్మ జింతించును
తనయుమృతికి తాను తల్లడిల్లు
పూర్వపురుషు మృతికి భూమికి మృతియగు, వి.
స్పష్టము

ఆ. ఇంగలంబుతోడ నిల నల్పుతోడను
పరునియాలి తోడ పతితుతోడ
సరసమాడు టెల్ల చావుకు మూలము; వి....
నిప్పుతో నీచునితో పరస్త్రీతో పాపాత్మునితో సరస మాడుట యంతయును తన చావునకే మూలమని యెఱుంగ వలయును

క. ఇచ్చకము భువి నవశ్యము
కుచ్చిత మీలోకనింద కోవిదునకు నీ
తచ్చనని హాని వచ్చును
మచ్చరమే తన్ను జెఱచు మహిలో వేమా!
ఇచ్చకమువలన ననేకములగుహానులు వాటిల్లును కావున కోవిదుఁ డగువాఁడు దానిని పరిత్యజింపవలయును

ఆ ఇహమునందు బాధ లెన్నైన బడవచ్చు
యముని బాధ లేక యమరవలెను
పరుని బాధ లేక బ్రతుకుఁడు నరులార, వి....
ఇహలోకమునందు ఎంతటికష్టముల నైన ననుభవింప వచ్చును; గాని పరలోకకష్టము అసహ్యములై యుండును.

ఆ. ఈఁగతల విషంబ దిముడదు నీలోన

తేలు తోఁకవిషము తెంపుఁ జూపు
పాముకోరవిషము పట్టి చంపును గదా, వి....

స్పష్టము

ఆ ఈఁగ తేనె రుచికి నింపుగాఁ జచ్చును
ఓగు కాసురుచికి నొదిగిచచ్చు
త్యాగి గానివాని ధర్మ మడిగినఁ జచ్చు, వి....

స్పష్టము

ఆ ఉక్కుచూర్ణము దిన నుడుగును కష్టంబు
లుక్కుచూర్ణము దిన నుడుగు క్షయయు
నుక్కుచూర్ణము దిన నుడుగును కర్మముల్, వి.

ఉక్కుచూర్ణము తినుటవలన సమస్తకష్టములును కర్మములును తొలఁగి సుఖింపఁగలుగును

ఆ ఊపిరున్నయపుడె యుపదేశ మందుము
రూపుమాయు నెపుడొ రూఢిగాను
బాపఁడైన నేమి బడబాగ్నిమింగునా, వి....

ప్రాణమున్నప్పుడే పరమునకై పాటుపడి కృతార్థుఁడవు కమ్ము

ఆ.

2167

ఋణమును పెంచినతండ్రి శత్రు వైనట్టులనే పరానురక్తయగు భార్యయును శత్రువే యగును.

ఆ. ఎంచి యెంచి పూజ లెన్ని సేసిన నేమి
భక్తిలేని పూజ ఫలము లేదు
కన్నపూజ సేయఁ గారణమెఱుఁగుఁడీ, వి....2168

ఎన్నివిధములగు పూజలను చెసినను భక్తిలేనిచో నవి యన్నియును నిష్ప్రయోజనములు.

ఆ ఎఱుక లేనిదొరల నెన్నాళ్లు కొలిచిన
బ్రదుకు లేదు వట్టి భ్రాంతి కాని
గొడ్డుటావుపాలు గోకిన చేఁపునా, వి.... 2169

విజ్ఞానము లేని ప్రభువులను ఎన్ని దినములు కొలిచినను వ్యర్థమే యగును

క. ఏగుణములాపదల నెడు
నాగుణము లడంప వలయు నాసక్తుండై
ఏగుణములు మేలొనరుచు
నాగుణముల ననుసరించి యలఁగుము వేమా!

వేనివలన నాపదలు వాటిల్లునో అవి పరిత్యాజ్యములు. మేలిచ్చునట్టివి మేలగింపఁదగు గుణములునై యుండును

ఆ [illegible]

[illegible]

ద 171

దంపతుల కైకమత్యమే మెలు [illegible] చుకొనుటయే వారి కాత్మరక్షణమనఁదగును

ఆ. ఐకమత్య మొక్క టావశ్యకం బెప్డు
దానిబలిమి నెంతదైనఁగూడు
గడ్డివెంటిఁ బెట్టి కట్టరా ఏనుంగు, వి.... 2172

ఐకమత్యము అత్యావశ్యక మైనది దాని మూలమున వెంటితో నేనుఁగును కట్టినట్లు ఎంత దానినైనఁ గట్టవచ్చును

ఆ ఐదువ్రేళ్లబలిమి హ స్తంబు పనిఁజేయు
నందొకటియు విడ బొందిక చెడు
స్నేహుఁ డొకఁడు విడిన చెడఁగదా ఎని బల్మి,వి.

సులభము

ఆ ఐనవారలంచు నాప్తులటంచును
బంధుగులను నమ్మ పాడిగాదు
తనకు నైనవాఁడు తా నొకఁడే యగు, వి....

ఆప్తులని అయినవారలని బంధుగులని నమ్మకుము. ఎవ
నికి వాఁడొక్కఁడే ఆప్తుఁడగును

ఆ. ఔరసుండే నీకు వారసుండగు గాక
వేశ్యయందుఁ బుట్టు వెధవకొడుకు
నీవుపోయినపుడు నీరైన వదలునా ! వి.... 2175

ఔరసుఁడు వారసగుగాని తొత్తుకొడుకు వారసుఁడు
గాఁడు

ఆ. కనరానిది పరతత్త్వము
వినరానిది గురునినింద విని కనియును తా
ననరానిది పెద్దలమతి

మనగానిది మానహాని మహిలో వేమా!

పగతత్త్వము చూచుట కళక్యమైనది అని యెఱుంగుము.

క. కఱకంఠునికోపమువలె
వరగౌతముశాపమట్లు వర్ణింపంగా
జిఱకష్టజీవులై తగు
నరులును మదినొచ్చితిట్టనాశమె వేమా! 2177

ఈశునికోపమువలె గౌతముని శాపమువలెను కష్టజీవులయార్త సంతాపము కులమును నశింపఁ జేయును

ఆ కల్లనిజము రెండు కఱకంఠుఁ డెఱుఁగును
నీరు పల్ల మెఱుఁగు నిజముగాను
తనయునిజన్మంబు తల్లి తా నెఱుఁగును, వి....

సత్యాసత్యముల నీశుఁడును మెట్టపల్లములను నీరును ఎఱుగున

ఆ. ఖగములందు చూడఁగా ముచ్చటగ నుండు
తెగలు గన్న నైన తేటపడదు
దేవుఁ డినిసొగను దేబె నీకేలరా, వి.... 2179

స్పష్టము

ఆ.ఖలులతోడిపొందు కలుషంబు గలిగించు
మానదెంత మేటిమానికైన
వానిఁ జేరఁ దీయు వలవదు చెడుదువు, వి....

దుష్టులతోడిసహవాసము ఎంతటివారికైనను కీడును గలిగించును.

ఆ. చిక్కియున్నవేళ సింహంబు నైనను
బక్కకుక్క యైన బాధసేయు
బలిమి లేనివేళ పంతముల్ చెల్లవు, వి....2181

కాలవశమున నెంతటిబలవంతులనైనను అల్పులు బాధించెదరు

ఆ. చెప్పులోనిరాయి చెవిలోనిజోరీగ
కంటిలోనినలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు ఇంతంతకాదయా, వి.... 2182

చెప్పులోనిరాయి చెవిలో దూరిన జోరీగ కంటిలోబడినలుసు కాలిలో విఱిగినముల్లును చిన్నదైనను గొప్ప కష్టమును గల్గించును

ఆ. చక్కదనములేల సంపద లేలను
విద్యలేల భూమి విఱివి యేల
పుత్రపదవికన్నఁ బుట్టునె పదవులు? వి....2183

పుత్రసంపదకంటెను పరలోకముల నియ్యఁగల సంపద యితరము లేవియును లేవు

ఆ. చదివినతనికన్న చాకలియే మేలు
కులము వేల్పుకన్న కుక్క మేలు
సకలసురలకన్న జారభామిని మేలు, వి.... 2184

చదివినవానికంటె చాకలియును, కులదైవముకంటె కుక్కయును సురలకంటె జారయును మేలు. (నీతిలేనివారి విషయమున నియ్యది)

ఆ. జంత్రమంత్రమహిమ జాతవేదుఁ డెఱుంగు
మంత్రవాదియెఱుఁగు దంత్రమహిమ
తింత్రిణీకమహిమ తినువాఁడెఱుంగును, వి....

యంత్రమంత్రముల సార మగ్ని యెఱుఁగును తింత్రిణీకపు (చింతపండు) మహిమ తినెడివాఁడు నెఱుంగుచుఁడు

ఆ. జీవిపోఁకుండ జీవనౌషధ మిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవితొలఁగునేని జీవవస్తువు లేల, వి.... 2186

ప్రాణము పోకుండ మంచియౌషధమునిచ్చి మున్ముందు ప్రాణమును కాపాడవలయును

ఆ. జన్మములను మఱియు జన్నియుల ననేక
ముల నొనర్చి యున్న ఫలముగాన
రాక యుండునీతి లేకున్నమాత్రాన, వి....2187

ఎన్నివిధములగు యజ్ఞాదులను జేసియున్నను నీతి లేకున్నచో నన్నియు నిష్ఫలములు

ఆ. ఝషము నీరువెడల జచ్చులే సిద్ధము
నీటనుండె నేని నిక్కపడును
అండతొలగు నెడల నందఱపనియట్లె, వి....,

చేఁప నీటినుండి తొలఁగనేని చచ్చునట్లులే అండదప్పిన అందఱును కష్టములపాలగుదురు

ఆ. డీకొసంగఁ దగదు డెంద మెఱుంగక
యడుగవచ్చి కొంత యనినవాని

నెప్పనంత వినియు మెప్పగాఁ బలుకువిా, వి
సులభము

ఆ తగవుతీర్పువేళ ధర్మంబు దప్పిన
మానవుండు ముక్తి మానియుండు
ధర్మమునె పలికిన దైవంబు తోడగు, వి....
తగవును తీర్చునపుడు ధర్మమును దప్పిన మనుజునకు ముక్తి దొరకగు

ఆ. తగినకులజుఁడైన తనయెత్తుధన మైన
లెక్కఁగొనక చెప్ప నిక్కమెపుడు
పరమసాధ్వి చూడ నొరుల నంటదు సుమా! వి.
సాధ్వియైనచో ప్రలోభములకు లొంగక నిజమునే యొతింగించును

ఆ. తండ్రిమాటలు విని తల్లిని దెగటార్చి
పరశురాముఁ డేమి ఫలము గనెను
నిలువ నీడ లేక కులగిరిఁ జేరఁడా? వి.... 2192
తల్లికి ద్రోహము చేయరాదు చేసిన పరశురాముఁడు నిలువనీడలేక పోయెను గదా!

ఆ తనయుఁ డెవ్వఁడేని తనతండ్రి కంటెను
పేరుతెచ్చునట్టి పెద్దయైన
జనకు హీనతఁ జేయ సాహసించినచేటు
మూఁడు నిహపరముల మొనసి వేమ. 2193
స్పష్టము

ఆ. తన్నుఁగన్నయట్టి తల్లిపంటిది సుమ్ము
అన్యకాంత న్యాయమరసిచూడ
కన్నదానిజనులు కానంగలేరయా, వి.... 2194
పరస్త్రీ తనకు మాతృసమాన ఇట్టిదానిని అందఱు నెఱింగియే యున్నను ప్రవర్తనలలో గానలేరు

ఆ తప్పుపలుకు పలికి తాటోటు జేసిన
కూడియున్న లక్ష్మి క్రుంగిపోవు
నోటికుండ నీళ్లు నానరఁగా నిల్చునా, వి....2195
అసత్యము లాడెడువానియింట నోటికుండలో నీళ్లు నిలువనట్లు లక్ష్మి నిలువదు

ఆ. తరుణి పుణ్యవతిగ వరుని పట్టియె యగు
పాపిని యగు మగని ప్రాపువలన
భర్తవర్తనంబె పడతులయం దుండు, వి....2196
స్పష్టము

ఆ. తల్లిదండ్రిమీఁద దయలేనిపుత్త్రుండు
పుట్టనేమి వాఁడు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా, వి....2197
మాతాపితృభక్తి లేనికుమారుఁడు పుట్టలోని చెదలువలె వ్యర్థపుపుట్టుక గలవాఁడగును

ఆ. తల్లిదండ్రులందు దారిద్ర్యయుతులందు
నమ్మిన నిరుపేద నరులయందు
ప్రభులయందుఁ జూడ భయభక్తులుంచుము, వి.
సులభము

ఆ. తామసించి చేయఁదగ దెట్టికార్యంబు
వేగిరింప నదియు విషము నగును
పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనె ? వి....

ఏపనినైనను త్వరపడి చేయరాదు పండనికసుగాయను కోసి మాగవెట్టినమాత్రాన పండగునా ? కాదు గదా ! అట్లే

ఆ. దశముకొని యొకప్డు దారిద్ర్య మేర్పడ
హీనకార్యములుసహించి చేయు
బరువు మాయునింతె ఫలమింత చిక్కదు, వి.

దారిద్ర్యమునను లోఁగి కానిపనులఁ జేయరాదు. చెసి నచో తత్కాలమున సుఖముగనే యుండును; గాని తక్కిన యపుడు ఫలము గలుగదు

ఆ. దానధర్మములును దయయు సత్యము నీతి
వినయధైర్యశౌర్యవితరణములు
రాజుపాలిటి కివి రాజయోగంబులు, వి... 2201

దానము ధర్మము మున్నగునవి యన్నియును రాజులను రాజిల్లఁజేయు నుత్తమగుణములు

ఆ. దున్నపోతునకును తోడిరాగంబేల
కన్నగాని కేలకంటినిదుర
వెన్నముద్ద కేల సన్నవిసెగ కావు, వి.... 2202

దున్నపోతుకు తోడిరాగమును దొంగకు నిద్రయును వెన్నకు సన్నవిసెగయును గిట్టక యుండును.

ఆ. దొంగతనము అంకు దొరసియుండు జగతి
రంకులాడి కింత శక్తిపుట్టు
దొంగకెన్నతేవెలుంగొప్పకానట్టు, వి.... 2203

సులభము.

ఆ. దొంగమాటలాడ దొరకునె మోక్షము
చేతగాని పనులఁ జేయరాదు
గురువుపద్దు గాదు గుణహైన్యమది యగు, వి.

దొంగమాటలను పలికినను మోక్షము లేదు గనుక నైచ్యములకు పాల్పడకుము

ఆ. దొమ్మతెగులుచేత దూలినగేదెకు
వాతవేయఁ బ్రదికి వచ్చెనేని
ప్రాతయెనుముపాలు ఓతనవచ్చునా, వి....

దొమ్మ తగిలిన గేదె వాత వేసినఁ బ్రదుకునేని గ్రాహ్యమే గాని పరిత్యాజ్యము గాదు

ఆ. ద్విజకులంబునందు తేజరిల్లుచుఁ బుట్టి
తాఁ దరించి యొరుల దాఁటఁ జేయ
లేనియాతఁ డున్న లేకున్న నొక్కటే, వి....2206

బ్రాహ్మణవంశమునందు పుట్టి పరులను తరింపఁజేయ లేనివాఁ డున్నను పోయినను నొక్కటే యగును

ఆ. ద్విజవరుండు చెడ్డ దిక్కులేకయె భూమి
మనుజులెల్లఁ జెడుదు రనుట కేమి
కాలగతులు మాఱఁ గలియ ధర్మము మీఱు, వి.

సులభము

ఆ ద్విజుల ఖేదపెట్టి తిట్టఁదొడఁగువాడు
మృతిని బొంచి తాను వెతలఁ బడఁగ
గాలుదరిని జేరఁ గడతేఱు లేదయా, వి.... 2208

బ్రాహ్మణుల నిందింపఁబూనెడివాఁడు యమునిబారి నుండి తప్పించుకొని దరిఁ జేరలేఁడు

ఆ దొమ్మరాటవాని దోర్బలం బెల్లను
పొట్టకూటికొఱకె పుట్టినదగు
నదియె యోగి కెఱుక నానంద మొందదా, వి.

దొమ్మరివాని యభ్యాసము పొట్టకూటికి మాత్రమే యగును పరమున కుపయోగింపదు

ఆ. దొమ్మ మాయుకొఱకు నమ్మవారికి వేఁట
లిమ్మటంద్రి దేమి దొమ్మ తెవులొ?
అమ్మవారిపేర నందఱు దినుటకా, వి.... 2210

దొమ్మ పోవుటకని అమ్మవారలకు వేటలిమ్మని పలుకుదురు, గాని దానినట్లీయరాదు

ఆ. దోసకారియైన దూసరికాఁడైన
పతితుఁడైన వేదబాహ్యుఁడైన
వట్టిలేనిపేదవాని కీఁదగు నీవి, వి.... 2211

ప్రతిగ్రహీత ఎట్టివాఁడైనను బీదవాఁడుగా నున్న దానము నీయవచ్చును

ఆ ద్రోహి యైనవాఁడు సాహసంబున నెట్టి
స్నేహితునకు నైనఁ జెఱుపుఁ జేయు

సూహా గలిగియుండునో కనఁజాలక, వి....2212

ద్రోహి ఎల్లప్పుడును ద్రోహచింతతోనే యుండును గాన నతనిని జాగ్రత్తగా చూడవలయును

ఆ ధనము లేక యున్న ధైర్యంబు చిక్కదు
ధైర్య మొదవెనేని ధన మొదవును
ధనము ధైర్య మరయఁ దగుభూమిపతులకు, వి.

స్పష్టము

క. నందనుఁడు పెరిగి పెద్దల
కందఱకు విధేయుఁ డైన నానందముగుఁ
పొందిక చెడి సత్పురుషుల
నిందను బడఁ జింత కలుగు నిక్కము వేమా!

కొమారుఁడు గుణియైనచో సంతసమును దుర్గుణియైనచో చింతయును కలుగును

క. నలుగురుగలచోటను దా
దల చూపుచు మెలఁగుచుండి ధన్యత గనఁగాఁ
దలఁచెడియాతఁడు నిచ్చలు
గలమాటలె పలుకుచుండఁగాఁ దగు వేమా!

నలుగురిలో మెలఁగవలయునని కోరెడి ప్రతివాఁడును ఇచ్చకములనే పలుకుచుండవలయును

ఆ. నాగుబాము గన్న నంబిబ్రాహ్మణు గన్న
చెవులపిల్లి గన్న చేటువచ్చు
గకుడుని గనుఁగొన్న గలుగుచు కోరికల్, వి....

సులభము.

ఆ. నిక్కమైన మంచినీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టెఁడేల
చదువ పద్య మరయ చాలదా యొక్కటి, వి....

నిక్కమగు నీలమొక్కటియే చాలినట్లు పిచ్చిపద్యములు వేలకొలఁదియుండుటకంటె మంచిది యొక్కటియే యుత్తమముగా నుండును

ఆ నిజము లాడువాని నిందించు జగమెల్ల
నిజముఁ బల్కరాదు నీచులకడ
నిజమహాత్ముఁ గూడ నిజ మాడవలయురా, వి....

నిజమును మహాత్ములనొద్ద పలుకవలయునే కాని నీచుల యొద్ద పలుకరాదు.

ఆ. నీతిజ్యోతి లేక నిర్మలం బగు నేది
ఎట్లు కలుగుఁ బరమ దెంత దైన
ధనము గల్గియున్న దైనంబు గలుగదు, వి....

నీతియును జ్యోతియును లేక పరముగలుగనట్టులనే ధనమున్నను దైవముకలుగఁజాలదు

ఆ. నీతి దెలియఁ జెప్ప నిజముగ వేమన
పాతకముల నెల్ల బాఱఁబట్టి
లోతుతత్త్వ మరసి లోకులకును జెప్పె, వి....

స్పష్టము

క. పగ యుడుగఁ గోప ముడుఁగును
పగ తెగ కోపంబు లడఁగు బరఁగును కొర్కల్

తెగఁ గూర్కు భేద ముడుగును
త్రిగుణము లుడుగంగ ముక్తి స్థిరముగు వేమా!
సౌలభము

ఆ. పట్టి విడువరాదు పదిలక్షలకు నైనఁ
బెట్టి చెప్పరాదు పేద కైనఁ
బెట్టిగొలువరాదు విభుఁ డెట్టి ఘనుఁడైన, వి....
తా నెంతటివాఁడైనను పట్టుకొనివిడుచుటయును పెట్టి
చెప్పుటయును మంచిది కాదు

తే. పటుతరంబుగ తనయాత్మభావ మంది
నిటలదుర్గముపై నున్ననియతి మీఱి
ఘటము మఱచినవాఁడు పో ఘనుఁడు నుమ్మి
కుటిలకర్ముల కిది మెట్టు కూడు వేమ
స్పష్టము

ఆ. పడుచు నిచ్చి నతని బత్తె మిచ్చినవాని
కడుపు చల్లఁ జేసి ఘనత నిడుచు
నడువ నేర నతఁడు నాతియిచ్చె గదా' వి....
కన్యకనిచ్చువానిని అన్నముపెట్టినవానిని ఎల్లప్పుడును
గౌరవించుచునే యుండవలయును

ఆ. పతకమందు నొప్పు బలురత్నముల పెంపు
బంగరందు గూర్ప బగువు గనును
గాని యితరలోహ మైన హీనముకాదె, వి....
పతకములో నిరత్నములు సొంపుగా నున్నట్టులు సజ్జన
మధ్యమునందలి నరుఁడు ప్రకాశించును

ఆ పత్తనమ్ములఁ గలరు ప్రౌఢాంగనలు వారు
పల్లెలందు నిలిచి బ్రదుకఁ గలరె
సుఖులు పరమదారి శోభింపఁ జాలరు, వి....

సులభము

ఆ పంద నధిపుఁ జేసి బలరాని కంపిన
వాఁడు పాఱు మూఁక వలెను దెలియు
పాఱునట్టిబంటు నెక్కిరాఁ డెన్నఁడు, వి.... 2227

పందను అధికునిఁ జేసి యుద్ధమునకు పంపినచో పరు
గెత్తిపోవునే గాని యెదిరింపఁ జాలఁడు

ఆ పంది పిల్లలను పదునైదు నొకటిని
కుంజరంబు దీనుకొదను నొకటి
నుత్తమపురుషుఁ డటు లొక్కఁడు చాలఁడా, వి.

ఉత్తమగుణములను గలుగువాఁడు నొక్కఁడైన గను
టయే బహుసంతానముఁ గనుటకన్న నుత్తమము.

ఆ. పదుగురాఁడు మాట పాటియై ధరఁ జెల్లు
నొక్కఁ డాడుమాట యెక్క దెందు
ఊరకుండ వానికూరెల్ల నోపదు, వి.... 2229

పదిగురిమాట చెల్లునే కాని యొక్కనిమాట చెల్లదు.

ఆ

ఆ. పరులవిత్తమందు భ్రాంతిమానినయట్టి
పురుషుఁ డవనిలోనఁ బుణ్యమూర్తి
పరులవిత్త మరయ పాపసంచిత మగు, వి....

పరద్రవ్యమునందు ఇచ్ఛ మానినవాఁడే విచారించి నచో పుణ్యమూర్తి యగును

ఆ ఫల్గువాని కేల పరసమృద్ధి దలంపఁ
బలుకు పరుసవానిబలిమితప్పు
బలమువాని కేటి సాత్వికధర్మము, వి.... 2236

స్పష్టము

ఆ పలుతెఱఁగులుగాను బగ యుండుచోటుల
చిటుకు మనఁగ ప్రియముఁ జెప్పవలయు
కాల్పఁదగినకట్టె కడకఁ ద్రింగదా, వి....

అనేకవిధముల శత్రుత్వ మున్నను ప్రియమునుమాత్రము త్వరగా నెఱింగింపవలయును

ఆ పాడి గాదు జగతి పంచాంగములు సెప్పి
కొంచెమైన బుద్ధి నొంచ లేక
బ్రహ్మ నెఱుఁగ కిట్లు పౌరోహితము జేయ, వి.

బ్రహ్మమును పాసింపక బ్రాహ్మణు లీవిధమున పంచాంగమును చెప్పుట పౌరోహిత్యము చేయుటయును మంచిది కాదు

ఆ. పాపరాశిఁ బుట్టి పాపంబు దెలియక
పాపబుద్ధిచేత బరఁగియుండు

భక్తి గలిగియున్న పాపంబు లేదయా, వి....

పాపములోఁబుట్టి పాపములోఁ బెరిఁగి యున్నవాఁడు భక్తి గలిగియున్నచో పూజ్యుఁడగును

ఆ. పాలనీటికలిమి పరహంస మెఱుఁగును
నీటిపాత్రము నెమలి కేల
అజ్ఞుఁడైనహీనుఁ డలశివు నెఱుఁగునా, వి....

పాలలోను నీటిలోనిభేదమును హంసమెఱిఁగినట్లే శివాశివతారతమ్యమును పరమహంస యెఱుఁగును

ఆ. పాలపక్షి శకునఫల మిచ్చు నందురు
పాలపక్షి కేమి ఫలము తెలియు
తనదుమేలు కీళ్లు తనతోడ నుండెఁగ, వి....2241

స్పష్టము

ఆ అన్న మధిక మైన సరయు మృత్యువు నిజం
బన్న మంట కున్న నాత్మ నొచ్చు
చంపఁ బెంపఁ బువ్వ చాలదా వేయేల, వి....

సులభము

ఆ. అన్నమిడుటకన్న నధికదానంబుల
నెన్ని చేయునేమి యెన్నబోగు
అన్న మెన్న జీవనాధార మగునయా, వి....

జీవనాధార మగుటచేత అన్నదానముకంటెను మించిన దాన మింకొకటి యుత్తమ మైనది లేదు.

ఆ. ఆరుగురుని జంపి హరిమీఁద ధ్యానంబు

నిలిపి నిశ్చయముగ నెగడి యాత్ర
గతి నెఱుంగుమందు ఘనుఁడగు యోగిరా, వి.

అరిషడ్వర్గములను జంపి ఈశ్వరునిపై మనస్సును నిలిపి ముక్తుఁడ వగుటకై యత్నింపుము.

ఆ. ఇన్ని ఫలములందు నేఫలం బెక్కువ
అన్నఫలముకంటె నధికమేది
కన్నది గననిది కాన్పించునాహావు, వి.... 2245

సులభము

ఆ. ఊకయందుఁ బుట్టి యున్నది యన్నంబు
ప్రాకునందు ఫలము మానితముగు
సోకుగాలిపట్టి శోధించుచుందురా, వి.... 2246

స్పష్టము

ఆ. దానములను నన్నదానమే దొడ్డది
గానములను సామగానమెచ్చు
ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్ఠంబు, వి.

దానములలో నన్నదానమును గానములలో సామగానమును ధ్యానములలో శివధ్యానమును ఉత్తమములు

క. భయమంతయు దేహమునకె
భయ ముడిగిన నిశ్చయంబు పరమాత్మునిదే
లయమంతయు జీవికి గద
జయమగునని లోకమందు చాటుర వేమా!

దేహమునకే భయక్రోధాదులు గాని దేహికి లేవని యెఱుంగుము

ఆ. భారతమునఁ బలుకు పలుధర్మములయందు
సత్యనిష్ఠ మేటిసత్యమె కద
వసుధ దానఁ గలుగువన్నియ మిన్నయా, వి.

భారతములోని ధర్మము లన్నిటిలో సత్యనిష్ఠయే యుత్తమధర్మమనఁ బడెను, గాన దాని నవలంబింపుము

ఆ. భావ మరసి తన్ను భార్య సేవించిన
నింటికైన నగును నీశ్వరుండు
అరియు లేక బ్రదుకు టధమము భువిలోన, వి.

తనమనస్సును కనిపెట్టి భార్య యనుకూలయై తన్ను సేవించినచో ఈశ్వరుఁడు తనకు సదా సన్నిహితుఁడైయే యుండును

ఆ. భాషలాడ కున్న పరులు మెచ్చరు గాన
భాషలాడవలయు పగువుఁ జూచి
భాష పరువు తెలుఁగు పరమాత్ముఁ డెఱుఁగురా, వి.

మాటలాడనిచో వ్యవహారము జరుగదు కావున ఎంతటి వాని యయ్యును వ్యవహారమునకై భాషించుచునే యుండవలయును

ఆ. భూపతికృప నమ్మి భూమి చెఱచువాఁడు
ప్రజలయుసురు దాఁకి పడును పిదప
నగుర వేయు బంతి యెందాక నిలుచురా, వి.

రాజుల యనుగ్రహమును నమ్మియుండువాఁడెప్పు
డో యొకప్పుడు అవనతిని తప్పక పొందును

ఆ భూమి నాది యనిన భూమి పక్కున నవ్వు
దానహీనుఁ జూచి ధనము నవ్వు
కదనభీతుఁ జూచి కాలుఁడు నవ్వును, వి....
స్పష్టము

ఆ భూమిపేరువల్ల పుణ్యస్థములాయె
వెలయ రాళ్లవల్ల వేల్పులాయె
నీళ్లపేరునల్ల నిఖిల తీర్థము లాయె, వి.... 2254
స్పష్టము

ఆ. భూమిమీఁద పుణ్యపురుషులు లేకున్న
జగము లేల వెలుఁగు పగలు రాత్రి
అంత బయలు కాదె యారసికాడకుఁ జూడ, వి
స్పష్టము

క. మగువ కాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖముఁ జెందు
కలిమిలేము లెంత గల వెంతవారికి
బలిమిపుత్ర బలిమె బలిమి వేమా! 2256
స్త్రీ సమయమునందు కష్టపడినచో పిమ్మట సుఖింపఁ
గలుగును

ఆ మగనిమీఁద భక్తి మానకుండిన కాంత
మూఁడులోకములను ముక్తి గనును

మగువలందఱకును మగలె దేవతలయా, వి....

మగనిపైని భక్తి గలిగినస్త్రీ ముల్లోకములను చూఱ కొనఁజాలును కావున స్త్రీలకందఱకును భర్తలే దైవములు

ఆ. మద్యమాంసరుచిని మాదిగదైవాల
యెంగిలి దినువారి దెట్టికులము
భక్తిని హరు గొల్చి భవ్యులు కండయా, వి....

సులభము

ఆ మనసు దెలిసి యొకనిమాటకు బ్రతి చెప్ప
సంతసించునతఁడు చాల మెచ్చు
మనసు తెలియకుండ గునియుచు నను నేదొ, వి.

మనసు కనిపెట్టి పలికినవో రెంతటివారైనను సంతసింతురు

ఆ మనుట లెల్ల కల్ల మన సెల్ల దొంగ యిం
కేటి ప్రాణ మింక నేటి బ్రదుకు
మాటసత్య మైన మరి శతాయుష్యంబు, వి....

మనట లన్నియును కల్లలు మన స్సొకదొంగ, ఇట్టి స్థితిలో శతాయుష్యాదులు ఎట్లు కలుగును?

ఆ. మైలకోకతోడ మాసినతలతోడ
నొడలిముఱికితోడ నుండెనేని
అధికకులజుఁడైన నట్టిట్టె పిలువరు, వి.... 2261

సులభము

ఆ. మాటఁ జెప్ప వినని మనుజుఁడు మూర్ఖుఁడు

మాట విన్న నరుఁడు మాన్యుఁ డగును
మాటవినఁగఁ జెప్ప మానుట కూడదు, వి ...
సులభము

క. మాయిల్లని మాపాల మని
కాయము తనసొమ్మటంచు గామాతురుఁడై
మాయని పదవిని గోరక
దాయాదులపాలు చేయ దగదుర వేమా ! 2263

సర్వము తాను తనది యనుమమత్వము నుంచికొని
యనశ్వరమగు పదవిని బొందక యుండకూడదు

ఆ మాల మాలగాఁడు మహిమీఁద నేప్రొద్దు
మాట తిరుగువాఁడె మాలగాక
వాని మాల యన్న వాఁడెపో పెనుమాల, వి.

నిజమును విచారించినచో మాలవానికంటెను మాట
తప్పఁగడివాఁడే ఎక్కుడు మాల యగును.

ఆ మాలవాఁడయినను మఱి యాత్మమీఁదను
మనసునిలిపెనేని మాలగాఁడు
మనసు నిలుపకున్న మహిమీఁద మాలఁడౌ, వి.

మాలవాఁడైనప్పటికిని ఆత్మధ్యానముగలిగినచో వాఁడు
మాల కానేరఁడు

ఆ. మాలవానిఁ జూచి యేల నిందింపంగ
పాటితేనిమాట పలుకుటె గద
వానిలోనఁ బలుకువానికులం బేది, వి.... 2266

పాటిలేనిమాటలఁ బల్కుచు మాల యని యేలయనె దరు? వాఁడు మాలయైనచో వానిలోనివాఁ డెవ్వఁడో తెలిసి కొనఁడు

ఆ ముండమోపి కేల ముత్యాలసాపట
వన్నె లెల్ల పుణ్యవతికిఁగాక
కుక్కయేపి కేల కుచ్చులపల్లంబు, వి.... 2267

ముండమోపికి ముత్తెపుపాపటయును కుక్కకు కుచ్చుల పల్లకియును నిష్ప్రయోజనకరములు

ఆ మేలిపండుఁ జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చిచూడ పురుగు లుండు
బెరుకువాని మదిని బింక మీలాగురా, వి....

బెరుకువానిమనసు మేలిపండులోనిభాగమువలె పరి శుద్ధమై యుండును

ఆ. మొండివాని కేల ముంజేతికడియాలు
తొట్టివాని కేల కట్టుపండ్లు
గాడిదెలకు నేల గడ్డముల్ మీసముల్, వి....

స్పష్టము

ఆ రజ్జు లాడరాదు రణభూమిలోపల
బుజ్జగింపరాదు బొంకువాని
నొజ్జతోడ వాదు లొనరంగ మానరా, వి....

స్పష్టము.

ఆ. లక్ష్మి యేలినట్టిలంకాధిపతిపురి

పిల్లకోతి పౌజు కొల్లఁబెట్టె
కలసివచ్చువేళ ఘను లౌదు రల్పులు, వి.... 2271

లక్ష్మికి నిలయము మనఁబడినలంకేశునంతటివానినగరు కూడ కోతులు కొల్లఁబెట్టె నవి ఏమికాలము!

ఆ. వసుధ నొడ్డె కేల వైద్యకార్యంబులు
గ్రుడ్డివాని కేల గుణుగుపరఁగు
బుడ్డవాని కేల పోకుప్పిగంతులు, వి.... 2272

ఒడ్డెవానికి వైద్యమును గ్రుడ్డివానికి గుణగుపరుగు లును బుడ్డవానికి ౙప్పిగంతులు నేల?

ఆ. వావివర్తనలును వరుసలు మర్యాద
దప్పి నడచెనేని తగులుకీడు
పదల దపుడు కాకునం దుది తప్పదు, వి....

వావివర్తనలును వరుసయును మర్యాదయును తప్పి నడచెడివాఁడు ఎప్పుడో యొకప్పుడు కీడును పొందనే పొందును

ఆ. విద్య గలిగి యుండి వినయము లేకున్న
నైదువలకు మేలిమైనమణుల
సొమ్ము లుండి కంఠసూత్రము లేనట్టు, వి....

విద్య యున్నను వినయము లేకపోయినచో సొమ్ము లుండియు మంగళసూత్రము లేనట్లు వ్యర్థ మగును

క. విద్యలలోపల నీతియు
వాద్యంబులలోన వీణ వరరసికులకున్

హృద్యంబై విలసిల్లును
విద్యలలో బ్రహ్మవిద్య విద్యగ వేమా! 2275

విద్యలలో నీతియును బ్రహ్మవిద్యయును వాద్యములలో వీణయును హృద్యమై విలసిల్లుచుండును

ఆ. విశ్వనాథునందు విప్రులయందును
వినయమందు వేద విధులయందు
భక్తిలేనివాఁడు పాపాత్ము డిలలోన, వి....2276

దైవమునందు బ్రాహ్మణులందును వినయమునందు భక్తి లేనివాఁడు పాపాత్ముఁ డగును

ఆ. వెలఁదిచక్కఁదనము వెలిమైన ఈడును
విభునికరుణ లేమి విగతి నుండు
నీదు కరుణ లేమి నేర్పులు కొఱగావు, వి....

స్త్రీకి చక్కఁదన మెంత యున్నను పెనిమిటికరుణ లేక ప్రకాశింపనట్టులనే నీదయ లేక ఎట్టి నేర్పులును కొఱగావు

ఆ జల్లిమాట లనుచు జగమునఁ దిరిగెడు
కల్లగురుఁడు గట్టు కర్మ లెల్ల
పల్లుఁబురుగు సేరి బాధింపుచుండదా, వి....

సులభము

ఆ. జవ్వనంబునందు జవరాండ్రతో పొందు
గోరకుండువా డి కేడ లేఁడు
కాని వాని గోరకయె యున్నఘనుఁడురా, వి....

యౌవనమునందు జవరాండ్రపొందు గోరక యుండు వాఁడే యుత్తముఁ డనఁదగినవాఁడు

ఆ. జడలు దాలుచుటకు జగము ఛీ యనునట్లు
నోడఁబు విఱచుకెల్ల యోగమెల్ల
ముక్తికాంత దయకు మూల మౌనని కదా, వి.
స్పష్టము

ఆ జాణల మనియెడిచపలాత్ము లెల్లరు
తెలియరొరుల దమ్ముఁ దెలియలేరు
కష్టపుటడవిని గాసిలుచున్నారు, వి.... 2281
స్పష్టము

ఆ. తరుణి యున్నఁ గన్నఁ దనయుని జూచిన
మరునికళలు మించి మనసుపాఱు
పాపజాతిమనసుఁ బట్టంగ రాదయా, వి.... 2282
స్పష్టము

ఆ. తలను వ్రేలవేసి తాలిమి లేకయు
యోగి తెఱచు గన్నుమూయుచుండు
జ్ఞాన మిఁక నెటుండు కష్టజీవికి చెవుము, వి....
స్పష్టము

ఆ కసవు నేఱి తినెడుపసరముఁ దినువాని
మాలయండ్రుగాదె మహిని నరులు
పట్టి కోడిఁ దిన్న బాపు లటందురా ? వి....
పశువులను తినువానిని మాల యందురే కాని కోళ్లు

మున్నగు చిన్నచిన్న జంతువుల దినువారిని మాలలని పిలువ వలయును

ఆ. కాననంబుఁ జేరి కడుశ్రమ నొందిన
నానలుండు రాజ్యమందె మరల
కష్టములకు నోర్వఁగల్గును సుఖములు, వి ...2285

అడవులఁ బడి యిడుమలఁ బడినను నలుఁడు చివఱకు రాజ్యము నొందెను కావున కష్టముల నోర్చుకొనిన సుఖములు కలుగును

ఆ. కామి యయ్యెఁగాక ఘనుఁడు ఘనుండగు
కామి కృష్ణుఁడరయ ఘనుఁడుగాఁడొ
కామిగాని ఘనుఁడు గణపతికాఁడొకో, వి ...

కామియైనను కాకున్నను ఘనుఁడు ఘనుఁడే యగును కృష్ణుఁడు కామియయ్యెను గణపతి కాకయును ఘనులు కాలేదా?

ఆ. కాలకంఠు నెదిరి ఘనముగాఁ బోరిన
నర్జునునకు వశము కర్జమైన
పాశుపతము గలిగె పగతుల దునుమాడ, వి ...

కాలకంఠు నెదిర్చి పోరినయర్జునునకు పాశుపతము లభించెను కావున పోరుటకైనను గొప్పవానితోడనే యత్నింప వలయును

ఆ. కావిబట్టఁ గట్టి ఘనయోగివలె నుండి
వెలయు రాత్రిగాఁగ విడిచిపెట్టి

తోడరి తిరుగువాఁడు దొరకోలు సన్యాసి, వి....

కావిబట్టలు గట్టికొని యుండి రాత్రి కాఁగానే విడిచి తిరుగుచుండెడివాఁడు దౌర్భాగ్యపుసన్యాసి యగును.

ఆ కావుకావు మంచు కగుణకై యేడ్పెడి
శిశువు చేరఁ దీసి చిత్త మలర
పాల నిచ్చునట్టి పడతి పుణ్యాత్మరా, వి.... 2289

[illegible] శిశువుల చేతఁదీసి పాలిచ్చిన

సె

ఆ

[illegible]

చచ్చి వెనుక ముక్తి సాధింపఁగలరొకో, వి....

కాశిగంగయని నీళ్లను మోసిమోసి చచ్చినపిమ్మట ముక్తిని సాధింపఁగలరో లేరో, కావున ముందుగనే ముక్తికై యత్నింపవలయును

ఆ కాశియాత్రఁ జేసి గాసినొందఁగ నేల
రోయుగుణవికారరూప మడచు
మోసపోక యెఱుకమూలంబుగనుచుండు, వి.

కాశియాత్రకు పోయి గాసిపడుటకంటెను మాయ నడంచి యెఱుక నందుట యుత్తమము

ఆ కుండ పగిలె నేని క్రొత్తది గొనవచ్చు
భూతలంబునందు పొందుగాను
కూలఁబడిననరుఁడు కుదురుట యరుదయా, వి.

కుండ పగిలినఁ గొత్తది కొనవచ్చును; గాని నరుఁడు కూలిన గుర్తు...యరాదు

ఆ కులములోన నొకఁడు గుణహీనుఁ డుండిన
కులముచెడును వాని గుణమువలన
వెలయు చెఱకునందు వెన్ను పుట్టినరీతి, వి....

కులములో నెవ్వఁడో యొకఁడు గుణహీనుఁ డున్నంత మాత్రాన వానికులము చెడిపోవును

ప్రపంచమంతయును మఱుగులతో నిండియున్నది. అమఱు గెల్లను దైవముతో నిండియున్నది

ఆ. గంగ స్నానమాడి ఘనులైన వారెల్ల
భంగపడిరి పెక్కు బాధ లంది
గంగనీటికన్న గయతీర్థముల కన్న
నెన్న వేము తీర్థ మెచ్చు వేమ 2295

గంగాస్నానమునుజేసి కష్టపడి బాధలందిరి, కాని గంగ నీటికన్న వేమునీళ్లే కష్టములఁ బోద్రోలును

ఆ. గురునిసేవఁ జేసి గురితోడ భుజియింప
వలె నటంచు నరులు వాంఛదీఱఁ
బలుకుచుంద్రు గాని భావంబు గానరు, వి....

గురుని సేవించి లక్ష్యముతో నతనిపంక్తిని భోజనము

చేయవలయునందురే కాని యందలి యంతరార్థమును కన లేరు

ఆ గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ జేకొని పోవ
పండ్లూడఁ దన్ను బాల నియదు
లోభివాని నడుగ లాభంబు లేదయా, వి ...

గొడ్డుటావు బిదుకిన పాలులేక పైఁగా పండ్లూడదన్ని నట్టులనే లోభి నడిగినను ప్రయోజనము లేకపోవును

ఆ గొఱ్ఱెలు పదివేలు కూడి యుండినచోట
తల్లి నెఱిఁగి వచ్చుదానికొదను
పరమయోగి నెఱిఁగి భక్తుండు వచ్చును, వి....

పదివేలు గొఱ్ఱెలున్నను తమతల్లి నెఱిఁగి గొఱ్ఱెపిల్ల వచ్చునట్టులనే పరమయోగియొద్దకు భక్తుఁడు వచ్చును

ఆ. గోఁచివిడుచుయోగిఁ గోతిగ నాడించి
వెఱ్ఱివానిఁ జేసి వెతలఁ జిక్క
జేయు నయ్యలేమి చేసెదరో చూడు, వి ...

విరాగులను కోతిం బోలె నాడించి యెన్నెన్నిబాధల పెట్టెదరో పరికింపుము

ఆ. చంద్రునంతవాఁడె శాపంబుచేతను
కళలహీనమొందఁ గలిగెఁ గదర
పుడమిజనుల కెల్ల బుద్ధు లట్టులు పుట్టు, వి....

సులభము

ఆ. చిన్ననాఁటినుండి చేసినకర్మంబు

పిన్న పెద్దలకును బెరిగి వచ్చు
మంటి మింటి నడుమ మది నిల్పి చూడరా, వి.

బాల్యమునుండి చేసినకర్మ మెంతవారికి అయినను అనుభవమునకు రాకమానదు

ఆ చీము గారుపంట చెదలుపట్టెడియింట
బురుగుముట్టుగుంట బుసులకంటఁ
బిడ్డచీకుచంట బిగి యుండ నేర్చునా, వి....

చీము పంటిలోను చెద లింటిలోను పురుగులగుంటలోను పుసులకంటిలోను చీకుచంటిలోను బిగువుండఁజాలదు

ఆ. చదువుఁ జదువ కున్న సౌఖ్యంబులును లేవు
చదువుఁ జదివెనేని సరసుఁ డగును
చదువు మర్మ మెఱిఁగి చదువఁగఁజూడుము, వి.

చదువకున్న సౌఖ్యములులేవు చదివినచో సరసుఁడగును. కావున మర్మముఁ గనుటకై చదివికొనుము

ఆ. ఛత్రమున్నఁ దగిన ఛాయ యేర్పడియుండు
శాస్త్రమెఱుఁగఁదగినజ్ఞాన మొదవు
నబ్బయున్నవాని కండయున్నట్టులే, వి.... 2304

గొడుగు ఉన్నచో నీడయుండి లేకున్న లేనియట్టులే శాస్త్రముండినచో జ్ఞాన ముండును

ఆ. తావు తెలిసినతఁడు తావీలు వెంబడి
ఏవిధముననైన నిరవు సేరు
భావమెఱుఁగకున్న పర మెఱుంగుట యెట్లు?, వి.

స్థానము నెఱింగియున్నచో ఎట్లైనను ఇల్లు చేరఁగలుగునట్లే భావ ముండినచో పరేశ్వరు నెట్లయినను పొందఁగలఁడు.

ఆ. తల్లిగర్భమందు తాఁబుట్టినప్పుడు
అరుతలింగమేది యుఱయు మయ్య
నడుమ లింగమూన నగుఁబాటు గాదొకో, వి.
సులభము

ఆ. తావు తప్పకుండ తనమనంబున నిల్పి
తావుఁ జేరునట్లు తంత్రపఱిచి
తాను దావుఁ జేర తావు దా నేకమౌ, వి....
సులభము

ఆ. తోఁక గల్లువాని దొడరిగొంతులు గోసి
మేఁకజీవములను మెడలు విఱిచి
కడమువాని నెల్ల గాల్చుక తిందురు, వి....
సులభము

ఆ దున్నపోతుమడక దురుతుగా సాగదు
ఎద్దు దీనికంటె నేమి హెచ్చు
ముద్దగాలి మగఁడు ముదుసలి మెచ్చునా, వి.
యౌవనమున నున్నవాఁడు ముదుసలిని మెచ్చుకొననట్లే ఎద్దుమడక యున్నపోతు మడకను మెచ్చుకొనదు.

ఆ ధనమదంబుచేత దైవంబు నెఱుఁగక
కుటిలభావ మొందు కూ్రరజనుఁడు

మదము మించినంత మన్నింపలేరయా, వి....

ధనమదమువలన కుటిలుఁడై మత్తుఁడై యపకృతి జేయఁ జొచ్చును.

ఆ నియమమునను వేత్త నేమంబు నొనగూర్చి
షోడశోపచారసూక్తు లిలను
జేసి శివుని నెపుడు సేవించుచుండును, వి....

వేదవేత్త నియమముతో షోడశపూజల నెప్పుడు శివుని పూజించి సంతుష్టునిఁ జేయుచుండును

ఆ నోటిపుప్పి కెల్ల నొప్పి లేకుంటకు
నాకుపోకసున్న మౌషధముగఁ
బెట్టుకుండెనేని బెనురోఁత వేయురా, వి....

నోటిపుప్పికి నొప్పిపోవుటకై మందు వేయనిచో రోఁతపుట్టించును

ఆ. నొసలు భక్తుఁడయ్యె నోరుతోఁడేలయ్యె
మనసు భూతమువలె మలయఁగాను
శివుని గనియె నన్న సిగ్గేలు పుట్టదు, వి....2313

నుదురు భక్తునివలె నమ్రముగను నోరు తోఁడేలువలె నుండి దుష్టపనులఁజేయుచు శివునిగంటినన్న వారికి సిగ్గేలరాదో గదా!

ఆ నేర్పు గలుగువారు నెఱతనముగలారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడిగలుగువారి బానిసకొడుకులు, వి.... 2314

నేర్పు గలవారు విద్య గలవారు ఎల్లరును విత్తము గల వానిదాసులు

ఆ పంకజాక్షిఁ గన్న బంగరుపొడగన్న
దిమ్మ బట్టుచుండు తెలివిలేమి
మనుజులకును తత్త్వసుహిమ మెట్లబ్బును, వి.

ఆఁడుదానిని అర్థమును గాని చూచిన నెంతటివారికిని మోహము కలుగును

ఆ పట్టువస్త్రములను పసిఁగ భూషణములను
కుదువబెట్టి యిల్లు గొదువపడ్డ
లనుభవింపకూడ దతఁడెట్టి వాఁడైన, వి....

పట్టువస్త్రములను భూషణములను సుఖమనుంచికొనుటయును ఉంచుటయును కానిపనులు

ఆ పరగ రాతిగుండు పగలగొట్టఁగ వచ్చు
కొండలన్ని పిండిఁ గొట్టవచ్చు
కఠినచిత్తుమనసు కరగింపఁగారాదు, వి.... 2317

రాతిగుండునైనను శ్రమపడి పగులఁగొట్టవచ్చును, గాని కఠినాత్మునిమనస్సును కరిగింపలేము

ఆ పరగ లేమిచేత బంధువు లొగ్గవారు
పరగ లేమిచేత పరము తప్పు
పరగ లేమిచేతఁ బరపతియును తప్పు, వి....

దారిద్ర్యమువలన బంధువులు మున్నగువారెల్లరును తొలఁగిపోవుదురు

ఆ. పరుల కుపకరించి పరుసొమ్ముపరునకుఁ
బరఁగ నిచ్చెనేని పరము కలుగు
బరముకన్న నేమి పావన మాసొమ్ము, వి....

ఇతరుల కుపకరించి వారిసొమ్ము వారికిచ్చివేసినఁ బరము కలుగును విచారించినచో పరముకంటెను ఆసొమ్ము అంత ఎక్కువ పవిత్రమైనది కాదు

ఆ. పరుల మోసపుచ్చి ధర ధన మార్జించి
కడుపు నించికొనుట కానిపద్దు
ఋణము సేయుమనుజుఁ డెక్కువ కెక్కునా, వి.

ఇతరులను మోసము చేసి ధనము నార్జించుటయును ఋణము తీయుటయును తగనికార్యములు

ఆ పరులు చదువఁ జూచి నిరసనబుద్ధితో
వట్టిమాటలాడ వ్యర్థుఁ డగును
అట్టివానిబ్రదుకు లరయుఁగా నేటికి ? వి....2321

ఇతరులు చదివికొనిరని ఏవగించువారు పరమమూర్ఖులు. అట్టివారున్నను పోయినను ఒకటియే యగును

ఆ. పూసపోగుఁ బెట్టి పురుషునిబుజ మెక్కి
కన్నులార్చి వారకాంతఁ జేరి
తనకు లొంగువానిఁ దడయక చంపురా, వి....

వేశ్య సొమ్ము నిచ్చువానితలపైననే యెక్కి చంపుటకు యత్నించును

ఆ. పెట్టినంతఫలము పెక్కండ్రు కుపహాతి
సేయుకున్న తాను చేసినట్టి
పెండ్లి యగును జూడ పెద్దఫలంబుగా, వి....

ఇతరుల కీయుకున్నను ఇచ్చువారిపడఁగొట్టకుండిన నిచ్చి నంతఫలము వచ్చును

ఆ పెట్టడీపతియింటఁ బెట్టనిలోభున్నఁ
దిట్టితిట్టితిరుగ గొట్టుచుండు
పండినచేనిలో పశ్లేరుఁ బోలును, వి.... 2324

దాతయింటిలోఁ పండినచేనిలో పశ్లేరుకాయ యు న్నట్టు లోభి చేరి యీయకుండ చేయుచుండును

ఆ. బాపఁ డేముకకూడు భక్షింపసాగెను
బోవు పేరటంబు బొచ్చుముండ
కులము మానముడుగఁ గోర్కులుమెండయ్యె, వి.

ఏమి పాపకాలమో గాని బ్రాహ్మణుఁడు మాంసభక్షణమును విధవ సౌమంగల్యమును నెరపుచున్నవారలు !

ఆ. బాపలన్న దొడ్డపరువునఁ జూతురు
కానిపనులు సేయ హీనులండ్రు
కులము లెక్కయేమి గుణము ప్రధానంబు, వి....

బ్రాహ్మణులనిన గౌరవించెదరు, కాని అనుచితములను చేసినచో వారినికూడ హీను లందురు

ఆ. భిడియ మింత లేక పెద్దను నేనంచు
బొంకములను బలుకు సంకరునకు

హెచ్చు కల్గ దిచటఁ జచ్చినరాదాడ, వి....

సిగ్గు ఇసుకంతయైనను లేక నేను పెద్దనని ఎన్ని బింక
ములు పల్కినను హెచ్చు ఇచ్చటనురాగు అచ్చటను రాదు

ఆ. బ్రహ్మను తలఁగొట్టి పారనై చినయప్పు
డడ్డపడఁగ నోపరైరి సురలు
శివునికరుణ లేమిఁ జెడిపోక పోదురా, వి....

బ్రహ్మను శిరశ్ఛేదము చేసినప్పు డీశుని అడ్డుకొనినవా
రెవ్వరైనఁగలరా? కావున శివునికరుణ నార్జింపుము

ఆ. భూమిలోనఁ బుణ్యపురుషులు లేకున్న
జగము లేల నిల్చు బాగులుగాక
అంతఁ దఱచు దొరకనాడదు నమ్ముము, వి....

లోకములోఁ బుణ్యాత్ములు బొత్తిగా లేనేలేకపోయి
నచో లోకములు నశించును.

ఆ మత్తజిత్తులు తమమార్గంబు తెలియక
చిత్తచలనమంది చెడిరి భువిని
బత్తిలేనివాఁడు పరమాత్ము నెఱుఁగునా, వి....

సులభము

ఆ మది గలిగినపూజ మదనారి మెచ్చును
మనసు నిల్పినంత మహితుఁ డగును
మనసులేనిపూజ మట్టిసమానము, వి.... 2381

సులభము

ఆ. మధురసంబు గోరి మక్షికంబులు చేరి

చొచ్చి విడువలేక చిక్కినట్లు
మునిఁగి విడువలేఁడు మోహాంబురాశిని, వి....

మధువుపైఁ గలయాశచేత తేనెటీఁగ బడి చచ్చునట్లే నరులు మోహమును విడువలేక కూలిపోయెదరు

ఆ మనసున దయలేని మాలకొడుకునొద్దఁ
జేరియున్న ప్రజకుఁ జేటు నిజము
పెద్దతనము లెంచఁ బెంకెలచందము, వి....

దయావిరహితునియొద్దఁ జేరిన తప్పక కీడు మూడును.

ఆ. మనసు నిల్పలేని మాయావిరక్తులు
మనసుపడుదు రేల మగువకొఱకు
ఇంతవ్యర్థ జన్మ మింక నెందులకయా, వి....

మనసు నిలుపఁజాలక మాయవైరాగ్యము గలవారై జన్మములను వ్యర్థము సేతురు

ఆ మర్మ మెఱుఁగలేక మతములు గల్పించి
యుర్విఁ దుఃఖు లగుదు రొకరికొకరు
గాదె యింటకుక్క కళవళపడురీతి, వి.... 2335

రహస్యము నెఱుఁగఁజాలక మతములను కల్పించికొని యొకరొకరికిఁ గాక చిక్కువడుదురు

ఆ మరణ మన్న వెఱచి మది గలఁగఁగ నేల
నిరుడు ముందరేడు నిన్నమొన్న
తనువు విడచినతఁడు తనకన్న తక్కువా ? వి....

మరణమనిన భయపడెదరు కాని ఇదివరలో మృతు
లైనవారు తనకంటె దక్కువగారని యెన్నవలయును

ఆ. మాటలాడఁ గలుగు మర్మము లెఱిఁగిన
పిన్న పెద్దతనము లెన్నవలదు
పిన్నచేతిదివ్వె పెద్దగా వెలుఁగదా? వి.... 2337

సులభము

ఆ మాటలాడవచ్చు మనసు నిల్పగ లేఁడు
తెలుపవచ్చు దన్ను దెలియ లేఁడు
సురియఁబట్టవచ్చు శూరుఁడు గా లేఁడు, వి....

సులభము

ఆ. మాట వినని యాలు మగనికి బందాలు
దానిఁ జేరఁ బ్రాణమానహాని
అట్టియాలి విడిచి యడవి నుండుట మేలు, వి.

అనుకూలవతి కానియాలు మనుజునకు సంకెల కావున
ఆట్టిదానిని విడిచి యడవిలో నొంటిగా నుండుటయే యుత్త
మము

ఆ. మాలకన్నియలకు మంచిరూపంబున్న
ముట్టెనే యలత్రిశంకుపట్టినాఁడు
కానిపనులు సేయ ఘను లాసపడుదురా, వి....

మాలకన్నె లెంతటిరూపరులైనను హరిశ్చంద్రుఁడు
చేపట్టెనా? ఆట్లే ఘనులు కానిపనులఁ జేయరు

ఆ. మాలవానిఁ జూచి యేల నిందింతురు

తూలుమాటపలుక దొమ్మ యేమొ
ఆకుఁ జూచి పలుకు నతనికులం బేది, వి....2342

మాల యని నిందింతురే కాని అంగుండి చరించువాని కుల మేదో కానఁజాలరు

ఆ మాలవాని నేల మహిమీఁద నిందింప
నొడల రక్తమాంస మొకటె కాదె
వానిలోన మెలఁగు వానికులం బేది, వి....2342

మనవలెనే మాలకును రక్తమాంసము లొక్కటిగానే యుండె గదా! ఇఁక మాల నేల నిందంపవలయును?

ఆ. మాసినతలతోడ మలినవస్త్రముతోడ
నొడలిజిడ్డుతోడ నుండె నేని
అగ్రజన్ము నైన నట్టె పొమ్మందురు, వి.... 2341

సులభము

ఉ

మొక్కపోయిన మనస్సును దిద్దుట కష్టము

ఆ. మ్రుచ్చు [illegible] చున కాని
మ్రొక్కఁబోఁడు నిజము చక్కనొదిగి
కుక్కయిల్లు సొచ్చి కుండలు వెదకదా, వి....

దొంగయాత్రకు దొంగిలింపఁబోవునే గాని పుణ్య మార్జించుటకుఁ బోవఁడు

ఆ. మృగమదంబుచూడ మీఁద నల్లగ నుండు
పరిఢవిల్లు దానిపరిమళంబు
గురువు లైనవారి గుణము లేరిసేగా, వి....

చూచుటకు కస్తూరికూడ నల్లగానే యున్నను దానివాసన లోకాతిశయమై యున్నది ఇట్లే గురువులును

ఆ. రాజయోగ మాని తేజమందుట ముక్తి
తేజమందకున్న దేహి యరయ
మర్మరహితగురుని మహిఁ జేరవలెనయా, వి....

సులభము

ఆ విశ్వకర్మమహిమ వినఁగను చిత్రము
విశ్వకర్మమహిమ శాశ్వతంబు
విశ్వకర్మ లేమి విశ్వంబు నిలుచునా, వి... 2351

స్పష్టము

ఆ వేషభాష లింకఁ గాషాయవస్త్రముల్
బోఁడినెత్తి లొప్పఁ బొరయుచుండ్రు
తలలు బోఁడు లైనఁ దలఁపులు బోడులా, వి

వేషభాషలతోను కాషాయవస్త్రములతోను బోడితలల తోను తిరిగెదరు, కాని తలఁపులు మాయనంతవఱకు వేషములు వ్యర్థములు

ఆ వ్యాధి కలిగెనేని వైద్యునిచెంతను
మందుఁ దిన్న గాని మాన దెందు
చెంతదీప మిడక చీఁకటి పాయునా, వి... 2353

దీపము పెట్టక చీఁకటిపోనట్టులనే మందు తినక రోగము కుదురదు

ఆ సకలవిద్యలందు సంపన్నులై యున్న
యట్టివారు పరిచయమునఁ జౌక
పెరటిచెట్టు మందుఁ బరికింప మెత్తురా, వి....

సమస్తవిద్యాసంపన్నులైనను పరిచయ మెక్కుడైనచో చౌకఁబడుదురు.

ఆ. సకలశాస్త్రములను సంపుటములు వ్రాసి
. చదువ నేర్చి యుండి చావెఱుఁగరు

చావెఱుఁగనిచదువుఁ జదువంగ నేటికి?, వి....

సులభము.

ఆ. సతులగవయుటయును సుతులఁ బడసెన మను
వెతలపడుట యెట్టి వెఱ్ఱితనము
నేల నున్నరాయి నెత్తి కెత్తినయట్లు, వి....2356

ఆఁడువారితో కలసి సౌఖ్య మనుభవింత మని నరులు తమంత తామె త్రవ్వి బరువును తల కెత్తుకొందురుగదా!

ఆ భూమిలోనఁ బుణ్యపురుషులు లేకున్న
జగము లేల నిల్చు బాగులు గాక
అంత బయలుగాదె యాడ కాడకు రాత్రి, వి....

భూమిలో పుణ్యాత్ములింకను పలువురున్నారు; లేనిచో బ్రద్దలై పోకపోయెనా!

ఆ హాని కలుగఁ బోదు హరి మది నెంచెడు
వాని కబ్బు పరము వసుధయందు
పూని నిష్ఠమీఱి పొదలక యుండుము

హరిని సర్వదా ధ్యానించువాని కెప్పటికిని హాని కలుగదు పైని పరము లభించును కావున నిష్ఠతో దేవుని ధ్యానించుచు నిశ్చలుఁడవై యుండుము



# * కూటవేదాంతపద్ధతి.

---

ఆ. అవని నొక్కబిడ్డ యుదయం బుట్టినతండ్రి
నట్టి యేలె జగము లగణితముగ
తల్లి లేక పెరిగి ధాత్రి నెట్లెలెరా, వి.... 2359

మాయ యనుబిడ్డ లోకేశుని లోకములను ఆవరించి
కాని యేలెను కాని యిట్టి యాది కారణము లేక యెట్లు
పుట్టెను?

సీ. (1) అవనిలో నొకకప్ప యైదుపాములఁబట్టి
విడిఁబడ మ్రింగిన విధ మదేమి ?
(2) యొనర నొక్కట రెండు ఘనకపుల్ చెలరేఁగి
యొంటిపిల్లల నీను నోజ యేమి ?
(3) కలియుగంబున నక్క గర్భవాసమునందు
కామధేనువు పుట్టుకట్టడేమి ?

---

* కూటములనఁగా ప్రశ్నపూర్వకముగా విషయమును ప్రతిపాదించు శ్లోకములు. ఇయ్యవి యొకవిధములగు సమస్యల వలె నుండును. వీనికి తాత్పర్యమును పెంచి వ్రాయుటకంటె ప్రశ్నములకు మాత్రము నుత్తరములను వలసినచోటుల వివరణమును వ్రాయుట మంచిదని అట్లు చేయఁబడినది

(4) అవికారవృక్షంబు నరటిఫలంబులు
పుట్టినయట్టి యాపొలుపదేమి?

తే (5) అరయ నేర్చిన సర్వజ్ఞులైనవారు
చెప్ప నేర్చినవా రొండు చెప్పనేల?
శివుని గాంతురు భువిలోఁ బ్రసిద్ధముగను
నీకుఁ దెలియుని దేముండు నిజము వేమ.

(1) మాయ పాంచభౌతికశరీరమును గ్రహించుట. (2) మనస్సు చంచలము గనుక కపిసామ్యము మనస్సు త్రిగుణముల బడియుండుట (3)నక్క జిత్తులమారి కనుక మనస్సునకు పోల్పఁదగును. మనస్సునందు శ్రద్ధపుట్టుట (4) ప్రకృతిత్రిగుణములను పుట్టించుట (5) తెలిసినవారు దీనిఁ దెలియ చెప్పఁడు

ఇనుమునఁ జేసిన మైనపుకడ్డీ
ముంటిమొనను నక్షత్రాపుల దొడ్డి
కూర్చుండి మేపిన కుంచనగడ్డీ
విప్పి చెప్పరా వేమా రెడ్డీ 2361

ఇయ్యది మృద్రచితమగు దేహము సంసారమునకు మూలము దీనిని జాగ్రత్తగా పట్టుకొని వచ్చిన బ్రహ్మసాక్షాత్కారమునకు కారణ మగును

ఆ. ఎడ్లు రెండు తిన్న నిహాముున స్తంభించు
నెడ్లుమూఁడు తిన్న నిహాము విడచు
ఎడ్లు తెలియుమనుజు డేర్పడ యోగిరా, వి....

పంచకోశములను వృషభములతో పోల్తురు క్రమమున పంచకోశములను పొందగలవాఁడు యోగియగును

సీ. (1) కమలభవాండంబు కర్పటం బదియెంత
దానిలోపలి జగత్త్రయ మదెంత?
(2) దానినాల్గవపాలు ధాగుని యది యెంత
దీనినేడవపాలు దీని యెంత?
(3) యందు తొమ్మిదవదియగు తునియ యదెంత
యాతునియం భాగ లమితమయ్యె
(4) నట్టిభాగంబు నొండ నను వ్రాయఁగఁ గడఁ
బాలుపాయుచున్నట్టి భూములెన్ని?
తే (5) యట్టిభూముల నేలెడు వార లమితనృపులు
ఘనులు పెక్కండ్రు కలరని కనకు నెఱఁగి
యొకరిదయ చాలఁగా నమ్మియుండు మనుజు
విభవ మెమనఁగావచ్చు వెట్టి వేమ. 2263

(1) బ్రహ్మాండము (2) మల్లోకములు (3) ద్వీపములు (4) నవఖండములు.

ఆ. కాయమీఁద మ్రాను ఘనముగా నుండును
మ్రానుమీఁద తీఁగ మాయయుండు
తీఁగ మీఁద వ్రేళ్లు త్రిపురతాండవమాఁ, వి.

మనస్సునకు విజ్ఞానమును విజ్ఞానమునకు ప్రకృతియును కారణములై అప్రకృతియందు పరబ్రహ్మము లీనమై తాండవ మాడుచుండును

సీ. కోరికవలరాజు కుడిచి వేసినపుల్లె
పద్మనాభుఁడు మోయుపాత్ర దట్టి
వేడుకతో జనుల్ విప్పి చూచినభరిణె
గౌరవముల కెల్లఁ గప్పువిప్ప
అజుఁడు దినము దప్పి కారగించెడు గిన్నె
రాజులు పట్టిన గాజుకుప్పె
చుక్కకప్పెరశివు సొగసు కిరీటంబు
మహిమ నింద్రునిసొక్కు మందు బుట్ట
ఆ పాడఁ జదువ నేర్చి పఠికించి చూచిన
నాడ నేర్పుఁ దాను నాడ నేర్పు
నింతకంటె జెట్టయిఁక నేమికావలె, వి....

స్త్రీలు

ఆ కృష్ణపర్వమందు కృత్తికలైదుండు
కృత్తులైదుపట్టి కృష్ణ మ్రింగె
వలయు కృష్ణలైదు వేమన మ్రింగెరా, వి....

అంధకారమయమగు గుహాలో నైదుతత్త్వము లుం
డును ఆవీనింటిని మాయ మ్రింగెను దానిని వేమన మ్రిం
గెను అనఁగా నశింపఁజేసె ననుట

మత్తకోకిల గాలిరాకలుబోకలుండెడికాలమే బ్రతు
కాయెరా, లీలతోఁ బరమాత్మ నెంచఁగ లేని
మాయలఁ గంటిరా, చాలనమ్మియు నాత్మకీలును

సాధనంబున గానరా, మేలుగా నిఁక నీవు నీ
యెడ మేళగింపర వేమనా! 2367

సులభము

సీ గురుబోధ దెలియని కుటిలశాస్త్రంబులు
పరికింపఁగా నేమి ఫలము గలదు
ఆత్మైక్య మెఱుఁగక యఖిలయోగంబుల
సాధింపఁగా నేమి సాధ్య మగును
తన్మయత్వంబును తా నెఱుంగనివాని
సేవఁ జేసిన నేమి సిద్ధికలుగు
తుదిచే టెఱుంగక చదువులు పెక్కులు
చదివినఫలమేమి సత్యముగను
తే అనుచు సద్గురుబోధగా ననవరతము
వేయినోరులఁ జెప్పిన మాయ జగము
వానిచేఁ జేయఁజూతురు వా స్తవంబు
మదినిఁ దెలియంగలే రీశు మహిమ వేమ.

గురుబోధలేని శాస్త్రములును ఆత్మైక్యములేనియోగములును తన్మయత్వములేని శుశ్రూషయును వినాశము నెఱుఁగని చదువులును వ్యర్థములు

క చరణంబులు పదిలోకలు
పరగంగ న్నాడుతలలు బయలను తిరుగు
న్వరభూమి తల్లడిల్లఁగ
నిరవొంపఁగ దీనిదెలియు మిలలో వేమా!

విచారణీయము

ఆ చిగురుచెట్టుమీఁదఁ జింతపువ్వులు పూచి
నిమ్మపండు పండు నిమిషమునను
డాలు చెడక మునుపె దానిని తినవలె, వి....

మనసు అనునది చిగురుచెట్టు అందలిపువ్వులు చింతలు తత్పరిణామ మొకనిమేషమున నగును దానిని వెంటనే యను భవింప యత్నింపవలయును

క. చిన్నది యెలప్రాయంబునఁ
గన్నది పతిలేక సుతుని గడు చిత్రముగా
నెన్నడు రతిలవ మెఱుఁగదు
చన్నీయక పెనిచె నౌర జగమున వేమా! 2371

మాయ యనుచిన్నది లేతప్రాయములోనే సంసార మను సుతుని గన్నది ఈమాయకు పరేశ్వరునితో నెప్పుడును సాంగత్యమే లేదు అయినను కొడుకుఁ గనుట చిత్రము

ఆ. చెట్టునందుఁ బుట్టి చెలరేగు కాయలు
తనరుకాంతితోడఁ దగిలి పండ్లు
పండ్లుతినెడివారు వర్ణము తెలియుఁడు, వి....

సంసార మనువృక్షమున ఫలించినఫలముల ననుభవించువారు ముందు వానివర్ణము మున్నగువానిని పరికింప వలయును

సీ. తమతలంపులలోనఁ దత్త్వశిఖామణి
దలచినవా రెల్లఁ దత్త్వవిదులు

ఘనమైన నిబిడాంధకారంబునకు జ్యోతి
నసువునఁ జూచిన యతఁడె యోగి
శివునిలో జీవుని జీవునిలో శివు
నొనరఁ దెలియువాఁడు యోగదృక్కు
సాంఖ్యయోగంబున సర్వంబు శివుఁడని
నిశ్చయించినవాఁడు నిర్మలుండు
ఆ. ఇట్టిజాడఁ గాన నెందఱైనను నేమి
పుట్టుకాలశివుని బట్టఁ గలరె
పొట్ట జీవు బాసిపోయి తా నుబ్బునా, వి....

తనమనస్సులో నీశ్వరుని తలఁచినవాఁడే తత్త్వవేత్త యగును గాఢాంధకారములో పరంజ్యోతిఁ గన్నవాఁడే యోగి శివజీవుల కన్యోన్యసంధానము చేసినవాఁడే యోగదృక్కు సాంఖ్యమును సర్వమును శివమయమని యెఱుంగువాఁడు నిర్మలుఁడు అనఁదగును

చ. తరుణిని బెండ్లియాడి తిగ తమ్ములు నన్నలు
బావయుం చన, న్వరుసలఁజిక్కి సొక్కి మఱి
వాంఛలచేతనె తేనటీఁగయై, సరవిమునింగి నా
తనికి సత్పథ మబ్బునె నిన్నుగానకీ, ధరణిని
ముక్తి లేదు యిఁక దాఁపక చెప్పుము వెఱ్ఱి
వేమనా!.... 2374

మనుజుఁడు స్త్రీని పెండ్లిచేసికొని మోహమునఁ జిక్కి అన్నలు తమ్ములు బావయని ఇట్లు సొక్కుచుండును ఇట్టివానికి ముక్తి దుర్లభము

మత్తకోకిల. తల్లిదండ్రులు నన్నదమ్ములు తాత బం
 దుగులేలరా, మఱల జన్మము లేనిసద్గురుమర్మ
 భావము నొందరా, పుల్లమైనను రాదు వెంట
 ను భూమిదాఁటి యడేఁగుచో, కల్లభ్రాంతిని
 వీడి వేమన కార్యపద్ధతి గాంచుమా 2375

సులభము

ఉ. తాత జనించెఁ గన్యకకు తండ్రులు తాము
 కుండగోళకుల్, మాత పరానుకూలినియె మ
 ఱువ ద్రౌపది భర్త లేవురు, నీతులు సెప్ప
 బాండవులనీతులు నిట్టి నటంచు నెన్నుచు న్యాభ
 తలమందు నెంతయును బూమెలఁ జేసిరి వెఱ్ఱి
 వేమనా! 2376

మూర్ఖులు భారతమును విని యందలి నీతులను గానక పాండవుల తాత కన్యకకు పుట్టెనని యిట్టి ఎన్నియుం ఎంచి వ్యర్థముఁ జేసిరి

సీ. దినకరచంద్రులు చనుత్రోవలను గట్టి
 పాన్పుతోడ నిరులు పాదు పెట్టి
 మూఁడుమూలల యింటి మ్రోఁతలు పోకార్చి
 పరఁగుముంగిలిమీఁద బదిలపఱిచి
 కడుసన్నమగు గుర్తు నడయును నడివీథి
 శోధించి మాత్రను మీఁదఁ బెట్టి
 అణువనుజ్యోతియై యానందరూపమై
 దివ్యతేజంబుపై దృష్టినిల్పి

తే. తలఁప నేది లేక భేదంబు తలఁగనీక
జోలలందును నర్థియై జోలలాడు
చున్న యోగీంద్రుఁ డని చెప్ప నుచితమగును
వేమ ననియెడి యోగిని వెలయు భువిని 2377

సూర్యచంద్ర నాడులను కట్టి వ్యాదయాకువారమును జాగ్రత్తగా మూసియుంచి అందు గురూపదేశము ననుకుదుట నుంచి లక్ష్యమునుంచి అణుస్వరూపమగు దివ్యతేజమును గని సర్వదా ధ్యానించు నుత్తమయోగినిగా వేమన్నను తెలిసికొన వలయును

సీ. ధరణిలోఁ జదువెల్ల పరమాత్మలో నాత్మ
నైక్యము చేయని యజుని సొద్దు
పంచభూతఘటితప్రకృతిని దలపోసి
యిరుకెఱుంగని వాని నెత్తి సొద్దు
పంచవింశతితత్వపద్ధతి నెఱుఁగక
వేదాంతి ననువాని మీఁదసొద్దు
అంతరంగములోని యానుకూల్యము లేక
యోగి నేననువాని కొక్క సొద్దు

తే. తాను దానైన తత్త్వంబు తగులు గలిగి
వెలిసి లోనను నొకటను తెలివి తెలిసి
బ్రహ్మవేదంబు గనలేనిపామరునకు
వెనుక నొకసొద్దు గల దిఁక వినుము వేమ 2378

విద్యయనుదాని నెల్లను పరాత్మానుసంధానమున నుపయోగింపని యజునకును, పంచభూతవివేచన లేనివానికిని, పంచ

వింశతితత్త్వము నెఱుఁగకయే వేదాంతినని కొనువానికిని అంత
రంగశుద్ధి లేక నేనే యోగి ననువానికిని, తాను తానను
తత్త్వము నెఱుఁగలేనివానికిని దొరకఁగునుఁ బొసగించుచు
న్నాఁడను అనగా నిట్టివారు నింద్యులు.

క. నందనసంవత్సరమునఁ
బొందుగ గార్తికమునందు పున్నమనాఁడీ
వింధ్యాద్రి సేతువులకును
సందున నొకవీరుఁ డేలుఁజాటర వేమా! 2379

హర్షమయమగు మనస్సనఁ బూర్ణచంద్రునిఁబోలు
పరాత్మ యావిర్భవింపఁగా నప్పు డీశరీరమున నిర్వికారుఁడై
చెప్పనలవిగాని తేజ మొక్కటి వెలుంగుచుండును

క. నలుగురు దొంగలఁ బట్టుక
తలఁగొట్టగవలయు నొకనిఁ దగ మన్నింప
న్వలెరా మువ్వురిఁ దీర్పుము
యిలలోపల నెఱుక ఫలమె యిది యగు వేమా!

కామక్రోధలోభమోహములను దొంగలను నలుగురిని
పట్టుకొని అందొక్కని (అనఁగా కామమును) మన్నించి తత్కా
ర్యముల నుపయోగించుటయే యెఱుక గలందులకు ఫలము.

క. నలుగురు దొంగలఁ బట్టుక
తల త్రుంపక యున్నయట్టి తామసికేలా
కలుగును జ్ఞానము? ధర ని
శ్చలపాలన మాత్మసుఖము సత్వము వేమా!

సులభము

ఆ. నాల్గునాలుగింట ననువుగాఁ దగుఁగాని
నాలవయిలు వాని నయు మెఱుఁగరు
అట్టివాని నరయు నాతఁడే శివయోగి, వి....
పదియాఱుకళలను మెలఁగి యుండునీశ్వరుని ఎఱుంగు
వాఁడే శివయోగి యనఁదగును

ఆ. నిమ్మపండు పుట్టె నిజమైనరసముండె
హేమమునకు నేడ్చు చేల ప్రజలు
సత్తుపొత్తుఁ జేసి సాధింప లేరొకో, వి.... 2383
స్పష్టము

ఆ. నీరుకారమాయె కారంబు నీరాయె
గారమైన నీరె కారమాయె
కారమందు నీరు కడు రమ్యముగ నుండు, వి....
సులభము

ఆ. నీరుకారమాను నీరాను కారంబు
వానివద్ద నిద్రఁ బోవవచ్చు
నీటిలోన నుండు నిఖిల బ్రహ్మాండముల్, వి....
సులభము

మత్తకోకిల పరమగురువరుమంత్రసిద్ధిని పట్టి నీలో
నుంచరా, యురములో గుఱి బయలు దాఁకెడి
నూని నొక్కినతోడనే, కరతలామలకంబు బ్ర
హ్మము గ్రాలుచుండును బ్రహ్మలో, దిరము వేమ
న చేరుపదవిని తెంపుగా మది నుంచరా.

గురూపదేశమును వీడక సతతమును ధ్యానించుచు కరతలామలకమువలె నన్న బ్రహ్మమును గాంచి కృతార్థుఁడ వగుము

సీ. (1) మహిలోన నొకయీఁగ మఱికేక లిడుచును
మంచంబు మ్రింగిన మహిమ యేమి?
(2) మానుషవంతుఁడై మహిమీఁదఁ బొలుండు
మ్రాను నమలినట్టి మఱి పదేమి
(3) తొడరి దోమలు గిరి నొడసిపట్టుక తాము
పరఁగ గతించిన బల మదేమి
(4) పంచవన్నెల చిల్కలు పరఁగ నైదును గూడి
పర్వతంబుదిన్న బల మదేమి
తే. (5) గొడ్డు దొడ్డిని బడి చెట్టు చిదుమఁజూడ
విరులు పూచినయట్టి విధ మదేమి
అరయ నేర్చిన చెప్పఁడు అఖిలజనులు
వివరముగఁ బల్కనల్లైన వినర వేమ. 2384

(1) అహంకృతి (2) గురూపదిష్టమగు జ్ఞానము (3) విషయములు (4) పంచభూతములు (5) మనస్సును తజ్జనితములగు నభిలాషలును

ఉ. మేదిని లేనివాదములు మిక్కుట మైనబలంబు
లేదు లే, నాడుగ గాలి లేనియెడ నవ్యము మేఘ
ముగవ్వ దల్లై న,దొబ్బధయు లేక సద్గురుని పుత్రుఁ
డవౌదెనిదానదృశ్యమా, వాదుల బోకయుండు
మిఁక వచ్చునదెల్ల నెఱుంగు వేమనా! 2388

వాదములు పెక్కులున్నను ఉపయోగము లేదు గురుని సద్బోధ లేక ఆత్మసాక్షాత్కారము గానేరదు.

సీ. మొదలు మీఁదికిఁ గాను దుద మొదలుగ నున్న
వృక్షంబు మొలచినవింత యేమి
మహి మింటిమీఁదను మదగజం బొక్కటి
వివరించుచున్నట్టి వివల మేమి
చిదిమి పెట్టిన బంటువిధమున నేనుంగు
జీమలు మ్రింగిన చిత్ర మేమి
పులిచింత మీఁదను దలమీఁద నొకచింత
మ్రానుగట్టిన యట్టి మరుగ దేమి
తే. చింతవృక్షముమీఁద జేమంతిపూవులు
చెలఁగి పూచినయట్టి చిత్ర మేమి
అరయ నేర్చిన సర్వజ్ఞులైనవారు
వివరముగ బల్కవలెను వివర మేమి! 2339

(ఊర్ధ్వమూల మధశ్శాఖ అనుదానిభావము) బ్రహ్మము, మాయ, అజ్ఞానము వికల్పభావములు, కోరికలు

సీ. మొదలు మూలాధార మొనప విఘ్నేశ్వరుం
డచ్చోట దేవాళి యలరుచుండు
అందుమీఁదటను రెండంగుళంబుల మేఱ
స్వాధిష్ఠచక్రంబు వరలు బ్రహ్మ
దీనికి నెన్మిది దేహాంగుళములందు
మణిపూరచక్రంబు మలయును హరి

అంత దశాంగుల మవల ననాహత
మొప్పు రుద్రుం డట నొనరియుండు
తే. పదియు రెండంగుళములకుఁబై విశుద్ధ
మందు జీవుఁడు పొందుగా నలరుచుండు
వెలయుఁ బరమాత్ముఁ డగ్నియై వెలుఁగుచుండు
నిట్టి జాడలు తెలియుట యెఱుక వేమ  2390

హృదయపీఠమందు తొలుత మూలాధారచక్రమును,
అటుపై స్వాధిష్ఠానచక్రము దానిపైన మణిపూరగచక్రమును,
అద్దానిపైని ఈశుఁడు విశుద్ధస్వరూపమున వెలుంగుచుండును
క వంచనఁ జేసెడియెఱుకను

మించినపరతత్త్వ మదియు మేలిమిగా నా
సించును గన్గొని యుండిన
సంచారము లేనిబయలు సరగున వేమా ! 2391

మోసముఁ జేయుమాయను దాఁట గలిగినచో పర
తత్త్వము సాక్షాత్కరించును

తే లోకములయందు వెలియైన లోతుఁ జూడఁ
బూని వర్తించి పరిపూర్తిఁ బొందువాఁడు
ఉన్నవాఁడౌను ముక్తుఁడై యున్నవాఁడు
పరమసంతోషనిలయుఁడై పరఁగు వేమ ! 2392

లోకాతీతుఁడై పూర్ణుఁడై యున్నవాఁడే ముక్తిని గనిన
వాఁడగును.

సీ. వాతపైత్య శ్లేష్మరీతు లొక్కటి గాఁగ
శాత్రవమిత్రులు సమము గాఁగ

సరవితో నన్నమౌషధము లొక్కటి గాఁగ
  స్వర్ణలోష్ఠంబులు సమముగాఁగ
జాతిభేదంబులు సరణి నొక్కటి గాఁగ
  కర్తధర్మంబు లొక్కటియు గాఁగ
ఘనసుఖదుఃఖంబు లెనయ నొక్కటిగాఁగ
  కన దివారాత్రు లొక్కటియుఁగాఁగ
ఆ తెలిసి యాత్మలోన దేదీప్యమానమా
  తేజమందు శివుని తేటపఱచి
మనసు శివుని జేర్చి మగ్నత నుండరా, వి....

వాతపిత్తములు శత్రుమిత్రులు అన్నము ఔషధములు స్వర్ణలోష్ఠములు మున్నగువానిని సమబుద్ధితో చూచి నిరీహుఁడై యుండుము

---

# జీవన్ముక్తిపద్ధతి.

ఆ. జీవలింగపూజ జతపడువారికి
శిలలలింగములకు చింతయేల ?
చక్కెఱ దినునోరు చవిగొనునే చేదు, వి....

జీవలింగములను పూజించువారలు చక్కెర దినువాఁడు చేదు గోరనట్టులనే శిలల పూజింపఁ గోరరు

ఆ. జీవసంజ్ఞ గలుగు జీవతత్త్వంబును
జీవపరుని గురుని జెందఁజేసి
తనువు నిలుపువాఁడు తత్త్వజ్ఞుఁడగు యోగి, వి.

జీవసంజ్ఞ గలుగుజీవతత్త్వమే బ్రహ్మము అద్దానిని నిలుపువాఁడే తత్త్వజ్ఞుఁడు

ఆ జ్ఞానియనెడివాఁడు ఘనతేజమందును
పూని సుఖముఁ జెంది పుట్టఁబోఁడు -
తాను తానె గాను తనలోనె వెలుఁగును, వి ...

జ్ఞానియైనవాఁడు తేజమును పూని సుఖింపఁగా నేర్చిన వాఁడే వెలుఁగఁగలుగును

ఆ. జ్ఞానియైనవాని మానక పూజించు
మనుజుఁడెప్డు పరమునను ముదంబు
సుఖము నందు చుండు సూరులు వర్ణింప, వి....

జ్ఞాని యైనవానిని విసుగక పూజించువాఁడే పరుని గనినవాఁడగును

ఆ తత్త్వము తిరమైన తావుల వెదకుచు
తాను తత్త్వ మగుట దలఁచి యోగి
తలఁపు లన్ని యడుగ తత్త్వము తానగు, వి.

తత్త్వము స్థిరముగా నున్నతావులను వెదకి తానును తత్త్వ మగుట నెఱిఁగి కోరికలడంచువాఁడె ముక్తుఁ డగును.

తే తత్త్వములలోనఁ బరమాత్మ తత్త్వ మెఱిఁగి
నిత్యనిర్ముక్తపరిపూర్ణనిలయమంది
సరి పరబ్రహ్మమయమని సంచరించు
నతఁడె పో పరశివుఁ డన నగును వేమ 2399

తత్త్వము లన్నింటిలోను పరతత్త్వమునే యెఱింగి పూర్ణుఁడై యుండుటే బ్రహ్మమయము

ఆ. తత్త్వ మెఱుఁగువాఁడు దైవంబు నెఱుఁగును
సర్వసారములను జూచఁజేయు
కదళి మ్రింగునట్లె గరళంబు మ్రింగును, వి....

తత్త్వవేత్తలు దైవమును ఎఱుంగఁజాలుదురు. సమస్త సంసారమును రూపు పోఁగొట్టఁజాలుదురు

ఆ. తనదు దేహమందు తత్త్వార్థ మెన్నుచు
మందబుద్ధి కాక మహితుఁడగుచు
లోనిగుట్టు దెలిసి లోకములో నుండు, వి....

తనశరీరములో నున్నతత్త్వము నే ఎన్నుచు మాంద్యము లేక యుండువాఁడు మహితుఁ డగును

ఆ. తనదునాత్మయందు దైవంబు వెలయఁగ
తీర్థయాత్రల కని తిరుగుచుంద్రు
గంధపుతునకల గాడ్దె మోసినయట్లు, వి....2102

తనయాత్మలో నే ఈశ్వరుఁ డుండఁగా తీర్థయాత్రల కని తిరిగెడివారు కృతార్థులు కాఁజాలరు

ఆ. తనువు నస్థిర మని ధనము నస్థిర మని
తెలుప నేర్చి తాను దెలియ నేర్చి
పాత్రుఁడైన యోగి పరమాత్ముఁడే సుమా, వి.

ధనతనువు లస్థిరము లని యొరులకుఁ జెప్పి తాను నేర్చి తిరుగువాఁడే నిక్కముగు యోగి యని నమ్ముము

ఆ తన్ను తాఁ దెలిసిన దైవంబు మఱిలేదు
తానె దైవ మంచు తత్త్వయోగి
తలఁచుచుండు నెప్పుడు ధరలోన నరయుము, వి.

తన్ను తా దెలిసికొనిన నంతికంటెను దైవమిఁకలేఁడు అట్లు తలఁచుచుండినచో ముక్తుఁడు కాఁగలుగును

ఆ. తన్ను వెదకి చూడ దానె యా జీవుండు
తత్త్వ మరయ నగును తానె యాత్మ
మన్ను మిన్ను లేదు మాయయు లేదయా, వి....

తనను పరికించి చూచినచో తానే జీవుఁడు తానే తత్త్వము తానే యాత్మయై ప్రకాశించును

ఆ. తన్ను తా నెఱుఁగఁడు తా నెవ్వరికి నేర్పు
ప్రాలుమాలితిరుగు పశువుకొడుకు
కాసులకొఱకని కర్మంబు గూర్చును, వి....2406

తన్ను తాను తెలిసికొనఁ జాలఁడు గాని ఇఁక నితరులకు తత్త్వమును చెప్పెద నని మూర్ఖుఁడు పోవును

ఆ. తనువులోని యాత్మ తత్త్వ మెఱుంగక
వేఱె కలదటంచు వెదుకనేల ?
భానుఁ డుండ దివ్వె బట్టినచందము, వి ... 2407

స్పష్టము

ఆ. తన్నెఱుంగువాఁడు తాను తానై యుండు
తన్నెఱుఁగనివాఁడు తాను తానె
తనదులోనివాఁడు తానె తా నవునయా, వి....

స్పష్టము

ఆ. తలపులోనఁ గలుగు దా దైవ మెప్పుడు
తలఁచి చూడ నదియు తత్వ మగును
తలపులోనితలపు దలఁచుచు నుండుము, వి....

దైవములోనే యుండును గనుక సదా తలఁపులోని తలపుఁలోనుండి కనుఁగొనుము.

ఆ. తల్లి పార్వతి యగు దండ్రియా శంభుఁడు
ప్రమథగణము లఖిలబంధువితతి
తనకు పుట్టినిల్లు తనరి కైలాసము, వి.... 2410

తనకు తల్లిదండ్రులు బంధువులు మున్నగువారెల్లరును పార్వతీపరమేశ్వరులును ప్రమథగణములు నని నమ్ముము

ఆ. తాను తాన యనెడి తత్త్వంబు లోపల
నన్వయంబు తెలియఁ జెప్పలేఁడు
తాను తాన యైన తత్త్వంబె బేరా, వి....2411

తాను తానగు నను తత్త్వము నెఱిఁగినవాఁడే జీవన్ముక్తుఁ డగును

ఆ. తాను నింద్రియముల దనరఁజయుంచిన
తత్త్వమరసి చూడ తాన యగును
రాజయోగి యిట్లు దేజరిల్లఁగవలె, వి ... 2412

తా నింద్రియముల జయించెనేని తత్త్వము తన కలవడును. రాజయోగి యీరీతి నుండవలయును.

క. తా నొకటి దెలియు నన్నది
తాను మొయి నేక యొల్లతావులు తానై
తా నెఱిఁగి పరిణమించిన
మానవుఁ డిల ముక్తుఁడగుఁడె మాన్యుఁడు వేమా!

సులభము

ఆ తామసంపుపనులు తగి వెందులకు నైన
తామసంబు నుడుగఁ దగు సుజనుఁడు
తామసంబు గల్గ ధర నధముం డగు, వి....

కోపపుపనులు ఎందులకైనను పనికిరావు గాన కోపమును త్యజించవలయును

ఆ తారు మారుగాక తత్త్వదర్శన మూని
మేరుశిఖర మెక్కి మెలఁగువాఁడు
కేరి యొఱుకలోనఁ గీటణగించును, వి.... 2415

తొట్రుపడక తత్త్వమును దర్శించి యెఱుక నంతరంగమునందు దర్శించి ముక్తుఁడ వగుము

ఆ తిరిగి తిరిగి యింక దిరుగంగఁ దిరుగంగ
తిరుగు గలదె యెంత తెలివియున్న
తిరుగనట్టితోవఁ దిరుగు మెల్లప్పుడు, వి....2416

ఎన్నిమాఱులు తిరిగినను ఫలము లేదు గావున నపునరావృత్తముగల త్రోవను తిరుగుము

ఆ తేకు వమర బుద్ధి తెల్లముగా నిల్పి
తాక నది ప్రణవపుధ్యాన మగును
సోకి మించువాఁడె సురలోక మొందును, వి....

బుద్ధిని నిల్పి ప్రణవమును జపించుచుండినచో బ్రహ్మము సాక్షాత్కరించును

ఆ దినము మూఁడుమార్లు తిని నిదురించుచు
సొగసుచనులవారి సొంపుతోడ
చేరుచుండి కడకు చెడి చావఁబోకుఁడు, వి....

దినమును మూడుమార్లు తిని విషయలోలుఁడవై వ్యర్థుఁడవై చనిపోవకుము

తే నిక్కమగు జ్ఞాననిష్ఠలో నేర్పుమీఱు
సాక్షి సోలియు బ్రమయుక నూక్ష్మ మంది

చిక్కువడకయుండువాఁడె పో చిన్మయుండు
దక్కువగ వానిఁ గనలేరు ధరను వేమ.
సులభము

ఆ. నివురు గప్పినట్లు నిశ్చలభక్తితో
దగిలి యుండ ముక్తి తానె వచ్చు
జగతి నొప్పఁ జెప్ప జాణలు లేరయా, వి....
సులభము

ఆ. నిజగురూపదేశనిశ్చయాత్మకవిద్య
రక్షకం బటండ్రు రాజవీధి
మధ్యదేశమునను మార్గొని చూడరా, వి....
నిజముగుగురూపదేశమే రక్షకమగు నాత్మవిద్య యని
తలంచి ధ్యానింపుము

ఆ. నిజము కల్ల రెండు నీలకంఠుఁడెఱుంగు
నిజము లాడకున్న నీతిదప్పు
నిజము లాడునతఁడు నీరూపె యనవచ్చు, వి....
స్పష్టము

ఆ. నిజము కళల మీఁటి నిత్యుండు కావలె
పలుకులోనిపలుకు పదిలపఱచి
వేడుకలర ముక్తి వెన్నంటి చూడరా, వి....
స్పష్టము

ఆ. నిజము తెలిసియున్న సుజనుఁ డానిజమునె
పలుకవలయుగాని పరులకొఱకు

దాపఁగూడ దింక నోప దన్యముపల్క, వి....

నిజముఁ దెలిసిన సుజనుఁడు సాధ్యమైనంతవఱకును నిజమును పల్కుటకే యత్నింపవలయును

ఆ. నిజము వరుస నెఱిఁగి నిర్గుణత్వం బంద
పలుకులోని శబ్ద మలరఁ దెలియఁ
బలుకకుండువాఁడె పరమాత్మ యగునురా, వి....

సులభము

ఆ నిద్రలోనినిద్ర నిజముగాఁ దెలిసిన
భద్రమగును మిగుల బ్రహ్మవిద్య
నిద్ర తెలియువాఁడు నిర్మలయోగిరా, వి ...

నిద్రలోనినిద్రను (అనఁగా సమాధిని) తెలిసికొనెడి వాఁడే నిర్మలయోగి యగును

ఆ నిశితవృత్తి మీఱి నిటలదుర్గముఁ జేరి
భయము లేక యుండు బ్రహ్మవేత్త
జయము గల్గ ముక్తిఁ జవిజూచుచుండును, వి.

సులభము

ఆ. నిర్మలాత్మవిద్య నిత్యసత్యజ్ఞాన
నిరతుఁడైనవాఁడు నేర్పు మీఱ
ననుభవింపఁగోర నలసటఁ బొందురా, వి....

నిర్మల మగునాత్మవిద్యను సత్యనిరతుఁడై ననుభవింపఁగోరినచో అలసటను పొందనే పొందఁడు

---

# సంకీర్ణ పద్ధతి.

---

ఆ. ఊరు కొండవీడు నునికి పశ్చిమవీథి
మూఁగచింతపల్లె మొదటి యిల్లు
ఎడ్డెరెడ్డికుల మదేమని తెల్పుదు, వి.... **2429**

ఊరు కొండవీడు ఉనికి పడమటివీథి కులము ఎడ్డెరడ్డి కులము ఏమని చెప్పఁగలను

ఆ. ఊరుకొండవీడు ఉనికి పశ్చిమవీథి
మూఁగచింతపల్లె మొదటియిల్లు
అరసి చూడ బయలు నడె యగు ముక్తియు,వి.

కొఁడవీటిపశ్చిమవీథిలోని మొదటియిల్లే చిత్స్వరూపమగు ముక్తికిఱవు

తే. ఎంతకాలమొ వ్యర్థమై యంత వీలు
చిక్కఁగా జిక్క వెంటనే జలక మాడి
పాత్రపుష్పము లిడికొనిపట్టినాఁడ
గుహాముఖముసొచ్చి కనుఁగొంటి గురుని వేమ

ఎంతకాలమో వ్యర్థ మయ్యె నని చింతిల్లి చివఱకు వీలు చిక్కఁగానే స్నానముఁ జేసి పువ్వులు తీసికొని యోగిని దర్శింపఁబోయితిని

ఆ ఒరులకొఱకు భూమి నొదిగించువారలు
ననని పతికి వశ్యులైనవారు
పాలపంటికులపుకాపుల నెఱుఁగుము, వి....

కాపులు సాధువులు ఇతరులకు భూమిని సాగుఁజేసి రాజులకు విధేయులై యుండెడివారు

తే చింత వలదయ గురుచర్య యంతేనయున
నంకితము నీదునామంబు నమరఁజేసి
నాదుభక్తిని మీయందు పాదుకొల్పి
చెప్పఁ బూనెద పద్యముల్ చిత్త మలర 2433

గురూ! విచారింపకుఁడు మీపేరును పద్యములలో నెలకొలిపి భక్తితో పద్యములను చెసెదను

ఆ. చెవిని నిల్లుగట్టి చెప్పెను వేమన
బట్టబయలునుండు బ్రహ్మమనుచు
బుద్ధి గలిగి యందుఁ బొంది సుఖంపుఁడీ, వి....

వేమన చెవి నిల్లుగట్టుకొని (అంతటిశ్రద్ధతో) బట్టబయలనే బ్రహ్మ మున్నదని చెప్పెను కావున సుఖింపుఁడు.

ఆ జ్ఞానవంతుఁ జూచి జ్ఞానుల మనుకొని
వెఱ్ఱియండ్రు ప్రకృతి విడువ లేక
వెఱ్ఱి కవనిఁ బ్రకృతి వెదకినఁ గల్గునా, వి....2435

జ్ఞానవంతునిఁజూచి వెఱ్ఱివెఱ్ఱి యని యందురే కాని వెఱ్ఱికిఁ బ్రకృతి వెదకినను దొరకదు

ఆ. టక్కరులను గూడి యెక్కసక్కెము లాడ

నిక్కమైన గురుని నియమము చెడు
ఉల్లితోటఁ బెరుగు మల్లెమొక్కలరీతి, వి....

మోసగాండ్రతో చేరినచో ఉల్లితోటలో నున్నమల్లె మొక్కకునలె మాహాత్మ్యము నశించి పోవును

ఆ టెక్కె మెత్తి చెప్పు మొక్కఁడె దేవుఁడు
నిక్కముగను లోననిలిచియుండు
చక్కఁజూచువాని సంతోషమునఁ దేల్చు, వి....

ధ్వజమెత్తి ప్రపంచములో దేవుఁ డొక్కఁడే యని గట్టిగా లోకులకుఁ జెప్పి సంతుష్టులఁ జేయుము

తే. పరమగురుఁ డభిరామయపాదములకుఁ
జేతులను నాచి మొక్కితి శిరముఁ జేర్చి
తప్పు వినియును క్షమియించె నొప్పు నార
దలఁపడే నందఁ దనపాటు ఫలము వేమ.

పరమగురుఁ డగునభిరామయ్యపాదములకు మ్రొక్కి మన్నింప వేడితిని ఆయన నాతప్పును వినియును క్షమియించెను

క ప్రతిదినమును నుదయమ్మున
మితకాలము లెక్కఁగొనక మీఁటి పనికి రాఁ
గతమేమి యనుచు రామయ
వ్రత మరయఁగ గంట గట్టివాసిని వేమా! 2439

దినమును సరియైనవేళ కేల రావని నిర్బంధించుటచేతనే యిట్టిమహాత్పదవిని పొందఁగలిగితిని

ఆ. నిక్కమైన మంచినీలమొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టెఁడేల ?
చదువఁజదువఁ బద్య మరయ నొక్కటి చాలు, వి.

నిజమైన నీలమొక్కటియే మేలు తళుకురాలు తట్టెడైనను ప్రయోజనము లేదు కనుక అట్లే జదువుటకు ఇంపైన యొక్క పద్యము చాలును

ఆ ముక్తిమార్గమునకు మూలమై తగునట్టి
గ్రంథ మంత జనులు గడఁగి చదువ
విన్నవారి కెల్ల విభవముల్ కలవయా, వి....

ముక్తికి మూల మగునీ గ్రంథమును సాంగముగా చదివి విన్నవారికి ఎల్లవిభవములును లభించును

క వేమన చెప్పిన కల్పం
బే మానవుఁడైనఁ గాని యెదనూహింపక
దామస మేటికి కల్గును
వేమనయే సిద్ధుఁడరయు విధ మిది వేమా !.

వేమన చెప్పినట్టిదీనిని ఎవ్వఁడు చదివినను అగ్రహము జనింపక శాంతి చేకుఱును సిద్ధుఁడు కాఁగలుగును

క. వేమన చెప్పినమాటలు
సామంబున సకలవేదసారంబుగదా
సమ మిది పంచాక్షరితో
నీమహిమలు తెలిసియుంట యింపగు వేమా !.

వేమన చెప్పినమాటలన్నియును వేదసారములు; గనుక సర్వదా పంచాక్షరివలె జపింపఁదగును

ఆ. వేమ ననఁగ యోగి వెలసె లోకములోనఁ
బూజ లిడుడు పుణ్యపురుషులార
పూజ లిడినయంత భుక్తిముక్తుల నిచ్చు, వి....

వేమన యను నొకయోగి లోకములో వెలసెను; కావునఁ నతనిఁ బూజించి కృతార్థు లగుటకు యత్నింపుఁడు

ఆ వేమ నిట్లు చెప్పె వేలపద్యంబులు
తప్పు లెన్ని యున్న నొప్పియుండు
తత్తరపడకందు జిత్తము నిల్పుము, వి .. 2457

వేమన యీతీఋగా వేలకొలఁది పద్యములను చెప్పి యున్నాఁడు అందు ఎన్నియైన తప్పులు దొరకవచ్చును గాని ఆమాత్రమున త్వరపడక యందలి యర్థమును చక్కగా మన నముఁ జేయుము

క వేమనపద్యము లెల్లను
సామముతోఁ జదివినట్టి సజ్జను లెల్లన్
సోమనతలగలయాంతని
సామ్యము నొందెదరు సర్వవిధముల వేమా!.

వేమన చెప్పినపద్యముల నన్నిటిని సామముతో జదివి నట్టిసజ్జనులు శివసాయుజ్యమును పొందగలుగుదురు

వేమనపద్యములు సంపూర్ణము.

---

# అనుక్రమణిక.